


# ఆంధ్రపత్రిక

(నలువది ఆరవ)
ఉగాది సంచిక

(1955-56)

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

[వెల రూ. 2]

అమ్మకమునకు సిద్ధముగానున్నది.



# టామ్‌సాయర్ ప్రపంచ యాత్ర

మూలం: మార్క్‌ట్వేన్

అనువాదం: నండూరి రామమోహనరావు

వెల: 1-8-0

పోస్టుఖర్చులు ప్రత్యేకం.

ఆంధ్రగ్రంథమాల, మద్రాసు-1.

---

మా ఆంధ్ర ఖాతాదారులకు
నూతన సంవత్సరము సుఖప్రదమగు గాక!

కర్నూలులోని గవర్నమెంటు సెక్రిటేరియేటు, చీఫ్ ఇంజనీరు ఆఫీసుల క్రొత్త భవనములకున్నూ, హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రికి, జగ్జీవనరాం నగర్‌లోని భవనాలకు శానిటరీ, సిటీ సరఫరా, మురికి కాల్వల సౌకర్య నిర్మాణములు మాచే జరుపబడినవి.

## స్వామి & కంపెనీ

సివిల్ శానిటరీ & ఇంజనీరింగ్ కంట్రాక్టర్లు
(ఇటాలియన్ మార్బుల్ టైల్ టాపులకు)

డీలర్లు

318, తంబుచెట్టివీధి, మద్రాసు-1

Phone 2130. Grams: 'EXQUISITE'

---

## ఎవర్ - రెడీ ఫ్లాస్క్

నెం. 750
ఎనామెల్
వివిధరంగుల
అల్యూమినియం
కప్పులు



నెం. 755
పూర్తి
అసలు యిత్తడి,
ఎలెక్ట్రో,
నికెల్ ప్లేటెడ్

నవీన అభిరుచులకు తగినట్లు ప్రత్యేకంగా తయారైనది. పటిష్టమైన ఒక పింటు వాక్యూమ్ సీసాతో బిగింపబడి, దట్టమైన పాదరసం పై పూతతో, లోగడ నమూనాలమీద దీంతో అభివృద్ధికరముగాను, తయారైనది. లోపలనే మరో కప్పు కలదు. ఇది ప్రత్యేకమైన అనుకూలము.

2 డజనులు కేసులో ప్యాకు చేయబడును.

## సన్‌లాంప్ ఇండస్ట్రీస్

23, ఆండర్‌సన్ వీధి, మద్రాసు-1.

సంవత్సరము
1955-56

# ఆంధ్రపత్రిక

## మన్మథ ఉగాది సంచిక

### విషయానుక్రమణిక

ముఖచిత్రం: మన్మథ—దశిక రామలింగేశ్వరరావుగారు

త్రివర్ణచిత్రములు: ముగ్ధ—కె. సి. యస్. పణికర్ గారు;
బలిమూర్తి—కె. సి. యస్. పణికర్ గారు;
అధికారప్రదానము—రణవీర సక్సేనా.

ఛాయాచిత్రాలు: (1) తటాకతీరము (2) సుందరమూర్తి: రాజారాణీ దేవాలయశిల్పం (3) ప్రమథగణం: భువనేశ్వర దేవాలయం—చిత్రకారులు: కె. వేణుగోపాల్ గారు.



# ADVERTISERS' INDEX



అధికార ప్రదానము

ఓమ్

# ప్రస్తావన

నేటితో మన్మథవత్సర వసంతోదయం ప్రారంభం అయింది. సంవత్సరారంభం మనకొక ప్రత్యేకమైన మహోత్సవం. ఈనా డాంధ్రులందరు గత జీవిత ఘట్టాలొకసారి సంస్మరించుకొని భవిష్యజ్జీవన గమనంలో బంగారుకలలు కంటూంటారు. ఎలాంటి వాస్తవికులకైనా కొంతవర కిది సహజమే. మానవుని మనోనిర్మితిలోనే ఈ విచిత్రవిన్యాసా లున్నాయి. పిన్నలు పెద్దలు, యువకులు, ప్రజలు, నాయకులు, అందరు అంతరాంతరాల్లో ఈనా డుత్సాహడోలికల్లో ఉవ్విళ్లూరుతూంటారు.

మన్మథ సంవత్సరాది మహోత్సవసమయంలో వీరందరికీ మా అభినందనా లందజేస్తున్నాము.

మనజాతి చరిత్రగతిలో మన్మథసంవత్సరాది విశిష్టమైనది. జయలో మనవారు స్వరాష్ట్రానికి పునాదులు నిర్మించుకొన్నారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి శంకుస్థాపనోత్సవం జరుపుకొన్నారు. ఇలాంటివే మరికొన్ని విజయాలు సాధించుకొన్నారు. కాని ఆంధ్రప్రభుత్వానికి తగినంత బలం లేకపోవడం వల్లనైతేనేమి, రాష్ట్రనాయకుల్లో తగినంత ఐకమత్యం లేకపోవడంవల్లనైతేనేమి ఆయారంగాల్లో అనుకున్నంత అభివృద్ధి కన్పించలేదు.

కాని నేటి ఉగాదితో అన్నిరంగాల్లోను మన కెన్నెన్నో ఆశారేఖలు మెరుస్తున్నాయి. మన ప్రజాస్వామికపక్షాలన్నీ ఒక్క తాటిమీద నడిచి మొన్నటి ఎన్నికలలో అఖండవిజయం సాధించుకొన్నాయి. ఈ విజయోత్సవం మనరాష్ట్రంలోనే కాక భారతదేశంలోను, ప్రపంచంలోను, మహోత్సాహంతో ప్రతిధ్వనించింది. ఎవరు ఇంతటి దిగ్విజయం చేకూరగలదని ఊహించలేదు. ఎలాంటి క్లిష్టపరిస్థితులలోనైనా ఆంధ్రప్రజ ప్రజాస్వామ్యంవైపే నిలబడగలదని ఈ ఎన్నికలు స్పష్టంగా ఋజువు పరిచాయి. ఏకగ్రీవంగా జరిగిన నాయకుని ఎన్నికలో కూడా ఈవిధమైన ఉత్సాహాభినివేశాలే వెల్లివిరిశాయి. రాష్ట్రప్రభుత్వ నిర్మాణంలోకూడా ఇలాంటి ఏకీభావమే వర్ధిల్లగలదనీ తద్వారా మనరాష్ట్రంలో సుస్థిరమైన ప్రజాస్వామికప్రభుత్వం ఏర్పడగలదని ఆశిస్తున్నాము. ఆంధ్రదేశ ప్రజ లీనాడు తమ విశిష్ట వివేచనాశక్తివల్ల ప్రపంచప్రసిద్ధి వహించారు. కొంతవరకు వీరి బాధ్యత తీరినదని అనవచ్చును. ఇక ఈబాధ్యత రాజకీయనాయకులు, రాష్ట్రప్రభుత్వము స్వీకరించి ఇతోధికంగా ప్రజలమన్నన లందుకొనవలసిన తరుణం ఆసన్నమయింది. నేడిక వీరిమీదనే మన ప్రజాస్వామ్య భవిష్యత్తంతా ఆధారపడిఉన్నదన్నా అతిశయోక్తి కాజాలదు. ప్రజానాయకు లీ విషయం గుర్తించగలరనీ ప్రజకు, ప్రభుత్వానికీ, నాయకులకు ఇతోధికమైన పరస్పర సహకారసౌహార్దా లభివృద్ధి పొందగలవనీ ఆంధ్రరాష్ట్రం ఈవిషయంలో ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకం కాగలదని ఆశిస్తున్నాము.

సారస్వతదృష్ట్యా పరిశీలించినా ఈ ఉగాదినాడొక ప్రత్యేకత భాసిస్తున్నది. ఇంచుమించుగా గత దశాబ్దంలో మన సారస్వతంలో అస్పష్టమైన అభ్యుదయ నినాదా లెన్నెన్నో మారుమ్రోగాయి. యువక రచయిత లనేకు లభ్యుదయనినాదా లాధారంగా రకరకాల రచనలు సాగించారు. కాని ఇటీవల రచయితల గురుతరబాధ్యతపై నూతన వాదోపవాదా

ఈవిషయంలో పాఠకులలో గాఢమైన సారస్వత జిజ్ఞాస, అభిమానము రేకెత్తించాయి. తద్ద్వారా విఖ్యాతరచయిత లనేకులు ప్రజాస్వామ్యవిజయంపై తమ గాఢాభిమానం వ్యక్తీకరించి ప్రజానీకానికీ, ప్రజాస్వామ్యవిజయానికీ మార్గదర్శకులైనారు. ఈ విషయంలో ఆంధ్రపత్రికలు, రచయితలు, పాఠకులు చేసినసేవ చిరస్మరణీయమైనది.

ఈ వాదోపవాదాలవల్ల కొన్ని ముఖ్యవిషయాలలో పాఠకులకేగాక రచయితలకుకూడా కనువిప్పు కలిగింది. కేవలం రాజకీయనినాదాలే రచనా వస్తువులుగా స్వీకరించి, తాత్కాలిక లక్ష్యాల వాగురలలో చిక్కిన రచనలకు సారస్వతగౌరవం చేకూరదని స్పష్టపడింది. సాహిత్యానికీ రాజకీయ ప్రచారానికీ హస్తిమశకాంతరం ఉన్నదని రాజకీయ ప్రచారరచన లాయాపక్షలక్ష్యాల ఆవశ్యకతలు తీరిపోగానే అంతరించిపోగలవని తేలిపోయింది. సాహిత్యంలో సాంఘికసమస్యాదృక్పథానికీ ప్రచారవాఙ్మయంలో సాంఘికసమస్యాదృక్పథానికీ గల అంతరువులుకూడా ఈ చర్చలవల్ల విస్పష్టంగా వెల్లడి అయ్యాయి. బలీయమైన రాజకీయాధికారముద్రవల్ల సారస్వతం ఏదైనా, సన్నగిల్లి నిర్జీవమైపోగలదని, స్వాతంత్ర్యవాతావరణంలోనే సజీవసాహిత్యం వర్ధిల్లగలదని రచయిత లనేకులు సోదాహరణంగా ప్రతిపాదించారు. అంతేగాక ప్రతిజాతికీ సజీవమైనసంస్కృతి, సంప్రదాయము ఉన్నాయని ఇవి విడిచి వ్యవహరించడం రయిచతలకు కేవలం నేలవిడిచినసాముగా పరిణమించగలదని స్పష్టపడింది.

ఈచర్చలవల్ల ఆంధ్రదేశంలో సారస్వతంలో ఒక నూతనాధ్యాయానికి నాందీప్రస్తావన జరిగినదని అనవచ్చును.

అయితే రచయితలలోను, పాఠకులలోను బయలుదేరిన ఈ నూతనోత్సాహానికి అనేకవిధాలుగా ప్రోద్బలం కలిగించవలసి ఉన్నది. ఈ దశాబ్దంలో ఆంధ్రదేశంలో బయలుదేరిన సాహిత్యసంస్థలు కొన్ని ఆయారాజకీయపక్షాలకు ప్రతినిధులుగానే నిలబడి ఉన్నాయి. సరియైన సారస్వతాభివృద్ధికి అవి దోహదం కలిగించలేవని ఇటీవలి సారస్వతచర్చలు ఋజువు పరుస్తున్నాయి. నేడు సజీవమైన సాంప్రదాయికతకు, నవ్యతకు తగినప్రోద్బలం కలిగిస్తూ కేవలం సాహిత్యదృక్పథం అభివృద్ధిపొందించే సారస్వతపరిషత్తు నిర్మించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. దీనికి ప్రజలేకాక ప్రభుత్వంకూడా గట్టిగా చేయూత ఇవ్వాలి. ఇది రాష్ట్రానికంతటికీ ప్రాతినిధ్యం వహించాలి. ఈపరిషత్తనేకరంగాల్లో జరుగుతున్న సారస్వతకృషికి సర్వతోముఖంగా సహాయంచేసి, సమన్వయం కలిగించి ప్రోత్సహించాలి. ప్రస్తుతం తెలుగుభాషాసమితివల్ల జరుగుతున్నకృషి రచయితలలోను, పాఠకులలోను తగినంత ఉత్సాహం కలిగించడంలేదు. ఇది బాగా విస్తృతిచెంది రచయితలలో నూత్న చైతన్యం కలిగించాలి. ఇంకా సహకారప్రచురణసంస్థ ఏర్పరచవలసినదని, ప్రాచీనగ్రంథాలు ప్రభుత్వమే ప్రచురించి ప్రజల అందుబాటులోనికి తీసుకురావాలని కొందరు సూచించారు. ఇవి సులభసాధ్యమైన సూచనలు. ఇన్నాళ్లనించీ నడిచిన ఆంధ్రప్రభుత్వం భాషావాఙ్మయాభివృద్ధికి తగినంత దోహదం కలిగించలేకపోయింది. నేడిక మనకు సుస్థిరమైన ప్రభుత్వం ఏర్పడగలదని అందరు ఆశిస్తున్నారు.

త్వరలోనే ఈ ఆశాభావం వాస్తవరూపం ధరించగలదనీ మనప్రభుత్వం ఆయా ఆర్థిక వ్యావసాయికాది రంగాలలోనేకాక భాషాసాహిత్యాది సాంస్కృతికరంగాలలోకూడా తగినంతదోహదం కలిగించగలదనీ ఆంధ్రప్రజ సర్వతోముఖంగా అభివృద్ధిపొందగలదనీ ఆశిస్తున్నాము.

# ఉగాది

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

మంగళంబోయ్ మన్మథా! జయ
మంగళంబోయ్ మన్మథా! నవ
వత్సరాది మహోత్సవార్పిత
వాద్యగీతా స్వరసుధా!
    మంగళంబోయ్ మన్మథా జయమంగళంబోయ్!

ఎన్నియేండ్లో నడిచినవి మా
యింటిలో నీ వాడికూడి
పక్వకదళీ గోస్తనీఫల
    పాయసము భుజియించి, మంగళంబోయ్!

నీదు తరుణస్నేహ విరహము
నిలువరాని దురాతపంబున
దిగులుపడిచెడి సొగసుమాసెను
    తీగెలును పూలునువగన్. మంగళంబోయ్!

రామశబ్దము వల్లెచెప్పదు
దోరపండ్లను తేరిచూడదు
శుకశుకీవలయంబు తావక
    సుగమచోదన పొందమిన్. మంగళంబోయ్!

మెఱుగుకాడలు లోలకులవలె
మిసిమి తళతళలాడి వ్రేలగ
మురిసి వేచెడు దిరిసెనలు నీ
    దరిసెనమునకు తాలిమిన్. మంగళంబోయ్!
కోకిలలు తినకుండ తోటల
గున్నమావి చిగుళ్ళగుత్తులు
కాచినారము; కమ్మదనములు
    కదలలేదు రవంతయున్. మంగళంబోయ్!
పూలతేనెలు గ్రోలకుండగ
తోలితిమి తుమ్మెదల వేకువ
నేలపైపడనీక పమిటల
పట్టినారము పొగడలన్. మంగళంబోయ్!
జన్నికట్టిన జాతిచెఱుకుల
వెన్నువేయని కండకన్నులు
పరిదాచితి మిష్టమంచును
ఆరగింపుము అతిథివై!
    మంగళంబోయ్ మన్మథా!
    జయమంగళంబోయ్ మన్మథా!
        మంగళంబోయ్!



# సువర్ణ విహంగాలు

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

శ్రేణులుదీర్చి గాంగజలశీకరశీతలమారుతమ్ము నా
ఘ్రాణ మొనర్చి నాల్గుదెసలన్ విహరింపుచు భారతాంబికా
పాణివిసర్జితమ్ము లగు బంగరురెక్కల పావురాళ్లు వేల్
పూనికతోడ మోసుకొనిపోవుచున్నవి శాంతిదౌత్యమున్.

చల్లదనమెల్ల ముల్లెగట్టిన మంచు కొండయే తల్లికి నిండుగుండె
బుద్ధుడు మొదలైన మునిశిరోమణులు ఏ యమ్మ పున్నెంపు ముత్యాలపంట
భవ్యభాగీరథీవారి పూరమ్ము లే మాతకు కమ్మనిమాట తేనె
బాపూజీ కంటిపాల జాలి వెన్నెల ఏయవ్వ చిరునవ్వు సోయగమ్ము

ఆమహాభారతాంబ, దయావలంబ
సులలితతరముగా నవశ్రుతులువలుకు
విశ్వవీణను సవరించి శాశ్వతప్ర
శాంత కల్యాణగీతముల్ చదువుచుండె!

ప్రళయ పరమాణు గర్భగోళంబునందు
నిదురబోయెను మృత్యువుల్ మేలుకొలిపి,
రవ్వగోయు వారల శుష్కహృదయములను
ప్రేమమధుర సాంద్రిముల గావించుచుండె!

చెరువలోన నంగరపు చీకటి కూకటి విచ్చుచున్న నేం
ధ్యారుణ కేతనస్ఫుట పటాంచలముల్ దిగజారిపోవగా
భారతమాత తూర్పు తలవాకిట నాటిన స్నేహదీపికా
తోరణ మాలికల్ వెలుగుత్రోవలు దీయుచునుండె దిక్కులన్.

నునుపైన రేకులు చెలువారు భరత
భూమిలో పూచిన గులాబి పూవొకండు
సకల దేశాలలో వెదజల్లుచుండె
శాంతి సందేశ మాధుర్య సౌరభములు.

శూన్య వనముఖంబున నూత్న శోభనించు
ఈ వసంతమ్ము వలె శాంతి యొనయుగాత!
ఈ యుగాది ప్రేమసుమాలు దోయిలించి
భువన వీధులలో నెగబోయు గాత!

---

* శ్రీ పండిత నెహ్రూ

1913 లో 417 ప్రకటితములు అయినవి. అన్ని యూరోపు భాషలలోను అతని గ్రంథాల భాషాంతరీకరణాలు వెలువడినవి. 1927 సంవత్సరము ఇవ్వబడిన నోబెలు బహుమతి ఇతనికి ఇవ్వబడినది. ప్రకృతిశాస్త్ర విచారణలలో డార్విన్ పరిణామవాదానికి ఎట్టి అసాధారణ స్థానము వచ్చినదో, అట్టి విశిష్టస్థానము బెర్గ్‌సన్ మతానికి అధ్యాత్మిక వాదాలకు, సంక్రమించిందని విమర్శకుల అభిప్రాయము. ఆ తత్త్వవాదముయొక్క ముఖ్యాంశాలను అతి సంక్షిప్తముగా ఆంధ్రపాఠకులకు అందచేయాలని ఈవ్యాసం వ్రాయనుకట్టాను.

కాని ఇతడు 1918 సంవత్సరమున ఉపాధ్యాయ పదవిని విడిచిపెట్టి రాజకీయ వ్యవహారాలలో ప్రవేశించాడు. ముఖ్యంగా అంతర్జాతీయ సంస్థలలో పాల్గొన ప్రారంభించాడు. అంతర్జాతీయమైన అన్యోన్య విజ్ఞాన సహకారసమితి పక్షాన అమెరికాకు తన దేశము పక్షాన ఒక బృందము వెడలినపుడు ఇతనిని దాని అధ్యక్షునిగా ప్రభుత్వము నియమించి పంపింది. 1941 సంవత్సరములో నశ్వరమైన శరీరాన్ని విడిచినాడు ఈ పండితుడు.

## 2

బెర్గ్‌సన్ తత్త్వవాదమును గ్రహించుటకు అతని గ్రంథరాశి నుండి ముఖ్యమైన మూడింటిని ఎంచవచ్చును: కాలమూ, స్వేచ్ఛాశక్తి (*Time and Free-will 1888*), జడపదార్థమూ స్మృతీ (*Matter and Memory 1896*) సృజించు పరిణామము (*Creative Evolution 1907*) ఆ ముఖ్యమైనవి. ఇతని వాదములో ఉన్న ఘనత ఒక్కటికలదు; మూలసూత్రము ఒక్కటే అన్ని విషయాలను ఏకముఖముగా సమన్వయించగలిగేది "మారుతూ ఉండడము" అనేది ఆ మూలసూత్రము. ప్రతీదీ మారుతూ ఉంటుంది. ఇది పైకి ఎంత సులభముగా ఉన్నట్లు కనిపిస్తున్నదో అంత క్లిష్టమవుతూ ఉంటుంది విచారణ సాగించిన కొలదీ.

ఏ తత్త్వమైనా, ఏ శాస్త్రమైనా, అనుభవాన్ని ఆధారము చేసుకోవాలి. అనుభవములో కనబడేది మార్పు. పదార్థములన్నీ అన్నివిధాల ఎల్లప్పుడూ మారుతూఉన్నట్లు అనుభవము. ఈ అనుభవము చైతన్యమునుండి సంక్రమిస్తున్నది. నేను అనేది అందుకు మూలాధారం. నేను ప్రతిక్షణమూ మారుతూ ఉన్నట్లు నా అనుభవము. కాని కొంత విచారణ చేస్తేనేగాని నా ప్రత్యక్షానుభవము కూడా మార్పుతో కూడుకొన్నదే అని స్పష్టపడదు. బాహ్య వస్తువు అలాగే ఉన్నా, నా ప్రత్యక్షమునకు సిద్ధమైన పరిస్థితులు అలాగే ఉన్నా, క్షణక్షణానికీ నాకు గోచరమయేది మారుతూఉంటుంది. కాలావచ్ఛిన్నమైన మారక తీరదుగదా. భూతమంతా వర్తమాన ప్రత్యక్షంతో మిళితమైనపుడు, క్షణక్షణానికీ భూతము మారడంవల్ల అనుభవము మారిందిగదా. చైతన్య—అవస్థలా అట్టివే. స్థైర్యము అనే గుణము చెప్ప వీలు పడదు. అది ప్రవాహమువంటిది. భూతము వర్తమానంద్వారా భవిష్యత్తులోనికి మారి చైతన్యము ప్రవహిస్తున్నట్లు అనుభవము. ఇది అవిరామమైనది. ఈ అవిరామము అనేది మూలసూత్రం. దీనికే మార్పు అనికూడా చెప్పవచ్చును గాని మారేది మాత్రము పూర్తిగా మారిపోదు. ఆ మారే అవస్థ నిలిచిఉంటూ మారుతుంది. ఈ స్వభావము మానసిక వృత్తులలో బాగా వ్యక్తమవుతుంది. పూర్వము జరిగినది స్మృతిద్వారా ఇప్పటి వృత్తిలో కలుస్తుంది. కాబట్టి నాశనము లేకుండా మార్పు ఉంటుంది. అందుచేత వ్యక్తి అన్నా, అవస్థ అన్నా మార్పే. మారకుండా ఉంది అంటే, నిలిచింది అన్నమాట, ఆ అర్థంలోనే మరొక రీతిని చెప్పవచ్చును; ఒకస్థితి నుండి మరొక స్థితికి మారింది అన్నా, ఆ స్థితిలోనే ఉంది అన్నా ఒకటే అర్థము. ఎల్లప్పుడూ మారుతూఉండడమువల్ల, ఎప్పుడు దృష్టిని ఆకర్షించేటంత స్పష్టమైన మార్పు సంభవిస్తుందో, అప్పుడు కొత్త స్థితి సంభవించింది అని చెప్తూఉంటాము. చైతన్యము అనగా భిన్నభిన్న వృత్తుల సమూహము అన్నా, ఈ వృత్తులన్నీ మనస్సు అనే పదార్థమునకు చెందినవి అన్నా ఒకటే అర్థము. మన అనుభవము మాత్రము మారని ప్రత్యేక పదార్థము కాదు. సంబంధము లేని ప్రత్యేక అవస్థల సమూహమూ కాదు. మార్పు అన్నదే ఉంటేది.

ఈలాగు మారుతూ ఉండబట్టే మనము అన్నది బతికి ఉన్నాము. ప్రపంచము అన్నది కూడా ఈ మార్పే. ప్రపంచము ఎల్లప్పుడూ మార్పు అవుతూ ఉంటుంది. అది అనుభవము. మారుతూ ఉన్న మనోవృత్తుల వెనకను, మారుతూఉన్న ప్రపంచము వెనకను ఏదో ఒక మారనిది ఉన్నది అనడము అనుభవవిరుద్ధము. ఉన్నది అవిరామము మార్పు అవుతూ ఉండడము. అనుభవగతమైన ఈ మార్పులు ఏదో ఒకదానికి చెందినవి అనేది సత్యము కాదు; అనుభవవిరుద్ధము కూడా

బెర్గ్‌సన్ ప్రధానశాస్త్రమైన ప్రాణులశాస్త్రములో దీనిని ఎట్లు ప్రతిపాదించాడో తెలుసుకోవలెను. ప్రాణులు పరిణమించి సిద్ధమైనవని సర్వాంగీకారము. ఎట్లు పరిణమించినవి అనే ప్రశ్నకు రెండువిధాల వ్యాఖ్యానము కలదు. డార్విన్ ప్రకారము అంతరజాతులలో (*Species*) మార్పులు యాదృచ్ఛికంగా కలుగును. అవి వాటిలో ఏవి పరిసరములకు సరిపడునో అవి నిలిచి సంతానాభివృద్ధి చేయుననిన్నీ నిర్వచనము. లామార్క్ ప్రకారము పరిసరములకు ప్రభావము ఎక్కువ. పరిసరములు మారితే, ఆ క్రొత్త పరిసరాలకు సరిపడే క్రొత్త అంతరజాతులు లేచి నిలుచును అని నిర్వచనము. ఇవే పరిణామ సిద్ధాంతములో ముఖ్యమతాలు. వీటిప్రకారము పరిణామము యంత్రవత్తుగా జరుగుతుందనిన్నీ, ఒక ప్రయోజనము గాని ఒక చైతన్యప్రభావముగాని లేదనిన్నీ వ్యాఖ్యానము. ఈ యంత్రవత్తు పద్ధతిని బెర్గ్‌సన్ అంగీకరించలేదు. కృమిజాతినుంచి చిన్న పురుగులనుండి పెద్ద జంతువులనుండిన్నీ ప్రాణవ్యాపారోదాహరణాలను అనేకములను సేకరించి, యంత్రవత్తు పద్ధతి ఎట్లు వాటిని సమన్వయించలేదో నిరూపించాడు అతడు. పరిసరాలకు సరిపడుటకే పరిణామమైనపుడు, ఎన్నో వేల సంవత్సరాల క్రిందట పరిణామము అంతమైంది ఉండవలసినది. అన్ని అవస్థలలోను ప్రాణి పరిసరాలకు సరిపడగలిగినా దానిలోని ప్రాణశక్తి క్రొత్త రీతుల పరిణమించటానికి ఎందుకు ప్రయత్నించాలి? ఆ క్రొత్త

రీతులలో కొన్ని దాని ప్రాణస్థైర్యానికి విరుద్ధముగా ఉన్నవి కూడా అధిక—అధికతర—అధికతమ—సామర్థ్య జీవనాన్ని సాధించడానికి సాధనములు ఎందుకు కావాలి? ఈ ఉత్సాహము ప్రాణశక్తి స్వరూపము; ఇదే ప్రాణము అన్నది; అన్ని ప్రాణులలో వ్యాపించి ఉంటుంది; ప్రాణిని ప్రవర్తింపచేస్తుంది. దీనిని అంగీకరించినప్పుడే పరిణామవృత్తులు ఎందుకు జరిగినవో నిర్వచనచేయ సాధ్యము; కానప్పుడు పరిణామము ఎట్లు జరిగెనో చెప్ప సాధ్యమైనా ఎందుకు జరిగెనో తర్కసంతుష్టిపూర్వకముగా చెప్ప సాధ్యపడదు.

ప్రాణిక ముఖ్యధర్మము ప్రయోజనపూర్వక వ్యాపారము. ఇది ప్రాణము ఉత్కృష్టస్థానాన్ని ఆక్రమిస్తున్న కొలది ఎక్కువ వ్యక్తమవుతూ ఉంటుంది. మనుష్యుని స్థితికి వచ్చేసరికి ప్రయోజనరహిత వ్యాపారము ఉండనే ఉండదు. మనశ్శాస్త్రములో మూలమైన సమస్య మనశ్శరీరాలకు గల సంబంధము. శరీరవృత్తులచేతనే మనోవృత్తులన్నవి కార్యకారణరూపంగా సిద్ధమవుతున్నవి; శరీరవృత్తిలేని మనోవృత్తిలేదు కాబట్టి శరీరవృత్తులు మనోవృత్తుల సంస్థానానికి ఆవశ్యకము. అని భిన్నభిన్న రీతులచేసే ఉపపాదనలలో మనస్సు యంత్రవత్తుగా ప్రవర్తిస్తుంది అని సూచనఉన్నది. బెర్గ్‌సన్ ఇట్టి వాదాలకు ప్రత్యుత్తరముగా చాలా నిదర్శన సామగ్రిని బయటపరచెను. చైతన్యానికి అంగమున్న మెదడుకు కలిగే ఘాతములవల్ల చైతన్య వ్యాపారానికి హాని కలుగలేదని ఆ నిదర్శనాల సాక్ష్యము. తన చైతన్య వ్యాపారాలు మెదడుపైని ఆధారపడినవి కావుగదా. ఈ సాక్ష్య విచారణద్వారా బెర్గ్‌సన్ తన వాదాన్ని ఖాయపరచెను; చైతన్యము శరీరాన్ని అనగా మెదడును ఉపయోగించుకొంటుంది; చైతన్య వ్యక్తీకరణానికి అంగము మెదడు; చైతన్యము బాహ్యప్రపంచముతో కార్యరూపేణ ప్రవర్తించడానికి మెదడు కరణము. చైతన్యము ప్రాణశక్తి.

ఈ ప్రాణశక్తికి ముఖ్యధర్మము చలనము, మార్పు; ఇది ఎల్లప్పుడూ సృజించే శక్తి. దీనికి ఆరంభము, అంతము లేవు; అలాగే

సంపూర్ణత, పూర్తి, ముగింపు లేవు. ఈ శక్తియొక్క అభివ్యాప్తమే ఈ ప్రపంచము. ఈ ప్రపంచము ఏలాగు వచ్చిందో అలాగే మార్పు అవుతూ ఉంది.

ఈ తథ్యాన్ని గ్రహించడము ఏలాగు అనే ప్రశ్నకు సమాధానముగా ఉపలబ్ధి (*Intuition*) అనే అంతర్ జ్ఞానాన్ని నిర్వచించాడు అతడు. ఇది బుద్ధి అనేదానికి సంపూర్ణతను ఇచ్చే ఆత్మశక్తి. ప్రాణిశక్తియొక్క అనుభవ ప్రత్యయము ఈ ఉపలబ్ధి అనే సహాయ్యము ద్వారానే కలుగగలదు. ఈ అంతర్ జ్ఞాన సహాయ్యాన మనము వాస్తవముగా ఇట్టి అవిరామమైన మార్పుకంటె భిన్నము కాదని గ్రహించగలుగుదుము. ఇది ఏకత్వతను గ్రహించునట్టిది. ఇట్టి ఏకత్వతకు చక్కని ఉదాహరణము సంగీతమునుండి తెలుసుకోగలము. రాగమును ఆలాపన చేసేటప్పుడు వినబడే వేరువేరు ధ్వనులు ఉన్నవి. ఈ ధ్వనుల కూడికమాత్రము రాగ్రావ్యత కాదు. ఈ కూడికకు అన్యమైన అతీతమైన ఏకత్వత రాగము, దాని మేళవింపున్నూ. అలాగే ఒక చిత్రమును రంగుల కూడికగాక వాటికి అతీతమైన ఏకత్వతగా గ్రహించాలి దాని ఘనతను అనుభవించేటప్పుడు. అంగముల కూడిక మాత్రమేకాదు ప్రాణి; ప్రాణియొక్క ఏకత్వాన్ని అనుసరించి ఈ అంగాలన్నీ పనిచేస్తవి. ఈ ఏకతను భాగాలక్రింద విభజించగానే ఆ ఏకత నశిస్తుంది. ఈ భాగాల అతీతమైన ఏకత్వమే దాని తథ్యము, దాని సత్తా. ఈ ఏకత్వమును గ్రహించుటకు సహకారి అయేది ఆ ఉపలబ్ధి. ఈ ఏకత్వ గ్రహణమునకు కంటె దాని సృష్టికి ఎక్కువగా ఉపచరిస్తుంది ఉపలబ్ధి. బాహ్యముగా కనబడే భాగాలకు అతీతమైన ఏకతను గ్రహించి, దానిని ఆ భాగాలకు అర్పించి ఆ ఏకతను సృజించడానికి కావలసినది ఉపలబ్ధి. ఈ ఏకతా-సత్తను గ్రహించేవాడు కళాకారుడు. ఆ సత్తను గ్రహించే కళాభిజ్ఞానికి కూడా ఈ అంతర్ జ్ఞానము ఉండాలి. ఏకత్వత అన్నది మీదను వివరించిన అవిరామము; ఒక భాగము రెండో భాగముగా మారుతూ నడిచే ప్రవాహము; పూర్వము అన్నది వర్తమానము అన్నదాని ద్వారా పరము అన్నదిగా మారడము. ఇట్లు మన అనుభవాన్ని గ్రహించడమే సత్తును తెలుసుకోవడము. ఇట్టి సద్ జ్ఞానమే తత్వ జ్ఞానము.

ఈ నిరంతర ప్రవాహమునుండి ప్రత్యేక వస్తువులను తయారు చేసేది బుద్ధి. ప్రవాహములోనిదానికి లేని ప్రత్యేకతను ఇటూ అటూ ఉన్న సంబంధాలను తెగదీసి కల్పించేది ఈ బుద్ధి. ప్రత్యేకతయొక్క ఫలము వాటితో మనము వ్యవహరించడానికి సాధ్యతను కల్పించడము. ఆ వ్యవహార ప్రతిఫలమే వాటికి కల్పించిన రూపాలు అన్నీ. ఈ రూపాలు మనము కల్పించినవే. ఇవి అద్దములోని ప్రతిబింబాలవలె తిరిగి ఆ వస్తువులనుండి మనపై చిత్రింపబడును; ఆ ప్రతిఫలములైన వాటిని వాస్తవముగా అవి ఆ వస్తువులకు చెందినవని భ్రమపడుచుందుము; అవి మనసుంచి బయలుదేరినవేగదా.

ఏకమైన సత్తునుండి విడదీయడమువలన అనేక భ్రమలు కలగడానికి అవకాశము వచ్చింది. తత్వశాస్త్ర చర్చలలో గతినిగురించి, కాలమునుగురించి అలాగే అనేక విషయాలలోను భిన్న భిన్న నిర్వచనాలు లేచినవి. అవి అన్నీ కూడా ఈ అవిరామ తథ్యాన్ని గమనించకపోవడమువలన పుట్టినవి. విరామము అన్నది లేకుండా ప్రవహిస్తున్న తథ్యములో విరామాలు కల్పించి, విడదీసి, ఏకమైనదానిని విభాగించి ఈ చిక్కులు కల్పించారు ఈ తత్వ విమర్శకులు అందరూ. సినిమా చిత్రాలలోని చిన్న చిన్న ఫోటోలు ఈ వస్తువులు. వాస్తవముగా స్థాయిలో ఉన్న వస్తువుల ఫోటోలు కావు ఆ చిత్రాలలోనివి. నడుస్తున్న గుర్రాన్ని చిన్నచిన్న ఖండాల ఫోటోలుగా నిరూపించినంతసేపు ఆ నడుస్తున్న గుర్రం రాదు. ఆ ఖండాలకు గతి పెట్టితే అన్నీ ఏకమై చిత్రాన్ని ప్రదర్శిస్తవి. అలాగే బుద్ధివలన విడదీయబడిన ఈ వస్తుజాలమంతా విరామము లేకుండా ప్రవహిస్తున్న ఈ అవిరామములో ఈ స్థాయిగల వస్తువులను బుద్ధి ప్రదర్శిస్తున్నది. బుద్ధి కల్పితమైన దీనిని తథ్యమని భావించడము పొరపాటు. విడదీయబడిన భాగాలు గుణవాచక పదార్థాలవంటివి. తెలుపు వస్తువు ఉంటే, తెలుపుదనము ఉన్నదానిని తెలుపు వస్తువులనుండి విడదీసి ప్రత్యేక పదార్థంగా ఉన్నట్టు నిరూపించునట్టిది. భాగాలు అట్టివి. కాబట్టి భాగాలగురించి చెప్పేది ఏకతనుగురించి చెప్పడము అసత్యము అవుతుంది. భాగాలను గ్రహించేది బుద్ధి. ఏకతను గ్రహించేది ఉపలబ్ధి అన్న అంతర్ జ్ఞానము.

ఇంతవరకు వివరించిన బెర్గ్‌సన్ ముఖ్య సిద్ధాంతాలు, ఈ ప్రధాన సూత్రాలను అనేక రీతుల అనేక సమస్యలకు సమన్వయింపచేసెను. వాటిని అన్నిటిని రెండు కారణాలవల్ల ఇక్కడ విపులీకరించలేదు. గ్రంథము ఎక్కువగును అని ఒకటి. అది క్లిష్టముగ ఉండడమువల్ల సాధారణ పాఠకలోకానికి నచ్చదని రెండోది. బెర్గ్‌సన్ మహాతత్వవేత్తలలో ఒకడు. ఒక్క సూత్రము క్రింద అన్ని విషయాలను సమస్యలను సమన్వయించినవాడు. అతని వ్యాఖ్యాన ధోరణి, పొందుపరచిన నిదర్శనాలు, నచ్చచెప్పడానికి ఉపయోగించిన ఉపమలు, అనన్య పద్ధతిని ఉంటవి చదువుతున్నంతసేపు అతని వాదాన్ని అంగీకరించని వాడు ఉండడు; పూర్వపక్షపు ఆలోచన రానే రాదు. అలాగని బెర్గ్‌సన్ వాదము సర్వాంగీకృతము అని చెప్పవీలులేదు. అతనిపై అనేక విమర్శనలు అతని జీవితకాలములోనే లేచినవి. బహుశః రానురాను వాటి ఉధృత తగ్గింది అని చెప్పగలము. వాదోపవాదాలలో చిక్కుపడడము అతనికి అంత ఇష్టము కాదు అని నిరూపించుటకు ఈ వాక్యమును పొందుపరుస్తున్నాము. "తత్వజిజ్ఞాసలో స్వమత ఖండనాలకు చెప్పే ప్రత్యుత్తరాలలో వినియోగపడే కాలము వృథా వ్యయము. ఒకరిపై కొకరు చేసుకొన్న అధిక్షేపాల అంతాన మిగిలినది ఏమిటని వారు వారు తత్వగ్రహణమునకు అర్పించిన సత్యాంశాలు. సత్యము ప్రబలమైనది; అదే అమోఘమైన ఖండన చేయగలదు. ఇక వాదోపవాదములు ఎందుకు?" అని వ్రాసిన ఘనుడు అతడు.

మనదేశములో విరాజిల్లిన తత్వవిచారణ చాలా ఉత్కృష్టమైనది. కాని తత్వవిమర్శకులకు ఇతర తత్వనిరూపకుల వాదాలను తెలుసుకొనడము సంజసము. మనదేశములో అనేక మతములు లేచినవి. ఇప్పుడు వ్యాప్తిలో ఉన్నవి కొంచెము కావు. మనము సాధారణముగా ఆరాధిస్తున్న శంకరాద్వైతములోని ముఖ్య సిద్ధాంతాలను ఈ మహనీయుని వాదోపపత్తులతో సరిమాచి చేసే ప్రయత్నము మరొక వ్యాసము కాగలదు.

# వీరచానమ్మ

శ్రీ జీ. జాషువా

తెనుఁగుం జోదుల యుక్కుపిండములు హేతిజ్వాల చల్లార, భం
డన రంగంబు దొలంగి, భీరువయి, యింటంబడ్డ ప్రాణేశ్వరుం
గని క్రోధోజ్జ్వల మూర్తివై, పసుపుటుండల్ జూపు మా ఖడ్గ తీ
క్ష్ణన యర్ధాంగికి, వీరచామనకు రక్త స్వాగతాభ్యర్చనల్.

కవి తిక్కన్నకు సోదరుండవయి, యక్కౌరవ్య సంగ్రామ భా
ర్గవగాథల్ పదునేను పర్వముల నాకర్ణించియున్ వెట్టి యా
దవ సేనం గని పాఱివచ్చితని భర్తం దెప్పు నవ్యాంధ్ర భా
ర్గవి కాలూనిన నేలలో మొలుచునింకం ద్యాగదీపాంకురుల్.

ముగురాడంగుల మైతి మిప్పటికి, నీ పుణ్యాన నింకెందుకీ
మగరాయల్ ధరియించు డాలును, దవాల్, మాణిక్య రత్నాంచితం
బగు ఖడ్గంబని, భర్తలో కఱకు వీరావేశవహ్నిచ్ఛటల్
రగులం దగ్గరిబుగ్గలం బొడుచు ధీరన్ నారి నూహించెదన్.

ఆనిలోనం మరణించియున్న భవదీయంబైన దేహంబుతో
ననలంబుం వరియించి, స్వర్గపుర సౌఖ్యంబుల్ సమార్జించి యుం
డును, దీనాకృతి బాఱివచ్చు మను వీన్గుంగూడి జీవించు టె
ట్లని నిట్టూరుచు వీరకాంతను సమస్తాంధ్రంబు భూషించెడిన్.

సంగరభీరుడై, పురుషజాతి జనించిన యట్టివింత యా
తంగిని పెండ్లియాడిన పడంతిని నేనొక వీరపత్నినై
పొంగు టబద్ధమంచు వలపుం బ్రియనాథు నుదగ్రరోష వి
స్ఫాంగుని జేయు బ్రాహ్మణకులాంగనకుం గవితా సుమాంజలుల్

ఎట్టని రక్తవాహినుల నీది, రణస్థలి పొంగలించు నీ
గుట్టముగూడ నీ పిరికికాల్వు సహింపనిరీతి కళ్లెపుం
బిట్టున పోరుమంచి విలపించెదు నంచు నిజేశు నంగముల్
జాల్లునవాడు నప్పరముకూర సతిం మదినావహించెదన్.

గడగడ కొక్కుపుట్టెడు రక్తమర్పించి
మనుమసిద్ధులసేన బెనగుచుండ
విజయుడైవచ్చు నా ప్రియపుత్రుడని పల్కి
మీయమ్మ నన్ను సమ్మించుచుండ
ఖడ్గతిక్కన కత్తి కఱకుదారుణమంచు
మా బావ తిక్కన్న డాబులాడ
మొక్కవోవని భవద్భుజశక్తిగరిమంబు
వమ్ముగాదని రాజు నమ్మియుండ
ప్రాణభీతిపఱచి వచ్చిన మగయాడు
దానవింక నీకు మానమేం?
పసుపు రాచుకొమ్ము ముసుగుఁగొనని భర్త
నత్తిపొడుచు మహిళకేటికోళ్లు

వీరరసోక్తులఁ గినుక వెల్లియులేచి యుదగ్రమూర్తియై
క్రూర కరాసినకందుకొని గుఱ్ఱము నెక్కిన భర్తకున్నమ
స్కారమొనర్చి-కుంకుమము గంధమునద్ది సహర్షబాష్పయై
పోరికి సాగనంపిన యపూర్వ చరిత్రకు కోటి జోహారుల్.

ప్రియుని శిరస్సుతో పవనవేగమునం బరతెంచు పారసీ
హయమును జూచి ఖేదపడి యశ్రులురాల్చి, తెలుంగుతేజ మ
క్షయమగుగాత మంచు నరుసంబున భర్తృశిరంబుతోడ ని
ర్భయముగ నగ్నిజొచ్చి బలియైన సతీమణి, మాకు ధ్యేయయా.

పసుపుం గుంకుమమీది మోహమున కుద్వాసంబు గల్పించి, నీ
రసదర్పుండయివచ్చు నాథునకు వీరస్వర్గ మర్పించి, ని
ర్వ్యసనస్వాంతత నగ్నిజొచ్చి సకలాంధ్రధ్యేయవై కీర్తిఁ
బసుపుం గుంకుమగా వరించితివి చానా! నీకు శ్రద్ధాంజలుల్!

———

కథానిక:

# కాళరాత్రి

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

సెప్టెంబరు నెల చివరిరోజులు; సుమారు వారంరోజులు వర్షాలు ఎత్తిపెట్టినట్లే కనబడి, ముసురు మొదలుపెట్టింది. అంతకు ముందునాటి రాత్రి మొదలయింది, ఉదయం ఒక్క అరగంట మాత్రం తెరిపించ్చింది; అంతే, రోజంతా చినుకుతూనే ఉంది. ఈదరగాలి కొట్టూంది. వీధుల్లో కలుసుకొన్న మిత్రులు పరస్పరం "ఎక్కడో గాలివాన పుట్టినట్టుంది; దాని చివర ఇది" అన్న మాటను కుశలప్రశ్నల్లో భాగంగా చేసుకొన్నారు. ఇంకా తమకు తెలియని విశేషాలున్నాయన్న విషయాన్ని సున్నితంగా తెలుపుగు చేసుకోవాలన్నవారు "అవునండీ, నిన్నరాత్రి వార్తల్లో ఎక్కడో సముద్రంలో సుడిగుండం ఏర్పడిందని, గాలివాన రావచ్చునని చెప్పారు. పిల్లల గొడవలో సరిగా వినిపించుకోలేదు" అని ముసురుకు తమకు తెలిసిన అధికమయిన కారణాన్ని ప్రసారం చేసుకోసాగారు. రోడ్లు పరిశుభ్రంగా ఉండేంత పెద్ద పట్టణం కాకపోయినా, అటూ ఇటూ తిరిగే బళ్ళకు లోటులేదు; అవి తుళ్ళించే బురదకూ లోటులేదు. ఈ వచ్చే బస్సుతో మన బట్టలు ఎందుకూ పనికిరాకుండా బురద కొట్టుకొనిపోతాయని తెలిసికూడా తప్పుకోటానికి తగిన ఎడంలేని పెద్దవీధులు; ఇక తక్కిన సందుగొందుల సంగతి చెప్పుకోవటం అనవసరం. పాదాలు పూర్తిగా కూరుకుపోయే బురద; అక్కడక్కడ చిన్న నీటికుంటలు; రోడ్డు ప్రక్కనుంటే కాలవలు రోడ్డు ఒకే తీరుగా ఉన్నాయి. కాలవలు వేసవికాలంలో కళ్ళకి కనబడడానికే గాని, మురుగునీరుగాని, వర్షపునీరుగాని పారిపోడానికిగాని కావు.

పట్టణంలో చాలాభాగం ఇళ్లు, గాలీ వెలుతురూ ప్రసరించడానికి వీల్లేకుండా కట్టినవే. ఇల్లునంటి ఇల్లు ఇరికించుకొని కట్టుకోడంవల్ల ప్రక్కలకు కిటికీలుంటే పావకాశంలేదు, పొడవుగా గొట్టాలలాగుంటే ఇళ్లకు ముందు వెనకలకు కిటికీలున్నా లేనిలో జమే.

ఇళ్లలో అధికారం తమదే అయి, ఇంటిలో దేనికీ లోటులేని వాళ్లకు ముసురునాడు ఇంట్లో కూర్చోడమే బాగుండవచ్చును. కాని, ఇంటిలో శాంతి సౌఖ్యాలు రెండూ లేని సత్యనారాయణ వంటివాడికి, ఇంటికంటె గుడిపదిలం అన్నట్టు, వీరయ్య కాఫీ హోటలే ఇటువంటి రోజుల్లో శరణ్యం. ఈగలు ముసురుతూ ఉన్నా, పగలే చీకటికోణంగా ఉన్నా వచ్చేపోయే మనుష్యుల వైఖరీ, ప్రసంగరీతీ, టిఫిను తినేపద్ధతీ ఇవన్నీ మనలనుగూర్చి మనం ఆలోచించకుండా ఉండడానికి తగిన సాయంచేస్తాయి. ప్రస్తుతం సత్యనారాయణకి ముఖ్యంగా కావలసిందే అది.

స్కూలుకి దసరా శెలవులు—కాని తనకి మరి శెలవురోజులయినా ఒకటే, బడిఉన్న రోజులయినా ఒకటే. రేపటినుంచి దసరా శెలవులు ప్రారంభమవుతాయనగా, కొంప మునిగిపోయినట్టు పరుగెత్తుకొనివచ్చి ప్రవేశించాడు 'పద్మనాభంగారు—రేపటినుంచి శెలవుంది; ఆరోగ్యమూ అంతంతమాత్రంగా ఉంది, అయితేనేం, ఎక్కడ శెలవుల్లో పని చెయ్యకుండా జీతంవచ్చే సావకాశం పోతుందో అని—ఇంతాచేసి, ఈ డబ్బు ఎవరికోసమని?—తానెంత ఆరోగ్యంగా ఉన్నాడో భార్యకూడా అలాగే ఉంది. ఎవరుముందో ఎవరు వెనుకో అన్నట్టు ఉన్నారు ఇద్దరూ. ఇన్నాళ్ళూ, శుభ్రంగా తింటేతిని, బట్ట కట్టుకోడానికి కూడా కక్కుర్తిపడి, వడ్డీలకి వడ్డీలుపెంచి ఆర్జించిన డబ్బు కావలసినంత ఉంది. అయినా ఎందుకో ఈ తాపత్రయం? అతనేగాని ఆరోగ్యంగా ఉద్యోగంలో జాయినుకాకుండా ఉండిఉంటే? తనకు ఈ [illegible]రోజులకు ఏమాత్రమూ శ్రమలేకుండా జీతంవచ్చిఉండేది. మొన్నరాత్రి నాన్నగారితో వచ్చిన వివాదంకూడా రాకుండా ఉండేదేమో! ధనికవర్గాల్లో తగాదాలకు కారణాలు ఏమయినా మధ్యతరగతిలోమాత్రం చాటున కొంపదీయిపాట్లు వాదోపవాదాలు, [illegible], రసాభాసలూ కేవలం ఆర్థికమైన మూలాధారం కలిగినవి మాత్రమే.

కాని ఈ సమస్యలను ఏ ధోరణిలోనయినా కాస్త ఒకరినొకరు అర్థంచేసుకోనే ప్రయత్నంచేస్తే ఏమి తప్పు? తానిప్పుడేమీ ఉద్యోగం చెయ్యననలేదే? సర్వవిధాలా ప్రయత్నిస్తూనే ఉన్నాడు; నాన్నగారువల్లి కలుసుకోమన్న ప్రతివారినీ కలుసుకొంటూనే ఉన్నాడు. వినయవిధేయతలు ఉట్టిపడేలాగ మాట్లాడుతూనే ఉన్నాడు. అయినా ఏమో తాను ఎందుకూ పనికిమాలినవాడుగానే కనిపిస్తున్నాడు నాన్నగారికి.

వారంరోజులక్రిందటివరకూ తానూ ప్రయోజకుడే. కాదూ మరి, నాన్నగారికి ఘనంగా జీతం తెచ్చేవాడు ప్రయోజకుడు కాక మరేమవుతాడు? అప్పుడు నాన్నగారు తనతో మాట్లాడే ధోరణే వేరు. తమ్ముళ్లూ, చెల్లెళ్ళుకూడా తనను ప్రత్యేక గౌరవంతో చూసేవారు. నిన్నను మధ్యాహ్నం భోజనం అయాక కిల్లీలు సిగరెట్లు తెమ్మంటే తమ్ముడు వెంకటిగాడు తనకేదో పెద్దపని ఉందన్నాడు. వాడుచేసేపని ఏమీలేదు; ఇంకా ఎప్పుడో రావలసిన దీపావళికి సిసింద్రీలు కట్టడానికి గొట్టాలు తయారు చేస్తున్నాడు. అయినా వాడికి అమ్మదన్ను ఉంది. తాను ఎందుకూ పనికిరానివాడు, ఏపనీలేనివాడు, దమ్మిడీ ఆర్జనలేందీ కిల్లీలూ సిగరెట్లు దేనికి? ఇది అమ్మసిద్ధాంతం—ఇదే ఇంట్లో తక్కిన అందరికీ పట్టుకొంది. అంతగా అప్రయోజకుడయిన తనవంటివాడికి పెళ్ళి చెయ్యడానికి ఎందుకో ఈ కొందరికి వాళ్లు నచ్చినంతమాత్రంలో

వచ్చాలని నిర్బంధంఏమిటి? అసలు ఈ నిరుద్యోగస్థితిలో పెళ్లి చేసుకొంటే, ప్రస్తుతం ఉన్న సమస్యలు రెండింతలుగానే కాదు, అంతలుగా పెరుగుతాయి—ఇప్పుడు తనమీదఎవరికి ఎంత అయిష్టంగా ఉన్నా తినమగట్టిగా ఏమైనా అనడానికి జంకుతారు. ఎంత చేతకానివాడయినా, తాను, అంతగా చికాకువస్తే ఎక్కడికయినా వెళ్లిపోగలడు; ఏదో విధంగా బ్రతకగలడు. చివరికి అదే తప్పనిసరి అవుతుందేమో? తాను తొందరపడ్డాడనకుండా, వీలున్నంతవరకూ సహించిచూస్తాడు. మరి ఇంట్లో పరిస్థితులు ఎప్పుడు గుర్భరమనిపించి, స్థానికంగా ఉద్యోగం వచ్చే ఆశ శూన్యమయినప్పుడు, ఎవ్వరికీ చెప్పకుండా ఎక్కడికో ఒకచోటికి పారిపోతాడు. అంతవరకూ ఎవరు ఏమన్నా పట్టించుకోకుండా ఉండానికే ప్రయత్నిస్తాడు. ఇది నాటి సాయంత్రం అంతా కాఫీ హోటల్లో కూర్చొని, ఆలోచించి, సత్యనారాయణ చేసుకొన్న నిశ్చయం.

ఆఫీసు పేరుకి అయిదు గంటలకో అయిపోయినా, నాన్నగారు ఇంటికి వచ్చేసరికి ఏడు దాటుతుంది. ఆయన వచ్చేవరకూ ఉంటే ఆయన భోజనానికి లేచేవరకూ ఆగాలి, అంటే ఎనిమిది దాటుతుంది. అదొక పెద్ద ఆలస్యం అని కాదుగాని, భోజనాల సమయంలో ఎవరో ఒకరు ఏదో ఒకమాట అనకపోరు. దానితో ప్రసంగం ఎటు తిరుగుతుందో చెప్పలేము. అప్రయోజకుడయిన పెద్ద కొడుకుగా మధ్యతరగతి సంసారంలో పుట్టడంకంటె పెద్ద నేరం ఏమీ ఉండదు. వాడు ఏమి చేసినా తప్పే, చేయకపోయినా తప్పే—

తను కాలేజీకి బి యే లో వచ్చిన అయిదు సెకండు క్లాసుల లోనూ తన దొకటి. వాళ్ళంతా హాయిగా పై చదువులు చదువుకొంటున్నారు. తనకి ఆ అవకాశం లేకపోవడమూ తన పొరపాటేనా? చదువుకి సావకాశం లేకపోయినందుకు తాను పెద్దగా విచారించలేదు. తనకంటె తెలివితేటలుగల సుబ్రహ్మణ్యం, నాగరాజు, రామచంద్రరావు, లక్ష్మణశాస్త్రి వీళ్ళంతా స్కూలు ఫయినలుతోనూ ఇంటర్మీడియేటుతోనూ చదువుకి స్వస్తి చెప్పవలసినవారయారు—ఈ ఊళ్లోనే కాలేజీ లేకపోతే, తనూ స్కూలు ఫయినలుతోనే చదువు సాంతంచేసిఉండును. అయినా ఇప్పుడీ డిగ్రీ కూడా ఉద్యోగాన్వేషణదృష్ట్యా తన కేమీ ఉపయోగించేదిగా లేదు. ఏమో, ముందు ముందు ఉపయోగిస్తుందేమో? ఎందుకు పనికివచ్చినా, పనికిరాకపోయినా ఇంగ్లీషు సారస్వత సముద్రాన్ని మథించే సావకాశాన్ని మాత్రం ప్రసాదించి—పుస్తకాలు స్వంతానికి కొనుక్కొనే శక్తి లేదు తనకి—బహుశః ఎన్నటికీ లభించదేమో! అయినా ఉచితంగా పుస్తకాలు చదువుకొనిచ్చే లైబ్రరీలన్నవి ఉంటున్నంతకాలం, రోజుకి కొన్ని గంటలయినా చదువుకొందికి తనకి వీలున్నంతకాలం—తన జీవితంలోని లోటుపాట్లు ఎలా ఉన్నా సరే, వాటి ప్రసక్తి తనకి లేదు—పరిణత ప్రజ్ఞులు, లోక సంగ్రహపరులు అయిన ఎందరో మహామేధావుల దృక్కోణాలనుండి ప్రపంచాన్ని తాను చూడగలడు—తన కీ దేశంలోని కలకత్తా, బొంబాయి, మద్రాసు, ఢిల్లీ నగరాలకంటె, డికెన్సుమూలంగా లండను, ఓ హెన్రీ మూలంగా న్యూయార్కు, మపాసామూలంగా పారిస్ సుపరిచితములు—మనలోని లోటుపాట్లు డాక్టర్లకి తప్ప, మనకు సామాన్యంగా తెలియనట్టే, మన ఆకారాన్ని చిత్రలేఖకుడు చూసిన ప్రత్యేక దృష్టితో మనం చూసుకోలేనట్టే, ప్రజలు తమనుగురించీ, తమ పరిసరాలను గురించీ స్పష్టంగా తెలిసికోలేరు. బానిసలుగా బ్రతుకుతున్న వారికీ, పరపరిపాలనకు దాసోహమనేవారికీ అందులో పెద్ద పొరపాటు కనిపించదు. ఎవరో కొందరు, తాత్కాలిక పరిస్థితులకు అతీతంగా ఆలోచించగలిగి, వర్తమానంలో మిక్కిలి అసంతృప్తి చెందినవారే, భవిష్యత్తుకి మేలుబాటలు వేయగలరు.

ఇప్పుడు తీరుబాటుగా కూర్చొని తర్కించుకొంటే ఇన్ని ఆలోచనలు వచ్చాయిగాని, నిజంగా మంచి పుస్తకం పట్టుకొంటే తానింకొక, లోకంలోనికే వెళ్లిపోగలడు. వేరె లోకమే మరి—అక్కడి మనుష్యులే వేరు, వాళ్ళ మాట్లాడేతీరే వేరు—అంతేకాదు, ఒక కొద్ది గంటలకాలంలో, ఎన్నో రోజులూ, నెలలూ సంవత్సరాలూ తరతరాలు గడిచిపోతాయి—ఇంత గొప్ప ఆనందం ఇంత సులభంగా ఖర్చులేకుండా దొరుకుతూఉంటే ప్రజలెందుకో కాలం గడవక, అస్తమానం ఆవులించుకొంటూ, 'మరేమిటి విశేషాలు?' అనుకొంటూ, అదివరకు వందసార్లు చెప్పుకొన్న సంగతులనే మళ్లీమళ్లీ అదే మొదటిసారన్నట్టుగా చెప్పుకొని కాలాన్ని బరువుగా నెట్టడానికి ప్రయత్నిస్తూ ఉంటారు—లేదా అనుమానంమీద, లక్షలో ఒక వంతు అవకాశంమీద ఆధారపడిన జూదం, లాటరీ పజిల్సు పోటీలలో తన్మయత్వం పొందటానికి ప్రయత్నిస్తారు. వీటిలో నికరంగా వచ్చే లాభం అవి నిర్వహించేవారికేనని తెలుస్తూఉన్నా, ఏమో అకస్మాత్తుగా వేలూ లక్షలూ రాకూడదా అన్న ఆశతో ఎంతటి నష్టాలకు నా కష్టాలకూ అయినా భరిస్తారు—ఎన్నిమార్లు ఆశాభంగం చెందినా, ఏమో ఈమారు అదృష్టం మనల్ని వరించకూడదా అని భ్రాంతిపడుతూఉంటారు. ఇప్పుడు రాత్రి తాను దీపం పెట్టుకొని చదువుకోడంకూడా ఒక పెద్ద దుర్వ్యయంలాగే ఇంటందరికీ కనిపిస్తోంది. ప్రతి అయిదునిమిషాలకీ, ఎవరికో ఒకరికి ఎందుకో ఒకందుకు తనదగ్గరఉన్న దీపమే అవసరం పడుతూఉంటుంది. తరవాత మళ్లీ తెచ్చి ఇవ్వడంకూడా మరిచిపోతూ ఉంటారు—అవును మరి, తనదేమీ పరీక్షలకి పనికివచ్చే చదువుకాదు; తన ఈ చదువువలన ఎవరికీ ఏమీ లాభించేదిలేదు; మరెందు కనవసరంగా దమురు ఖర్చు? ఇదంతా చూస్తే తాను ఈమధ్యనంతా సాయంకాలం వేగంగా, అంటే నాన్నగారు ఇంటికి రాకుండానే, చిన్నపిల్లలతోపాటు భోంచేసి, పుస్తకం పట్టుకొని బయలుదేరి, విఠయ్య హోటల్లో కూర్చుంటున్నాడు. సినిమా చూసి వచ్చేవాళ్ల సదుపాయంకోసమని హోటలు రాత్రి పదిన్నరవరకూ తెరిచేఉంటుంది. పోయి పుస్తకం పట్టుకుని కూర్చుంటే చదువుకొన్నంతసేపు చదువుకోవచ్చును. లేదా హోటలుకి వచ్చేపోయే వారి వైఖరులను గమనిస్తూ కూర్చోవచ్చును. కుటుంబ రాజకీయాలకంటె, తాను తప్ప తక్కిన అందరూ అవినీతిపరులని ధ్వనించే ఉపన్యాసాలకంటె—అదే, ఇంటివాతావరణంకంటె ఏదయినా నయం. ఆరోజు సాయంత్రంనుంచి నేరం ఏమీ సాగడంలేదు.

వీరయ్య కొంటరుదగ్గర కునికిపాటు పడుతున్నాడు. తానీ మూలను పుస్తకంతో తంటాలు పడుతున్నాడు ఇవాళ ఎంచేతో చదవు సరిగా సాగకుండా వుంది. చదవడానికి కొత్త పుస్తకం ఏదీ దొరకక, అదివరకోసార్లు చదివినదే శామ్యూయల్ బట్లర్ రాసిన ది వే ఆఫ్ ఆల్ ఫ్లెష్ (*The way of all flesh*) పట్టుకొని బయలుదేరేడు ఎక్కడయినా తీసి చదవబోతే, పుస్తకంగురించి కంటె తనను, తన పరిస్థితులనుగురించిన ఆలోచనలే ఎక్కువగా వస్తున్నాయి. పుస్తకంలోని హీరో ఎర్నెస్టు పరిస్థితి, తనస్థితి ఒక్కలాగు కనిపిస్తోంది. అయితే తనకింకా ఇంటిని విడిచిపెట్టి పారిపోయే నిబ్బరం కలగడం లేదు—

సాయంకాలం అంతా బేరం సాగకపోయినందుకు విచారం లేకుండా సినీమా మొదటి ఆట విడిచిపెట్టగానే చాలామంది భోజనానికి, టిఫినుకి వచ్చారు అంతసేపూ ఈరోజు చేసిన పదార్థాల వల్ల వచ్చే నష్టం ఎంత, ఏవిధంగా భర్తీ చెయ్యబడుతుంది అని ఆలోచిస్తున్న వీరయ్యకి ఇప్పుడు వచ్చిన ఇందరికీ కావలసినవి ఎలా సరఫరా చెయ్యడం అనే సంతోషకరమయిన సమస్య పట్టుకొంది

సత్యనారాయణకి మరి కూర్చుందికి బుద్ధి పుట్టలేదు—కాక, ఒక తిండి తినే మనిషి, జాగాను తానెందుకు వృథాగా ఆక్రమించుకోవాలి? వీరయ్య ఏమీ అనడు, అనుకోడు, కాని, తనమట్టుకు తానే ఇంతటి గొడవను భరించలేడు అంతేకాదు, బైట వర్షం కూడా బాగా వెలిసిపోయింది అక్కడక్కడ నక్షత్రాలు కూడా కనిపిస్తున్నాయి ఇంకా వర్షాకాలం ప్రభావం కనిపిస్తూనే ఉంది, చిన్న చలి కూడా ప్రారంభమయింది ఇంకా పదీ పదిన్నరకంటె ఎక్కువ కాలేదు, ఇప్పటినుండి ఇంటికి వెళ్లి ఏంచెయ్యడం? నిద్ర ఎలాగూ పట్టదు, అంతకంటె, అలా దేవాలయం అరుగుమీద కూర్చుంటే, ఎదురుగా కోనేటిలో ప్రతిఫలించేదీపాల వెలుగును చూస్తూ ఎంతసేపయినా గడపవచ్చును ఏ పన్నెండు ఒంటిగంటల ప్రాంతంలోనో ఇంటికి వెళ్లి, చప్పుడు కాకుండా వీధికొట్టు తలుపు తీసుకొని పడుకోవచ్చును — ఇంట్లోవాళ్లు సినిమాకి వెళ్లేననుకొంటే అనుకోనీ—

వీధిచివరదాకా వెళ్లేక జ్ఞాపకం వచ్చింది, అప్పుడు తాను కాలుస్తున్నది ఆఖరి సిగరెట్టని—మళ్ళీ, తిరిగివచ్చి, రెండు మిఠాకిళ్లీలు, ఒక అరపేకెట్టు సిజరుసిగరెట్లు తీసుకొని నడక సాగించాడు బురదని తిట్టుకొంటూ—

దేవాలయప్రాంతం అంతా నిర్మానుష్యంగా ఉంది ఒక మూలను దుర్బలంగా ఒకకుక్క పడుకొనిఉంది, అది లేచి, చెవులు తాటించి, ఎక్కడికో వెళ్లాలన్నట్టుగా కొంచెం మేరవెళ్లి, అంతలోనే తిరిగివచ్చి ఎప్పటిస్థానంలోనే ముడుచుకొని పడుకొంది. పగలంతా దానికి ఏమయినా తినడానికి దొరికిందో లేదో? జీవితమంటె ఏమిటి? ఇంతకన్నా నికృష్టంగా చూడబడుతూ, దీనంగా అడుక్కోడంతప్ప, ఆహారసేకరణకు అన్యమార్గం తెలియని వేనవేలు బిచ్చగాళ్లున్నారు వాళ్ళను చూడడానికి కూడా అసహ్యం—అంతేగాని వాళ్లకు ఆస్థితి పట్టకుండా ఉంచేఉపాయం ఆలోచించేవారు లేరు—తనకు డబ్బు ఆర్జించేశక్తి లేకపోలేదు. మొన్న మొన్నటివరకూ ఆర్జిస్తూనే ఉన్నాడు. ఇంక, మళ్ళీ ఏనాటికన్నయినా ఉద్యోగస్థుడు కాగలడు—ఆ సంగతి తనకే కాదు; ఇంట్లోవాళ్ళకికూడా బాగానే తెలుసును. అయినా తన యీ తాత్కాలికనిరుద్యోగస్థితి ఇంత దుర్భరంగా, అవమానజనకంగా ఉంటూంటే, శాశ్వతంగా నిరుద్యోగులయి ఇతరుల ఆదరాభిమానాలమీద ఆధారపడినవారిమాట ఏమిటి? అటువంటిబ్రతుకు బ్రతికేకంటె, కొద్దిక్షణాలబాధకు ఓర్చుకొని, ఈ చెరువువంటి చెరువులోపడి ప్రాణం పోగొట్టుకోడం చాలానయం.

అప్పుడు తను నాలుగవఫారం చదువుతున్నప్పుడు—ఒకనాడు ఉదయం లేచేసరికల్లా ఊళ్ళో పెద్దగొడవ—దేవాలయం చెరువులో ఎవరిదో శవం తేల్తున్నాదని పెద్దవాళ్ళకి తెలియకుండా తానూ నరసింహం వెళ్ళి చూసేరు బుర్ర, వీపు కొద్దిగా కనిపిస్తూ ఏటవాలుగా తేలుతూఉంది మధ్యాహ్నం రెండుగంటలకి పోలీసులు వచ్చేవరకూ అలాగే తేలుతూఉంది అంతతోనయినా పూర్తికాలేదు హాస్పిటలుకి తీసుకొనివెళ్ళి కోసి చూసారట—ఆ తరవాత చాలాకాలంవరకు రాత్రి పడుకోనేముందు, ఆనాటిశవం జ్ఞాపకం వస్తూ ఉండేది. హాస్పిటల్లో ఎల్లా కోసారో, ఏమిటో, అందువల్ల వాళ్లకు ఏమిటితెలిసిందో? అమ్మమ్మ బలవంతపుచావు చచ్చినవాళ్లు దెయ్యాలవుతారంటూండేది అమ్మమ్మమాటలను ఆధారంలేనివని కొట్టిపారెయ్యడం తేలికే కాని, అమ్మమ్మకు సాధారములో, నిరాధారములో ఏవో కొన్ని నమ్మకాలంటూ ఉండేవి నేడు తనకు ఏ నమ్మకాలూ విశ్వాసాలూ లేవు—అన్నీ సందేహాలే—దయ్యాలూ భూతాలూ ఊహాకల్పితాలు—సరే—అయితే, మృతి అనంతరం మానవుడేమి అవుతున్నట్టు? పూర్తిగా నశించి పోతున్నాడా? ఎప్పటికప్పుడు కొత్తగా సృష్టి జరుగుతూందా? లేక, పూర్వజన్మం పుణ్యపాపాలు ప్రస్తుత జీవితక్రమాన్ని సరిదిద్దుతాయా? స్వర్గనరకములనేవి లేవనుకోడం సుళువే—కాని, మనిషి మంచితనానికితగిన ప్రతిఫలము, చెడునడతకు తగిన శిక్షా లేదనుకోడం మరీ మానవికమయిన అరాజకానికి దారితీస్తుందేమో?

తీరా దుకాణానికి వెళ్ళికూడా అగ్గిపెట్టె తీసుకోడం మరిచిపోయాడు—ఇప్పుడీ సిగరెట్టు పారేస్తే మరి ఇక్కడెక్కడా అగ్గి దొరకదు—అందుచేత ఒకదానికొకటి అంటించి కాల్చేస్తే అయిదూ సుమారు ఒకగంట వస్తాయి తరువాత పోయి పడుకోవచ్చును—

ఎలక్ట్రిక్ దీపాలుకూడా అట్టే కాంతిలేకుండానే వెలుగుతున్నాయి గత సంవత్సరం సెప్టెంబరు నెలలోనే, తానూ సుశీల ఒక నిశ్చయానికి వచ్చేరు తాము తమ ఉభయుల తల్లిదండ్రులనూ వ్యతిరేకించి పారిపోయి పెళ్లిచేసుకొన్నా నిజంగా సుఖపడే సావకాశం తక్కువని, అందుచేత ఆమె వాళ్లనాన్నగారు తీసుకొనివచ్చిన సంబంధానికి అంగీకరించడమే యుక్తమని—సుశీల తన సెంతో తెలివయినవాడని నమ్ముతుంది. నువ్వెలా బాగుంటుందంటే అలాగే కాని అంది—అటువంటి సరళ స్వభావంగల మనిషి ఎక్క



తటాకతీరము

చిత్రకారుడు : శ్రీ వి. వేణుగోపాల్.

ఉంటూనే సుఖపడగలడు—తన చుట్టూ ఉన్నవారిని సుఖపెట్టగలడు—అటువంటి సుశీలను తాను దేశీకులా విడిచిపెట్టుకొన్నాడు. ఎందుకు? ఎందుకో తనకే తెలియదు, పెద్దవాళ్ళను తృప్తిపరచ డానికా అంటే, ఇప్పుడుమాత్రం తృప్తిపరచ గలుగుతున్నాడా? లేదే—ఉద్యోగం దొరకకపోతే అది తన నేరమే, వాళ్ళకి నచ్చిన సంబంధం, అంటే బాగా కట్నంవచ్చే సంబంధం, తనకి నచ్చ లేదంటే తాను కుటుంబ శ్రేయస్సుగాని,కులగౌరవంగాని తెలియని మూర్ఖుడే—తీరా వాళ్ళ ఇష్టప్రకారం చేసుకొన్నా, తరవాత మళ్లీ సమస్యలు రావని కామా ఏముంది?

కష్టాలు తప్పకుండా వస్తాయి; అప్పుడు తన జీవితం ఇంత కంటె కూడా నిర్భాగ్యంగా ఉంటుంది—ఇదంతా తెలుస్తూనే తా నిందుకు తల ఒగ్గుతున్నాడు. తనకి దేనికీ తగిన ధైర్యంలేదు—ఆనాడు సుశీల సూచించిన ప్రకారం తా మిద్దరూ పారిపోయి ఉంటే! ఏమో, ఎలా ఉండునో, ఆమాత్రం తమ కాలక్షేపానికి తగినపాటి ఉద్యోగం సంపాదించలేక పోవునా? ఎందుకు దొరకదూ? తాను తెలివితక్కువగా అర్థంలేని భయాలతో సుశీలను పోగొట్టుకొన్నాడంతే—కట్నాలు ఇతర లాంఛనాలే ప్రధానంగా నిర్ణయించుకొంటే, అమ్మా నాన్నా నిశ్చయించిన సంబంధపు వధువు ఎటువంటి దవుతుందో—ఆర్థికమయిన అసౌకర్యాలకు తోడు సంసారంలో అరకని అపశ్రుతుల మనస్తత్వాలయితే ఇక చెప్పేదేముంది!

ఆనాడు తాను ధైర్యంచేసి సుశీలను తీసుకొని పారిపోయి నట్లయితే...ఎందుకు పదేపదే గతంల పేకుబంధనం!.. అయినా ఏమో మనస్సు మళ్ళీమళ్ళీ అటే తిరుగుతూంది.

చివరి సిగరెట్టు ముట్టించి లేచాడు—. లేచాడు—కాని, వెంటనే నడవాలనిపించలేదు—మళ్లీ కూర్చున్నాడు. సిగరెట్టు పూర్తయేదాకా లేచిపోవచ్చునని.

సిగరెట్టు పూర్తయింది. కాని, లేచిపోవాలనే తలపు ఇందాక ఉన్నంత బలంగా ఇప్పుడులేదు. టైము పన్నెండుదగ్గర కావస్తూంది. కానుంది. మరి కొంచెంసేపు ఇలాగే కూర్చొని పన్నెండు కొడుతూఉండగా బయలుదేరితే.. ఓ, పన్నెండుకి వెళ్లి పడుకొన్నంటే అయిదుగంటలకి లేచినా, నిద్ర సరిపడకపోదు. ఉదయం వేగం తెమిలి ఏడుగంటలకల్లా లైబ్రరీ చేరుకొంటే మధ్యాహ్నం పన్నెండుదాకా మరే బాధా ఉండదు. ఇంకా పన్నెండు కావడానికి ఎంత వ్యవధి ఉందో?

* * * *

మేలుకొనేఉన్నా ఆరాత్రి పన్నెండుగంటలు కొట్టడాన్ని గమనించలేకపోయాడు సత్యనారాయణ. ఆఖరి సిగరెట్టుకూడా పూర్తయింది. అరువిచ్చేదుకాణం మూసిఉంటాడు. అసలు ఇక్కడ కూర్చొనే కాళ్ళుపీకేదుగాని, దారిలో నడుస్తూ కాల్చుకొందికి ఒకటి ఉంచుకొని ఉండవలసింది. ఆఁ, మరొక్కటి ఉంటేమాత్రం రక్షించే దేమిటి? అప్పుడు ఇంటికివెళ్లే ఇంకొకటి కావాలనిపిస్తుంది. మరి, పన్నెండుకొట్టేదాకా కూర్చోవడం ఎందుకు? ఇంటికివెళ్ళి, పక్కమీద పడుకొన్నంటే నిద్ర పట్టినా పట్టక పోయినా మనం చెయ్యవలసినదని అంటూఉండదు. ఇక్కడే ఎంతసేపున్నా ఇంకా అవని మిగిలేఉంటుంది; అదీకాక, రేపు పగలు ఇంటిదగ్గర నిద్రపట్టే సావకాశం లభిస్తుందని కామా ఏమిటి?

లేచి ఒకటి రెండడుగులు వేసేడు—అంతలో అవతలిగట్టున ఎవరో మనిషి పరుగెత్తడం కనిపించింది. అసలు పరుగెత్తడం ముందు కనిపించిందో, వెనకనుండి కాంతా! కాంతా! ఆగు! అన్న కేక ముందు వినిపించిందో తెలియదు—ఇద్దరు మనుష్యులు యాభై అరవై గజాలదూరంలో పరుగెత్తుతున్నారు. వెనక మనిషి గొంతు మగగొంతు; ముందరిమనిషి ఆడమనిషిఅయి ఉండాలి.

సత్యనారాయణ నడక దానంతటదే ఆగిపోయింది. ఇదేదో దొంగతనంవ్యవహారంలా లేదు. అయితే మరేమిటి?

నిశ్శబ్దమయిన ఆ వాతావరణంలో మొదటిమనిషి నీటిలో ప్రవేశించడం కనబడడంకంటె బాగా వినబడినట్లయింది. వెనకా తనే పరుగెత్తుకొనివచ్చిన మనిషి "కాంతా! కాంతా!" అని అరిచి, కొంచెంసేపు నిలబడి, అస్పష్టంగా ఏవో మాటలు అని నీటిలోకి దిగబడ్డాడు.

సత్యనారాయణ తాను చూసినదానికి ఒకవిధంగా అర్థం చెప్పుకోగలిగేడు.

భార్యాభర్తలో, ప్రేయసీప్రియులో, పోట్లాడుకొని ఉంటారు. ఆమె ముందు, అతను వెనకాల అయితే అతను వస్తున్నాడని ధైర్యంగా ఆమె నీటిలోకి దిగబడి ఉంటుంది సరే అతనూ దిగేడు. కొంచెం శ్రమతో ఆమెనుతీసి, ఇంటికి తీసుకొని పోగలుగుతాడు. అతను రావడం ఆలస్యంఅయిఉంటే, ఏమయి ఉండునో? అటువంటప్పుడు ఆమె నీటిలో దిగకపోయిఉండు నేమో. తీసేవాళ్లున్నప్పుడే నీటిలోపడి చస్తామనేవాళ్లకీ, విడిపించేవాళ్లున్నప్పుడే పోట్లాడుకొనేవాళ్లకీ ఉద్రేకం ఎక్కువగా ఉంటుంది.—సరే వాళ్లబాధ ఏదో వాళ్లు పడతారు; మనదారిని మనం పోదాం అనిపించకపోలేదు సత్యనారాయణకు. కాని, వాళ్లు మాత్రం కదలలేదు. ఆలోచనతో సంబంధంలేకుండా దానంతటది పుట్టే తలపుఏదో, ఇదేదో ఈ వ్యవహారం పరిష్కారంకాని, ఇంతలోమాత్రం తొందరేమిటంది.

సత్యనారాయణకి అప్పటికీ పరిస్థితిలోని ప్రమాదం స్ఫురించ లేదు. అబ్బ, ఇక్కడే ఇంత చల్లగా, కొరుదలిగా ఉందికదా, నీళ్లు ఎంత చల్లగా ఉన్నాయో! ఈ వ్యవహారం ఈ కాలంలో కాక, వేసవికాలంలో జరిగిఉంటే, అల్లరిడుల సరదా కూడా తీరి పోయిఉండును, భార్యాభర్తలో, ప్రేయసీప్రియులో...ఎవరో ఈ జంటకి...

గొడ్డుచలిలోనే మరి అంత లోతుగా ఆలోచించా లనిపించ లేదు...ఎంతటి బాధ కాకపోతే ఆమె ఇంత సాహసం చెయ్యడానికి సిద్ధపడుతుంది. పాపం, అతడూ సహృదయుడులాగేఉన్నాడు— పోతేపోని, ఎక్కడికి పోతుందో అని ఊరుకోకుండా వెంటనే పరుగెత్తుకొని వచ్చేడు.

ఏమిటంత ఆలస్యం చేస్తున్నాడు పాపం?

మాటలాడలేకపోయినా, నీటిలోంచి బైటికి రావడం తనకు స్పష్టంగా తెలియవలసింది.

ఇదేమిటింత ఆలస్యం!

వ్యవహారం ఏమీ సవ్యంగా నడుస్తున్నట్టు లేదు. అట్టే ఆలస్యం అయితే తీసినా ప్రయోజనం ఉండకపోవచ్చును అతను టీలో దిగేముందు ఏమిటో గొణుక్కున్నాడు. మాటలు సరిగా వినిపించలేదు. కొంప తీసి, అతనికి ఈత సరిగా రాకపోయి ఉండవచ్చును. అయితే, మరెందుకు దిగుతాడు? ఏదో ఉద్రేకంలో మనసు పట్టలేకపోయి ఉండవచ్చును సత్యనారాయణకి పరిస్థితిలోని ప్రమాదం ఒక్కమారుగా అర్థమయినట్టయింది తనమీద తనకే కోపం వచ్చింది.

ఊళ్ళోని యువకులందరిలోకీ ఈతలో మొనగాడనిపించుకొని, తాను ఇక్కడ ఒడ్డునే ఉండి మీనం మేషం లెక్కపెడుతూ కూర్చున్నాడు. అతను దిగితేమాత్రం; తనవంతు సాయం చెయ్యడంలో తప్పేముంది? అంతేకాదు చెరువులో అక్కడక్కడ ఊబులున్నాయి. అడుగంతా బురదగా ఉంటుంది.

మరిక ఒక్క క్షణమయినా ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు తొందరగా విప్పడంలో చొక్కా ఫ్రరున చిరిగింది చలిగాలికి ఒళ్లు గగుర్పాటు చెందింది. 'అబ్బ, ఎంత చలి' అనుకొంటూ గబగబా మెట్లు దిగివెళ్ళి నీటిలో ప్రవేశించాడు

ఒక మనిషిని తాననుకొన్నకంటె సులభంగా బైటికి తీయగలిగేడు. అప్పటికింకా ప్రాణం ఉందో లేదో తెలియదు రెండవ మనిషికోసం దిగేడు గాలించేడు అలిసిపోయాడు ఎక్కడా జాడ కనబడడం లేదు లోతు లేని నీళ్ళలోకి వచ్చి నిలబడ్డాడు బైటికి చేర్చిన మనిషి సంగతి చూడడమా, ఇంకా నీటిలో వెతకడమా? తను పడిన కష్టం తక్కువే గాని, ఇంతలా అలిసిపోయాడు—ఏం చెయ్యడం! ఏం చెయ్యడం! ఏమీ తోచడంలేదు. ఎవరినయినా పిలిస్తే? ఎవరు వస్తారీ నిశిరాత్రివేళ—

లోపలనుంచి ఏదో హుషారు వస్తుంది, మరి ఆలస్యం చెయ్యడానికి వీల్లేదని—చిన్నతనంలో నేర్చుకొన్నది—నోటిలో వేళ్లు పెట్టి చెవులు గింగురుమనేట్టు వరుసగా నాలుగయిదుసార్లు ఊదేడు; గట్టిగా పెద్ద కేక వేసేడు.. మళ్లీ ఈల ఊదేడు; మళ్లీ కేక వేసేడు... ఎవరికీ వినబడినట్టు లేదు, ఈమారు ప్రయత్నిస్తే దొరుకుతాడేమో! మళ్లీ లోతునీటిలోకి వెళ్ళబోతూ ఉంటె, దూరంనుండి టార్చిలైటు ఇటుతిప్పి కనిపించింది. "ఇక్కడే దేవాలయం చెరువుదగ్గరకి, తొందరగా రండి" అని కేకవేసి, ఈదుకొంటూ లోనికివెళ్లి వెతకడం ప్రారంభించాడు. అతను నీటిలోంచి తిరిగివచ్చేసరికి ఒక పలుగురు పోగయినారు. వాళ్ళు దీపాలు పట్టుకొని అలా నిలబడి చూస్తున్నారేగాని, ఎవరూ వ్యాసకల్పించే ప్రయత్నంకూడా చెయ్యలేదు. సత్యనారాయణ బాగా అలిసిపోయేడు; ఎలాగో చెప్పాడు, ఇంకో మరొక మనిషి నీటిలో ఉన్నాడు. వెతకండి" అని.

అక్కడకు వచ్చి ఏమీ చెయ్యకుండా నిలబడి చూస్తున్న మనుష్యులకంటె బుద్ధిమంతుడొకడు పరుగెత్తుకొనివెళ్లి దగ్గరలో ఉన్న డాక్టరుగారిని, వారిలో ఉన్న ఇళ్లలోని ధైర్యశాలులనూ కూడగట్టుకొని వచ్చేడు. కొంతసేపు తర్జనభర్జనలయిన మీదట ఎలాగో ముగ్గురు సాహసించేరు నీటిలోకి దిగడానికి. సత్యనారాయణ మళ్లీ లేవబోతూఉంటే డాక్టరుగారు వద్దని వారించారు... బైటికి తీయబడిన ఆడమనిషి బ్రతికే సావకాశం లేకపోలేదనీ, దగ్గర్లోనేఉన్న తమయింటికి తీసుకొనివస్తే, చికిత్స చేస్తాననీ అన్నారు. ఇక ఇద్దరు మనుష్యులు ఆమెను మోసుకొని తీసుకొని వెళ్లాలని తంటాలుపడుతూఉండగా, ఒక బలాఢ్యుడు నీటిలో అయితే నేనెందుకూ పనికిరానుగాని, బైట బాధలేదు. మీరు లెండి, అని, సునాయాసంగా భుజంమీదవేసుకొని, పదండి డాక్టరుగారూ అన్నాడు డాక్టరుగారు సత్యనారాయణను లేవదీసి తమతోపాటు తీసుకొని వెళ్లేరు, అక్కడ ఉన్నవాళ్ళకు, ఆ రెండవ మనిషి దొరకగానే తీసుకొనిరమ్మని

సత్యనారాయణని డాక్టరుగారికి తెలుసును. ఆయన పొడిబట్ట విప్పించి, మరేం గాభరా పడకుండా అక్కడ పడుకోమన్నారు. ఇద్దరికీ మరేం ప్రమాదం లేదు, అయినా మీరు చెయ్యవలసినదేదో మీరు చేసేరు. ఈపాటికి చెరువులో పదిమందయినా దిగిఉంటారు మనిషిని కాదు, మంచి ముత్యాన్నయినా గాలించి పట్టుకొంటారు—ఈ రాత్రంతా నాకు పని ఉంటుంది మీరిక్కడ నా పక్కమీద పడుకోండి ఆవిడకి మరేం భయం లేదు, అతను కూడా ఎంత వేగం బైటికి తియ్యబడితే అంత మంచిది—ఉదయం లేచి వెళ్దురు గాని, నాకు మీనాన్నగారినీ మిమ్మల్నీ కూడా తెలుసును—.. సరే సరే, ఎలా జరిగిందో ఏమిటో అంతా ఉదయం చెప్పుదురు గాని, పడుకోండి; నేను ఆ మనిషి విషయం చూడాలి. ఈసరికి మా నర్సు అంతా సిద్ధంచేసి ఉంటుంది...

* * * *

"ఎవరు, మీరా?"

"ఈ సమయంలో ధైర్యంగా తలుపు కొట్టుకొని మరెవరొస్తారు నేను తప్ప—"

"మంచిపని చేసేరు. రండి, లోపలికి"

"ఏమిటో మీకు నేను రావడం ఇష్టం లేనట్టుంది."

"అంతేమాత్రం మీరు మానుతారా? నేను మూడు రోజులాయి చెప్తున్నాను — ఎందుకనవసరంగా మాటపడతారు, హాయిగా ఉండండని."

"అదుగో అలా అంటేనే నాకు కష్టంగా ఉంటుంది నా సుఖంకోసం అంటూ ఉండడం, పైగా ఇదీనాకీ నేను మిమ్మల్ని కోరను గనుక? నాకు ఇంట్లో పరిస్థితులు బాగుండక, నన్ను కొస్త అర్థం చేసుకోగలిగి, సరదాగా మాట్లాడగలవారని మీదగ్గరికి వస్తే, మీకూ కష్టంగా ఉంది—నేను రోజంతటిలోకీ ఎక్కువకాలం మీకు శ్రమ కలిగించడం లేదే—ఒక్క గంటో రెండు గంటలో కూర్చుండిపోతున్నాను. అయితే, ఈమాత్రము కొంచెం సేపటిలో ఎంతో మనసుకి విశ్రాంతిగా ఉన్నట్టుంటుంది.

"అయితే నాకుమాత్రం మీతో కబుర్లు చెప్పుతూ కూర్చోడం ఇష్టంలేదంటారా?"

"అందుకు వంతేమేమిటి? ఎల్లప్పుడూ ఒకే సంగతులు ఒకే ధోరణిగా మాట్లాడే నా ప్రసంగం మీకు ఇష్టంలేకపోవచ్చును— అసలు నా మొగం చూడడమే మీకు విసుగుగా ఉన్నట్టుంది."

"అదన్నమాట నా మాటలకి అర్థం. అలా అనుకొనే మాటయితే, సరే మీ యిష్టం వచ్చినప్పుడల్లా వచ్చి కూర్చోండి, ఎంత సేపయినా సరే, నా అభ్యంతరం ఏమీ లేదు; మీచేత అపార్థం చేసుకోబడి, మాటలు పడేకంటె పైవాళ్ళచేత మాటలు పడడమే మేలిక. ఈ ఊళ్లో నేనున్నంతకాలం మీరు యథేచ్ఛగా రావచ్చును మళ్ళీ సిగరెట్లు మొదలుపెట్టేశన్నమాట?"

"మొదలుపెట్టడానికి పూర్తిగా మానేసేకదూ? అయినా బాగా తగ్గించేశాను. నన్నేదో చక్కదారిలో పెట్టి మరిపించేద్దామని చూస్తున్నారు. ఈ ఊరు విడిచిపెట్టి ఎక్కడికి వెళ్ళిపోదామని?"

"ఇంత ప్రపంచం ఉంటూండగా, ఈ ఊరు విడిచిపెడితే వెళ్ళడానికి స్థలమే లేదా?"

"ప్రపంచం ఎంత పెద్దది ఉన్నా, మనం ఉండే స్థలం స్వల్పమయినదేకదూ. ఎక్కడికి వెళ్దామని, ఏమిటి చేద్దామని?"

"ఇక్కడనుంచి వెళ్లిపోవాలని మాత్రం నిశ్చయించుకొన్నాను. ఎక్కడికి వెళ్లాలి, ఏమిటి చెయ్యాలీ అన్నది ఇంకా నిశ్చయం కాలేదు. అయినా దానికేముంది? ఇక్కడుండి నేను చేస్తున్నదేమిటి గనుక. నేనుండగా ఈ ఇల్లు అద్దెకివ్వడం కుదరదు. ఇంత ఇల్లు నా కనవసరం.. ... అంతే కాదు, ఈ ఇల్లు అమ్మేస్తే కొంత డబ్బు వస్తుంది. అది పెట్టుకొని ఎక్కడో చిన్న ఇల్లు అద్దెకు తీసుకొని ఉంటాను"

"ఇల్లు అమ్మకుండా ఈ ఊళ్లోనే ఇంకొక చిన్న యింట్లో అద్దెకుండి, ఇది అద్దెకివ్వకూడదా?"

"దానికి కూడదని లేదు—అయినా ఈ ఊరు విడిచి పోవాలని అనుకుంటున్నా నన్నానుకదూ? ఇవాళ మీ యింటిలో పెళ్ళి చూపులు జరిగిఉండాలి; ఆ సంగతు లేమీ చెప్పారు కారు, సంబంధం కుదిరినట్టేనా? ఎక్కడయినా మగపెళ్లివారు వెళ్లి ఆడపిల్లను చూసుకొంటారు గాని, వాళ్ళే మిమ్మల్ని చూసుకొందికి రావడమా? ప్రజ్ఞంటే మీదేలెండి—ఇంతకీ ఏం జరిగింది, పండా కాయా?"

"మావాళ్లు స్థిరపడడం పండనుకొంటున్నారు. నేను స్థిరపడక పోడం పండనుకొంటున్నాను"

"అయితే మరి చెప్పక్కర్లేదు, ఇది తిరగ్గొట్టేసే రన్నమాట? అంతేనా?"

"అంతే ననుకోండి, అయితే అంత సులభంగా తెమిలిందా? ఇంట్లో అందరూ క్రాసెగ్జామినేషను—నేను కొంతసేపు సమాధానాలు చెప్పిచెప్పి విసుగెత్తి కూర్చున్నాను మాట్లాడకుండా—దాంతో మా నాన్నగారు విజృంభించేరు—కొంతసేపు ఊరుకొని ఊరుకొని, నా పెళ్ళివిషయంలో నష్టమయినా కష్టమయినా అంతా నా యిష్టంమీదనే జరిగి తీరాలి తప్ప, మరోరకంగా జరగడానికి వీల్లేదని ఖచ్చితంగా చెప్పేసి లైబ్రరీకి వెళ్లిపోయాను. అదే మంచిదయినట్టుంది, రాత్రి ఇంటికి భోజనానికి వెళ్ళినప్పుడు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు—"

"సరే బాగానే ఉంది—కాని, తెలియక అడుగుతాను, పిల్ల తెల్లగా బాగానే ఉంటుందిటకదా, మీకెందుకు నచ్చలేదు"—

"ఇక్కడకు వచ్చినా ఈ క్రాసెగ్జామినేషను తప్పదన్న మాట?"

"సరదాకి ఏదో మాటడిగితే క్రాసెగ్జామినేషన్ అంటారేమిటి? అసలు నా ప్రశ్నకి సమాధానం చెప్పండి"

"చెప్పడానికేముంది, పిల్ల తెల్లగాకాదు, ఎర్రగా ఉంటుంది కనుముక్కు తీరు ఏమీ బాగాలేదు పళ్లు బైటికి కనబడకుండా మూసికొని ఉంచాలని నానా తాపత్రయం పడింది, అర్భకంగా ఉంది, నిలబడితే కాస్త గూని ఉన్నట్టుగా ఉంటుంది. వాళ్లు కొంత డబ్బిచ్చి సంగీతం చెప్పించే ఉంటారు. కాని, ఆ పాట వింటూంటే, కడుపులో తిప్పినట్టయింది"

"బాగానే ఉంది. అయితే మొత్తానికి మీకు నచ్చేపాటి అందగల అమ్మాయిలు లోకంలో ఎక్కడయినా ఉన్నారా? అసలు సినిమాతారలయినా మీకంటికి ఆనుతారా?"

"సినిమా తారలూ, అందాల తారలూ అనబడే వాళ్ళను నేను ప్రత్యక్షంగా చూడనేలేదు వాళ్ళ అందంలో సగంభాగం మేకప్పుమేన్ ప్రసాదించినదీ, తక్కిన సగం కెమేరామేన్ పను కూర్చినది అంటారు ఇంతకీ వాళ్లు ఎలా ఉంటేనేం, తెరమీద అందంగా కనబడి ప్రజల్ని ఆనందపరుస్తున్నారు సినిమాల్లోని పెళ్లిళ్లు చావులూ నిజంకాకపోయినా సంతోషం శోకం కలిగించ గలిగినట్టుగానే, సినీతారల సౌందర్యం సహజమయినదైనా కృతకమయినదయినా దాని ఉద్దేశాన్ని అది నెరవేర్చుకుపోతున్నది."

"అదీసంగతి, అంటే ప్రియురాలు తారాపథంలో ఉందన్న మాట? మరి మీకు మామూలు పెళ్లికూతుళ్లు నచ్చకపోడంలో వింతేముంది?"

"అక్కడే మీరు పొరబడుతున్నారు నాది మరీ అతిపోకడ స్వభావంకాదు—ఇటువల నేను ఇష్టపడడానికి అందంగా ఉండాలనికూడా కోరుకోవడంలేదు—ప్రత్యేకించి అంద వికారంగా ఉండకపోతే చాలనుకొంటున్నాను నేను తగినచ్చే సరికల్లా అదే గగనమయిపోతూంది. ఒక పిల్లకు మిడిగుడ్లు, ఇంకొకపిల్లకు మెల్ల; వేరొకపిల్లకు మూతి అంత వెడల్పుగా చప్పిడిముక్కు—ఇక నడకతీరు మాటతీరూ చెప్పనే అక్కరలేదు. అసలు నాది బుద్ధితక్కువ. సుశీలను చేజేతులా పోగొట్టుకొన్నాను. అయితే ఒకటి, దానికేం తక్కువకాలేదు. హాయిగానే బ్రతుకుతూంది. నిజంగానే అది నన్ను చేసుకొని ఉంటే, ఇప్పటి ఈ భాగ్యం, వైభవం, అనుభవించలేకపోయి ఉండేది—అలాగని, నేనేమీ పెద్ద పుస్తకాల్లోని ప్రేమికుడులాగ ఆమెకోసం తపించిపోయి, తక్కిన వాళ్ళను కాదనడంలేదు—నాకు వచ్చిన సంబంధాలు ఒకటి రెండు

కాకపోలేరు. అది నేను వారు వచ్చేయన్నందుకు ఇవాళ వద్దనేదన్నందుకు వచ్చినట్టే అశాంతులు వచ్చాయి—ఒకటి సాంప్రదాయం మంచిదికాదట—రెండవ సంబంధం సాంప్రదాయం మంచిదేగాని, ముద్దుముచ్చట తీరదట—అంటే అర్థంమరేంలేదు, కట్నం, లాంఛనాలూ ఏమీ విశేషంగా ముట్టజెప్పలేరని—"

"బాగానే ఉంది.—పోనీ ఇవాళ ఖండితంగా చెప్పేసేరు కదా, ఈ అంశంలో ఇష్టం అంతా మీదేనని, ఇకముందయినా గొడవలేకుండా ప్రశాంతంగా మీ స్వప్నసుందరి తారాపథంనుంచి దిగివచ్చేవరకూ నిరీక్షిస్తూ ఉండవచ్చును"

"మీ కిది అంత నవ్వులాట విషయంలాగుంది నిజమే, ఎంతటి సహృదయులయిన వాళ్లకీ, నా పరిస్థితిలోని ఇరకాటమూ, బాధా అవగతంకావు కాబోలు"—

"క్షమించండి ఇంతలోకే మీకు కోపం వస్తుందనుకోలేదు పాలున్నాయి—పంచదార కలిపి ఇస్తాను తాగేసి వెళ్ళి పడుక్కుంటారా?"

"పడుకున్నాక, వెళ్లి, రాత్రంతా ఊరు గస్తు తిరుగుతా వుంటారా?"

"ఏమో, నా కదే అనుమానం—మీరలా తిరగడంవల్ల నేకదా నేననే మనిషిని మళ్ళీ ఈ లోకంలో పడి, మామూలు సమస్యలూ గొడవలూ, మంచి చెడ్డలూ అన్నిటిని ఎదుర్కోవలసి వస్తున్నాది, భవిష్యత్తు ఎలా ఉందో, ఎవరికీ తెలియదు, గాని, నేను మాత్రం ఎప్పుడు ఏ కష్టం అనుభవించవలసివచ్చినా, అందుకు మీరే కారణం అనుకొంటాను"

"తప్పకుండా అనుకోవలసిందే—మనుష్యులకు సుఖంగా ఉన్నప్పుడు అట్టే ఆలోచనే ఉండదు—దుఃఖంగా ఉన్నప్పుడే, ఎక్కడలేని ఆలోచనలూ వస్తాయి—అయితే, మీ కష్టాలన్నీ ఆ రాత్రితోనే సరి—ఇకముందు మీకు సుఖమే గాని దుఃఖంఅంటూ ఉండదు—"

"మీరు నాకు ఆ రాత్రి పునర్జన్మ ప్రసాదించినట్టే అందువల్ల నేను సుఖంగా ఉంటే మీకు ఇదంతా మీ ప్రభావమే అని గర్వించవలసిన మాటే—గాని, నేను కష్టపడితే, దుఃఖపడితే మీకేమి? ఇంత ప్రపంచంలో మీ రెవరో, నే నెవరో అంతేనా! పైకి అనరుగాని, మీకు నేనంత వేగం ఈ ఊరు విడిచిపోతే అంత బాధగున్నట్టుంది కదూ?"

"మీకు మనుష్యులను నొప్పించగలిగే మాటలు బాగానే వచ్చును."

"ఇందులో నొప్పించడాని కేముంది? మీరు నేను సుఖంగా ఉండాలని కోరుకొంటున్నట్టే నేనూ మీరు సుఖంగా ఉండాలని కోరుకొంటున్నాను. అయినా మీరు కొద్ది క్షణాలు, నాకేం పోయింది, అని ఊరుకొంటే చచ్చిపోయిఉండేవాణ్ని. నన్ను కాపాడేరు మీ ప్రాణానికికూడా తెగించి. అటువంటి మీకు నేను ప్రత్యుపకారం చెయ్యలేకపోడం అటుండగా, నా మూలంగా కష్టాలు, నష్టాలు కలగడం అంటే నా కెలాగుంటుంది? ఇందండి పాలు, సరే మన మాటల కేమిటి, రేపు కొనసాగిద్దాము—వెళ్ళి పడుకోండి; రేపు మళ్ళీ స్కూలుకి వెళ్ళవలసి ఉంటుందికదా!"

"సరే, వెళ్తున్నాను గాని, మీరూ ఇవాళ నేనా సంబంధం తిరగ్గొట్టడం తెలివితక్కువ పనే నంటారా?"

"నేనేమంటే ఏం, ఏమనుకొంటే ఏం, మీవాళ్లకి అసంతృప్తిగా ఉండడమూ, అందువల్ల మీకు మనస్సుకి శాంతి లేకపోవడం అనిగాని......"

"సరే, సరే, సరే, తెలిసింది; మరెంగుకు. ఈమారు ఏదయినా సంబంధం వస్తే, కళ్లూ చెవులూ కూడా మూసుకొని, "అద్భుతంగా ఉంది; బ్రహ్మాండంగా వచ్చింది" అనేస్తాను.

"నేనేం మిమ్మల్ని అలా అనమనలేదే—ఒకవేళ మీరు విసుగుకొని అలా అంటే అందువల్ల శాశ్వతంగా ఇబ్బంది పడే దెవరు?" అయితే మీరు మరి అకాలకార్యాలు కట్టకుండా ఏదో ఒక నిశ్చయానికి వచ్చి, కాస్త సంసారపక్షంగా ఆలోచించాలి."

"ఇందాకా నేను చెప్పానుకాదూ, అవి గగనకుసుమాలే అయితే మరి నేను చేయగలిగింది ఏమీ లేదు. మీకు బాగా నిద్ర వస్తున్నట్టుంది. నేను పోతాను."

"నా నిద్రకేం, నాకు పగలు రాత్రి ఎప్పుడూ నిద్రే—మరే పనీపాటు లేదు. మీకయితే రేపు పగలంతా పనిఉంటుంది రాత్రి నిద్రలేకపోతే ఆరోగ్యం చెడుతుంది. వేగంవెళ్లి, వెళ్లినతరువాత మళ్లీ ఏదో పుస్తకం పట్టుకోకుండా పడుకోండి."

"అలాగే ప్రయత్నిస్తాను. కాని, పుస్తకం పట్టుకొంటే నిద్ర రాదు, కొన్ని పుస్తకాలు రెండు పేజీలు చదివేసరికల్లా నిద్ర ముంచుకొని వస్తుంది మరి కొన్ని పుస్తకాలు పట్టుకొంటే అదివర కెంతకాలంగా నిద్రలేకపోయినా నిద్రరాదు."

"నాకు ఆశ్చర్యంగా ఉంది, మీకింత ఓపిక ఎలాఉందో? నేను రోజుకి ఇన్నిగంటలు నిద్రపోతూన్నా నా కింకా నిద్ర వచ్చేట్టే ఉంది. మీరు అసలే నిద్ర అక్కరలేనట్టు మాట్లాడతారు నిద్రలో కలలు వస్తాయని భయంకాబోలు మీకు"—

"కొందరు మేలుకొని కలలు కంటూఉంటారు. మరికొందరు నిద్రలో కలల రూపంగా మేలుకొని ఉంటారు. మొత్తానికి ఫలితం ఒకటే—అందనివాటికి అర్రులుచాపడం, అందనివాటిని అంతస్యం చెయ్యడం...మరి నేను వెళ్తున్నాను"—

* * * *

"మాడమ్మాయి—నువ్వేమో చమత్కారంగా మాట్లాడే వనుకొన్నందువల్ల లాభంలేదు—ఇందువల్ల మమ్మల్ని అనవసరంగా క్షోభ పెట్టడమే తప్ప నువ్వు బాగుపడే దేమీలేదు."

"నేను బాగుపడాలనా మీ తాపత్రయం? నే నెలాపోతే మీకేం? మీ అబ్బాయిని బాగుచేసుకోండి. నన్ను సగంప్రాణం పోయినదాన్నే ఆ రాత్రి మీ అబ్బాయి కాపాడేరు అర్ధరాత్రి, జన సంచారం అసలే లేని సమయంలో ఆయన నన్ను కాపాడతారని నేను ముందుగా ఆలోచించుకొని నీటిలో పడలేదుకదా? నా పనకారల నన్ను కాపాడాలనే ఆతృతతో తనకు బాగా ఈత రాకపోయినా నీటిలోదిగిన మా ఆయనని ఎవ్వరూ కాపాడలేక పోయారు—భగవంతుడే ఆరాత్రి మీ అబ్బాయి రూపంలో వచ్చి నన్ను కాపాడేడు; ఇంకా నేను ఈ లోకంలో అనుభవించవలసిన కష్టాలంటూ ఉన్నాయి కాబోలు."

"కష్టాలు! నీకేం, దీపంచుట్టూ చేరిన పురుగులే చస్తాయి; దీపానికి లోటులేదు"

"మీరు నన్ను దీపమన్నా దయ్యమన్నా ఒక్కటే ఫలితం. నే నిప్పుడేం చెయ్యగలను? ఏంచెయ్యాలి? మీ రిలా పెద్ద రాయ కారంలాగ నా దగ్గరకు రావలసిన అవసరం ఏముంది?"

"మళ్ళీ మొదటికివస్తే నేనేం చెప్పగలను? తెలిసో తెలియకో, మంచికో చెడ్డకో మావాడు నిన్ను ఆ లోకంనుండి ఈ లోకంలోనికి తీసుకొని వచ్చేడు అందుకు వాడికి నువ్వుచేసే ప్రతిఫలం ఇదా? వాడు మాపిల్లల్లో పెద్దవాడు, కుటుంబానికి గౌరవా గౌరవాలు ఏమయినా వాడి మూలంగానే కలగాలి. వాడు సవ్యంగా పెళ్ళిచేసుకొని, ఒక యింటివాడయి, సక్రమంగా సంసారం నిర్వహించుకోడంకంటె మాకు కావలసిం దేమిటి?"

"మీరు నమ్మండి నమ్మకపోండి—నేను ఆయనతో చెప్పేమాట ఇదే. అయితే మీ సమస్యలు నాకెందుకుగాని, చూపండి, ఆయన కిష్టపడని సంబంధం చేసినందువల్ల మీకేం లాభం? లోగడ ఆయనకు ఇష్టపడిన ఒకటి రెండు సంబంధాలను కట్నకానుకలు, సాంప్రదాయం మొదలయిన అంశాలను మనసులో పెట్టుకొని మీరు వద్దంటే ఆయన మానుకోలేదా?"

"ఈ సంగతులన్నీ కూడా నీకు మావాడే చెప్పేడన్నమాట? అప్పుడు బాగానే ఉండేవాడు—అప్పటికింకా వాడి బుర్ర ఇప్పటిమాదిరిగా చెడిపోలేదు."

"అంటే ఆ చెడిపోడానికి కారణం నేనేకదూ"

"కారణం ఎవరయినా కావచ్చును. మనిషిలో నిబ్బరం అన్నది లేకపోయిన తరవాత చెడిపోడానికి అనేక కారణా లుంటాయి. మన బంగారం మంచిదయితే కంసాలివాడి నననం ఎందుకు? అయితే, ఇక్కడ మావాడు మూర్ఖుడు. చెప్పిన మాట వినడు అనేకదా నీదగ్గరకు వచ్చి ఇలా ప్రాధేయపడడం!"

"పెద్దవారు, మీరు పదే పదే ప్రాధేయపడడం అంటే బాగుం డదు. నేనేం చెయ్యాలి అని."

"నీవు ఈ ఊళ్ళో ఉండడంవల్ల ప్రత్యేకంగా కలిసివచ్చేదేమీ లేదు. ఎక్కడ ఉన్నా ఈ ఇంటి అద్దె నెలనెలా వచ్చేలాగా ఏర్పాటంతా నేను ఘూచీగా చేస్తాను. ఇది నేనేమో హక్కు అధికారం అన్నదృష్టితో చెప్పలేదు. కాని, మావాడు అపకీర్తి పాలవకుండా ఉండడానికి, లేదు, ఇప్పటికే వాడిగురించి అందరూ అన్నివిధాలుగా అనుకొంటున్నారు, ఇకముందయినా ఆ అపవాద నిజం కాదనే మార్గంలో వాడు పడతాడని ఆశ..... లేదా, మమ్మల్ని ఉసురు పెట్టి నువ్వు బావుకొనే దేమీ లేదు. నీకూ.. ...

"ఇంతసేపూ మంచిగా మాట్లాడేరు, ఇప్పుడు బెదిరింపులకి దిగేరన్నమాట! బెదిరించి నన్ని ఊళ్ళోనించి తగిలేయ్యగలమని ఆశ పెట్టుకోకండి. నా అంతట నేనే ఈ ఊరునించి వెళ్ళిపోవాలని నిశ్చయం చేసుకొని ఉన్నాను అయినా మీ ధోరణి, ఏమీ లేనిదే అనవసరంగా అపవాదులు లేవదీసే మన స్వభావం ఇదంతా చూసి ఆ నిర్ణయాన్ని మార్చుకోవాలన్నంతలా అనిపించింది."

"దంపేళ్ళు."

"మరేం భయం లేదు. నేను పోతాను కాని, ఒక్క మాట లోకం ఎలా అనుకొన్నా మీరే ముందుగా మీ అబ్బాయినిగురించి అనవసరంగా చెడు ఊహిస్తున్నారు. ఆయనకు నాకూ మధ్య మీరూహించిన సంబంధం ఏమీ లేదు అటువంటిది ఉంటే ఇంత కాలం మీరంతా ఇలా రాద్ధాంత సిద్ధాంతాలు చేసేపర్యంతం ఎదురు చూస్తూ ఉందురూ! ఆయన ఇక్కడికి వచ్చి ఒకగంట రెండుగంటలు కూర్చొని మాట్లాడి వెళ్తున్నారంతే. ఈ ఒక్క గంటలోనూ పది మార్లయినా మీరు నా అందంగురించి ప్రస్తావించేరు. ఆయన ఇన్నాళ్ళలోనూ ఒక్కమారా మాట అనలేదు"

"క్రియ జరిగిపోతున్నవాడికి మాటతో ఏంపని?"

"నిజమే నాకు తెలుసును మీరు నమ్మలేరని. మీకు అన్నిటికంటె పరమశత్రువు మీ మనస్సే—మీకు ప్రపంచాన్ని క్షుద్రమయినదీ, నీచమయినదీ అని చూడడంతోనూ, దానివలన హింసలు పడిపోతున్నా మనుకోడంలోనూ ఒక రాక్షసానందం ఉంది. నాకూ కొన్నాళ్లలాగే ఉండేది...సరే మరెందు కిన్ని మాటలు—మీ రిలా నా దగ్గరకు వచ్చి ఈ గొడవంతా చెయ్యకుండా ఉంటే బాగుండేది...అలాగని మరేం భయపడకండి—నేను వెళ్లిపోతాను. అయితే మీరు మీ అబ్బాయిని బాగుచేద్దామనుకొనే పేరుతో అతన్ని మీకు శత్రువుగా తయారుచేసుకుంటున్నారకారణంగా, వెళ్ళండి...

*　　*　　*　　*

అర్ధరాత్రి—చిమ్మచీకటి—ప్లాటుఫారంమీది దీపాలవెలుగూ రైలులోని దీపాల వెలుగూ తామున్నామని సూచించడానికి మాత్రమే ఉపయోగిస్తుంది

ఇంకా చాలాదూరంలో ఉండగానే రయిలు వస్తున్న కూత వినిపించింది సత్యనారాయణకు.

చిన్నతనంలో పరుగుపందేలలో పరుగెత్తినకంటె జోరుగా పరుగెత్తాడు సత్యనారాయణ.

స్టేషనులో నుండి బండి బయలుదేరడానికి ముందు కొట్టబోయే ఒకగంట వినిపించింది. ఒక్కక్షణం కాళ్లు స్తంభించిపోయాయి. నిరాశతో నిస్పృహతో అలా నేలకు కూలబడిపోయినంత పని అయింది

పీడకలలో అరవడానికి నోరురాని పరిస్థితిలో ఉన్న మనిషిలాగ అయినాకూడా ఎలాగో ఆఖరి ప్రయత్నం చెయ్యాలని ఒళ్లు తెలియని పరుగు ప్రారంభించాడు

బండి బయలుదేరవలసిన గంటకూడా మ్రోగింది—ఇంజను కూసింది

తనకంటె ముందున్న గుర్రం లక్ష్యాన్ని సమీపించిందని తెలిసీకూడా, పరుగులోని వేగాన్ని హఠాత్తుగా తగ్గించుకోలేక పరుగెత్తే గుర్రమయాడు సత్యనారాయణ—

ఇంజను మళ్ళీ కూసింది—కాని, గార్డుగారు స్టేషనులోని ఆప్తమిత్రుడితో అంతరంగిక విషయం మాట్లాడుతూ నీ యిష్టం వచ్చినట్టు కుయ్యి, నేను అనుమతించందే నువ్వు కదిలేదిలేదు అనుకొని తన ప్రసంగం సాగించాడు, మరొక కొన్ని సెకనులకాలం.

కొద్ది సెకనులుకూడా ఒకొక్కప్పుడు కొన్ని జీవితాలను శాశ్వతంగా కలపడానికి విడదియ్యడానికి సమర్థమయినవి కాకపోవచ్చును

"ఇంక మరి వచ్చేవారు వెళ్ళేవారు లేరు, ఇక్కడ నిలబడడం వృధా—పోయి ఈ టిక్కెట్లు వేరీజు వేసుకోవాలనుకొంటున్న టిక్కెట్టు కలక్టరు తుళ్లిపడేట్టుగా తోసుకొని ప్లాటుఫారంమీద పడ్డాడు సత్యనారాయణ—

ఏదో ఒక పెట్టి, ఎలాగోలాగు రైలందుకోడం అతని లక్ష్యం—

కాని, ఎదురుగా ఉన్న పెట్టె కాక పక్క పెట్టె గేటుదగ్గర నిలబడి కనిపిస్తూనే ఉంది ఆమె—అతనికి ఏమాత్రం తెలియనివ్వకుండా కట్టుదిట్టం చేసుకొని వెళ్లిపోతున్నా ఆమెకు ఏదో లోపల్లోపల చిన్న ఆశ ఉండిపోయింది కాబోలు—

అతను కనబడిన తరవాత, రైలు కదిలిపోయి, అతని కందకపోతే గొలుసు లాగి ఆపడానికి కూడా ఆమె సిదమే. కాని, ఆ అవసరం కలకలేదు. గార్డుగారి విజిలూ, తామూరు నిజంగా బయలుదేరుతున్నామనే యింజను కూతా, అతను బంతిలా ఎగిరి బండిలో పడడమూ అన్నీ ఏకకాలమందు జరిగేయి.

చాలాసేపటికి సేదదీరి మాట్లాడగలిగే స్థితికి వచ్చేక సత్యనారాయణ అన్నాడు. "అభూత కల్పనలు చేసి, అపవాదులు ప్రచారంచేసే లోకులే నాకంటె బుద్ధిమంతులు—అందుకొటులో నున్న వజ్రాన్నిగూర్చి ఆలోచించకుండా, రాళ్లకోసం వెతకపోగాను. అయితే నన్ను బాధ పెట్టాలన్నవాళ్ళ మాటలే చివరికి నాకు కర్తవ్యాన్ని బోధించాయి, ధైర్యాన్నిచ్చాయి—ఏమంటావు."

"ఏమీ అనడం ఎందుకు! ఆ రోజు రాత్రి నీ ఆశా లేకుండా నీటిలో పడినట్టే ఈ రాత్రి రయిలెక్కను—అప్పుడూ ఇప్పుడూ

కూడా మీ రిలా కాపాడడానికి పది లక్షల్లో ఒక వంతుకూడా అవకాశం ఉందని గట్టిగా అనుకోలేము—అయినా, ఎప్పుడూ సవ్యంగా నడిచే రైళ్ళూ, హాయిగా పారే నదులూ, ప్రశాంత గంభీరంగా ఉండే సముద్రము హఠాత్తుగా ఏవో ప్రమాదాలను తెచ్చి పెట్టాగానే, అప్పుడప్పుడు కొన్ని మంచిపనులు కూడా జరగడానికి తగినన్ని అవకాశాలు లేకుండానే జరుగుతాయి పోనీలెండి జరగ వలసిందేదో జరిగింది టిక్కెట్టు కొన్నారా?

"టిక్కెట్టు? ఎక్కడికి? నేనేగాని టిక్కెట్టుకొనడానికి గాని, గేటుదగ్గర టిక్కెట్టు కలెక్టరు మాట వినిపించుకోడానికిగాని అలస్యం చేసిఉంటే, అంగుళ్ళ కలిగిన ఆకాశంగపు ఉద్ధృతికి తట్టుకోలేక ఇంకొక లోకానికి టిక్కెట్టు కొనుక్కొని ఉండే వాణ్ణి—

"ఛ, ఎందు కలాంటి మాటలంటారు? అంతా ఎలా జరగాలో అలాగే జరుగుతుంది—మన మేదో ఎంతో వేగంగా పారిపోతున్నా మనుకొంటున్నాము—ఆ నక్షత్రాలనుంచి చూసేవాళ్ళకి మన భూమే కనిపిస్తుందో కదిలిందంలో? రెండు చీకటి రాత్రులు మనల్ని ఇలా దగ్గరకు తీసుకొని వచ్చాయి—అయినా కలిసి ఉన్నంతకాలం ఒకరికొకరం భారంగా కాగా పరిణమించకుండా ప్రయాణం చేద్దాము"—

"ఒక బంతి అనంతంగా సరళ రేఖామార్గంలో నడవాలను కొంటుంది—ఏదో ఒకటి అడ్డువస్తుంది. దీనొని మళ్ళీ మరొక రేఖా రేఖలో ప్రయాణం మొదలుపెడుతుంది అలా దీనొని దీనొని ఎప్పటికో చలనశక్తి పూర్తిగా ఖర్చయి ఆగిపోతుంది—ఎప్పుడు ఏది మన మార్గంలో అడ్డుపడి దానిని మనం ఏ ఏ మార్గంలో ప్రయాణించవలసి వస్తుందో చెప్పలేము అయితే ఒక దిక్కుగా వెళ్తున్నంతకాలం ప్రయాణం సుగమం కావాలనే ప్రయత్నం మాత్రం చెయ్యకుండా ఉండలేం, ఆ రాత్రి అదివరకు విడివిడిగా ఉన్న మన జీవితాల బంతులను కలిపి ఒక దిక్కుగా, ఎడఎడంగా సమాంతర మార్గాల్లో నడిపించింది మళ్ళీ ఈ రాత్రి వేరు వేరు దిక్కులుగా విడిపోవలసిన దానిని కలిపి నడిపిస్తుంది—"

"చాలా బాగానే ఉంది సామ్యము కాని నా కిదంతా తెలియదనుకొన్నారు కాబోలు. ఇదంతా చెప్పడంలో మీ ఉద్దేశం ఏమిటి అంటే మనం కలియడానికి మన ప్రయత్నంతో సంబంధం లేకపోయినట్టే, మనం విడిపోడానికి కూడా మన శక్తిమించిన ప్రభావాలు పనిచేస్తాయని ముందుముందు తప్పించుకోవాలని కాబోలు—నేను, అంతగా, మానవప్రయత్నంమీద విశ్వాసం లేని మనిషిని కాను—మనం ఎన్నటికీ కలిసిఉంటామనే నా ఆశ అందుకు నా ప్రయత్నాలు వృథా పోవనే నా విశ్వాసం."

"విశ్వాసం, ఆశ ఉండడం మంచిదే—ఎంతటి అంధకారంలోనూ ఏదో వెలుగు లేక, కనిపించక పోగు—దానిని ఆధారం చేసుకొని ముందుకు సాగిపోవాలనే ప్రయత్నిస్తాము గెలిచినా ఓడినా. తమసోమా జ్యోతిర్గమయ—





ప్రమథగణం

భువనేశ్వర దేవాలయ శిల్పం

చిత్రకారుడు: శ్రీ కె. వేణుగోపాల్.

# మన్మథ!

శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు

౧

మధువుం జిల్కు మనూను నీ ధనువు సమ్యగ్వాక్కులం గుల్కు నీ
రద రాజంబు సుధా ప్రపూరితములై రంజిల్లు నీ శస్త్రముల్
సఫలంబౌను మహా సమర్థుఁడవు సత్యస్వామి వీవోయి! మ
న్మథ! అబ్జాసన మెక్కి ప్రోవు మిఁక సామ్యస్వామ్య ధర్మమ్ములన్.

౨

జయ నాదంబులు సభ్యనాగరకతల్ సౌజన్య సంబంధముల్
నయ మార్గంబులు సన్నివేశములు నానా శోభనమ్ముల్ మహో
దయముల్ సామ్య మహోద్యమ ప్రకృతి సిద్ధాంతంబులన్నా! దశా
మయ! దేశంబుల నుద్ధరించెదవు రమ్మా! స్వాగతం బందుమా!

౩

అమ్మ ధనమ్మునం గెడి దయామయి! పంట వసంతి యింతి పి
న్నమ్మ - వరప్రదాత పరమాత్ముఁడు తండ్రి - చరాచర ప్రపం
చమ్మును సృష్టిచేయు గుణశాలి కళావిభుఁ డన్న? రమ్మ! రా
రమ్మ! త్వదాగమమ్మున కొఱంతలు చింతలుదీరు మన్మథా!

౪

చిగురింపుల్ సవరింపు లొప్ప వనలక్ష్మీ దేవతల్ స్వాగతో
త్సవముల్ కూర్చిరి నీకు - నూతన వసంత ప్రేమ మాధుర్యముల్
జనసర్వమ్ములఁ జేర్చి లోకమున కాశ్చర్యంబుఁ గల్గించె - ర
మ్యపలోకింతువుగాక మన్మథ బుధా! యాహ్లాద సంపత్ప్రదా!

---

# పంచవర్ష ప్రణాళిక - ఆర్థికాభివృద్ధి

శ్రీ కె. వి. రమణ

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఆఖరి సంవత్సరం నడిచిపోతోంది ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు సన్నాహాలు చేస్తున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక స్వరూపం ఏవిధంగా ఉన్నా ఒక ముఖ్యవిషయాన్ని ప్రభుత్వం గుర్తించాలి ప్రథమ పంచవర్ష ప్రణాళికలోని లోపాలు సరిదిద్దబడాలి దీనివలన నెరవేరని ఆశయాలు లభించేటట్లు దాని స్వరూపం వుండాలి దీనిదృష్ట్యా ప్రథమ పంచవర్ష ప్రణాళికలో జరిగిన ఆర్థికఫలితాలేమిటో, యింకా సమకూరని ఆశయాలేమిటో పరిశీలించటమే ఈ వ్యాసోద్దేశం

యుద్ధానంతర పునర్నిర్మాణంలో తదితర దేశాలవలె భారత దేశంలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక క్రింద చెప్పుకోదగ్గ ఫలితాలు కొన్ని వున్నాయి అనతికాలపు ఆశయాలు కొన్ని ముఖ్యంగా సాధింపబడ్డాయి ముఖ్యంగా మన ఆర్థిక వ్యవస్థలో గత పది సంవత్సరాలలో ముఖ్యమైన స్థిరత్వం చేకూర్చబడింది; తరువాత అభివృద్ధి ప్రణాళికలకు వలసిన ఆర్థిక స్తోమతను పొందింది ధరలు, ముమ్మరం తగ్గి కొరియా యుద్ధపూర్వపు సాయికి వచ్చాయి. వ్యవసాయ రంగంలో అభివృద్ధి మెచ్చుకోతగ్గది తిండిగింజల కొరతతో అల్లాడిపోయిన దేశం నేడు, వీటి ఉత్పత్తి ఎక్కువ అయి ధరలు పడిపోయే ప్రమాదస్థితికి కూడ వచ్చింది పారిశ్రామిక ఉత్పత్తిలో అనుకొన్న హద్దులు మీరగలిగాం మొత్తంమీద ఉత్పత్తి—ధరలు—దేశంలో చెలామణి అయ్యే ధనం ఒక సామ్యానికి వచ్చాయి అంటే పంచవర్ష ప్రణాళికయొక్క అనతికాల ఆశయములు కొనసాగినవన్న మాట ఈ క్రింది పట్టీలో యిచ్చే సంవత్సరముల వారిగా చూపబడినవి

ఎంతవరకు నెరవేరాయని అంటే మాత్రం అసంతృప్తికరమైన సమాధానం వస్తుంది. ఈ ఆశయాలు ముఖ్యంగా రెండువిషయాలమీద ఆధారపడి వుంటాయి—ఒకటి. జాతీయ ఆదాయం పెరుగుతూ, దానిలో ఎక్కువభాగం పెట్టుబడి ధనముగా వినియోగింపబడాలి. రెండు: అందరికీ ఉద్యోగావకాశముల కల్పించి జీవనప్రమాణములను హెచ్చుచేయాలి. ఈ రెండు అంశముల దృష్ట్యా చూస్తే పంచవర్షప్రణాళికయొక్క ఫలితాలు సంతృప్తికరంగాలేవు. ప్రస్తుతం మనం జాతీయ ఆదాయంలో నూటికి 4 వంతులు మాత్రమే ఆదా చేస్తున్నాము. పెరిగే జనాభాగల మనదేశంలో వచ్చేతరాలలో ప్రస్తుతపు జీవన ప్రమాణాలు నిలబెట్టవలెనన్నా అధమం నూటికి 15 వంతులు పైగా ఆదా చెయ్యాలి రోజురోజుకీ పెరుగుతున్న నిరుద్యోగ సమస్యని పరిష్కరించాలంటే ప్రభుత్వం ఎక్కువ పెట్టుబడిపెట్టి తన ఆర్థికరంగాన్ని విస్తృతం చేసికోవాలి. ఈ రెండు ఆశయాలు ప్రాధానము దృష్టిలో ఉంచుకొని రెండవ పంచవర్ష ప్రణాళికను తయారుచేయాలి పై రెండుసమస్యల స్వరూపాన్ని పరిశీలించాలంటే దేశపు (1) జనాభా, (2) నిరుద్యోగసమస్య; (3) ప్రయివేటు పెట్టుబడులగురించి ముందుగా గుర్తించాలి. ఎందుకనగా పై రెండు ఆశయముల సాధన ఈ సమస్యలతో సన్నిహితముగా సంబంధించబడివున్నది

ప్రజల శ్రేయాభివృద్ధి జాతీయ ఆదాయములలో మార్పును బట్టి నిర్ణయింపవచ్చును. ఆదాయములు పెరిగేకొలదీ, ఆదాయములలో ఎక్కువ వ్యత్యాసములు కలుగకపోతే, జీవనప్రమాణములు హెచ్చుతాయి. ఈ ఆదాయాభివృద్ధి దేశంలో జరిగే "పెట్టుబడి పెరుగుదల" మీద ఆధారపడి వుంటుంది. విరివిగా విదేశీయ పెట్టు

| | 1949—50 | 1950—51 | 1951—52 | 1952—53 | (రూపాయలలో) |
|---|---|---|---|---|---|
| సరాసరి ఆదాయములు (*Per Capita Incomes*) | | 246.3 రూ. లు. | 252 రూ. లు. | 261 రూ. | |
| చెలామణీఅయ్యే ధనం (*Money supply*) | | 1951 మార్చిలో 1966 కోట్లు | | | మార్చి 54 లో 1845 కోట్లు |
| ఎగుమతిదిగుమతుల సామ్యం (*Balance of payments*) | | | —136.3 కోట్లు | +48.4 కోట్లు | |
| పారిశ్రామిక ఉత్పత్తి సూచీ | | 105 | | 135 | 1946 సం॥ ఆధారంగా తీసికొనబడింది |
| ధరల సూచిక — | 395 | 458 | | 385 | |
| *Cost of living Index (1949 Base Yaar)* | 105 | 115 | 101 | 103 | |

పై ఫలితములుమాత్రం సంతృప్తికరంగానే వున్నాయి. బడులు లేకపోయిన, దేశంలో మొత్తం పెట్టుబడి అయితే ప్లానింగుయొక్క ముఖ్యోద్దేశములు దీర్ఘకాల ఆశయములు ధనం ప్రజల వినియోగాన్నిబట్టి నిర్ణయమవుతుంది. ప్రస్తుతం

ఉన్న జీవన ప్రమాణములను యింకా తగ్గించి ప్రజలను ధనం ఆదా చేయమని అడుగుట సమంజసంకాదు, కారణం ఈ ప్రమాణాలు అసలే చాలా తక్కువస్థాయిలో ఉంటుటయే. కాని పారిశ్రామికంగా అభివృద్ధిపొందిన దేశాలు జాతీయ ఆదాయములలో నూటికి 20 శాతంలు వరకూ ఆదాచేసి పెట్టుబడి పెరుగుదలకు తోడ్పడాయి ప్లానింగు కమిషన్ లెక్కలప్రకారం ప్రస్తుతం మనం నూటికి 5 పాళ్లు నిల్వచేస్తున్నాము పంచవర్ష ప్రణాళికప్రకారం 1967-68 సంవత్సరానికి ఈ రేటును నూటికి 20 వంతులు చేయాలని అందినా ఈ నిల్వధనముమీద నే దేశంయొక్క పెట్టుబడి ఉత్పత్తుల నిష్పత్తినిర్ణయింపబడుతుంది తక్కువ పెట్టుబడి ధనంతో ఎక్కువ ఉత్పత్తిని పొందగలగటమే మనలాంటి వ్యవసాయిక బీదదేశాల ఆశయమయి వుండాలి. దీనివలన ఎక్కువమందికి ఉద్యోగావకాశములనుకూడ కల్పించవచ్చు జనాభా అధికంగాగలదేశాలలో కాపిటల్ కంటె లేబర్ ను ఎక్కువ ఉపయోగించుకొనే ఉత్పత్తి సాధనాలను సాధ్యమయినంతవరకు ఉపయోగించుకోవాలి ప్లానింగును సాధనంగాతీసికొని త్వరలో మనం పెట్టుబడి పెరుగుదల చేయాలి రెండవది కాపిటల్ లేబర్ నిష్పత్తిని అధికంచేసికోవాలి ఈ ఆశయసాధన జనభా సమస్యమీద ఆధారపడివుంటుంది మన జనాభా 1891-1920 మధ్య 12 మిలియన్లుమాత్రం పెరిగింది 1920 తర్వాత 30 సంవత్సరాలలోను దాదాపు 10 కోట్లు పెరిగింది 1920 తర్వాత జనాభా యింత విపరీతంగా పెరగటానికి కారణం అంటువ్యాధులవలన తక్కువమంది చనిపోవటమే! ప్రస్తుతం జననమరణముల సంఖ్యలు ఎక్కువగావున్నా (అవి ప్రతి వేయిమందికి 40 27) క్రమంగా మరణములరేటు తొందరగా తగ్గుతోంది జననములరేటుమాత్రం తరగటంలేదు ఆధునిక విజ్ఞాన సహాయంవల్ల ప్రజల ఆరోగ్యాభివృద్ధిచేసి (ఉదాహరణ డి డి టి, బి సి జి మొదలయినవి విరివిగా ప్రచారంలోకి రావటం) మరణముల సంఖ్య తగ్గించుట సులభంకాని జననములసంఖ్య తగ్గించుట అంత సులువుకాదు అంత అచిరకాలములో జరిగేపనీ కాదు ఉదాహరణగా ఇంగ్లండు దేశంలో మరణసంఖ్య 1740 లో వెయ్యిమందికి 35 నుంచి 1930 లో 12 వరకు తగ్గింది కాని జననములసంఖ్యకూడా తగ్గుట వందసంవత్సరములు పైగా పట్టింది మనదేశంలోకూడా తొందరగానే జననమరణముల రేట్లను తగ్గించి క్రమంగా ఎన్నో తగ్గుతుంది అయితే మరో వందసంవత్సరాలదాకా అగి!! ఇంగ్లండు దేశానికి మనదేశానికి యింకా తారతమ్యాలున్నాయి ఇంగ్లండు జనాభా మొదటిలో చాలా తక్కువ రెండు అదినుండి ఇంగ్లండుకు పెట్టుబడి ధనం కొరత ఎప్పుడూ లేదు అందుకనే పెరిగే జనాభాతో పరిశ్రమాభివృద్ధి త్వరలో సాగించింది దీనికి సాయం ఇంగ్లండునుంచి చాల జనాభా ఇతరదేశాలకు వలసపోయారు మనదేశానికి పై పరిస్థితులలో ఏఒక్కటి అనుకూలంగాలేవు అందుకనే జీవనప్రమాణములను త్వరలో హెచ్చుచేయటానికి జనాభా పెరుగుదల పెద్దఅడ్డంకి ప్లానింగుకమిషనుయిచ్చిన లెక్కలప్రకారం చూసినా, జాతీయ ఆదాయములకు 1 25% వృద్ధిచేయాలంటే, ఉన్న జనాభాతో (జనాభా పెరుగదనుకొంటే) మనం నూటికి 5 వంతుల ఆదాయాన్ని నిల్వచేయగలిగి వుండాలి. కాని మన జనాభా ఏడాదికి 1 25% వంతున పెరుగుతోంది. అభివృద్ధి ప్రణాళికవల్ల జాతీయ ఆదాయంలో కలిగే అభివృద్ధి పెరిగే జనాభాను పోషించటానికి మాత్రమే సరిపోతుంది మరి జీవన ప్రమాణాలని 1 25% వంతున హెచ్చుచేయాలంటే మనం అధమం నూటికి 10 పాళ్లు ఆదాయంలో నిల్వచేసి పెట్టుబడి పెరుగుదలకు తోడ్పడాలి మనం వున్న స్థానంలో వుండాలంటే వేగంగా పరుగెత్తాలి అన్నమాట రెండవ పంచవర్ష ప్రణాళిక ముఖ్యంగా గమనించవలసిన సూత్రాలు రెండు ఒకటి ఆదాయములలో మనం నూటికి 15 గా యిప్పటినుంచీ నిల్వచేయాలి రెండు. జనాభా పెరుగుదల రేటును సాధ్యమయినంత తొందరగా తగ్గించాలి లేకపోతే, ఏదో గొప్ప "విచిత్రం" జరిగితే తప్ప, మన జీవన ప్రమాణములను అభివృద్ధి చేసికోలేం. 1951 సెన్సస్ ప్రకారం మరో 30 సంవత్సరాలకి మన జనాభా 60 కోట్లకి పెరుగుతుంది అప్పుడు నవీన విజ్ఞాన పద్ధతులన్నిటిని ఉపయోగించుకొని దేశంలో అన్ని రకాల భూమిని సాగుచేసినా కలిసినన్ని ఆహార ధాన్యాలని ఇండియా పండించుకోలేదు ఈ సందర్భములో ఒకటి విస్మరించకూడదు. రెండవ ప్రపంచ సంగ్రామంలో జపాను దిగటానికి ఒక ముఖ్య కారణం ఆస్ట్రేలియా మొదలయిన దేశాలు అనుసరించిన వలస విధానమే జపాను తన పెరిగే జనాభాకి ఆహారధాన్యాలమాట ఎలావున్నా అధమం వసతిని యిచ్చుకోటానికి తగినంత భూభాగాన్ని కూడ కలిగివుండక పోవటం!

రెండవ పంచవర్ష ప్రణాళిక ముఖ్యంగా గమనించవలసిన సమస్య "నిరుద్యోగ సమస్య" దీని తీవ్రస్వరూపానికి ఒక కారణం జనాభా పెరుగుతూనే—రెండవది దేశంలో కలసినన్ని ఉద్యోగావకాశాలని కల్గించలేకపోతున్నాం ఒకవైపున ప్రభుత్వం భారీఎత్తున పెట్టుబడులు చేస్తున్నా నిరుద్యోగసమస్య తీవ్రరూపందాల్చటం ఆశ్చర్యంగానేవుంద దీనికి ఒక ముఖ్యకారణం: మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వం ప్రయివేటువ్యవసతిలు క్రమంగా విస్తృతి మవుతూ ఎక్కువమందికి ఉద్యోగాలు కల్పించాలి కాని ప్రయివేటు వ్యవస్థ పంచవర్షప్రణాళికలో ఊహించినట్లు పెరగటంలేదు దీనికి కారణాలు తర్వాత చర్చిద్దాం ముందుగా నిరుద్యోగం పెరగటానికి కొన్ని దిగ్భ్రాంతి కారణాలు—వాటికితోడై మరికొన్ని ప్రస్తుతకారణాలు వున్నాయి దేశంలోని ఎంప్లాయిమెంటు ఎక్చేంజీల అంకెలనుబట్టిచూస్తే డిసెంబరు నెలకి 6 లక్షల నిరుద్యోగులు వున్నారు నవంబరుసంఖ్యకంటె 27 వేలు ఎక్కువ అన్నమాట బొంబాయి పశ్చిమ బెంగాలు మద్రాసురాష్ట్రాలలో ఈ సంఖ్య మరీ విపరీతంగా పెరిగిపోయింది ఒక్క డిసెంబరులోనే 1 లక్షమందిపైగా ఎక్చేంజీలలో రిజిష్టరు అయినారు వీటిల్లో దొరికే ఉద్యోగముల సంఖ్య నవంబరు నెలకంటె డిసెంబరులో 22 వేలనుండి 21 వేలకి పడిపోయింద ఈ ఒక్క నెలలోనే 50 వేలకు పైగా ఉద్యోగములనుండి తొలగింపబడ్డారు. ఈ సంఖ్యలు నిరుద్యోగసమస్య పూర్తి స్వరూపాన్ని తెలుపవు. ఏమంటే దేశాల్లో అన్ని మూలలా ఎంప్లాయిమెంటు ఎక్చేంజిలు లేవు. వున్న వాటిల్లో పేర్లు నమోదు చేయించుకొనే అలవాటు మనమింకా నేర్చుకోవాలి. మొత్తంమీద ఈ సంఖ్యలు ఈ సమస్య తీవ్రతను

తెలియజేస్తాయి. వ్యవసాయ రంగంలో భూమిమీద భారం క్రమంగా హెచ్చుతోంది. ఏడాదికి 40 లక్షలమందిని అదనంగా భూమి భరించవలసివస్తోంది. వ్యవసాయరంగం ఎప్పుడూ పటిష్టమైన వృత్తి కాదు. దీనిలో వలసినవారికంటె ఎక్కువమంది పని చేస్తున్నారు వీరిలో చాలమందిని తక్కిన వృత్తులకు మరలించినా వ్యవసాయపు ఉత్పత్తి తరగదు. వీరిని తరలించాలంటే చిన్న పరిశ్రమలను దేశంలో నాల్గువైపులా స్థాపించి ఉద్యోగాలు కల్పించాలి. ఈ చిన్న పరిశ్రమలవలన మరొక లాభం ఏమంటే వీటికి ఎక్కువ పెట్టుబడి ధనం అవసరం లేదు. తక్కువ పెట్టుబడి ఎక్కువ మనుష్యులకు పని కల్పిస్తుంది పైగా ప్రస్తుతం వున్న గృహపరిశ్రమలు మిలుల పోటీకి తట్టుకోలేవు ఈ పరిశ్రమలను పటిష్ఠం చేయటానికి "సబ్సిడీలు"—మిల్లులమీద అంక్షలు విధిస్తే చాలదు ఈ విధానం సమస్యను తీర్చవు—కప్పిపుచ్చుతుంది అందుకని జపాను పద్ధతుల గురించి ఎక్కువ మాట్లాడకుండా ప్రభుత్వమే ముందంజవేసి కొన్ని గ్రామాలలో ఆదర్శకేంద్రాలు పెట్టి ఈ పరిశ్రమలను ఎక్కువ పటిష్ఠంగా నడిపేటట్లు చేసి వీటి వ్యాప్తికి తోడ్పడాలి

పట్టణాల్లో నిరుద్యోగం పెరగటానికి—(1) అక్కడ పెరిగే జనాభాకి వృత్తులు కలిగించే స్థాయిలో పెట్టుబడులు పెరగటం లేదు. (2) అనేక దశాబ్దాలనుంచి పల్లెలనుండి పట్టణాలకు వలసపోయే జనం పట్టణాల్లో పరిస్థితులని విషమింప చేస్తున్నారు. యుద్ధకాలంలోని ధరలు పెరిగినా, తక్కిన దేశాలలో జరిగినట్లు, ఉత్పత్తి కాపిటల్ పెట్టుబడి పెరుగలేదు. యుద్ధం తర్వాత యిదే రకపు పద్ధతి మనకి నిలచిపోయింది. వీటికితోడు చదువుకొన్నవారి సంఖ్య గత నాలుగు సంవత్సరాలలోను 8 రెట్లుకి పైగా పెరిగిపోయింది. దేశంలో నేటి రోజున జరిగే "నిరుద్యోగపు అలజడికి" ఇది ముఖ్య కారణం దీర్ఘకాలంలో ఈ సమస్యని పూర్తిగా సాధించాలంటే ఒకే ఒక మార్గం—అది దేశాన్ని పారిశ్రామికం చెయ్యటం—పెట్టుబడి ధనాన్ని ఎక్కువచేసి పరిశ్రమలను బాహుళ్యంగా విస్తృతం చేయటం. వ్యవసాయరంగంలో ఖచ్చితమైన భూసంస్కరణలు చేసి వ్యవసాయాన్ని "ఒక జీవితవిధానమే కాకుండా" "లాభదాయకమైన వృత్తి" అని రైతులకు నిరూపించాలి ఈ సమస్య తీవ్రతని ప్రస్తుతం తగ్గించటానికి ప్రభుత్వం కొన్ని విధానాలనవలంబిస్తోంది. అదనంగా 175 కోట్ల రూపాయలను ఖర్చించి ఒక ఉపాధ్యాయుల పాఠశాలలు, సాంఘిక సంక్షేమకేంద్రాలు మొదలయినవి నెలకొల్పి అదనపు ఉద్యోగాలు కల్గించింది. రాష్ట్రాలకు యిదే దృష్టితో కొన్ని సూచనలు చేసింది.

ముఖ్యంగా దేశంలో ధరలుపడి ద్రవ్యోల్బణ భయాలు పోయాయి. ఉత్పత్తి ఎక్కువవుతోంది చెలామణీ అయ్యే ధనం తరగిపోతోంది. ఈ పరిస్థితులలో ప్రభుత్వం ఎక్కువగా లోటు బడ్జెటు విధానాన్ననుసరిస్తే ఆర్థిక వ్యవస్థ పెరగటానికి, ప్రయివేటు పెట్టుబడులకు ప్రోత్సాహం కలగటానికి ఆదాయాలు పెరగటానికి అవకాశం వుంది అయితే మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో ప్రయివేటు సంస్థ స్థానం ఏమిటి?

ఇంత భారీఎత్తున పెట్టుబడులు అవసరమైనప్పుడు మిశ్రమ ఆర్థికవ్యవస్థలో ప్రవేటు పెట్టుబడిదారులు భారం వహించాలి. పంచవర్ష ప్రణాళికలో దీన్నిగురించిన అంచనాలు విఫలమయ్యాయి. పెట్టుబడిదారులు 'ధనం' లేదు; పన్నులభారం ఎక్కువయింది; మేనేజింగు ఏజెన్సీల గురించిన ప్రభుత్వపు సంస్కరణలు ప్రోత్సాహకరంగా లేవు అని కారణాలు చెబుతున్నారు. 'ధనం' కొరత తీర్చటానికి ప్రభుత్వం తమ పెట్టుబడులకు సాధ్యమయినంత వరకు ప్రయివేటు వ్యవస్థతోపాటు వడ్డీ వ్యాపారం మార్కెటులో ప్రవేశించకూడదు కాని ప్రస్తుతం ప్రభుత్వపు వివిధ ఋణపత్రాలలో పెట్టుబడి పెట్టేది ఈ మార్కెటే. దీని దృష్ట్యా లోటు బడ్జెటు విధానం సమంజసమైనది. ఇతరదేశాలలో ఇన్సూరెన్సు కంపెనీలు చాలవరకు ప్రయివేటు పరిశ్రమలకు అప్పులిస్తాయి. కాని మన దేశంలో ఈ కంపెనీలు ప్రభుత్వానికి మాత్రమే అప్పు యివ్వాలి ష్రాఫ్ కమిటీ సూచించినట్లు, ప్రభుత్వం దీనికి సంబంధించిన నిబంధనలు సడలించి వీటిలోనుంచి ఎక్కువ ధనం ప్రయివేటు వ్యవస్థలకు క్రింద వెళ్ళేటట్లు చూడాలి 1952 సంవత్సరాంతమందు ఈ యిన్సూరెన్సు కంపెనీల క్రిందవున్న 292.12 కోట్ల ధనంలోనూ 40 కోట్ల రూపాయలు మాత్రమే కొన్ని పెద్ద ప్రయివేటు సంస్థలకు వివిధరూపాలలో బదులు యివ్వబడ్డాయి. ఈ అవకాశం కనుక ఈ కంపెనీలకు కల్పిస్తే, దేశంలో నలుమూలలనుండి ప్రజలవద్దనుండి ధనాన్ని యివి ప్రోగుచేయగలుగుతాయి. ప్రభుత్వ ఆశయంకూడా, ధరల పెరుగుదల అరికట్టటానికి యిదే కదా.

ఈ కొరత తీర్చటానికి "ఇండస్ట్రియల్ ఫైనాన్సు కార్పొరేషనుని" 1948 లో ప్రభుత్వం స్థాపించింది కాని దీని నిర్వహణ లోపభూయిష్టమయింది గత ఆరుసంవత్సరాలలోను ఇది 21 కోట్ల రూపాయిల ఋణాన్ని శాంక్షను చేసింది! దీనిలో తుదకి ఇచ్చిన ఋణం మాత్రం 13 కోట్లు!! పైగా దీనినుంచి అప్పుతీసికొన్న పరిశ్రమలు చాలవరకు దివాలా తీశాయి ఈ కార్పొరేషనుకి రావలసిన బాకీలలో యింకా 33% మిగిలేవున్నాయి ఈ కార్పొరేషనకి అయ్యే ఖర్చులు చూస్తే యిది జాగ్రత్తగా నిర్వహింపబడుతోందని చెప్పలేం. దీని ముఖ్యలోపం ప్రయివేటు పెట్టుబడిదారులకు మార్వాడీలలాగున అప్పులు ఇవ్వటమే కాకుండా వీటికి కావలసిన సాంకేతిక సహాయం యివ్వవలసి వుంది. ఈపని ఈ కార్పొరేషన్ చెయ్యనంతకాలం దీని ఫలితాలు సంతృప్తికరంగా వుండవు

దీని ఫలితంగానే ప్రభుత్వం "నేషనల్ యిండస్ట్రియల్ డెవలప్‌మెంటు కార్పొరేషను" ఒకటి స్థాపించాలని గత సంవత్సరమే నిర్ణయించింది ప్రయివేటువ్యవస్థ అధిపతులు కొందరు కలిసి ప్రపంచబ్యాంకు సహాయంతో "ఇండస్ట్రియల్ డెవలప్‌మెంటు అండ్ క్రెడిట్ కార్పొరేషను" స్థాపించటానికి నిర్ణయించారు. మొదటిసంస్థ కొన్ని భారీసంస్థలను తానే స్థాపించి నిర్వహిస్తుంది. తదితర ప్రయివేటువ్యవస్థలకు వలసిన ఆర్థిక సాంకేతికసహాయాన్ని యిస్తుంది. దీని ముఖ్యోద్దేశం—ప్రయివేటు పెట్టుబడిదారులు స్థాపించటానికి సంకోచించే ముఖ్యపరిశ్రమలను తానే స్థాపించి అవి విజయవంతమయినాక అవసరమయితే ప్రయి

వేటు పెట్టుబడిదారులకు స్వాధీనం చేస్తుంది దీనిఆశయాలు ఎలావున్న 'నిర్వహణ' 'బాధ్యత' ఎంతవరకు ప్రభుత్వం జాగ్రత్తగా స్వీకరిస్తుందో చూడాలి. ప్రస్తుతం మనని పీడించే వ్యాధి "నిర్వహణ అశక్తత". పైన పేర్కొన్న రెండవకార్పొరేషనుకి ప్రపంచ బ్యాంకు నిపుణులసహాయం సలహాలు వుంటాయి అందుకైనా యిది ఫలించవచ్చును. ఇది ప్రథమంలో 7.5 కోట్ల రూ. కలిగివుంటుంది ప్రపంచ బ్యాంకు 5 కోట్ల రూపాయలను అప్పు యిస్తుంది. ఈ రెండుసంస్థలు ఫైనాన్సు కార్పొరేషను, ఇతర రాష్ట్రకార్పొరేషన్లు కలసి ప్రయివేటు పెట్టుబడి ధనముల కొరతను తీర్చవచ్చునని ఆశించవచ్చు.

పన్నులభారం ఎక్కువ అనేది ఏదో సూత్రప్రాయంగా చెప్పేకారణం అనిపిస్తుంది అయినా "పన్నుల విచారణసంఘం" ఈ సమస్యను ప్రయివేటువ్యవస్థను ముఖ్యంగా దృష్టిలో పెట్టుకొని పరిశీలిస్తుందని ఆశించవచ్చు!

మేనేజింగుఏజెంట్లనుగురించి చేసినసంస్కరణలు వ్యక్తిగతంగా కొందరి యజమానులకు నష్టం కలిగించినా దేశం, ప్రజలు, వారికి కావలసినది—అని తలిస్తే, ఈ సంస్కరణలు చాల అవసర మని పిస్తాయి. మన పారిశ్రామిక పెద్దలు యుద్ధం ఆదినుంచి ఎక్కువ లాభాలకు అలవాటు పడ్డారు. కాలాకాలం వారిని ఈ స్థితిలో వుంచటం శ్రేయస్సుమాత్రం అవదు.

అమెరికాలో తప్ప తక్కిన దేశాలలో లాభాలరేట్లు యింత ఎక్కువ వుండవు యూజినీ స్టాలీ అంటాడు—"ప్రయివేటు పరిశ్రమ అభివృద్ధి చెందాలంటే ప్రభుత్వ పరిశ్రమలు సన్నగిల్లుట కాదు ప్రయివేటు పరిశ్రమ అభివృద్ధి చెందాలంటే దానికి తగిన "సాంఘిక విలువలనే" పునాది వేయాలి ఈ అభివృద్ధి ప్రభుత్వపు నిబంధనలు సడలించినమాత్రాన్నే రాదు.. ఈ బడుగు దేశాలలో, బలహీనప్రభుత్వాలు వున్నట్లైతే బలహీనపడిన ప్రయివేటు పారిశ్రామికరంగం వుంటుంది వీరిలో నిజమైన శక్తిసంపద, వ్యవహారసరళి, సాంకేతిక విజ్ఞానం, ముఖ్యంగా సాంఘికబాధ్యత లోపిస్తాయి. అను భవంనుంచి, శిక్షణద్వారా ప్రయివేటు పారిశ్రామికులు అభివృద్ధి చెందాలి. వీరు సంకుచిత అభిప్రాయాలు మార్చుకొని, తక్కిన రంగాలలోని అభివృద్ధితో మారుతూరావాలి" యింతకన్న ప్రయివేటు వ్యవస్థ నేర్చుకోవలసిన గుణపాఠాలు లేవు

భారీ పరిశ్రమలకు ప్రత్యేకంగా ప్రయివేటు వ్యక్తుల యిష్టాయిష్టాలకువదలకుండా, ప్రత్యక్షంగా ప్రభుత్వంచేపట్టకుండా స్వయం నిర్ణయాధికారం కలిగిన కార్పొరేషనులను కల్పించి, వాటికి యివ్వటం శ్రేయస్కరం పాశ్చాత్య దేశాలలో, ముఖ్యంగా మిశ్రమ ఆర్థిక వ్యవస్థ గలిగిన దేశాలలో యిలాటి కార్పొరేషనులు ప్రముఖ్య పాత్ర వహిస్తాయి మన దేశంలో వున్న ఒకటి రెండు కార్పొరేషనులు ప్రత్యేకం అల్లాటి కార్పొరేషనులు కావు ప్రత్యక్షంగా ప్రభుత్వం బాధ్యత తీసికొనే అని అలాటివి ప్రభుత్వానికున్న సాంఘిక బాధ్యత, ప్రయివేటు వ్యవస్థకున్నది కూడ కలిగివుండవు

ప్రభుత్వపు పారిశ్రామిక విధానం లోపభూయిష్టం కాక పోయినా, దానినిగురించి వ్యాఖ్యానించువారు మాత్రం ప్రయివేటు వ్యవస్థని కలవరపెడుతున్నారు పైనా ఎందువల్లనో దురదృష్టం మన దేశంలో అమలు జరుపబడుతున్న ఆర్థికవిధానాన్నే ప్రత్యేకంగా పైనానుండి తిరిగివచ్చి "సోషలిజం నిర్మిస్తాం" అని ఉపన్యాసాలిచ్చేటప్పుడు కూడ అమలు జరుపుతున్నారు. కాని ఒకరకపు ఆర్థిక విధానానికి యింత త్వరలోనే మరో పేరు అతికించి దేశంలో కాపిటలిస్టులని, సోషలిస్టులు తెలియని విదేశీయ పెట్టుబడిదారులని కలవరపెట్టవలసిన అవసరం ఏమిటో అగపడదు అసలు దేశంలో సక్రమమైన ఆర్థికాభివృద్ధికి ప్రయివేటు వ్యవస్థ పాటుపడాలంటే దీన్ని గురించి ప్రభుత్వంలోనివారు ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది అన్నాక్ లాంగ్ అన్నట్లు "పరిశ్రమలను జాతీయం చేయాలనుకొన్నా, సోషలిజం సాధించాలనుకొన్నా, ముఖ్యంగా దానినిగూర్చి తక్కువగా మాట్లాడాలి ఏమంటే ఈ చర్యల నిజ ఫలితాలకన్న ప్రకటనా ఫలితాలు చాలా ప్రమాదకరమైనవి" ఈ సలహాను మనం పాటిస్తే చాలా సమస్యలన్ను పరిష్కరించవచ్చు



# పువ్వులు

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి

రెండు ఇళ్లకి మధ్యనున్న బంతిమొక్కల పక్కన రాతిమీద కూర్చొని, మొక్కల్లాగే మొక్కల్లోకి చూస్తోంది కమల బాల. మేడ ఇంటిమీద మేడ అంచుమీదకి వచ్చిన చందమామ చిగురునవ్వు—చిన్నది—పారేశాడు.

ఊరవతల తోట 'ది గార్డెను' అది. తోటమధ్య పెద్దమేడ అది మెయిన్ హౌసు మేడకి కొంచెం పడమటగా చిన్న పెంకుటిల్లు అది గెస్టు హౌసు

మేడగల పెద్దమనిషి కలకత్తాలో వ్యాపారంగల పెద్దమనిషి. అతగాడు ప్రతియేటా వేసంగికిమాత్రం చల్లగాలికోసం స్వంత వూరుకి కుటుంబంతోసహా వచ్చి నెల్లాళ్ళుండి వెళ్లే అలవాటుగల పెద్దమనిషి. ఆయన కలకత్తాలో ఉంటున్నప్పుడు, ఇక్కడి మేడని అద్దెకి ఇవ్వవచ్చు కాని, ఊరవతల ఉంటే అంతపెద్ద మేడలో అంత మేడకి తగ్గ అద్దె ఇచ్చుకొని ఎవరూ దిగరు. తక్కువ అద్దెకి ఇంటివారు ఇవ్వగా ఇచ్చినా, దిగినవాళ్ళని ప్రతియేటా వేసంగికి మాత్రం ఖాళీ చెయ్యమనడం బావుండక అందుచేత మేడ ఇంటిని తలుపులుమూసి తాళాలు బిగించి ఉంచేరు గెస్టు హౌసునిమాత్రం అద్దెకిచ్చేరు

ఇల్లు చిన్నది కాబట్టి, ఊరవతల ఉంది కాబట్టి ఇంటివారు గెస్టు హౌసుని తక్కువద్దెకి ఇచ్చేరు ఇల్లు చిన్నదైనప్పటికీ, ఊరికి దూరంగా ఉన్నప్పటికీ, అద్దె తక్కువ కాబట్టి అందులో ప్రవేశించేరు అవతారంగారు

అవతారంగారి గురించి "మీ నాన్నగారికి ఎక్కడమ్మా పని?" అని ఎవరైనా అడిగితే ఒల్ల "బ్యాంకిలో" అని టక్కున చెప్పగల కమల, "బ్యాంకులో ఏం పని? ఎన్నాళ్ళ సర్వీసు? జీతం ఎంత స్తాయి?" ఇలాంటి ప్రశ్నలు వస్తేమాత్రం సరిగా సమాధానం చెప్పలేక. అవతారంగారి అద్దె ఇంటికి ఎంతమట్టుకు ఆధారంగా ఉండో, ఆ అద్దె ఇంటికి చాలుతుందో చాలదో అనే విషయాల గురించి కమలెప్పుడూ ఆలోచించనేలేదు. తన స్కూలేమిటో, తన చదువేమిటో, అంతే.

కిందటేడు ఏప్రెల్లో, కమల మూడోఫారం పరీక్ష రాసి పాసయిన రోజుల్లో ఆమెకి పన్నెండోయేడు దాటింది. ఆమె ఆ వెంటనే ఈ యింట్లోకివచ్చి పడింది అంతటితో.

"స్కూలు ఇక్కడికి చాలాదూరం, అవునా! మరి ఒక్కర్తివి అంతదూరం నడిచి ఎలా వెళ్తావో నువ్వే చెప్పు వెళ్ళలేవు కదు. ఒప్పుకుంటావా? ఒప్పుకోవు అలా అంటావు అంతే...మరి థర్డుఫారం పాసయావు. అలాగా ఇలాగా కాకుండా ఫస్టుగా పాసయావు ఏం! చాల్లూ!! అల్ల వాళ్ళ కీకాలంత్సుని చదాను, ఎమ్మే పాసయిందా!? పాసయింది. పాసవుతేమాత్రం పెళ్లి చేసుకోకతప్పిందా? అందుచేత.. ఆడపిల్లకి...పెళ్ళి—పెళ్ళి—అదీ ముఖ్యం తెలిసిందా?" అంటూ కొన్ని కారణాలు చెప్పి కమలని స్కూల్కి పంపించడం మాన్పించివేసేరు కమల తండ్రి

అవి అసలు కారణాలుకావనీ, వట్టి సాకులుమాత్రమేననీ అసలు కారణం వేరే ఉందనీ ఆరోజే తెలిసింది కమలకి తండ్రిని ఆఫీసుకి వెళ్లనిచ్చి తల్లిదగ్గర మారాం చేసిచేసి ఏడవగా, విసిగిపోయి కేకలువేసింది శేషమ్మగారు

"మీ అన్నదమ్ములూ అక్కచెల్లెళ్లూ పదిమందికీ ఒప్పులా ఎప్పట్లా చెప్పించడానికి మీ నాన్న లక్షాధికారనుకున్నావా, కోటీశ్వర్లనుకున్నావా? లేక, దులుపుతే రాల్డానికి పెరట్లో రూపాయల చెట్లున్నాయనుకున్నావా? దయచేసి, ఏడుపు కట్టిపెట్టు. తెలిసిందా! ఎండెక్కింది ఆ పచ్చికర్రలు కాస్తా ఎండలో పడేసి పెట్టు" అని కేకలేసిన కమలతల్లి విసవిస వెళ్లింది వంటదగ్గరకి

అంగుమీదట కళ్ళు తుడిచేసుకొంది కమలబాల.

అప్పట్నించీ, ఎవరూ చూడకుండా కళ్లు తుడిచేసుకోవడం అలవాటు చేసుకొంది కమలబాల.

ఆరోజున, కోపంగా ఉండడంచేత అవతారంగారి భార్య తన సంతానంయొక్క సంఖ్య ఎక్కువ చేసుకుంది గాని, నిజంగా లేరావిడకి పదిమంది పిల్లలు

కమల పుట్టిన పదేళ్ళనాటికి అవతారంగారికి, కడసారిది విమల కలిగింది ఈమధ్యకాలంలో ఉద్భవించినవాళ్లు వరసగా నలుగురు మొదటివాడు, సీతారాముడు. రెండవవాడు రాధాకృష్ణుడు. మూడోవాడు పార్వతీప్రసాదుడు నాలుగోవాడు గంగాధరుడు. నలుగురూ రావులే నలుగుర్నీ ఇంట్లో పిల్చే పిలుపు!

"ఒరే సీతా, ఒరేయ్ రాధా! ఏమర్రా గంగా, పార్వతీ! ఎంతసేపయింది ఒడ్డించీని ఇంకా అక్కడే కూర్చున్నారూ? ఎక్కడ దాపరించేరో ఏమిటో ఆ మొక్కలు. వస్తున్నాం మీ అక్కకి మతిపోతే మీకూ మతులు పోతున్నాయర్రా?! రండి వేగిరరండి" అదీ సాధారణంగా శేషమ్మగారు వేసే కేక.

కొత్త ఇంటికి రాగానే అవతారంగారి భార్య పెరట్లో ధనియాలు చల్లింది. కాకరపాదు పెట్టింది దొండబద్ద నాటింది. తరువాత, తోటలో ఓ రోజున కమల అటూ ఇటూ తిరిగి చప్పున తల్లి దగ్గరకి పరుగెత్తుకొచ్చి,

"అమ్మా అమ్మా, అక్కడ కొన్ని బంతి మొక్కలు ఎన్ని వున్నాయనుకున్నావ్! ఎన్నో ఉన్నాయే" అంది.

"ఎక్కడే?"

"అక్కడా, ఎరువుకుప్పదగ్గర"

"ఎరువుకుప్పదగ్గర, అవా?! అవి బంతిమొక్కలే ఒ(భ్రా)జ నూనవా?"

"బంతిమొక్కలా?!"

"అవును"

"బంతిపువ్వులు పూస్తాయా?!"

"బంతిమొక్కలకి బంతి పువ్వులు పుయ్యకపోతే పొట్లకాయలు కాస్తాయనుకున్నావుటే బావుందమ్మా బావుంది చదువ్తేస్తే ఉన్న మతి కూడా పోయిందిట" అంది శేషమ్మగారు.

ఆరోజునుంచే కమలకి మతిమారడం జరిగింది

ఆరోజే అవంటనే పువ్వులతోట వేసేదామనుకోలేదు కమల కాని, మసిబొగ్గుల్లో మాణిక్యం కనిపిస్తే దాన్ని వేరతీసేసి దానికి తగిన ఏర్పాట్లు దానికి చేసినట్టుగా, ఎరువుకుప్పనుంచి బంతి మొక్కల్ని వేరుచేయాలని కమలకి కలిగిన ఆలోచన "పూలతోట"కి దారితీసింది తరువాత ఆ ఎరువునే ఆ కమలే మోసుకొచ్చి ఆ మొక్కలకే వేయడం జరిగింపనుకొంది కాని అది వేరే సంగతి ముందు, ఆ మొక్కల్ని కొన్ని తీసుకొచ్చి పెరట్లో పాతింది కమల.

ఆ మొక్కల్ని అక్కణ్నించి తీసుకురావడానిగ్గాని, వాటిని పెరట్లో పాతడానిగ్గాని ఇంత చిన్న పిసరైనా సాయం చెయ్యని పెద తమ్ముడు—సీతగాడు—"అక్కయ్యా, అవన్నీ పెరట్లో వేస్తున్నావా? ముందువేపు వేస్తే షోగ్గా ఉంటుందే పువ్వులు పూసినప్పుడు అంతా గుమ్మెత్తిపోదూ?!" అని చెప్పి మొక్కల్ని ఇంటిముందు నాటమని సలహా ఇచ్చేడు అది బావుందని ఆ సలహా పాటించింది కమల. అక్కయ్యా, సైనుగా వేస్తే బావుంటుందికదే" అన్నాడు రాధ. అలాగే చేసింది కమల "అక్కా అక్కా, అంత దగ్గరసా పాస్తే, మన గదిలో సామాన్లాగ ఇరుగ్గా ఉంటుందే కొంచెం దూరంగా పాద్దూ" అన్నాడు పార్వతి "నువ్వేం సలహాలేం చెప్పక్కర్లేదు బాతసైతే సాయం చెయ్యి లేకపోతే నోరుమూసు కుక్కబో" అనేసినప్పటికీ పార్వతిగాడి సలహాప్రకారం మొక్కల్ని దూర దూరంగానే నాటింది కమల గంగగాడు సలహాలేవీ ఇవ్వకుండా, చిన్న చెంబుతో నీళ్ళు పట్టుకొచ్చి ఇచ్చేడు. విమల సలహాలూ ఇవ్వలేదు, ఊరికే చూస్తూ ఊరుకోలేదు; అటూఇటూ తిరిగి, మొక్కల్ని కొన్ని నాటబోయి, కొన్ని తొక్కేసి, అందరి కాళ్ళల్లోనూ అడ్డంగా పడి, కమలచేత చీవాట్లు తిని, సీతచేత ఓదార్చబడి, అమ్మ దగ్గరకి తీసుకుపోబడింది.

ఆఖరికి, ఆ సాయంకాలానికి, అంతా కలిసి ఆరు వరసల్లో ముప్పై బంతిమొక్కలు నాటేరు.

నాటిననాటి ఆ సాయంత్రం ముప్పయి మొక్కలూ సాకారం సొమ్మసిల్లిపోయి తలలు వేళ్ళాడవేసేయి.

ఆ రాత్రి ఆకాశంలో చంద్రుడు లేడు. ఎక్కడా మేఘాలూ లేవు. చుక్కలున్నాయి కాని వాటివైపు చూడ్డంలేదు కమల. బుడ్డిదీపం చేతపట్టుకొని, మడిదగ్గర కూర్చొని, బుడ్డిదీపపు గుడ్డివెలుగులో చుక్కల్లాంటి కళ్ళతో మొక్కల్ని ఓక్కొక్కటీ ఓక్కొక్కటీ చూసింది.

మొక్కలు బతకవేమోనని బెంగచేత ఆ రాత్రి అన్నం తిన్నాక కూడా ఆ రాత్రి అంతా రాన్ని శేషమ్మనీ బతకనిచ్చిందికాదు కమల.

"బతుకుతాయా, బతకవా?" అదే ప్రశ్న.

"బతుకుతే బతుకుతాయి లేకపోతే పోతాయి మధ్య నన్ను మాత్రం చంపక కళ్ళుమూసుకు పడుకో" అని అటు తిరిగి పడుకుంది శేషమ్మగారు

ఆ రాత్రి తనకి ఎప్పుడు నిద్రపట్టిందో అన్న సంగతి కమలకి తెలీదు ఆ రాత్రి ఎక్కణ్ణించో వచ్చిన మేఘాలు ఎంతగానో వర్షించి వెళ్ళిపోయాయన్న సంగతీ ఆ రాత్రి కమలకి తెలీదు.

మర్నాడు సూర్యుడు లేచిన కొంచెంసేపటికి నిద్రలేచిన కమల బాల, కళ్ళు నులుముకొంటూనే ఇంటిముందుకి వెళ్ళి, చూసి, కెవ్వున కేక వేసి మడిదగ్గరకి పరిగెట్టింది

తల్లికి తెలుస్తుంది; తండ్రికీ తెలుస్తుంది, భగవంతుడికి తెలిసే ఉంటుంది, ప్రాణాన్ని జీవితాన్ని పెంచి పోషించేవారందరికీ తెలిసితీరాలి, ఆ ఉదయం తలెత్తి నిల్చున్న చిన్నఎర్ర బంతి మొక్కలు ఓ పదమూడేళ్ళ ఆడపిల్లకి కలిగించిన సంతోష, సంభ్రమ, ఆశ్చర్య, ఆనంద, ఉద్వేగాలు ఎటువంటివో ఏమిటో.

ఇటు ఈ మొక్క దగ్గర నిల్చుంది కమల. అటు ఆ మొక్క దగ్గరకి పరిగెట్టింది కమల ఇదే కమల ఈ మొక్కా అయింది ఇదేకమల ఆ మొక్కా అయింది నిన్నటి రాత్రి నీటిబుబ్బా ఈ కమలే నిన్నరాత్రి వానజల్లూ ఈ కమలే ఆ కమలే ఈ ఉదయం సూర్యరశ్మిగా మెరుస్తోంది. అదే కమల ఈ ఉదయం చల్లగాలిగా వీస్తోంది.

అది, అంతటిది, ఆ ఉత్సాహమే కమలని మరోకమలగా చేసింది.

మొక్కల్ని పెంచడమే ముఖ్యమైన పనయిపోయి కూర్చుంది కమలకి కాని ఆ పెంచే అధికారం, అవకాశం కమలొక్కర్తె గుత్తకి పుచ్చుకోలేదు. అందుకే మిగతావాళ్ళకూడా ఉన్నాయి షేర్సు గంగగాడు చిన్నచెంబుతో పట్టుకెళ్ళి ఆ మొక్కలకి అక్కే పనిగా నీళ్ళుపోస్తూండడమే వాడిపని ఇంటివారి తోటమాలి దగ్గరకి పోయి, బోరిగా తొళ్ళికా తెచ్చిఇచ్చి, ఇచ్చితెచ్చే పని పార్వతిగాడిది. ఎరువుమోసుకొచ్చి మొక్కలకి పొయ్యడం అనేది రాధగాడి పనుల్లో ఒకటి. రెండుపూట్లూవచ్చి మొక్కల్ని తనిఖీచేసే అధికారి సీతగాడు. అప్పటప్పట, అవసరం వెంబడిని వచ్చి సైంటిస్టు సలహాలిచ్చే డ్యూటీ ఇంటివారి తోటమాలిది. తెలిసీ తెలియని సలహాలిచ్చే పని మొక్కల్ని పెంచడంలో పెద్దబాలశిక్ష చదువుతున్న అవతారం గారిది. అవతారంగారు సాయంకాలం ఆఫీసునుంచి వచ్చేక

ప్రతిసిలా శీతం అందినవాటిరాత్రి, పడుక్కునేముందు, తల కింద తలగడా సరిచేసుకొంటూ "తెల్లారేసరికల్లా తయారవుతావు రా బక్కా ముండాకొడుకూ" అని ఓసారి అనుకోకుండా పడుకోరు అవతారంగారు సరిగ్గా అలాగే మర్నాడు పొద్దుటే ఏదో గంట కొట్టే సరికల్లా "అయ్యా అవతారంగారూ" అని కేకేస్తూ అద్దె వసూలు చెయ్యడానికి వస్తాడు బక్కభగవాన్లు, ఆ కంతానికి పది తేరలు. పది అవతారాల్ని ఉద్దేశించి పిల్చేడా అనిపిస్తుంది.

ఇంటివారి ఇల్లు, ఇంటివారితోట, ఇంటివారి ఇక్కడి వ్యవహారాలన్నీ చూసేఉద్యోగం బక్కభగవాన్లుది ఆగోజాన అద్దె పుచ్చుకున్నాక "ఇంటివాళ్లు క్రిస్మస్‌కి వస్తున్నారండోయ్"అని చెప్పేసి నవ్వుకొంటూ చక్కాపోయేడు ఇంటివాళ్లు పక్కనే ఉన్నట్లయితే అద్దెకున్నవాళ్ళ సంకటాలు అణిగిపోతాయని భగవాన్లుగారి అభిప్రాయం

వేసంగికే రావడం ఇంటివారి అలవాటు ఇప్పుడెందుకొస్తున్నారో అనుకున్నారంతా భగవాన్లు కూడా ఏ మాటా తెలీదుట.

ఇంటివారంటే అంత ఇష్టం లేదు కమలకి ఇంటాయన ఎటువంటివాడో తెలీదు అత నెప్పుడూ చిన్నింటివైపుకి రాడు ఇంటావిడ మంచిమనిషిలాగే కనిపిస్తుంది ఇంటివారి పెద్దకూతురు అత్తవారింట్లో పాట్నాలో ఉంటుంది ఆమెని ఎరుగదు కమల రెండో కూతురు పదహారేళ్ళ వయసుదే అయినప్పటికీ పాతికేళ్ళ మనిషిలా ఉంటుంది తనకి పకేళ్లే ఉన్నట్టు ప్రవర్తిస్తుంది ఆ అమ్మాయి కిందనుంటే పంటలుండవు మీదనుంటే వర్షాలుండవు. మూడో అమ్మాయి నెమ్మదిగానే ఉంటుంది పదేళ్లది ఆ పిల్లని "రెండు జడలమ్మాయి" అంటారు అవతారంగారింట్లో అంతా.

నిన్న మధ్యాహ్నం పన్నెండు గంటలకి కారు దిగేరు ఇంటివారు అందరికంటే ముందు ఆఖరమ్మాయి కార్లోంచి దూకి బంతిలా గెంతి ఇంట్లోకి వెళ్ళింది ఆ పిల్ల వెనక ఇంటాయన దిగేరు ఆయనది బట్టతల మనిషి సన్నగా ఎర్రగా ఉన్నాడు ఫ్లానల్స్‌లో ఉన్నాడు ఆయన భార్య కార్లోంచి నెమ్మదిగా దిగింది నిండుగా ఎత్తుగా ఉంది. బ్లడ్ రెడ్ సారీ కట్టుకొంది ఛాయ మేలిమి బంగారంలా ఉంది వారి రెండో అమ్మాయి కార్లోంచి దిగలేక ఆమెని నెమ్మదిగా దింపేరు ఆమె కట్టుకున్న సారీమీద ఓవర్ కోటు తొడుక్కుంది పెద్దగా మూలుగుతోంద

"అమ్మాయిగారికి జెబ్బొచ్చిందమ్మా" అని భగవాన్లు ఎక్కలేని ఆందోళనతోనూ, అతి వినయంగానూ ప్రశ్నించేడు

అమ్మాయిగారికి 'ఫీవరు'ట

అందుగురించి బక్క భగవాన్లు ఇసుమంతైనా చింతించనట్టే కమల కూడా ఇంత పిసరైనా విచారించలేదు

కాని—

ఇంటివాళ్ళు ఎందుకొచ్చేరు? ఎన్నాళ్లుంటారు? వాళ్లిక్కడ ఉన్నన్నాళ్ళూ ఆ అమ్మాయికి ఉష్ణం ఉంటుందా ఉండదా? అని రాత్రి ఆలోచిస్తూ పడుక్కుంది కమల

ఉదయాన్నే లేచింది కమల

ఉదయం నెమ్మదిగా వెళ్లింది. ఇంటివారి రెండో అమ్మాయిగురించి ఆస్పత్రి నర్సెవరో వచ్చింది. మధ్యాహ్నం ఇంటివారి నౌకరు శేషమ్మగార్ని బింద ఒకటి అడిగి పట్టుకు వెళ్లేడు. అంతే మరేం విశేషాల్లేవు.

మధ్యాహ్నం మూడు గంటలకి మాత్రం—

చిన్న బిందెలో నీళ్లు పట్టుకొని నుయ్యిందగ్గరకి వచ్చిన కమల వచ్చీ రావడంతో, ఒక్క కేక వేసి, బిందెని అలానే విడిచేసి పరిగెట్టింది మొక్కలదగ్గరికి

మేడ ఇంటి డ్రాయింగ్‌రూమ్‌వైపు వరాండాలోకి ఇంటావిడా, చిన్న ఇంటి నుయ్యింలోకి శేషమ్మగారూ ఒక్కసారే వచ్చేరు.

ఇంటివారి ఆఖరమ్మాయి—రెండు జటలు వేసుకున్నది, బ్లూగౌను తొడుక్కున్నది, గాలికొట్టిన బంతిలా ఉన్నది—

"నే కోసుకుంటా. నా యిష్టం. నాక్కావాలి" అని గట్టిగా అరుస్తోంది. ఆమె చేతులు గట్టిగాపట్టుకొని, "వీల్లేదు. కొయ్యొద్దు. మావి" అని కమల కేకలేస్తోంది ఇద్దరూ పెనగులాడుతున్నారు. మూడు బంతిపువ్వులు నలిగి కేలనిపడ్డాయి.

"ఏం పిల్లా! ఏమిటా అల్లరి?" అని,

ఇంటావిడ శాఫుగానూ గట్టిగానూ కమల్నిమాత్రం ఉద్దేశించి అడిగింది ఇద్దరమ్మాయిలూ పెనగులాట ఆపేసి, అలానే నిల్చుండిపోయేరు అంతలోనే శేషమ్మగారొచ్చి కమల పట్టిన పట్టు విడిపించి, కూతురిచెయ్యి పట్టుకు నిల్చుంది

"లుక్ హియర్ మమీ " అని ప్రారంభించి చెప్పింది రెండుజట లమ్మాయి.

"నెవర్ మైన్డ్ హర్ యూ టేక్ ఏజ్ మెనీ ఏజ్ యూ లైక్" అని ఆ అమ్మాయితో చెప్పి,

"ఆ పువ్వులే అంత మహాభాగ్యంటమ్మా?! మీ అమ్మాయలా పిచ్చిగా అల్లరి చేస్తోందేమిటి?! కోసుకుంటుంది మీ చేవీ, దానికేం అనకండి "

అని శేషమ్మగారితో చెప్పి లోనికి వెళిపోయింది ఇంటావిడ ఆవిడ కోపగించుకున్నట్టు తెలియడంలేదు "ఇంత స్వల్ప విషయానికి ఎందుకంత అల్లరి? క్వైట్ అనెసెసరీ" అని ఆవిడ చిరాకు పడ్డట్టుమాత్రం స్పష్టంగా తెలుస్తోంది, ఏదో చెప్పామనుకొంది శేషమ్మగారు. ఏం చెప్దామన్నా ఇంటావిడ లోనికి వెళ్లనే వెళిపోయింది

తల్లి ముఖంలోకి చూసింది కమల తేటీని వారించడానికి శేషమ్మగారికి ధైర్యం లేదని ఆమె ముఖం చెప్పక చెప్తోంది

"ఈ తువ్వాకి చాలదు "

అని చెప్పడానికి, అసలు, తుపాకీలాటి మనిషి కానేకాదు శేషమ్మగారు

ఈలోపున తెంపేసుకొంటోంది ఇంటివారి బేబీ, బంతి పువ్వుల్ని, కావలసినన్ని.

నెమ్మదిగా, వెనక్కితిరిగిచూడకుండా ఇంటివైపుకి నడిచేరు తల్లీకూతుళ్లు. నుయ్యింలో గంగ చెయ్యిపట్టుకు నిల్చున్న విమల రాగాలు పెట్టింది గంగగాడు రాగాలుపెట్టలేక నిల్చున్నాడు

బంతిపువ్వులే మహాభాగ్యమా ?!

కళ్లు తుడుచుకొంది కమలబాల.

మేడ ఇంటిమీద మేడ అంచు ఎగబాకవచ్చిన దందమూ, చక్కనివి, చిన్నచిన్నవి నవ్వులు ఎన్నెన్నో పారేస్తూనే ఉన్నాడు. కాని,

కళ్ళుతుడుచుకొంది కమలబాల.

కళ్ళుతుడుచుకొంటూనే ఉంది కమలబాల.

---

# సంస్కృత ప్రహసనములు

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సంస్కృతప్రహసనాలలో అత్యంతప్రాచీనమైనదీ, అత్యుత్తమమైనదీ బోధాయన కవికృతమైన 'భగవదజ్జుక' ప్రహసనము. ఒక పరివ్రాజకునకు, ఒక వేశ్యకు సంబంధించిన ప్రహసనమిది.

### భగవదజ్జుక ప్రహసనములో కథ

పరివ్రాజకు డొకడు తన శిష్యునితో ఒక ఉద్యానవనములో విశ్రమించి ఉండగా—వసంతసేన అనే ఒక వేశ్య ఇద్దరు పరిచారికలతో అక్కడకు వచ్చును. సమీప నగరానికిపోయి ఎంతకూ తిరిగిరాని తనప్రియుడగు రామిలకుని కొరకామె విరహోగ్రయై, అతనిని గొనివచ్చుటకై ఒక పరిచారికను పంపును. ఇంతలో యమదూత ఒకడు సర్పాకృతిగోవచ్చి, అశోకపల్లవాలు త్రుంచుచున్న ఆవేశ్యను కాటువేసి, ఆమెప్రాణాలు గొనిపోవును. పరివ్రాజకుని శిష్యుడు శాండిల్యు డీదృశ్యముచూచి, జాలిపడినవానివలె నటించి, వేశ్య శవమువద్దకుపోయి రోదింప నారంభించును. అంతట—పరిచారిక శవము నాతనికి వప్పచెప్పి, వేశ్యమాతకీ ఉదంతము తెలుపుటకు పోవును. అపవర్గస్థుడైన శిష్యునకు యోగములో నమ్మకము కుదుర్చుటకై పరకాయ ప్రవేశవిద్యచే పరివ్రాజకు డావేశ్య దేహములో ప్రవేశించును. వేశ్యమాత, రామిలకుడువచ్చి, గణిక దేహములోని పరివ్రాజకుని విపరీతవర్తన, భావభాగులు చూచి గంటుపడి, వైద్యునికొరకు చేటిని పంపుదురు. ఒక ధూర్తవైద్యుడు వచ్చి, తనకావ్యాధి కొరుకుపడక, సర్పవైద్యుని పిలుచుకొని వత్తునని పోవును. ఇంతలో—యమధర్మరాజు తీసికొని రమ్మన్న వసంతసేన ఈమె కాకపోవుటచే ఈమె ప్రాణము లీమె దేహములో దిగవిడచుటకై యమభటుడు తిరిగివచ్చును. కాని, ఆ గణిక దేహములో పరివ్రాజకు డుండుట చూచి—తనకు తొందరపని ఉండుటచే—ఆమెప్రాణాలను చేరువలోఉన్న యోగి దేహములో వదలి యమదూత వెళ్లిపోవును. యోగి లేచివచ్చి వసంతసేనవలె మాట్లాడుచుండుట రామిలకాదులకు మరింత దిగ్భ్రాంతి కలిగించును. పిమ్మట సర్పవైద్యుడు రాగా—గణికాశరీరస్థుడై ఉన్న పరివ్రాజకుడు అతనిని పరిహసించి, అతనికి వైద్యపరిజ్ఞానము లేమిని రుజువుచేసి పంపును. యమభటుడు తిరిగివచ్చి, ఆ వృషలీ శరీరము విడువుమని యోగిని కోరును. అటుల్లు చేయగా—గణిక ప్రాణాలను యథాస్థానములో ప్రవేశపెట్టి యమభటుడు నిష్క్రమించును. నిజశరీరములో ప్రవేశించిన పరివ్రాజకుడును శిష్యునితో కలసి భిక్షార్థ మరుగును. భగవదజ్జుక ప్రహసనములోని కథ సంగ్రహముగా ఇది.

### భగవదజ్జుక ప్రహసన విశిష్టత:

అర్వాచీన ప్రహసనా లనేకము జుగుప్సాకరమైన హాస్యముతోను, నీచ శృంగారముతోను నిండియుండి, ప్రహసనము శిష్టజన సమాదరణీయము కాదని నిరసించుట కవకాశ మిచ్చినవి. కాని, ఉపలబ్ధమైనంతలో ప్రాచీనతమమైన ఈ 'భగవదజ్జుకము' అట్టి దురభిప్రాయాలు తొలగించి, ప్రహసనము కేవలము వినోదదాయకమే కాక, సాంఘిక దురాచార నివారకము, సన్మార్గోపదేశకము, విశ్వశ్రేయస్కరము కూడ ఎట్లు కాగలదో స్పష్టము చేయుచున్నది

శాండిల్యుని వక్రోక్తి ప్రశ్నలతో ఒకవంక వినోదము కలిగించుచునే, మరొకవంక పరివ్రాజకుని సమాధానాలలో బోధాయన కవి—'అంతరాత్మ, కర్మాత్మల విభేదము'వంటి అతిగహనములైన ఆధ్యాత్మిక తత్త్వాలను కూడ అత్యంత సుబోధముగా ఉపన్యసించును. పాత్రల విచిత్ర మనస్తత్త్వములవలనను, వేషభాషాదులలోని వక్రతలవలనను కాక, ఈ ప్రహసనములోని హాస్యము ప్రధానముగా ఒక సంఘటన నాధారముగా చేసికొని ప్రవర్తిల్లినది. వేశ్య, పరివ్రాజకుల ఆత్మలు తారుమారైన సంఘటన ప్రహసన మంతటికి కేంద్రమై, అత్యంత హాస్యమధురముగా నిర్వహించబడినది

భారతదేశములో బౌద్ధమత క్షీణదశ ఆరంభమై, ఆర్షమతము పునర్విజృంభణము చెందుచున్న కాలమునాటి దీప్రహసనము. నాటి కింకను హిందూ, బౌద్ధమతాల మధ్య పరివర్తనములు ధారాళముగా జరుగుచుండెను. యోగి శిష్యుడు శాండిల్యుడు పెందలకడ భోజనము దొరుకునను ఆశతో బౌద్ధభిక్షువై, వారి ఒంటిపూట భోజనాలతో వేగలేక, తిరిగి హిందూమతములోనికి పల్టీకొట్టినవాడు. ఆనాటి బౌద్ధులలోని దౌర్బల్యాల నన్నింటిని ఈ శాండిల్యునిలో ప్రతిపాదించి, బోధాయన కవి అతి నిపుణముగా ఈప్రహసనములో బౌద్ధమతమును పరిహసించును. భేషజముతో జపవంచన చేయు కుహనాభిక్షువుల నవహేళనముచేయు ఘట్టముకూడా ఈ ప్రహసనములో అత్యంత మనోజ్ఞముగా చిత్రితమైనది.

### ప్రహసన లక్షణము:

వస్తువులోను, సంధి సంధ్యంగాలలోను, లాస్యాంగములు, వృత్తి—మున్నగువాటిలోను ప్రహసనానికి, భాణానికి భేదము లేదు. భాణమువలె ప్రహసనముకూడా ఏకాంకిక; ముఖ, నిర్వహణ సంధులు మాత్రమే నిబద్ధములు కావలెను. అయితే భాణములోవలె ప్రహసనములో ఒకే పాత్రకాక బహుపాత్రలుండును

భాణములలో వీరశృంగారములు ప్రధాన రసములయిన, ప్రహసనము హాస్యరస ప్రధానము. దశలాస్యాంగాలతోపాటు, దశహాస్యాంగాలనుకూడా ప్రహసనములో కల్పింపవలెను.

శుద్ధములు, సంకీర్ణములు అని ప్రహసనాలను రెండు వర్గాలుగా భరతముని విభజించెను. ఈ శుద్ధ, సంకీర్ణ ప్రహసన లక్షణముల విషయమై నాడు వ్యాప్తిలో ఉన్న రెండు భిన్నమతాలను అభినవభారతిలో అభినవగుప్తపాదుడు వివరించెను. మొదటి మతము ననుసరించి—ఒకే వ్యక్తియొక్క దోషభూయిష్ఠ చరితమును పరిహసించునది శుద్ధప్రహసనము; వేశ్యాదులు పలువురి చరిత్రలతో సంకీర్ణమై ఉండునది సంకీర్ణము. రెండవ మతములో—సహజముగా గర్హిత చరితులు కాక, ప్రాకృత జనసంక్రాంతివలన దూష్యమాణతను పొందిన భగవత్తాపసాది స్వభావశుద్ధుల చరితము వర్ణించునది శుద్ధప్రహసనము; స్వాభావికముగానే అశిష్టులయిన వేశ్యాదుల చరితమును వర్ణించునది సంకీర్ణము. వేశ్యావృత్తాంతము కూడా అభివర్ణితమైనను, ఈ రెండవ మతము ననుసరించి 'భగవదజ్జుకము' శుద్ధప్రహసనమే యగుట కారణము. ఈ ప్రహసనములోని వేశ్య వసంతసేన 'మృచ్ఛకటికము' లోని వసంతసేనవలె ఏకప్రియానురక్త; కులకాంతా సదృశ.

భరతముని తరువాతి ఆలంకారికులు ధనంజయ, విశ్వనాథ కవిరాజాదులు సంకీర్ణమునే ప్రకీర్ణము, వైకృతము అని తిరిగి రెండుగా విభజించి, ప్రహసనాలు మూడువిధాలని నిర్ణయించినారు. షండ, కంచుకి, తాపసాదుల వికృత వచోవేషములతో కూడినది వైకృతప్రహసనమనీ, వీథి అనే రూపక విశేషముతో సాంకర్యముచెంది, ధూర్తసంకులముగా ఉండు ప్రహసనము సంకీర్ణమని దశరూపక కర్త ధనంజయుని వివరణము. విశ్వనాథకవిరాజు—ఒక్కొక్కప్పుడు సంకీర్ణ ప్రహసనాలలో రెండంకాలు కూడా ఉండవచ్చుననెను. హాస్యార్ణవము, లటకమేళకము, హాస్యచూడామణి—మొదలైనవి ఈవిధముగా రెండంకాలు గల ప్రహసనాలు.

## మత్తవిలాసప్రహసనము

భగవదజ్జుకము తరువాత ప్రాచీనతలోను, ఉదాత్తతలోను ముఖ్యముగ పేర్కొనదగినది మత్తవిలాసప్రహసనము. క్రీ. శ. 7 వ శతాబ్ది తొలిపాదమునాటి పల్లవరాజు మహేంద్రవీర విక్రమవర్మ వ్రాసిన ప్రహసనమిది. ప్రియాసమేతుడై ఒక కాపాలికుడు సురాపానగోష్ఠిలో ఉండగా అతని కపాలమును ఒకకుక్క ఎత్తుకొనిపోయినది. మిథ్యాచారుడైన ఒక శాక్యభిక్షుకుడు దాని నపహరించినట్లనుమానించి, కాపాలికు డాతనితో కయ్యమునకు దిగును. మధ్యవర్తిగా ఇద్దరూ ఒక పాశుపతుని వరింతురు. ఇంతలో—కుక్క దగ్గరనుండి ఆ కపాలము నొక ఉన్మత్తుడు లాగికొనగా, అతనివద్దనుండి కాపాలికుడు దానిని తీసికొనుటతో ప్రహసనము ముగియును. శైవమతములోని వివిధశాఖలలో ఆనాడు మిథ్యాచారులు ప్రబలి, ఆమతము నెట్లు కలుషితముచేయుచున్నది ఇందు ప్రధానముగ వర్ణితమైనది.

కాపాలికుడు మోక్షమార్గము నిట్లు నిరూపించును.

"పేయాసురా ప్రియతమాముఖ మీక్షితవ్యమ్
గ్రాహ్యః స్వభావలలితోఽవికృతశ్చ వేషః।
యేనేద మీదృశ మదృశ్యత మోక్షవర్త్మ
దీర్ఘాయురస్తు భగవాన్ స పినాకపాణిః॥"

సురాపానము, ప్రియతమా ముఖ సందర్శనము, స్వభావలలిత, అవికృత వేషధారణము—ఇట్టి అంశాలతో కూడిన మోక్షమార్గమును పినాకపాణి తనకు చూపినాడట! అందుచే ఆ పినాకపాణి "దీర్ఘాయువగు గాక!" అని ఈ ప్రబుద్ధు డాయనను దీవించుచున్నాడు.

ఈ శ్లోకములో 'అనృత' మనే హాస్యాంగము నిబద్ధమైనది. "అనృతంతు భవేద్వాక్య మసభ్య స్తుతిసంభితమ్, తదేవానృత మిత్యాహు రపరే స్వమతస్తుతేః"—అని 'అనృత' లక్షణము. ఇక్కడ సురాపానాదులతో కూడిన తన మతమును మోక్షసాధనముగా వర్ణించి స్తుతించుటచే 'అనృతము'

## హాస్య చూడామణి

మరొక చెప్పదగిన ప్రహసనము వత్సరాజ కృతమైన హాస్య చూడామణి. వత్సరాజకవి క్రీ. శ. 12 వ శతాబ్దినాటివాడు. అసభ్య శృంగారముగాని, మొరటు హాస్యముగాని లేక వత్సరాజకవి విశిష్ట కవితాశక్తి నీ ప్రహసనము చాటుచున్నది దీనిలోని లలితమైన హాస్యమున కొక ఉదాహరణము:

జ్ఞానరాశి అనే కపటసిద్ధుడు కపటకేలి అనే వేశ్యామాత ఇంటిలో దొంగతనము చేసిన దెవరో లెక్కకట్టుచు శిష్యుడు కౌండిన్యునితో ఇట్లనును

జ్ఞాన. ఈ 'శ' కారము 'క' వర్గములోనిది కదూ?

శిష్య: నేను 'వ' వర్గములోని 'శ' కారమునే ఎరుగుదును స్వామీ!

జ్ఞాన: అయిన—దీని కెన్ని మాత్రలందువు?

శిష్య అయిదు.

జ్ఞాన. అనుస్వారమున కెన్ని ఉండును?

శిష్య మీరు వ్రాయగలిగినన్ని.

జ్ఞాన అట్లయిన—18 మాత్ర లనుకొందము. పదమూడున్ను అయిదు ఇరువదిరెండు. .

శిష్య. కాదు కాదు—ఇరువది స్వామీ!

(మనస్సులో కపటకేలి కలిపించుకొని) కాదు స్వామీ! పద్దెనిమిది మాత్రమే! సరిగా చూడండి.

జ్ఞాన: (తనలో) అరె—ఈమెకు లెక్కలుకూడా వచ్చునే! ఏదో విధంగా ఇప్పటి గండం గాచుకోవాలి.

(ప్రకా) భద్రా! మా గణనా సంప్రదాయము నెరుగవు తెమ్ము!

ఈ విధముగా లలితమైన హాస్యముతోను, సహజ సంభాషణలతోను ఈ ప్రహసనము మనోహరముగా నడచును.

## ఇతర సంస్కృత ప్రహసనములు:

జగదీశ్వరకవి 'హాస్యార్ణవము' మరొక ప్రసిద్ధ ప్రహసనము కౌతుకప్రహసనము, నాటసాట ప్రహసనము మొదలైనవి—పూర్తిగా లక్షణానుగోధులు కానివికూడా కొన్ని కొన్ని ఉన్నవి. ఇక—లటకమేళకాదులు కేవల వినోదదృష్టితో రచితములైన ప్రహసనాలు. వేశ్యలు, ఆ వేశ్యలకొరకు విటుల తగవులాటలు, సురాపానము, జూదము మొదలైన అంశాలతో ఇవి నిండి ఉన్నవి. కాళిదాసుని కంటగట్టబడిన లంబోదర ప్రహసనమువంటివి మరింత బండబూతులకు, అశ్లీలశృంగారమునకు నిలయాలుగా ఉన్నవి. మొత్తముమీద సంస్కృతప్రహసనాలలో వివిధ కపట మతాచార్యులను పరిహసించుట ఎక్కువగా కనిపించును.

## షడ్విధహాసములు

ప్రహసనానికి ప్రధానరసమైన హాస్యము రెండువిధములు—ఆత్మస్థము, పరస్థము అని. స్వయముగ తానే నవ్వినచో ఆత్మస్థము, పరుని నవ్వించినచో పరస్థము. నవ్వు ఆరువిధములు. 1 స్మితము, 2 హసితము, 3 విహసితము, 4. ఉపహసితము, 5. అపహసితము 6 అతిహసితము—అని. దంతములు పైకి కనిపించకుండ కన్నులలోను, కపోలములలోను వికాస మేర్పడునవ్వు స్మితము. కొంచెముగా దంతములు పైకి కనవచ్చునవ్వు హసితము. మధురమైన రవముతో కిలకిల నవ్వినచో విహసితము. తల కంపించుచు నవ్వెడి నవ్వు ఉపహసితము. కళ్ళవెంట నీరు వచ్చునట్టి నవ్వు అపహసితము. క్రిందబడి దొర్లుచు పెద్దపెట్టున నవ్వెడి నవ్వు అతిహసితము. ఈ ఆరువిధాల నవ్వులోను స్మిత, హసితములు ఉత్తమ ప్రకృతికి, విహసిత, ఉపహసితములు మధ్యమ ప్రకృతికి, అపహసిత అతిహసితములు అధమ ప్రకృతికి యోగ్యములయినవి.

## తెలుగులో ప్రహసనములు:

నాకు తెలిసినంతవరకు భగవదజ్జుకము, మత్తవిలాసము మాత్రము శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే ఆంధ్రీకృతము లయినవి. కాని, ప్రాచీన సంస్కృత సంప్రదాయానుగుణముగా తెలుగులో స్వతంత్ర ప్రహసనాలు వెలసినట్లు తోచదు. అలంకారిక లక్షణలక్షితములు కాకపోయినను, హాస్యరస ప్రధానములు, సాంఘిక దురాచార విమర్శకములు అగు ప్రహసనాలనేకములు—శ్రీ. శ్రీ. కందుకూరి వీరేశలింగం పంతులుగారు వ్రాసినవి—ఉన్నవి. సంఘసేవాదీక్షితులైన పంతులుగారి చేతిలో ప్రహసన మొక బలవదాయుధమయినది. వ్యక్తుల దౌర్బల్యాలను, మనోవక్రతలను బృహత్కరించి చూపుటవలననే కాక, సన్నివేశ రచనా చమత్కారము ద్వారా కూడ పంతులుగారు హాస్యము సాధించినారు. 'విచిత్రవివాహ ప్రహసనము' నిందుకు నిదర్శనముగా పేర్కొనవచ్చును. అసహాయశూర ప్రహసనము, అపూర్వబ్రహ్మచర్య ప్రహసనము, మహామహోపాధ్యాయ ప్రహసనము, బలాత్కార గానవినోద ప్రహసనము—ఈ విధముగా ఆయన తన ప్రహసనాలకు అర్థవంతముగా నామకరణము చేసినారు. ఈ ప్రహసనాలలో వచ్చే దృఢవ్రతుడు, చండశాసనుడు, సాహసవర్మ, తిమ్మయ్య, సంగీతరావు మున్నగు వ్యక్తులుకూడా అన్వర్థనామధేయులు.

శ్రీ శ్రీ గురజాడ అప్పారాయ కవి వ్రాసిన కన్యాశుల్కము, కొండుభట్టీయము కూడా ఆలంకారిక లక్షణాలకు సరిపడకపోయినను,—ప్రహసన ప్రధానలక్షణమగు హాస్యప్రాధాన్య ముండుటచే—ప్రహసన శ్రేణిలోనే చేరును. గురజాడ కవి హాస్యము విశిష్టమైనది. అతిశయోక్తి లేకుండ సాధారణముగ హాస్యమును సాధించుట దుష్కరము. కాని, గురజాడకవి స్వభావోక్తిలోనే వినోదకము, ఉపశ్లోకముకూడ అగు ఉత్తమహాస్యము సాధించినాడు. శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు 'అప్పుడు,' 'ఇప్పుడు,' 'ఎప్పుడు,' 'గంజుగల్లు నాలుగు' మున్నగు సంపుటాలలో ప్రచురించిన రూపకాలుకూడా ప్రహసన పదవాచ్యములే అగును. కాని, ఇవి పూర్తిగా పాశ్చాత్య సంప్రదాయానుగుణములు. చాలా భాగము ఫ్రెంచి నాటకకవి మోలియర్ రచనల అనువాదములో, అనుసరణములో! ఇవి పూర్తిగా అతిశయోక్తి ప్రచురములు. "ఒసేవ్, పెళ్ళాం! నువు కొంచెం నోరు తగ్గాలి!"—వంటి అసహజ సంభాషణలు వీటిలో ఎక్కువగా కనిపించును.

## ఉపసంహారము:

ఎన్ని చెప్పినను—హాస్యము శృంగార, కరుణములవలె ప్రగాఢమైన రసముకాదు. అందుచే అట్టి హాస్య మంగిగాగల ప్రహసనము సద్యః పర నిర్వృతికరమైన ఉత్తమ సాహిత్య విభాగము కాజాలదు. అయినను - అభ్యుదయమార్గములో మాత్రము ప్రహసనమంతటి ఉత్తమ సాధనము మరొకటి లేదు. సాంఘిక, రాజకీయాది రంగాలలోని దురాచారాలను పరిహసించి, ప్రజలకు స్వస్వరూపజ్ఞానము కలిగించుటలో అత్యంత శక్తిమంతమైన ప్రహసనము నేటిసాహితీపరుల కవశ్య సమాదరణీయము.

భగవదజ్జుక, మత్తవిలాసాది ప్రాచీన సంస్కృత ప్రహసనాలలోని శిల్పసంప్రదాయాదులను లెస్సగా అవగత మొనర్చుకొని, ప్రస్తుత కాలానుగుణముగా ప్రహసనమును పునరుద్ధరించినచో—ఈనాడు భారతదేశములో పరివ్యాప్తమైయున్న అసత్య వాతావరణమును నిర్మూలించి, ఆధునికరచయితలు భారతీయులను కార్యోన్ముఖులను చేయగలుగుదురనుట నిస్సంశయము!

# ఆతడు

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

అతఁ డుగ్రతపః కృశీభూతుఁ డతఁ
డున్నత శరీరయష్టి సంపన్నుఁ డతఁ
డాత్మసందర్శ నోజ్జ్వల దక్షియుగళుఁ
డతఁ డార్షమహస్సున కానవాలు

అతఁడు నేర్వనివిద్య లే దతని కగ్గ
పడని భావము లేదు ప్రాక్పశ్చిమ ప్ర
పంచ సంస్కృతి పుక్కిటఁబట్టె నతఁడు
నిఖిల మానవతా ప్రతినిధి యతండు

దుర్భరావేశమునఁ దప్పద్రోవఁబట్టు
దేశభక్తిని గాంధేయదిశకు మలఁచి
సత్యసంసక్తమై నహింసాప్రవృత్తి
మై గరిష్ఠితఁ గను కర్మయోగి యతఁడు

జగతి యింద్రియసుఖ లాలసతకు లోఁగి
కామ్యకర్మానుగతికమై కదలువేళ
నిత్య నిరవద్య నిగ్రహనిష్ఠ కండ
దండమై నిల్చు నూర్ధ్వరేతస్కుఁ డతఁడు

పరమగుహ్యమ్ము గీతా నిబంధితమ్ము
బ్రహ్మవిద్యను బసులకాపరికి నైన
మెఱుకపడునట్లుగా నింత లింత లైన
కథలుగాఁ బ్రవచించిన బుధుఁ డతండు

వ్యక్తిసత్యాగ్రహ ప్రధానాంగణమున
నిలువఁజాలిన మొదటిసైనికుఁడుగా మ
హాత్మునుల్లమ్ము లోఁగొన్న యనఘుఁ డతఁడు
వీరులకు వింతగొల్పిన వీరుఁ డతఁడు

ఒక మహాశాస్త్రమర్యాద నొంది వెలసె
నతఁడు చేపట్టినంతన యలఁతికదురు
ఒక మహావేదబుక్కు వానికిఁ గరంగి
చల్లచల్లని దేశమై వెల్లివిరిసె

కుత్తుకలు గోసి నెత్తురుకూడు గాదు
తృష్ణలను ద్రుంచి యమృత మందించు నతఁడు
విప్లవము కాదు వానిది విశ్వశాంతి
కావరువుగా నెసంగు సర్వోదయంబు

జనచయమ్ములు దేవతాగణము లయ్యె
దాత లెల్లరు హోతలై తరలివచ్చి
రుభయతారక మగుశాంతి యురలి పొరలె
నతఁడు భూదానయజ్ఞ దీక్షితుఁడు కాఁగ

కలిమినిచ్చిరి ముక్కారు పొలమునిచ్చి
రొడలివిచ్చిరి బ్రదుకిచ్చి రోటలేక
బాపురే! వానిపయనించు బాటయందు
నిండె నీవులు పుణ్యముల్ పండిపోయె

కానరాఁడేక బాపూజీ కనుల కనుచు
శోకమయమూర్తినై క్రుంగు లోకమునకుఁ
బట్టుఁగొమ్మగ నిల్చినయట్టి దీన
బాంధవుఁడు పావనుఁడు ‘వినోబా’ యతండు

కోటి కొకఁడేని వానికి దీటువచ్చు
పురుషుఁ డుండిన మహికి రాచఱిక మేల
శాసనము లేల యస్త్రశస్త్రమ్ము లేల
ధర్మదేవత నాల్గుపాదముల నడువ

---

# అసలు కారణం

శ్రీ వేమూరి వేంకట రామనాథం

"అసలు, ఆమెకు ఇష్టంలేదు మొదట్లో—అదిగో, సరో, బస్సు ఆగింది. శంకరంగారు వస్తున్నారు, కొంచెం వెళ్ళి—"

సరోజిని ఒక్క గంతున బస్సుదగ్గరకు పోయింది, శంకరాన్ని తోడ్కొనిరావటానికి

"మనం లోనికి పోదాంపద సుందరం" అంటూ శర్మ అందంగా అన్నిఅమర్చిన హాలులోనికి త్రోవతీశాడు.

సరోజిని అంతకుముందు శంకరాన్ని చూపలేదు. అతను కూడ ఆమెను చూసి ఎఱుగడు. ఎవరో బస్సు ఎక్కటానికి పరుగెత్తి వచ్చిన పిల్లవంక చూసినట్లు చూశాడు, నవ్వీ నవ్వనట్లు ఆమె "నమస్తే" అంటూ అతని వనుకనే రావటంచూసి, ఆమెకూడ ఆనాటి పార్టీకి చెందినదేనని నిశ్చయించుకున్నాడు.

"నమస్తే, నా అదృష్టమండీ, మీలాంటివారి పరిచయం కల్గటం—"

సరోజిని కనులు పైకెత్తక, "ఇది నా అదృష్టమూ—"

"అనుకుంటారు, అంతేనా" అంటూ పెద్దగా నవ్వి ఆమె వంక చూశాడు, ఆమె కూడా తన పరిహాస కోలాహలంలో మునిగి తేలుతుందన్నట్లు

ఆమెకు నవ్వు రాలేదు. అప్పటికి శర్మ వీధిగడపలో నిలబడి, "హల్లో హల్లో, శంకరంగారు, రండి—మిత్రులను లోపల కూర్చోపెట్టటంలో మీ బస్సురాకా రాలేకపోయినాము—"

"ఫరవాలేదు, మీ తరఫున ఈమె వచ్చింది, ఎంత చాకచక్యంగా మాటాడగలదండీ!" అంటూ ఆమె వంకకు తిరిగాడు, ఆమె అప్పటికి పదడుగుల దూరంలో ఉన్న లలితను తీసుకు వస్తోంది చేతిలో చేయివేసికొని

"ఇదిగో లలిత, సరిగా టైంకు వచ్చింది దొరసానిలాగా" అందరు నవ్వుతూ లోపలకు వెళ్ళారు.

మధ్యన టేబిల్‌మీద ఒక చక్కని రజతపాత్ర. తళతళ మెరుస్తున్నది. సుందరం దాని అందం గమనిస్తూ అన్నాడు, "శర్మా, సాధారణ ప్రజలని మన మనుకుంటామే, వారి భక్తి భావం, వాత్సల్యం నిజంగా వర్ణనాతీతమైనాయి"

"కాకపోతే, మేమిది కావాలని కోరామా, మాధర్మం మేము నిర్వర్తిస్తున్నామన్న భావంతో మాకు చేతనైన రీతిగా వారికి వయోజనవిద్య గరపాము. అంతేగదా. మేము వారికి కలిగించిన నూతన జ్ఞానానికి ఇది కృతజ్ఞతా చిహ్నమట! వద్దంటే విన్నారుకారు—"

ఒంటరిగా ఒకమూల నిలబడిన లలితను భుజంమీద తట్టుతూ, సరోజిని అన్నది, 'ఎలాఉన్నది లలితా, ఆ. పాత్రమీద పూలు నీ జాకెట్టుమీద కుట్టిన పూలకన్న బాగున్నాయా?"

లలిత అన్నది, "నీకు జాకెట్టుమీద పూలంటే ఇష్టంలేదు నిజమే కాని, మీరుచేసిన పనికి మెచ్చి మీ కిచ్చిన బహుమానం మీద పూలయినా నీకు అందంగా ఉంటాయా సరోజినీ?"

శర్మ అందుకున్నాడు, "నీకు తెలుసో తెలియదో, లలితా అసలీ సరోజినికి మాతోపాటు మొదటిలో వయోజనవిద్యా—ఉద్యమంలో కలిసి పనిచేయటం ఇష్టమే లేదు."

"మీ సరోజిని నాకు క్రొత్త? కాని ఇంతధైర్యం ఎలా వచ్చిందా అని మాత్రం—ఏల సరోజినీ, స్త్రీలంత ధైర్యంగా ముందుకు రావచ్చునా" అంటూ నవ్వింది.

శంకరం పెద్దపెట్టున నవ్వుతూ, "మీ వంటి వారుంటేగాని పార్టీలు ఆనందంగా గడిచిపోవండీ" అంటూ లలితను దరిచేరాడు. లలిత వానిచేతికి కూల్‌డ్రింక్ ఒకటి అందించింది

సుందరం తనగ్లాసు పైకెత్తి "ఈ ఊరిలో గొల్లపాలెంలో వయోజనవిద్యను గరపుతూ 300 మందికి అక్షరాస్యతను ప్రసాదించిన శర్మకు, అతని మిత్రవర్గానికి మన అభివందనాలు" అంటూ శర్మ చేతిలోని గ్లాసుకు తగిలించాడు

లలిత శాండ్‌విచ్‌లున్న ప్లేటు అందరకూ అందిస్తూ, "ఇది నీకే చేశావా సరోజినీ" అన్నది

సరోజిని ఒక్క క్షణంలో నవ్వు, నవ్వునుతరమిన ఆశ్చర్యం, చూపుతూ, "నేను ఇంతకుముందే వచ్చాను మా యింటినుంచి" అంది.

సుందరం, శంకరం శర్మ చూపించే ఫోటోలను ఉత్సాహంతో చూస్తున్నారు. ప్రక్కనే ఉన్న గ్రామఫోను రికార్డుల మీదకు వారిదృష్టిపోయింది. అవన్ని ఒక్కొక్కటి తీసిచూశారు. చివరకు సుందరంఅన్నాడు, "శర్మా, మొన్నటి తెలుగు రికార్డు లేమయినాయి? చాల బాగున్నాయి?"

'అవి మనవికాదుగా శేషుదగ్గరనుంచి తీసుకువచ్చాను. చాలా బాగున్నాయి కాదు?"

"ఊ అవి మా కంపెనీకి కొన్నా బాగుండు ననుకొంటాను. అవి ఇప్పుడు తెప్పిస్తే బాగుంటుందోయి చక్కనిపాటలు—"

అవును చక్కని పాటలే, తెప్పిస్తే బాగుంటుంది. శర్మ తటాలున సరోజినివంక చూశాడు. సరోజిని తన మఫ్లర్ మెడకు చుట్టుకొని, "నేను వెళ్ళి తీసుకువస్తానండీ" అంటూ వీధిప్రక్క బయలుదేరింది.

సుందరం చిన్నబోయిన మొగంతో అన్నాడు, "మీరు, మీ శొక్కరూ వెడతారా, వాకోసం! నా కంత భాగ్యం వశేదు "

"ఫరవాలేద"ని శర్మ, సరోజని ఏకకంఠంగా పల్కారు.

తటాలున శంకరం అన్నాడు, "నేను మీకు తోడువస్తాను. ఏదీ, చేయి కడుక్కొని వస్తాను " అంటూ బాత్ రూమ్ వైపు వెళ్ళాడు లలిత వానివెంట వెళ్ళింది తుండుచేతపట్టుకొని

"సరో, త్వరగారా బస్సుమీద పోయిరండి పదినిమిషాల కన్న ఎక్కువపట్టదు "

"వాకోసం మీకు వృథాశ్రమగదా" అన్నాడు సుందరం

"ఫరవాలేదులే సుందరం అన్నట్లు, నీకు వచ్చిందా సరోజని! ఇసే ఇంటర్వ్యూకి అయితే ఉద్యోగం ఇస్తారుకదూ సరోజనీ?"

సుందరం నవ్వుతూ అన్నాడు, "రికార్డులు త్వరగా తెస్తే సరి "

శంకరం తిరిగి వచ్చాడు, సరోజనివెంట వైటకు నడిచాడు. వారి అదృష్టం, వీధిలో కాలుపెట్టగానే బస్సు ఆగింది

అసలా రోడ్డుమీద బస్సులు ఎక్కువగా తిరుగుతూనే ఉంటాయి కాని, ఒక్కొక్కప్పుడు ఎంత వ్యవధిగానో వస్తాయి పైగా జనం క్రిక్కిరిసి ఉండటంవల్ల సీటుకూడా దొరకకపోవచ్చును అక్కడ శేషు యింట్లో ఉన్నాడు కూడ అడగానే రికార్డులు ఇచ్చాడు

సరిగా పదినిమిషాలలో వచ్చి వాలింది సరోజని సుందరం తన అభినందనాలు తెలిపాడు సరోజని సరాసరి పోయి గ్రామఫోను పెట్టింది లలిత అడిగింది, "ఇంతకు శంకరంగారిని ఎక్కడ దాచివచ్చావు సరోజనీ?"

"వస్తారు, కొంచెం, తరువాతి బస్సులో—"

అంటూఉండగానే శంకరం కూడ అడుగుపెట్టాడు, "అబ్బ, ఈనాడు బస్సు లెంత క్రిక్కిరిసి ఉన్నాయి" అనుకుంటూ ఎవరు తనవంక ప్రత్యేకంగా చూడలేదు సరాసరి గ్రామఫోను దగ్గరకు పోయినాడు, 'చాల చక్కని పాటకాదూ' అనుకుంటూ

సరోజనికి దాహమయినట్లుంది, లోపలికిపోయి ఒక గ్లాసుతో నీళ్ళు తెచ్చుకున్నది రికార్డు అయిపోగానే, పోయి పిన్ను మార్చి, కీ యిచ్చి, మరొక రికార్డుపెట్టింది అలా ఇవన్నీ ముప్పది నిముషాలు గడచిపోయినాయి మధురమయిన గీతాలతో రికార్డులు గిర్రున తిరుగుతున్నాయి కుదిలించే తలపులేవో సరోజని హృదయాన్ని గిర్రున త్రిప్పుతున్నాయి పాటకొక్క క్షణమన్నా తగిలించుకోలేదు. మాటిమాటికి తన మనస్సులకొని శూన్యం గ్రమ్ముకొన్నట్లు ఉన్నది పాటలలో రాగాలాపన శ్రావ్యంగా ఉన్నది తనలో మాత్ర మేదో రహోవిలాపం అస్ఫుటంగా పొరలుకు వస్తున్నది

పార్టీ ఎప్పుడు పూర్తిఅయిందో ఆమె కనిపెట్టనేలేదు, లలిత వచ్చి పాటేపాటే రికార్డు ఆపేవరకు. ఒకరినొకరు చిరునవ్వుతో సాగనంపుతున్నారు

గ్రామఫోను మూసి సరోజని లోనికిపోయి కూర్చున్నది టేబిల్ మీద తలవాల్చుకుని. శర్మ తన చిన్న సూట్ కేసును తెచ్చి టేబిల్ మీద పెట్టాడు "సరో, ఏ మలాఉన్నావు, శేషుదగ్గరకు వెళ్ళివచ్చినప్పటి నుండి?"

వెక్కి వెక్కి ఏడుస్తూ అన్నది, "నన్ను ఒంటరిగా పోనిచ్చినా బాగుండేది . ఎంత సిగ్గయింది బస్సులో! నా కెలాగో ఒక సీటు దొరికింది, కూర్చున్నాను ఆ శంకరంగారికి సీటులేదు. కండక్టరు "ఎవరూ నిల్చోవరాదు, కూర్చోండి" అంటున్నాడు. శంకరం గారు జరగమన్నట్లు నావంక చూశాడు నేనుమాత్రం వానివంక చూడనట్లు కూర్చున్నాను కండక్టరేమో, "సీటు లేకపోతే మరొక బస్సులో రండి" అన్నాడు శంకరంగారితో. ఆయనమాత్రం, "కావచ్చాయి, మూడుస్టేజీలే, కలిసిపోవలసిన అవసరమున్నదన్నాడు " "నన్నేమి చేయమన్నారు, మరి కూర్చోండి అయితే, నిల్చోనటానికి మాత్రము వీలు లేదు—పోలీసుస్టేషను ముందు ఉన్నది," అన్నాడు కండక్టరు ఇంక ఏంచెయ్యను, నేను కొంచెం జరగక తప్పిందికాదు, ఆ యిరుకుసీటులో—" అంటూ కన్నీరు క్రమ్ముకుంది

"తిరిగి వచ్చేప్పుడు? ఆయనవెనుక ఎలా పడ్డావు?"

"నేను కొంచెం తెలివిపడ్డాను బస్సు ఆగింది. ఆయనను ముందు ఎక్కమన్నాను నేను చీర కాలికి అడ్డుపడ్డట్లు నటించి ప్రక్కకు తిరిగి సర్దుకుంటున్నాను కండక్టరు నావంక తిరిగినప్పుడు తన బస్సు పోవచ్చునన్నట్లు చూశాడు అయితే నేను అక్కడే దిగబడ్డాను బస్సుపోయింది "

"మరి నీవే ముందువచ్చావే!"

"వినండి ఆ శంకరంగారు తెలివితక్కువవాడా ఏం? తరువాతి బస్సుస్టాపువద్ద దిగి నాకోసం కాచుకొన్నారు నా అదృష్టవశాత్తు, నేను తర్వాత ఎక్కిన బస్సు మరీ క్రిక్కిరిసి ఉండటంచేత ఆ స్టాపుదగ్గర అసలు బస్సు ఆగనేలేదు "

"కథ యిలాగ అయింది సరో" అంటూ శర్మ సూటుకేసు తెరిచాడు. ఎవరో బయట దగ్గినట్లు వినపడింది "ఎవరు" అంటూ బైటకు తొంగిచూసేలోగా సుందరంగారు అనువచ్చి, "క్షమించండి మిమ్మల్ని disturb చేసినందుకు సరోజనిగారు నా కారులో వస్తే వారి యింటిదగ్గర దింపిపోతాను" అన్నాడు

"ఏం సరో—"

"వద్దు, మీకు కృతజ్ఞతలండీ నన్ను ఒంటరిగా పోనీయండి" అంటూ సరోజని లేచి నిలిచి వానికి నమస్కారంచేసింది. సుందరం కారు బుర్రుమన్నది, శర్మ వానిని సాగనంపి లోనికి వచ్చాడు.

సరోజని సూటుకేసులోని నీలం జాకెట్టు గుడ్డను బైటకు లాగింది "ఏం, ఇది నాకోసమేగా మీరు తెచ్చారు?"

"సరిపోతుందా సరో, నాకు ఎంత లేవాలో తెలియలేదు"

గుడ్డ మూరతో కొలిచిచూచి, "ఓ దక్కగా సరిపోతుంది. నాకు ఉద్యోగం వచ్చిన మరునాడు దీనితో అందమైన కొత్త ఫాషనులో జాకెట్టు కుట్టుకు మీకు కనపడుతాను."

"మంచిదే సరో" ఇద్దరు బైటకు నడిచారు.

దాదాపు సరోజని యింటిదాకా శర్మ వెంట వెళ్ళాడు. తమ తరహా విద్యోద్యమంలోని తరువాత కార్యక్రమంగురించి, ఆనాటి

తను పార్టీనిగురించి, ఆ బీ యిబి మాట్లాడుకుంటూ వెళ్లారు. మధ్యలో సరోజని అన్నది "ఆ లలిత యిల్లు ఇదే" అని.

శర్మ అడిగాడు, "లలిత అంటే నీతో యింటరు చదివి తను కూడ బి. యే లోచేరింది, ఆ పిల్లేకదూ "

"అవునవును, నేను బి. యే అనర్సు అని మీ గర్వంకదూ" అంటూ సరోజని తన యింటిగుమ్మంవైపు గంతు వేసింది

*          *          *          *

సరోజని ఆవేళ ఎన్నడు పడుకొని ఎఱగని జుట్టు చెదరి పోయింది. మధ్యాహ్నం ఉత్సాహంతో తలలో పెట్టుకున్న గులాబీపూలు గదినిండా రెక్కలపాన్పులలా అయిపోయినాయి కంపెనీనుంచి వచ్చిన ఉత్తరం టేబిల్ మీద హేళనచేస్తున్నట్లు గాలికి టపటపలాడుతూంది

సరోజని కన్నీటికి అంతులేదు దిండు పూర్తిగా తడిసిపో యింది. ఏడ్చి ఏడ్చి కన్నులు ఎఱ్ఱపడిపోయినాయి

పది రోజులక్రిందనే తనకు కంపెనీలో ఉద్యోగం నిశ్చ యంగా ఇస్తానని సుందరంగారు చెప్పారు సుందరం శర్మ చాలా ముఖ్య స్నేహితులు. శర్మ ఏది యిష్టమో, ఏది ప్రియమో, అది సుందరం చేస్తాడు కాని తనకు మాత్రం లేబర్ ఆఫీసరుపని గాలేదు. తన డిగ్రీ కాని, తన తెలివి గాని తక్కువని కాదు తనకు కాలే జిలో ఎన్ని బహుమానాలు రాలేదు

తన మనసులోని భావాలలాగానే విసురైన గాలి తెరలు దూసుకువస్తున్నాయి గదిలోకి. కిటికీలోంచి క్రిందకు జారిపడిన వార్తాపత్రిక పిల్లాచెదరై అటూ ఇటూ కొట్టుకుంటూ ఉన్నది ముంచంకోళ్లవద్ద, పెట్టెల సందులలోను తలయెత్తి చూసింది టేబిల్ మీద ఉంచిన రిస్టువాచివైపు అయిదు గంటలయింది. ఒక పెద్ద గాలికెరటానికి టేబిల్ క్లాత్ ఎగిరి కడిగూరం క్రింద పడి పోయేదే, తటాలున ఆమె లేచియుంచకపోతే

భరింపరాని గాలిహోరు తప్పించుకొనటానికి గది తలుపు వేసింది. ఏమి చేయాలో తోచలేదు, తిరిగి మంచంమీద మేను వాల్చింది తన నిష్ఫలమైన మరోక ఊహ వేధించ మొదలిడింది. తనను అందరికన్న ఎక్కువగా ప్రేమించిన శర్మగారెంత ఖిన్నుడై ఉంటాడో, యీ వార్త విని. అతని హృదయంలో రెండుకొరడాలు. ఒకటి తనకు ఉద్యోగం రాలేదని రెండు తన మాట, తన పరపతి విఫలమయినవని.

తనింత దుఃఖసముద్రంలో మునిగిఉన్నది. మంచిజీతం వచ్చే ఉద్యోగం పోయినందుకు శర్మ హృదయ మెంత దహించుకు పోతోందో, తనకున్న విశ్వాసం, తనమీద యితరులుంచిన విశ్వాసం తరిగిపోయినవని!

సరోజని తటాలున లేచింది, తలుపు తెరచింది. బయట నుండి తుటరగాలి ఒక్కసారిగ విరుచుకొనపడి లోనికి ప్రవేశించుకు పోయింది. కాని తన మనస్సులోరేగిన క్రొత్త తలపుల బలంలో ఇదేమీ పాటించలేదు. పోయి శర్మను చూడాలి. త్వరత్వరగా తలదువ్వుకొని చీర సర్దుకొని వైట సావడిలోకి వచ్చింది.

గడియ తెరచింది వీధితలుపు. ఎంతసేపుగా ఆ గాలి గుమా రంలో తలుపుకొడుతూ నిలుచున్నదో కాని, లలిత ఎదురుగా దర్శనమయింది.

"నీవా, ఇంతగాలి తుపానులో—" అంటూ తిరిగి లోనికి వచ్చింది సరోజని

"సరోజనీ, తుమించు ఎక్కడికో పోగోరుతున్నట్లున్నావు విజానికి నీ వనుకున్నంత గాలి తుఫాను లేదమ్మా లోపలకూర్చుంటే అలాగే అనిపిస్తుంది, కిటికీలు పగులుతూ, తలుపు లదేపనిగా కొట్టు కుంటూ

"అందుకే వైట పడ్డాను"

ఇరువురు పదడుగులు ముందుకు వేశారు, ఏమి మాటాడాలో తెలియని శిశువులలా మెల్లగా లలిత అన్నది, "సరోజనీ, నీకు తెలిసేఉంటుంది—'

"అవును ఇందాకనే కంపెనీ జవానువచ్చి ఉత్తరం ఇచ్చి పోయాడు ఉద్యోగం వచ్చిందనుకొని ఆత్రంతో కవరు చించి చూశాను—"

"సరోజనీ, ఇదే నేను దురదృష్టమంటాను—"

"కావచ్చును తగు కారణం నాకు కనపడం లేదు మరి"

"విను సరోజనీ, నీకు నాకు పోలిక ఏమిటి చెప్పు—"

సరోజని ఆమెవంక చూసింది. నవ్వు తెప్పించుకొని అన్నది "మూడు లలితా, మనిద్దరం ఎర్రగా ఉన్నాము అదొక పోలిక"

"బాగుంది"

"మనిద్దరి జడలు పొడవు. అది మరొకపోలిక—"

"నవ్వకు సరోజనీ చదువులోకాని, బుద్ధి విశేషములోకాని నీవు నాకన్న మిన్న నీవు ఆనర్సు ఫస్టుక్లాసులో ప్యాసయినావు. నేను సీటురాక, బి యే లో ప్రజాబాహుళ్యంతోపాటు ప్యాసయిన దానిని"

"ఏం—అర్థం లలితా, నాకేమైనా ఒరిగిందా ఫస్టుక్లాసులో ప్యాసయితే" కొంచెం సేపు ఇరువురు నిశ్శబ్దంగా నడిచారు. ఎన్నో లాంతరు స్తంభాలు గడచిపోతున్నాయి తటాలున సరోజని ఆగి, మరి నాకు ఉద్యోగం రాకపోవటానికి కారణమేమిటో చెప్పు లలితా?" అని గ్రుచ్చినట్లుగా ప్రశ్నించింది

లలితమొగం కొంచెం తెల్లపడ్డది అప్పుడే ప్రక్కనున్న లాంతరు స్తంభము తగుక్కుమన్నది ఆ వలువను భరించలేక తల వంచుకొన్నది

మరల కొన్ని అడుగులు ముందుకు వేశారు. లలిత అన్నది, తలయెత్తకే "సరోజనీ, నీవు వేఱుగా తలంచకుండావుంటే ఒక విషయం చెబుతాను. నాకెందుకీ ఉద్యోగం వచ్చిందో నిజంగా నాకు తెలియదు సుమ్మీ; కాని నీకెందుకు రాలేదో నాకు చూచా యగా తెలుసుననుకుంటాను"

సరోజనిపాదాలక్రింద భూమి బ్రద్దలయిన ట్లనిపించింది. తనకు కాని ఆ ఉద్యోగంలో లలితను నియమించారా! లలితను!

లలిత కూలకుర్చీమీద చతికిలబడింది. మెల్లగా అన్నది, "మీరు తప్పక వస్తారనుకొన్న సుందరంగారు రానేరాలేదు."

శర్మ అన్నాడు "అంతేకాదు, నేను అంతకన్న ముఖ్యంగా కోరియున్న సరోజకూడ రాలేదు. ఆమె ఆరోగ్యం ఎలా ఉన్నదో ఏమో."

లలిత నిశ్శబ్దంగా కూర్చొనిఉంది. శర్మ ప్రారంభించాడు, "ఇరవై రోజులనుంచి కనబడనేలేదు సరోజ. ఇందరువచ్చి యింత సందడిగా కార్యక్రమం నడిచినా నాకేదో లోటు జరిగినట్లే ఉన్నది"

లలిత అన్నది, "అవును ఎవరిమీద వాత్సల్యం మిక్కుటంగా ఉంటుందో వారు రాకపోతే అలాగే అనిపిస్తుంది శర్మగారూ. ఇంతకు మీరు ప్రేమించినంతగా మిమ్ము ప్రేమించే ఆ సరోజని రాకపోయే కారణం ఏముంటుంది?"

"ఏమో" అంటూ శర్మ నిట్టూర్చాడు. లేచి అటు ఇటు మెల్లగా నడిచాడు. కిటికీలోనుంచి బైటకుచూస్తూ అన్నాడు, "లలితా, నీతో ఈ విషయం ప్రస్తావించటం అనుచితమని నాకు తెలుసు అయినా—"

"అలా అనకండి శర్మగారు మీరు నాతో ఏవిషయమైనా—"

"విను లలితా. ఆమె రానికారణం నేను ఊహించగలను తాను తప్పక వస్తుందని ఆశించిన ఉద్యోగం తనకు దక్కనందువల్ల ఎంతో చిన్నబోయి విచారిస్తూ ఉంటుంది"

లలిత తలవంచుకొని "కావచ్చును" అంటూ రుమాలుతో వేళ్ళు తుడుచుకున్నది. శర్మ అటు తిరిగి ఆమెను సూక్ష్మంగా గమనించి అన్నాడు "లలితా ఆమె ఉద్యోగం మాట ఎత్తితే నీ ఉద్యోగప్రాప్తినిగురించి ముచ్చటించినట్లు అవుతుందిగదా. ఇందుకే నేనింతవరకు యీ విషయం స్పృశించాను"

"ఫరవాలేదు కాని నాకీ ఉద్యోగం ఎందుకు వచ్చిందో మాత్రం నేను చెప్పలేను"

"పోనీ మాసరోజ ఎందుకు రాలేదో చెప్పగలవా?"

లలిత తటాలున తలఎత్తి శర్మవైపు చూసింది. ఈ ప్రశ్న అనుకోనంతటూతంగా సూటిగా తనహృదయానికి తగిలింది శర్మ కన్నులు రెండు ప్రశ్నా సూచకంగా అరవిచ్చిపాల్లా వికసించాయి

లలిత మెల్లగా అన్నది "మీప్రశ్న అంత సులభంకాదు సమాధానం" తనచేతిసంచి తీసుకొని పవిట అలవాటుగ సర్దుకుంటూ "నన్ను పోనీయండి" అంది.

తాను ఊహించనంత గంభీరంగా కనపడింది. ఈ విషయమంతా. శర్మ అన్నాడు, "లలితా, క్షమించు. నీకు కష్టం కలిగే సమాధానం ఇమ్మని నేను నిర్బంధించను లే"

లలిత తటాలున పలికింది, "నాకుకాదు, మీకు కష్టం కలుగవచ్చునని నా భయం."

"నాకా? క్షమించు లలితా, వినకలేవని నాకు కష్టాల మధ్యలో ఉన్నా." చెప్పులలితా, చెప్పతూ."

లలిత తన చేతిసంచీ తిరిగి టేబిల్‌మీద పెట్టింది. పవిట అంచుతో కనుకొనలు తుడుచుకుంటూ, "కాని నేను చూచాయగా విన్నదే సుమా, ఇదే రూఢియైన సత్యమని మీరు అనుకోనక్కరలేదు," అన్నది.

శర్మ ఆశ్చర్యంతో "చెప్పు లలితా" అంటూ అనునయించాడు.

"కాని ఒక్క షరతు"

"అంగీకరిస్తున్నాను, చెప్పు లలితా"

"మీరీ విషయంగూర్చి సుందరంగారిని అడగనని, వారితో అసలీ విషయం ఎత్తనని వాగ్దానం చెయ్యాలి"

శర్మకు మరింత ఆశ్చర్యం కలిగింది "సరే" నన్నాడు.

"నేను విన్నదిది. సుందరంగారికి సరోజని మీ వర్గంలో కలసి వయోవిద్యాధ్యాపన చేయుటం ఇష్టంలేదట ఎందువలననో నాకు తెలియదు. నన్ను అడిగకండి. అందువల్ల ఆమెకు ఉద్యోగం ఈయలేదట."

శర్మ మొగం ఎఱ్ఱబారింది. కదలికలేని కన్నులు బరపుతూ, "నాతో కలసి వయోవిద్య గరపిందనా? మా సరోజనిలో ఇదొక దోషం కనిపెట్టాడా?"

లలిత నిశ్చలంగా పలికింది. "నాకేమీ తెలియదని, నన్ను ఈ ప్రశ్నలువేసి లాభంలేదని మొదటనే చెప్పాను."

"ఇదంతా సరోజనికి తెలుసునా?

"తెలుసు ననుకుంటాను"

"నమ్మి ఉంటుందా?"

"ఏమో మీ సరోజని హృదయం మీకు తెలియాలి శర్మగారు"

శర్మ ముఖంమీద ఆలోచనా మేఘాలు వీడలల్లుకున్నాయి. కన్నులొక్క పరి లోతయినాయి నిట్టూర్పులతో తల కదల్చుతూ, మెల్లగా అన్నాడు "సరో నవ్వుతుండాలి ఈ కారణం విని"

లోపల నవ్వుకున్నదేమో కాని పైకిమాత్రం పొంగివచ్చే దుఃఖాన్ని అణుచుకోలేక వ్యగచెందింది నేను చూశాను .." అంటూ లలిత ఆనాటి సాయంత్రం జరిగినదంతా వర్ణించసాగింది

శర్మ ఎడతెగని ఆలోచనా తరంగాలలో ఈదుతున్నాడు, దారి తెన్ను లేనట్లుగా. సుందరం నిజంగా అలా భావించి వుంటాడా? మరి ఆ సరోజనికి ఉద్యోగం ఇస్తానని ముందు గట్టిమాట ఎందుకు ఇచ్చిఉంటాడు? ఇంతకన్నా ముఖ్యమైన ప్రశ్న: సరోజని ఈ కారణం విశ్వసించి ఉంటుందా? ఏమో తన కార్యక్రమంలో పాల్గొని ఉద్యోగం పోగొట్టుకొన్నానని నమ్మి ఉంటుందా? పరుపత్తుకుపోయి ఆమెను ప్రశ్నిస్తే?

కాని ప్రశ్నించి ఏమిలాభం? తన సరో తనకు తెలియదూ, "ఇది నిజమంటారా" అని తననే అడుగుతుంది. "ఇది విశ్వసించవు సరో, అసలు సంగతి క్రమంగా బైటపడవచ్చును" అని తాను చెప్పవచ్చును. కాని, అది తెలుసుకునే మార్గమేముంది?

ఒకటే మార్గం సుందరాన్ని పోయి అడుగవచ్చును. సుందరం తన చిన్ననాటి స్నేహితుడు. సుందరం ఆసాయంత్రం రాసైనా రాలేదు అవును మొగవు జ్ఞాపకం ఉంచడు ఏమో, ఏదైనా తొందర పనిఉండి రాలేకపోయినాడేమో సుందరం తనకు ప్రాణ మిత్రుడు కాదుకదా పరిగెత్తుకుపోయి అడిగితే—అవును "లలితా, విను, ఇదెంతవరకు నిజమో నీకు సరిగా తెలియదుగా" అన్నాడు.

"తెలియదు"

"ఇది తేలికగానే మార్గమొకటుంది. నేను పోయి సుందరం గారిని అడుగుతాను."

లలిత దీర్ఘంగా నిట్టూర్చి, పవిట కొంగుతో విసరుకొంటూ, కుర్చీకి ప్రాక్కగా నేలగిలపడి అన్నది, తొణుకు లేని గొంతుతో. "శర్మగారు, మీరు నాకిచ్చిన బాస చెరుపుతారనుకొని మీకీ ఉదంతమంతా చెప్పాను మళ్ళీ రారా మీ మనస్థితిలోకి?"

శర్మకు సిగ్గువేసింది, క్రిందటి కింద తాను చేసిన వాగ్దానం తన మనశ్చాంచల్యంలో విస్మరించినందుకు "క్షమించు లలితా, నన్ను నమ్ము. నే నెన్నడూ ఈ విషయం సుందరంతో ప్రస్తావించను సుందరంతోనే కాదు; మరెవ్వరితోనూ కూడా మా సరోకు రాని ఉద్యోగం ఇది తెలుసుకోవడంవల్ల రాదుగదా కాని నీ వొక సాయం చేయాలి"

లలిత నవ్వుతూ అన్నది "ఏమిటి శర్మగారు? మీకేమయినా చేయగలను'

"నీ పుట్టినరోజు పండుగకు నేను రావాలంటే ఒక షరతు"

"బాగుంది మగవాళ్ళు కూడా షరతులు పెడతారా?"

"విను. సరోజను చూసి చాలా రోజులయింది ఆమెను తప్పక పిలిపించు"

"అలాగే ఆహ్వానాలు మీ యిద్దరనే పిలుస్తున్నాను."

"నేను రమ్మన్నానని ప్రత్యేకంగా చెప్పు లలితా"

"అలాగేనండి లలిత పుట్టిన రోజుకు శర్మగారు 'నిన్ను లలిత యింటికి ప్రత్యేకంగా ఆహ్వానిస్తున్నారని నొక్కి వక్కాణిస్తాను లెండి" లలిత నవ్వుతూ సెలవుచ్చి గిరగిర తిప్పుకుంటూ బైటకు నడిచింది మరొక్కసారి శర్మకూడా నవ్వులు కురిపించాడే కాని, మన సంతా వేసవి ఎడారిలాగ రేగే ఆలోచనలతో సందేహాలతో మండి పోతోంది

* * * *

లలితకు ఆనందంగానే గడిచింది కాని ఆ సాయంత్రమంతా శర్మకు మాత్రం బరువుగా దిగులుగా గడిచింది తన పుట్టిన రోజుకు అభినందిస్తూ, మిత్రులు పంపిన బహుమతులన్నీ శర్మకు చూపింది. ఒక్కొక్కటి వివరంగా వర్ణిస్తూ ఆ మిత్రులనుగూర్చి విసుగటి ముచ్చటలవీ యివీ చెప్తూ కాలం పుచ్చింది.

"ఇంతకు నేను కట్టుకొన్న చీర ఎవరిచ్చారు చెప్పండి శర్మగారు" ఈ వేడుకప్రశ్నల నానందించే స్థితిలో లేదు శర్మ. మెల్లగా అన్నాడు "నాకేం తెలుసు? నేను మాత్రం కాదు."

లలిత నవ్వుతూ దగ్గరకు వచ్చి, "చూడండి, యీ పవిట అంచు ఎంత అందంగా ఉందో. ఈ చీరలు, కాని మధ్య మధ్య పువ్వులు—"

"అవును, ఇప్పుడు గుర్తు వచ్చింది. ఆనాడు సరో అంటోంది కదూ నీకు పువ్వుల చీరలు రవికలు ఉంటే చాల సరదా అని. బహుశా సరో పంపి ఉంటుంది."

"కాదు, శంకరంగారు" అంటూ అప్పుడే వచ్చిన పాకెట్టు ఒకటి విప్పుతూ, "ఇందులో ఏముంటుంది చెప్పుకోండి" అన్నది.

ఏమి చెప్పాలో తెలియని శర్మకు ఎదురుగా నిలబడి, "చూడండి, నేను చెపుతాను. ఇందులో ఒక జాకెట్టు గుడ్డ ఉంటుంది"

"అవును, పాకెట్ చూస్తే అలాగే ఉంది, చిన్నదిగా, తేలిక గా—"

"అయితే ఏ రంగుదో చెప్పండి?"

"నీకు అందం కూర్చే రంగు"

"అంటే—" అంటూ లలిత పాకెట్ విప్పింది అతి సుందరమైన నీలిరంగు జాకెట్టుగుడ్డ ఉంది అది చూస్తూనే శర్మ కన్నులవెంట రెండు వేడి కన్నీటిబిందువులు కారినాయి. అనాటికి తాను సరోకు తెచ్చియిచ్చాడు; ఆ జాకెట్టు ఉద్యోగం వచ్చిన మరునాడు ఆమె ధరించి తనయొద్దకు రావలసిన అదృష్టం పనుకు పోయింది

తలవని తలంపుగా అన్నాడు "ఇది బహుశా సరో పంపించి ఉంటుంది. ఆమె కీరంగు చాలా యిష్టం"

"క్షమించండి శర్మగారు, మీకెప్పుడూ సరోజని నామ స్మరణగా ఉన్నదే—"

"ఆమె తప్పక వస్తుందన్నావు కదూ?"

"మీరు వస్తున్నారని, మీరు ప్రత్యేకం ఆమెను రమ్మని కోరారని కూడా చెప్పాను"

శర్మకు ఎప్పటికన్న ఆరాట మెక్కువయింది ఆమెతో అన్నాడు "లలితా చూడు మీ కుర్రవాడిని పంపుదాము సరోజని యింటికి. పోయి పిలుచుకురమ్మని చెపదాము"

"తప్పక" అంటూ లలిత కుర్రవాడిని పిలిచింది. వాడు ఒక్క గంతున బైటకు ఉరికాడు

శర్మ కొక ఆలోచన తట్టింది. కుర్రవాడిని పిలిచి ఒక చీటి వ్రాసియిచ్చాడు, తాను ప్రత్యేకంగా రమ్మన్నట్లు.

లలిత తన బహుమతులలోగల వింతలన్నీ వర్ణిస్తోంది చల్లారుతున్న తేనీరు పారపోసి వేడి టీ పోస్తోంది. శర్మ మనసంతా మాత్రం ఆ కుర్రవాడిమీదుంది

కుర్రవాడు పరుగెత్తుకు తిరిగివచ్చాడు. శర్మ ఆత్రంగా అడిగాడు. "ఏం వస్తోందా?"

"లేదండీ. అబ్బ...ఆ యిల్లంతా ఎలా ఉందండీ! ఎవరైనా మాత్రం ఎలా రాగలరండీ?"—

శర్మకు అర్థంకాలేదు. లలిత అన్నది "సరిగా చెప్పరా, అసలు సంగతేమిటి?"

"సామానులన్నీ చిందరవందరగా పడివున్నాయండి, అమ్మగారూ, అదే పనిగా సర్దుతున్నారు."

శర్మ అడిగాడు, "మరి నా చీటి ఇచ్చావా?"

"చూసుకున్నారు బాబూ, ఈ సర్దటం పూర్తి అయితేగాని కదలనన్నారు."

"ఎంతసేపు పడుతుందో యింకా—" అంటూ శర్మ తన గది గుమ్మంవంక చూసుకున్నాడు.

కుర్రవాడు అన్నాడు, "రేపు ప్రొద్దునదాకా కాదటండీ."

లలిత అన్నది "ఇక ఈ సాయంత్రం ఇక్కడకు రానట్లే."

"పోనీ నేనే అటుపోతే—" అంటూ శర్మ లేచాడు చేతులు తుడుచుకుంటూ.

కుర్రవాడు వంటింట్లోకి జారుతూ మెల్లగా అన్నాడు "ఏమో, ఈ సామాను సందడిలో ఎవరైనా వచ్చినా చాలా సిగ్గుగా ఉంటుంది అనుకుంటూ తెగ సర్దుతున్నారండీ సరోజనమ్మగారు."

శర్మ కేమీ తోచడంలేదు. ఇంతలో బైట కారు ఆగింది. హారన్ అదేపనిగా మ్రోగుతోంది. లలితకు తెలుసు శంకరం వచ్చాడని, తనవాళ్ళ రాత్రి సినిమాకు తీసుకుపోవటానికి.

లలిత బైటకు నడిచింది, శర్మకూడా వెంట వెళ్ళాడు. వెనుకకు తిరిగి లలిత వడివడిగా అన్నది, "శర్మగారు, రెండు రోజులలో నేను పోయి కనుక్కుంటాను. సరోజని నాకూ స్నేహితురాలేగా. మీకు చెబుతానులెండి."

"మంచిది లలితా" అంటూ శర్మ నెమ్మదిగా మెట్లు దిగాడు. లలిత గబగబా వానివెంటవెళ్ళి, "శర్మగారు, మీరు వచ్చినందుకు కృతజ్ఞతలు. కాని, సరోజని రానందుకు విచారం వేస్తోంది. మీరు ఆ కారులో రావచ్చును, శంకరంగారు మీ యింటివద్ద దించుతారు, మంచివారు" అన్నది.

శంకరం కారువంక చూడకే, "వద్దు నన్ను ఒంటరిగాపోనీ లలితా" అంటూ రెండడుగులు వీధిలో వేశాడో లేదో, హారన్ మ్రోగిస్తూ శంకరం కారు లలితతో సహా రివ్వున పరుగెత్తింది.

* * * *

ఆనాడు బేబీ పుట్టినరోజు పండుగ. తలంటి పోసుకొని, కొత్తచొక్కా, కొత్తపరికిణీ వేసికొని, తలనిండా అప్పుడే విచ్చిన పువ్వులు అమర్చుకొని గంతులువేస్తూ వచ్చింది శర్మదగ్గరకు. శర్మ బేబీని పైకెత్తి ముద్దు పెట్టుకున్నాడు.

బేబీ అడిగింది "అన్నయ్యా, ఏదీ యింకా రాలేదు? వస్తుంది వస్తుందన్నావు."

సరోజని రాకుండా బేబీ పుట్టినరోజు పండుగ లింతవరకు జరిగియుండలేదు. క్రిందటిఏడు తను సరోజని అక్కయ్య ప్రక్కనున్న పూలతోటలో తిరుగుతూ, పరుగులెత్తుతూ, కథలు చెప్పుకుంటూ, ఎంత హాయిగా గడిపారో బేబీకి విన్నటివలె గుర్తున్నది.

"నిజంచెప్పు అన్నయ్యా, సరోజని అక్కయ్యను పిలవలేదా?" శర్మ నవ్వాడు. బేబీ బుగ్గల నిమురుతూ, "నీ కలా ఎందుకు తోచింది బేబీ?" అన్నాడు.

"అవును, మనింటికి రావటం మానేసిందిగా. అందుకని కోపంవచ్చి—"

శర్మ నవ్వుతూ అన్నాడు "ఈమాత్రానికే కోపంవస్తే ఎలా బేబీ?"

"నాకు నిజంగా వస్తుందిసుమా"

"అందుకే నీవు బేబీవి" అంటూ తనగదిలోనికి వెళ్ళాడు. బేబీ తన పూలగుత్తులను సరిదిద్దుతూ అద్దంలో చూస్తూ నిల్చుంది. తనకు నచ్చినరీతిగా రంగులకలయిక చేస్తూ మురిసిపోతోంది. ఇంతలో పోష్టుమాను వచ్చాడు.

గబగబా శర్మ గదిలోనికి పరుగెత్తింది "అన్నయ్యా నాకొక పార్సెలు వచ్చింది. నాదే, నాకే—" బేబీ సంతోషానికి మేరలేదు, ఆమె కదే తొలిసారిగా తనపేర ప్రభుత్వ తపాలాశాఖవారిద్వారా పార్సెలొకటి రావటం.

శర్మ అదిచూస్తూ తెల్లపోయినాడు. రాలిపోయిన పూవులాగ ఆయనముఖం కళావిహీనమైంది. బేబీ అది కనిపెట్టింది, మెల్లగా అడిగింది "అన్నయ్యా, నాకు చెప్పవూ—"

బేబీని తన భుజాలదగ్గరకుతీసికొని, తల నిమురుతూ అన్నాడు "ఛెఁ, సరోజని అక్కయ్యరాదు—"

"అని దానిమీద వ్రాసిఉందా?" అని పార్సెలుపైన క్రింద చూసింది, కన్ను లింతచేసుకొని.

ఆమె అమాయకంగా చిక్కమొగం పెట్టింది. అది గమనించి శర్మ నవ్వుతూ, "బేబీ, ఇది నీకోసమే పంపింది సరోజని అక్కయ్య ఇందులో ఏముంటుందో చెప్పుకో," అన్నాడు.

బేబీకి మరల మొగమింత అయింది. "నాకు తెలుసు అందులో కీ యిచ్చేకారు ఉంటుంది. నిరుడు నాతో చెప్పింది కొనిపెడతానని. తనకు ఉద్యోగమవుతుందట. అప్పుడు చాలా డబ్బు వస్తుందట. నాకు తప్పక కారు కొనిపెడతానన్నది."

"కాని, సరోజనికి ఉద్యోగం కాలేదుగా—"

"మరైతే డబ్బు ఎక్కడనుంచి వస్తుంది అన్నయ్యా?"

శర్మ పార్సెలు సాంతం విప్పాడో లేదో బేబీ అందులోని గౌను లాక్కునిపోయింది లోపలికి. అయిదునిముసాలలో కొత్త డ్రెస్సులో తిరిగివచ్చింది "చూడు అన్నయ్యా, ఎంత చక్కని గౌనో. పోనీలే; ఇదే బాగుంది కారుకన్న."

శర్మ కళ్లు తొలుత సంతోషంలో మెఱిసినాయి. ఈణం పిత్త దగ్గరగా పరిశీలించాడా నీలిగౌనును. ఆ నీలిగుడ్డ తా నిచ్చినదే సరోజనికి, జాకెట్టు కుట్టించుకోటానికి.

ఎంతో ఆప్యాయంగా తాను బహూకరించాడు. అదే— ఆ బహుమానమునే ఆమె యీ విధంగా త్రిప్పికొట్టింది! లేక—

శర్మకు ఊహ లింతకన్న దూరంపోలేదా క్షణాన. కనుకొలకుల్లో క్రిందకు రాలని అశ్రుకణం చక్కగా అవతరించింది. ,బేబీ

ఈ వంక తిరిగింది, ప్రశ్న చేసినట్లు చూస్తూ. శర్మ ఆమె చెంపలను తన వ్రేళ్లు మెల్లగా తగిలిస్తూ అన్నాడు "అబ్బో ఎంత ధగధగ లాడుతోందో యీ గౌను. నా కళ్ళు చెదురుతున్నాయి కూడా."

శేవీ తృప్తిచెందిన ముఖం పెట్టింది. "అన్నయ్యా, ఇదిగో పోస్టుమాను ఇచ్చాడు" అంటూ ఒక కవరిచ్చింది.

అది తను సరోజనికి పంపిన ఆహ్వానం తిరిగివచ్చింది. "ఈ చిరునామా గలవారు ఇల్లువదలి వెళిపోయారు" అన్న ముద్రతో శర్మ కిప్పుడు తెలిసింది, అనాడు ఇల్లు సర్దుకూ ఉన్న దెంగులో తన ఆహ్వానం సరోజని ఇల్లు చేరలేదు, ఆమె బహుమతి మాత్రం తన యిల్లుచేరింది. శేవీ అంటే సరోజని కెంతముద్దు! మరువకుండా ఉదయానికి బహుమతి పంపించింది

ఆ కవరు మూసిమూసి ప్రక్కన పడవేశాడో లేదో శేవీ ముత్తోకటి తెచ్చియిచ్చింది.

"ఇదెక్కడిది?"

"ఇదీ ఆ పోస్టుమానే తెచ్చియిచ్చాడు. నాకు కావున్నది ముందు ఇచ్చాను తరువాత ఒక్కటే—" అంటూ పెద్దగా నవ్వి నాకిటిలోనికి గంతులేసింది శేవీ, తన తోడిపిల్లలు ఆడుకో టానికి వస్తే.

అది సరోజని తల్లిదగ్గరనుంచి. సరోజనికి ఉద్యోగం రాక పోవటంవల్ల వారందరూ ఆర్థికంగా బీదస్థితిలో ఉన్నారని, సరోజ నికికూడా వెనుకటిలా ఆనందంగా జీవితం గడిపేందుకు వీల మంతగా లేదని, ఖర్చు ఎద్దడివల్ల అదివరకటి పెద్ద ఇల్లు వదలి మరొక చిన్న యింటిలోనికి మారిందని, ఆ మిదిద ఆశపెట్టుకొని వ్యయభారాని కోర్చి చదువు చెప్పించిన తనకు ఇంకా సంతోషం కలిగే గడియ రాలేదని, ఏదోవిధంగా ఒక ఉద్యోగం శర్మగారు ఆమెకు ఇప్పించ రాదా అని, తప్పక యిప్పించగలరని, అలా అని సరోజనికూడా అనేకసార్లు అన్నదని—ఇలాగే చాల దీర్ఘంగా వ్రాసింది యిల్లాలు.

సరోజని ఇబ్బందిపడుతున్నదన్న ఆలోచనలో శర్మ మునిగిపోయినాడు బహుశా అందుకే శేవీకా నీలిగౌను పంపి ఉంటుంది ఆఉత్తరం తిరిగి ఒకసారి చదివాడు బరువైన కన్నులతో. మెల్లగా మడిచి ఆ ఉత్తరం జేబులో పెట్టుకూఉండగా శేవీ తన స్నేహితులతోపాటు గంతులేస్తూ వచ్చింది లోనికి, "అన్నయ్యా సరోజని అక్కయ్య" అంటూ

శర్మ తటాలున వాకిలివైపు చూశాడు శేవీ అన్నది, "ఆ బస్సులో వెడుతోంది. పందెం వేసుకు, మేం పరుగెత్తుకున్నాము. బస్సులాగే స్తంభందాకా. అక్కడ బస్సు ఆగి ఉంది. లోపలికి చూస్తినిగదా సరోజని అక్కయ్య. ఇదిగో ఈ పూవు కూడా యిచ్చింది. దిగమన్నాను. కాని దిగలేదు. నుక్కుమూలిన బస్సు దిగ దాకా ఆగనే లేదు."

"నేను రమ్మన్నానని చెప్పలేకపోయినావా?"

"నీవు చెప్పలేదుగా నాతో."

శర్మ శేవీ అమాయకత్వానికి నవ్వుతూ విన్నాడు. శేవీ అన్నది, "నా గౌనువంక మాత్రం సంతోషంతో చూసింది అన్నయ్యా. బాగుందికదూ అన్నయ్యా, నాకు సరిగా సరిపో యింది"

*   *   *   *

సరోజని కైటను పరదాగా పోయి చాలా రోజులయింది. ఏవో అవసరమైన వస్తువులు కొనుక్కోవటానికి తప్ప మిగతా దిన మెల్లా యింటిలోనే గడుపుతోంది. మొదట్లో పేపర్లలో వచ్చే ప్రకటనలన్నీ శ్రద్ధతో పరిశీలించేది. కాని క్రమంగా ఆ కుతూహలం సన్నగిల్లింది ఉద్యోగము అనవసరమయి కాదు. తనలో ఏదో అర్థం కాని అసహ్యం కలిగింది ప్రకటనల వెంపనిగా పరిశీలించటమంటే.

ఆనర్సు పరీక్షకై సిలబస్‌కి సంబంధించిన పుస్తకాలు చదు వుతూ ఎన్నో మిగతి పుస్తకాలు చదివే వ్యవధి లేక అప్పుడప్పుడు విచారపడుతూఉండేది ఏ ఇబ్సెన్ను నాటకమో తీసేది ఉత్సాహ ముతో, కాని అవతల ఏ జోన్ రాబిన్‌సన్ పుస్తకమో నోరు తెరు చుకున్న దయ్యంలాగా గోచరమయ్యేది. ఏ హోమర్ పెట్ మాఘం కథనో తెరిచేసరికల్లా కొత్తగా కూడిపస్త ఏ మీడ్ యొక్క జామ్రితి బొమ్మలో మనోనేత్రంముందు ప్రదర్శనమయ్యేవి హోరడ్ వ్రాసిన కీన్సు జీవితచరిత్రం కూడ సగంకన్న యెక్కువ చదవలేదు ఎందు కంటే హోరడ్ వ్రాసిన వనేక మిగతి పుస్తకాలు తనకు పాఠ్య గ్రంథాలే నాయె, సరే కీన్సు రచనల మాట చెప్పనే అక్కరలేదు. కొన్ని పేపర్ల కవి కైతలే!

తనకు ప్రైజులుగా లభించిన సారస్వత గ్రంథాలన్నీ దులిపి టేబిల్ మీద వరుసగా పేర్చింది. ఉదయం కాఫీ త్రాగి అపుస్తకాలు తెరిచేది, మధ్యాహ్న భోజనందాకా చదివేది. భోజనంచేసి తిరిగి అవి చదివేది సాయంత్రందాకా. రాత్రి తిరిగి అదే ధోరణి. ఈ పఠ నములో ఆమెకు కొంత శాంతి తోచినట్లు కూడా అనిపించేది.

తన ఈ దినచర్యలో మధ్య మధ్య కలిగే అంతరాయ మొకటే ఉంది. ఏ వారానికొకమారో తన తల్లిదగ్గరనుంచి ఉత్తరం వస్తుంది. ఎనుక తల్లి వ్రాసే ఉత్తరంకోసం కాచి వేచియుండే పిచ్చిపిల్లకు ప్రస్తుతం ఆ లేఖలు కొంత ఖేదం కలిగిస్తున్నాయి

ఆ దినం రెండు కవర్లు వచ్చినాయి. రెండూ తల్లిదగ్గర నుంచియే ఒకటి బరువుగాఉంది. ఆశ్చర్యంతో ముందు అది తెరి చింది కన్నీరు దిగమ్రింగుకుంటూ ఆద్యంతమూ చదివింది; మధ్య మధ్య ఆకాశంవంక చూస్తూ.

"సరో, ఇక్కడ నా ఆర్థిక పరిస్థితి నీరసంగా ఉన్నదని పదే పదే చెప్పి నిన్ను బాధించవలసినదానను కాను. చదువుకున్న పిల్లవు. నా హృదయం అర్థం చేసుకోగల తల్లివి.. ...

నేను వ్రాస్తూఉన్న ఉత్తరాలు నా కు చేతనయినంత ప్రియంగా, కష్టం కల్గించనట్లుగా వ్రాయ ప్రయత్నిస్తున్నాను. ఈసంగతి నీవు గ్రహించియే ఉంటావు ..

సరో, నీకొ ఉద్యోగం రావలసిందే. శర్మగారు తప్పక ఇప్పించి ఉంటారని నీకన్న నే ఎక్కువగా విశ్వసించాను. ఇప్పు

టికి నాకా విశ్వాసం సన్నగిల్లలేదు. నీవూ అలాగే అభిప్రాయ పడుతున్నా వనుకుంటాను.

నేనిప్పుడే శర్మగారికి ఉత్తరం వ్రాశాను. తిరుగు టపాలో జవాబిచ్చారు. ఆ సమాధానం చూచి ఒక విధంగా ఆశ్చర్యం కల్గింది. నీవు వెంటనే అది పురస్కరించికొని ఉత్తరం వ్రాయలే దంటే ఈ లేఖ ఎలా వ్రాయాలా అని ఆలోచించడంతో సరి పోయిందనుకో.

సరో, నీవు ఉద్యోగం రాలేదని విచారిస్తున్నావు ఇది సహజమే కాని శర్మగారికి ఎన్నాళ్ళుగానో నీవు కనపడనేలేదుట. ఏదేని కారణాలవల్ల వయి ఉంటుందనుకున్నాను

కాని సరో, నీవు ఇల్లు మార్చిన సంగతి ఇన్ని మైళ్ళ దూరంలో ఉన్న నాకు వ్రాశావు కాని అక్కడే ఉన్న శర్మగారికి తెలుపలేదట.

దీనానికి నా కిదేమాత్రము అర్థముకాలేదు. నీవు ఇలా ప్రవర్తించడం ఎంతవరకు సమంజసమో నే నూహించలేను కాని, నీవు శర్మగారిని శత్రువుగా భావించడం నేను సమర్థించను.

సరో నీవు త్వరగా ఏదైనా ఉద్యోగం సంపాదిస్తే నీకు నాకు మంచిది. ఈ విషయమై ఎక్కువగా నొక్కి చెప్పవలసిన అవసరం లేదుగదా

శర్మగారు పరపతిగల మనిషి, ఆయన సహాయంతో ఏదైనా ఉద్యోగం తప్పక దొరుకుతుంది. నామాటవిని, సరో, నీకు క్షణంలో (తాత్కాలికంగా) నచ్చకపోయినా, శర్మగారి దగ్గరకు పోయి వారిని కలసి ఏదైనా ఉద్యోగానికై ప్రయత్నించు నేను మరల వారికి వ్రాయ నక్కరలేదనుకుంటాను, బాగుండదు అన్ని సార్లు ఆయనను వేధించటం

ఇది నీ కిష్టం కాకపోయినా—నా కోసమనుకో—"

ఇలాగ గడచిందా ఉత్తరమంతా సరోజని కన్నీరు తుడుచుకుంటూ దిండుమీద వాలిగింది కొంతసేపటివరకు రెండవ ఉత్తరం ఉన్న మాటే మరచింది. తటాలున లేచి అది తెరిచింది.

"సరో, ఇంతకు మునుపే ఉత్తరం పోష్టుచేశాను. ఇప్పుడే "హిందూ"లో ఒక ప్రకటన చూశాను అది కత్తిరించి ఈ కవరులో పెట్టి పంపుతున్నాను. ఒకవిధంగా ఆశ్చర్యంగా ఉంది అదే ఉద్యోగం. తిరిగి అప్లికేషనులు పంపుమన్నారు. ఈమారైనా నీవు శర్మగారిద్వారా తప్పక ప్రయత్నించు. ఈసారి నీకు వచ్చి తీరుతుందని నా అంతరాత్మ నాకు చెప్పుతున్నది"

వ్రాసింది తల్లికాకపోతే ఆ అంతరాత్మ బోధనకు అంతగా విలువ యిచ్చేదికాదు ఆ సందర్భంలో. సరోజని ప్రకటన చూచింది. అవును అదే ఉద్యోగం, తాను ప్రయత్నించి విఫలమయినదే, లలిత అలంకరించిన స్థానమే అది. కాక అట్టిగే మరొక పదవిరాదా.

తిరిగి, శర్మగారి సహాయం తీసికోమని తల్లిబోధిస్తున్నది. తన మనసులో ఉన్న కారణాలు కొంతవరకు తల్లి ఉత్తరములోనే ఇది బుచ్చిందికాని, అసలు తన మనస్సును పట్టిన ముల్లువేరల సంగతి తల్లికేం తెలుసు.

ఇన్నాళ్ళు శర్మగారింటికి తను పోలేదు. అతడు రానట్లుగా యిల్లు మార్చింది. అతడు వచ్చే పార్టీల జోలికైనా పోలేదు. బేబీ పిలిచిన పిలుపులు తనపైన వ్యర్థమయినాయి. శర్మమాత్రం పసికట్టి ఉండడా, ఏదో కారణంగా సరోజని తననుండి దూరంగా సంచరిస్తోందని! ఇప్పుడు తటాలున తానుపోయి తనకి ఉద్యోగం ఇప్పించుమని అర్థిస్తే, శర్మ ఏమనుకుంటాడు. శర్మ ఎంత ఉదార బుద్ధియైనా, తనది మానవహృదయమేగా, తనకే ఎంత సిగ్గుగా ఉంటుంది! ఏమో, తను పోగానే తటాలున "ఏం సరోజనీ, నీవా ఉద్యోగం ఆశమీద వచ్చావుగదూ" అంటే తల పగిలినంత వేదన, హృదయం చితికినంత వ్యథకల్గదా! ఉద్యోగం సంతుష్టికి దోహదమయితేనే కోరదగినదికాని, తీరని ఆరాటం కలిగించే ఉద్యోగం స్వర్గంలోనైనా నిరర్థకంగదా.

ఈ తలపులకు అంతులేదు. ఎన్నిమార్లు తనలో తాను వాదోపవాదాలు పెంచుకున్నా, తనకు కలిగే చిన్నతనం ఒక ప్రక్కన, తల్లి ఉత్తరాలలోని ఆవశ్యకత ఇంకొక ప్రక్కన తిరిగి తిరిగి గోచరమవుతున్నాయి ఇంతకు సుందరంగారు వెనుక ఏకారణంచేత ఉద్యోగ మీయలేదో ఆ కారణ మిప్పుడు తొలిగిందా?

ఏమో అసలీ ప్రశ్నకు తన కెన్నడు తీరుతెన్నుగల సమాధానం తోచదు. ఆ ప్రశ్న తనకు తీరని సంతాపం కలిగించింది. గాని ఆ ప్రశ్నను వేసికొనే మనస్థైర్య మామెలో లేదు.

ఏమాలోచని కన్నీటి తెరలలో తల్లి ఉత్తరాలు మడిచి వేసింది తుదిని ఆమె హృదయానికి గుచ్చుకున్న వాక్యమొక్కటే. "ఇది నీ కిష్టంకాకపోయినా, నాకోసమనుకో"

వేగంగా లేచి దుస్తులను మార్చి బయలుదేరింది శర్మయింటికైపు—కాని త్రోవపొడుగునా తనను చులకనగా చూస్తాడేమోనన్న భ్రమ మాత్రం ఆమెను వీడనేలేదు. అలా జరిగితే, వెంటనే "అంత స్వార్థంగా నాఅంతట నేను రాలేదు, మా తల్లిగారు పదలేక వచ్చాను" అని పాఠం ఒప్పచెప్పి తిరిగి రావలెనని తనలో తాను వల్లెవేసుకొన్నది.

*  *  *  *

శర్మ తన పడకకుర్చీలో విశ్రమించి ఒక ఉత్తరం దీక్షగా చూస్తున్నాడు. బేబీ తనను పలుకరిస్తూ అల్లరిచేస్తూ గంతులు వేస్తూ ఉన్నది. శర్మచేతిలో ఉన్న ఉత్తరము మధ్యమధ్య లాగుతూ అతనిని విసివిస్తోంది శర్మ లేచి, నవ్వుతూ బేబీని ఎత్తుకున్నట్లు ఎత్తుకుని ఎత్తైనకిటికీలో కూర్చోపెట్టాడు. పాపం బేబీ తనంత తాను దిగలేదు దూకితే పడతానని భయము. నవ్వుతూ పలుకుతూ అలాగే కూర్చుని ఉన్నది.

శర్మ ఉత్తరంచూస్తూ మధ్యమధ్య ఆలోచనగా చూస్తూ ఉన్నాడు. ఇంతలో వీధితలుపు తట్టినచప్పుడు అయింది. బేబీ తటాలున "సరోజనిఅక్కయ్య సరోజనిఅక్కయ్య" అంటూ అరుస్తూ చప్పట్లుకొడుతూ, వీధిలోకిచూస్తూ శర్మవంక చూస్తూ గంతులు వేస్తోంది.

శర్మ ఉలిక్కిపడ్డట్లులేస్తూ, "ఎవరుసరో? ఎవరుసరో!" అన్నాడు.

తలుపుబైటనుండి సరోజని అన్నది "ఆఁ నేనే సరోజనిని."

శర్మ తలుపు తెరచాడు. తలవంచుకుని సరోజని ప్రవేశించింది వస్తూనే కిటికీపైపుకుపోయి ఆత్రంగా చేతులెత్తి నిలుచున్న బేబీని దింపుతూ ముద్దుపెట్టుకొన్నది.

శర్మ అడిగారు, "ఎలాఉన్నావుసరో, కులాసాయేనా?"

సరోజని బేబీవంకచూస్తూ రానినవ్వును తెప్పించుకో ప్రయత్నిస్తోంది.

వెంటనే శర్మ అన్నాడు, ఆఁ.. అన్నట్లు సరో. నీకా ఉద్యోగంకావాలనేఉన్నదా? కావాలంటే తిరిగి ప్రయత్నించవచ్చు, ఏంసరో—"

సరోజని కన్నులవెంటకారే నీటిపరదలలో బేబీతల తడిసిపోయింది, శర్మ అది కనిపెట్టకుండా, కాళ్లను చుట్టకున్న బేబీని త్రోసుకుంటూ ప్రక్కగదిలోకి పోయింది బేబీ తనను విదిలించుకొని, "ఉండు అక్కయ్యా నా కొత్తగౌను వేసుకువస్తాను" అని లోపలకు పరుగెత్తింది.

ఏ ప్రశ్నకు తాను భయడిందో ఆప్రశ్న శర్మ వేశాడు ఏవిషయం శర్మ ప్రప్రథమంగాఎత్తితే తాను భరించలేక పరుపెత్తుకు పోదలచుకొన్నదో అదేప్రశ్న శర్మవేశాడు. స్వార్థచింతలో తాను తిరిగి శర్మయొద్దకు చేరిందన్నస్ఫురణ యేప్రశ్నలో అవగత మవుతుందో అదేప్రశ్న శర్మ ప్రశ్నించాడు

తిపతిల్లిప్రొద్దులంమీద తిను వచ్చింది తనకు ఉద్యోగంవస్తే తిపతిల్లికి తనకు మంచిదే. కాని ఉద్యోగమే ప్రపంచములో సర్వము కాలేదు. ఉద్యోగంవల్ల ధనం లభిస్తుంది. ధనంవల్ల జీవనములో సౌలభ్యం ఏర్పడుతుంది. కాని అది భౌతికసౌలభ్యమే, అంతకుమించినది మానసికానందం, అది తనకే ఉద్యోగంవల్ల కల్గలేదు. తాను ఉద్యోగంచేసిన ప్రతిక్షణము శర్మ తనను స్వార్థిగా తలపోస్తున్నాడన్న మనోవేదన తనను బాధిస్తూయుంటుంది. తనను ప్రేమించిన శర్మగారే యిలా భావిస్తే తనకిక మానసికానందమెలా లభిస్తుంది?

సరోజని వంచినతల ఎత్తకుండా ప్రక్కగదిలోనుండి మెల్లగా బయటకు జారింది శర్మ ఇది గమనించనేలేదు. బేబీ లోనుండి తన నీలిగౌనుతో పరుపెత్తుకువచ్చి "ఏదీ సరోజని అక్కయ్య" అనేవరకు

"ఏది సరోజని" అంటూ శర్మ ప్రక్క గదిలోకి వెళ్ళాడు. అప్పటికి వదడుగులదూరంలో రోడ్డుమీద కన్పడింది సరోజని. బేబి పరుగెత్తుకుపోయి రమ్మనట్లు సరోజని చేయి లాగింది. సరోజని తల త్రిప్పకుండా బేబి చేయి విదిలించుకుంది.

బేబీ కన్నులు నీళ్ళలో తేలే పూవులలాగ అయినాయి. దిక్కుమొగంలో శర్మ దగ్గఱకు వచ్చింది శర్మ ఒక్క నిట్టూర్పు విట్టూర్చి, గబగబా తన కుర్చీప్రక్కనున్న కవరొకటి తీసి బేబీకిచ్చి, "ఇదిగో ఇది సరోజని కిచ్చిరా, పరుగెత్తుకుపోయి. ఊఁ. పరుగెత్తు." అన్నాడు

బేబీ ఒక్క క్షణములో కవరు ఇచ్చి వచ్చింది. శర్మ పోయి తన కుర్చీలో పడుకున్నాడు బేబీమాత్రము బైటకు చూస్తూ నిల్చున్నది, ఎంతసేపటికి లోనికి రాకుండా శర్మ పిలిచాడు, "బేబీ, ఇదిగో బొమ్మలు" అంటూ.

"ఉండు అన్నయ్యా, ఇక్కడే బలే బాగుంది. సరోజని అక్కయ్య నిలబడి ఉత్తరం చదువుకుంటోంది అన్నయ్యా.. ... మధ్య మధ్యనే సరోజని అక్కయ్య మొగం తుడుచుకుంటోంది. అన్నయ్యా అన్నయ్యా. మరే—" అంటూ బేబీ ఆకేపనిగా వర్ణిస్తోంది.

సరోజని విజంగా వెనుదిరిగి చూస్తూ ఉత్తరం చదువుతూ కన్నులు తుడుచుకుంటూ ఏదో నూతనానుభూతిలో తేలిపోతోంది. ఆ కవరు తనకోసం, తనపేరిట ఉంది, కాని శర్మగారి కేర్ ఆఫ్ చిరునామాతో వచ్చింది.

అది వ్రాసింది లలిత ఆ సంతకం చూడగానే సరోజని ఒళ్లు ఒక్కసారి జల్లుమన్నది లలిత కనబడి ఎన్నాళ్ళయింది! లలిత తన చినటటి స్నేహితురాలు! లలిత తనకు రావలసిన ఉద్యోగం పొందించిన పిల్ల!

చివరికిలా ఉన్నది "నా స్థానానికి నాకు తెలిసినది నా ఉద్యోగం పోయిన దెందుకు మాత్రమే. నా కసలు అది ఎలా వచ్చిందో ఇంతవఱకు తెలియదు, నీకు రాని కారణము కూడ నేను చూచాయగా విన్నదేసుమా నేను చేసిన నేరం నీ కిది చెప్పటం. క్షమించు, ఏదో క్షణికమైన శిబలత్వమో నాచేత చెప్పించింది"

సరోజని గబగబా పరుగెత్తుకు వచ్చింది శర్మ యింటిలోనికి. బైధ గడపలో నిల్చుని సంతోషంతో అరుస్తున్న బేబీని ప్రక్కకు తోసుకుంటూ సరాసరి శర్మగారి కుర్చీ కెదురుగా నిలబడ్డది.

శర్మ తలయెత్తి చూడలేదు, ఇంత రివ్వున వచ్చినది తనమీద వాగ్వర్షం కురిపించిపోవటానికేమోనని.

సరోజని శీతాకాలపు సముద్రపు గాలిలాగా మాటలు దొరలించింది, "ఈ ఉత్తరం వచ్చి ఎన్నాళ్ళయింది?"

"పది రోజులయింది." శర్మ తలయెత్తకే సమాధాన మిచ్చాడు.

"పది రోజులే! మరి ఎందుకు చూడలేదు, తెరిచి?"

"అది నీపేరన వచ్చింది"

"తెలుసును. కాని ఎందుకు తెరవలేదు అని అడుగుతున్నాను"

"అది నాది కాదు, నీపేర వచ్చిందని చెప్పాను."

"ఏం తెరచిచూస్తే ప్రపంచం తల్లక్రిందులయ్యేదా?"

"అవును. ఈమధ్య తల్లక్రిందు లయినట్లే తోచింది."

"సరోజని ఉత్తరములో శర్మ గడ్డము పైకెత్తుతూ అన్నది" అందులో మీ సరో సముద్రములో మునిగిఉంటుందనుకున్నారా?"

ఇది వెనుకటి సరోజని. తాను ప్రేమించిన సరో. తనను వాత్సల్యవృత్తంగా మార్చగల సరో ఇది. శర్మ తలయెత్తాడు. సరోజని ముఖంలో కుపామకు బదులు పౌర్ణమినాటి నిండు చంద్రబింబము తలపించింది.

శర్మ మాటాడేముందే సరోజని వానిచేతిలోని కాగితం లాక్కుంటూ "ఇదీ కొడో ఉత్తరంలాగానే యున్నదే" అంది.

"అవును. అది నాది."

"ఫరవాలేదు" అంటూ సరోజని ఆ లేఖ పూర్తిగా చదువుకుంది.

శర్మ చిరునవ్వుతో మెల్లగా అన్నాడు "సుందరం ఇవాళాడు—"

"అవును సంతకముబట్టి తెలుస్తోంది, ఫోర్జరీ అయితే తప్ప"

"ఎన్నాళ్ళయింది అతను వచ్చి, నాకు జాబైనా వ్రాసి. కాని అతని మంచితనంలో స్నేహభావంలో నాకు విశ్వాసం ఉంది. చూడు, ఈసారి నిన్ను ఉద్యోగానికి దరఖాస్తు పెట్టమన్నాడు"

సరోజని ఉత్తరం మడత చదివి, "అవును ఇందులోని విషయం చాలా చక్కగా పొరాఫ్రేజ్ చేశారు" అంది.

కొన్ని సెలులేని కాంతిరేఖలు, ఆశాకిరణాలు, ఆమె ముఖములో ఆ క్షణాన వికసించినాయి. కనులనుండి రాలే వేడి నీటి బింగువును తుడుచుకోవటం కూడ విస్మరించిన సరోజని తటాలున త్రుళ్ళిపడింది వాకిటిలో కారు చప్పుడు విని.

సరోజని, శర్మ, వీధి తలుపువైపు వెళ్ళారు. సుందరం వచ్చాడు

శర్మ చేయి ఊపుతూ సుందరం అన్నాడు, "ఆహా మా సరోజని కూడ ఇక్కడనే ఉన్నదే!" "ఇప్పుడే వచ్చింది. అదృష్టవశాత్తూ నీవు ఈవేళకే వచ్చావు సుందరం. నీ ఉత్తరం అందింది."

"అదిగో అందినట్లు తెలుస్తూనే ఉంది" అంటూ సుందరం సరోజనివైపు చూశాడు. ఆమె పెదవి కొరుక్కొని ఆ ఉత్తరం ప్రక్కనున్న టేబిల్ మీద పెట్టింది

సుందరం మొదలుపెట్టాడు. "ఏం శర్మా, నీకు నా ప్రవర్తన వింతగొల్పి ఉంటుంది. సరోజనికి ఉద్యోగం ఎందుకీయలేదో యిన్నాళ్లుగా చెప్పని కారణం చెప్పమంటావా?"

"నీయిష్టం. నా అంతట నేనే ఎందుకు అడగాలి?"

సరోజనివంక చూస్తూ సుందరం అన్నాడు, "బహుశా ఆమెకు వినాలని కుతూహలంగా ఉండి ఉంటుంది."

సరోజని ఓరకనులతో వెంటనే పలికింది, "శర్మగారికి చెప్పతలచుకోనిది నాకుమాత్రం దేనికండీ?"

సుందరం నవ్వుతూ, "విను శర్మా. ఆమెకు ఉద్యోగంరాని కారణం నీవు"

నిర్ఘాంతపోయినట్లు, శర్మ తలయెత్తాడు. తటాలున సరోజని వంక చూశాడు. సరోజని ముఖం క్షణము మబ్బుల వెనుక చంద్రునిలా చంద్రుడు లేని పద్మంలా అయిపోయింది.

అర్థంకాని తెల్లదనంతో సుందరం కనుకోణాలు సరోజని వంక తిరిగినాయి. "శర్మా, నీవు శంకరాన్ని ఎరుగున్నావు కాదూ?"

"ఆఁ.. ఆవేళ మన పార్టీకి వచ్చాడు."

"ఆఁ. అతనే. ఏమనుకుంటావు అతనిని గురించి?"

శర్మ ఏమి జవాబు చెప్పలేదు. సరోజని ముఖంమాత్రం వాడిన పూవులాగ వ్రేలవేసింది.

"నీవేమనుకున్నా ఫరవాలేదు శర్మా. సరోజనికి మాత్రం సుందరం అంటే అసహనం."

సరోజని రోషంతో నిట్టూర్చి రెక్కలు లాగిన పక్షిలాగ తీవ్రత అరిచింది, "నాకు అవసరంలేని వ్యక్తులనుగురించి నాకు ఉండే లేని అభిప్రాయాలతో మీ కెందుకండీ?"

"సరోజనీ, గాలి వీస్తోందో లేదో పూలతీవను అడగనక్కర లేదు, చూస్తేచాలు. నేనా పార్టీలోనే కనుపెట్టాను నీకు అతనికి పడదని."

సరోజనికి కోపం మైకం కమ్మినట్లయింది, "ఇంతకు నాకు అతనికి పడకపోవటం ప్రసక్తియెందుకు? నీవతని స్నేహం కోరినా ఏమైనానా?"

సుందరం మొదలుపెట్టాడు, "శంకరం మా ఆఫీసులో కార్మిక శాఖకు అధిపతి. నీ ఉద్యోగం వాని శాఖలోనిది. అతనితో సామరస్యం లేనివారు క్షణంకూడ అవని చేయలేని పరిస్థితి అది. ఏం, అర్థమవుతోందా సరోజనీ?"

సరోజని ముఖంలో కొంచెము తెలిచాయలు తొలకరింప దొడగినాయి. సుందరం తిరిగి పల్కసాగాడు, "చివర కేమయిందో చూశారా? ఆ లలితకూడా తగినదే దొరికింది. శంకరం ప్రవర్తనబట్టి అప్పుడే అతనిని తొలగించవలెనని అనుకున్నామగాని, వ్యవహారరీత్యా తగినంత గట్టికారణం చూపించటం కష్టమనిపించింది సరే క్రమంగా లలిత శంకరం నిప్పుకు గాలిలా విజృంభించారు. వారి ప్రవర్తన వ్యక్తిగతంగా అవమానకరం కావటమే కాకుండా, మా వ్యాపార సంస్థకుకూడా కళంకకారణం కాజొచ్చింది. ఇప్పుడు నాకు కేవలం వ్యవహార రీత్యా తగిన కారణం దొరికింది వానిని తొలగించటానికి, వానితోపాటు లలితను."

మారుమాటలేక బొమ్మవలె నిల్చున్న శర్మ సరోజనులను చూస్తూ సుందరం అన్నాడు, "శర్మా, నీకు సరోజనిమీద ఎంత వాత్సల్యమో నాకు తెలుసును ఆమెకు శ్రేయస్కరం కాని పరిస్థితులలో ఆమెను ఇరికించటం నీకు కష్టం కల్గించేదికాని తృప్తి నీయలేకపోయేది. నీకు తృప్తిని కలిగించనిపని నేనుచేసి యేమి లాభం? ఈమె నీ సరోజని కాక మరొక సరోజని అయిఉంటే ఆనాడే ఉద్యోగం ఇచ్చిఉండేవాడిని ఫస్టుక్లాసు ఆనర్సుగదా!"

సరోజని శర్మవంక ఒకసారి నిండుగా చూసి ఎన్నడు తాను పొందనంత చిన్నతనంతో తల వంచుకుంది.

సుందరం పూర్తి చేశాడు, "శర్మా యిన్నాళ్లు నీకు చెప్పవలెనని ఉబలాట పడేవాడిని గాని, తొందరపడి యితర వ్యక్తుల ప్రవర్తనలను గురించి ముచ్చటించటమెందుకన్న ఆత్మబలంతో నిశ్శబ్దం వహించి ఉన్నాను. నీవు కూడ ఆ ప్రసక్తి లేకుండా నాకు కొంత శాంతిని కలిగించావు."

సరోజనివంక చూస్తూ అడిగాడు, "ఏం సరోజనీ నీకు ఉద్యోగం రానిది నా మూలంగా కాదు. అసలు కారణం శర్మ"

* * * *

ఒకరి మనస్సు మరొకరికి స్ఫుటంగా సంపూర్ణంగా అవగతమయితే వ్యక్తుల జీవితాలలో ఎంత సామరస్యం కాంతి చేకూరుతుంది. కాని మానవజాతి కింత అదృష్టం అరుదు. మానవుని మనస్సు ఏ క్షణంలో ఎలా ప్రవర్తిస్తుందో ఊహించటం కష్టం; అంతేకాక మనస్థితి వ్యక్తీకరణకు అంతరాయం కలిగించే ముఖ్యహేతువు పరిస్థితుల ప్రత్యేకత. ఇవి అడకత్తెరలా అమరుతూ ఉంటాయి.

మానవుని శారీరక ప్రవర్తనను సూత్రీకరించటం మన స్తత్వ ప్రవర్తనను సూత్రీకరించటంకన్న ఎన్నోవిధాల సులభం. నిజానికి, అది నిర్దుష్టంగా విస్పష్టంగా చిత్రించగల్గిననాడు మానవ జీవితంలో శోభ తరుగుతుందేమో! తెలియనిదానికోసం వెతికే తపనలో ఉన్న ఆనందం ఒలిచిన అరటిపండులో లేదు. మనం ప్రేమించిన వ్యక్తి మనస్సు మన కొక పాలసముద్రం వంటిది. అది కదలికలేని కాసారంగా కాక, ఝల్లున ఎగిసే తరంగాలుగా ఉంటే మనకు కలిగే ఆనందం సంతుష్టి అనంతం.

# శైవము - ఆంధ్రదేశము

శ్రీ కురుగంటి సీతారామయ్య

"ఒకానొక కాలమందు భారతదేశమున పశ్చిమమున బెలూచి స్థానమునుండి, తూర్పున గంగాతీరమువరకు భాషలో, భావములలో, ఆచార వ్యవహారములలో, మతములలో, ద్రావిడప్రాధాన్యము విశాలమై యుండెడిది" అని భారతీయ సంస్కృతి చరిత్రకారులు వ్రాయుచున్నారు.

ఇట్లు ప్రభావము వేయుటలో శైవ వైష్ణవమతములు ముఖ్యములు. అందును శైవము బహుజనానుసృతము.

సింధులోయ త్రవ్వకములందును, అందు కనబడిన వస్తువుల పరీక్షయందును, దానినుండి సమన్వయించిన సంస్కృతియందును పరిశ్రమచేసిన సర్ జాన్‌మార్షల్, శైవము, శివపూజ, శివచిహ్నములు మొదలైనవి ఆర్యనాగరకతకు పూర్వమే యున్నట్లు స్పష్టీకరించినాడు. హరప్పవద్దకూడ ఇట్టి చిహ్నములే దొరకినవి. దొరకిన వస్తువులనుబట్టి శివుడు బహుముఖుడనియు, యోగాసన సక్తుడనియు, పశుపతియనియు, త్రిశూలధారియనియు పూజింపబడు చున్నట్లు కనపడును. హీరాస్ పండితుడుకూడ మొహంజొదారో సంస్కృతి ద్రావిడమని నిరూపించినాడు ఇందులో శైవము, లింగపూజ, పరస్పరసంబంధము కలిగినవియనియు, ఆర్య నాగరకతకంటె కొన్నివేల సంవత్సరముల పూర్వములనియు తేలుచున్నది శివశబ్దము ఎఱ్ఱనిరంగుగల అను ద్రావిడప్రకృతినుంచి వచ్చినట్లు భాషావేత్తలు తెల్పుచున్నారు. లింగ, లకుడ, లాంగూల మొదలగుశబ్దములు సంస్కృతిభాషవి కావని భాషాపండితుల అభిప్రాయము

తర్వాతివర్వాచీనకాలమున శివునకును, రుద్రునికి సంబంధము కలిగినది వైదికమతమున శివునకు రుద్రునిగా తప్ప ప్రవేశము లేదు వేదమున శివశబ్దము "మంగళకరమగు" అనునర్థమునసే వాడబడినట్లు కనపడును. "శివాయ శివతరాయ" అను రుద్రానువాకమునందలి శబ్దములు తిరప్రత్యయముచె విశేషణములు కాని నామవాచకములు కావని చెప్పవచ్చును. అంతకంటె నర్వాచీన శ్వేతాశ్వతరోపనిషత్తుకాలమువరకు శివశబ్దము మూర్తిపరముగా నర్థము కనపడదు. రుద్రుడు ఋగ్వేదమున సౌమ్యదేవతయేకాని అథర్వవేదమునాటికి వాయువకు సౌమ్యభయంకరత్వములు రెండు నాపాదింపబడినవి. శతరుద్రీయము శివుని తస్కరాధిపతియనియు నితర యాటవిక జాతుల కధిపతియనియు పేర్కొనుచున్నది. తరువాత క్రమముగా శివుడు క్షేత్రముగా నాటవిక దేవతయైపోయినాడు. అథర్వవేదమున శౌనకుతో యజ్ఞమునకు పూర్వము "వ్రాత్యుల" దేవతయైన శివుని యనుజ్ఞయవసరమని తెలుపబడినది. ఈ కాలముఆర్యాదివాసి సమ్మేళనకాలమని చెప్పదగును. ఆదివాసుల దైవమైనశివుడు వైదికదైవముగా మారిపోయినాడు.

## శైవశాఖలు

ఇక శైవశాఖలనుగూర్చి కొంచము ముచ్చటింతును. బసవుని వీరశైవమునకు పూర్వము శైవమున నీక్రిందిశాఖలున్నట్లు కనపడును

1 (అ) శుద్ధశైవము

(ఆ) కాశ్మీర శైవము

2 ద్రావిడశైవసిద్ధాంతము.

3 మిశ్రశైవము

4 సామాన్యశైవము

5. వీరశైవము

శ్లో॥ "శైవం చతుర్విధం ప్రోక్తం
సమాసాచ్ఛృణుషణ్ముఖ!
సామాన్యం మిశ్రకం చైవ
శుద్ధం వీరం యథాక్రమమ్" (వాతూలాగమము.)

శుద్ధశైవము:—

ఆర్యులకు పూర్వమునుండి వచ్చుచు, తర్వాత నార్యులవల్ల ననుసరింపబడి, ఆగమములచేతను, పురాణములచేతను దృఢీకరింపబడిన శైవము శుద్ధశైవము. దీనిలో నీ క్రింది తెగలుకలవు. (1)పాశుపతులు (2) కాపాలికులు (3) కాలాముఖులు (4) గోరక్షనాథులు (5) రాసేశ్వరులు. పదకొండవ శతాబ్దమునాటికి పాశుపత మత్తరమున రాజస్థానమునుండి దక్షిణమున మైసూరువరకు వ్యాపించి తూర్పున నాంధ్రదేశమునకూడ ప్రవేశించినట్లు కనపడును. కాలాముఖులు గుంటూరు ప్రాంతమున నున్నట్లు దృష్టాంతములు కలవు. ఇతర తెగలు ఉత్తరదేశమున తప్ప దక్షిణమున కనపడవు. ఈ తెగలన్నియు "ఆగమో"క్తములయిన యన్నియాచారములను కలిగియుండెను. లింగధారణము మాత్రము నిర్బంధముగా లేకుండెను.

కాశ్మీరశైవము:—

ఇది దక్షిణమున నంతగా వ్యాపించినట్లులేదు. ఆగమములయందగిరిధమైన ప్రశంసకలదు. శివుడు శైవము వ్యాపింపజేయుమని దుర్వాసుని యాజ్ఞాపించెను ఆయన తన ముగ్గురు కొమాళ్లగు త్ర్యంబక, ఆమర్దక, శ్రీనాథులకు తన్మతము నుపదేశించెను. మొదటి యిద్దరికుమారుల కిచ్చినది కాశ్మీరశైవమయ్యెను. మూడవకుమారునిచే

దక్షిణదేశ శైవసిద్ధాంతము ప్రచారమయ్యెను. ఈ కథ పరిశీలింప వలసి యున్నది.

శైవసిద్ధాంతము:—

"అది దేశీయము, యొచ్చటనుండి వచ్చినదికాదు" అని తదను యాయుల యభిప్రాయము. మొదట నాగమములు ద్రావిడములోనే యుండెననియు, నొకానొక కాలమున ప్రళయములో నవి నశించె ననియు, నందు పోగా మిగిలినవి సంస్కృతములోని కనువదింపబడె ననియు, కొంతమంది యందురు. ఏది యెట్లున్నను పూర్వతమిళ వాఙ్మయమున శైవమతమునకు గొప్పస్థానము కలదు. రాధాకృష్ణ పండితుడు, సుబ్రహ్మణ్యపిళ్లె, డా. పోపు మొదలైన పండితు లందరును ద్రావిడ శైవసిద్ధాంతము దేశీయమనియు, స్వతంత్ర మనియు, మిగిలిన దేశమువందలి శైవమతముకంటె ప్రాచీనమని నొక్కి చెప్పుచున్నారు. బౌద్ధ జైన మతములను ఖండించి వాని వ్యాప్తి కాటంకము కల్గించినవానిలో దాక్షిణాత్య శైవము ముఖ్య మైనదని తెల్పుచున్నారు."

మిశ్రశైవము.—

హిందువులలో నత్యధిక సంఖ్యాకు లీతెగవారు. ఈ తెగ వా రన్ని దైవములను పూజింతురు కాని శివునియం దభిమాన మెక్కువ. విభూతి ధరింతురు శివుని నెక్కువగా పూజింతురు వీరి కితర మతద్వేషము లేదు. వీరు పంచాయతనపూజ చేయు దురు. కాని శివలింగమును మాత్రము ముఖ్యమందురు. వారి పూజా ప్రణాళిక యిది.

శం—శంకరుడు
నా—నారాయణుడు
ర—రవి
గ—గణపతి
దే—దేవి

నా ర
శం
దే గ

సామాన్యశైవము:—

వీరు శివుని పరమదైవముగా నొప్పుకొందురు కాని, యాగ మములలో చెప్పిన సమస్తాచారముల ననుసరించరు ఇతరశైవులు ధరించినట్లు లింగమును ధరించరు. దానిని చూచినప్పుడు మాత్రము పూజింతురు.

వీరశైవము:—

ఇది బసవేశ్వరునితో నారంభమైనదని కొందరందురు కాని వాతూలాగమము వీరాగమము మొదలైన యాగమములలో వీర శైవము పేర్కొనబడినది. ఆగమములు బసవునికి పూర్వపు వని నిశ్చయము. ఈ తెగవారు శరీరమున అయిదుస్థానములలో నేదో యొకచోట తప్పక లింగమును ధరింతురు ఆ లింగమును తీసి చేత నుంచుకొని పూజింతురు. లింగమునకు నైవేద్యమిడని వస్తువును భుజింపరు. వారి యాచార వ్యవహారములు మిక్కిలి కట్టుదిట్టము కలవి. వీరిలో దీక్ష యను నొక సంస్కారము కలదు. ఇది మిక్కిలి ముఖ్యము దీక్షితులైనపిమ్మట వీరి యాగముల ప్రకారము వర్ణాశ్రమ ధర్మముల పాటింపరాదు. తాంత్రికులందువలె వీరికి కొన్ని రహస్యాచారములు కలవు. దీక్షితులైనగాని పాల్గొనరాదు.

## శైవసాహిత్యము

శైవ మాగమములపై నెక్కువగా నాధారపడియున్నది. ఈ యాగమముల సంఖ్య 28. దాదాపు ఆగమములన్నియు సంస్కృత భాషలో నున్నవి. వీరశైవము వచ్చువంతవరకు శైవులు వేదము లను కూడ ప్రమాణముగా గ్రహించుచుండిరి కాని యాగమముల యెడ నభిమాన మధికము ఈ సిద్ధాంతముపై వ్రాసిన రచయితలు, వేదాగమముల రెంటికి నొకేవిధమైన ప్రాముఖ్య మిచ్చినారు. తిరు మూలార్ అను నొక ప్రవక్త వేదములు సామాన్య ప్రమాణములనియు నాగమములు శైవమునకు ప్రత్యేక ప్రమాణములని తెలిపి రెండును నపౌరుషేయములేనని నొక్కి చెప్పినారు.

రానురాను అరువదిమంది నాయనారులును అనగా చాతుర్వర్ణ్యమును శైవము నాచరించుచుండిరి. వీరిలో బ్రాహ్మణులకు వేదములయం దెక్కువ ప్రామాణ్యబుద్ధి యుండెను ఇతరు లాగమముల నెక్కువ ప్రమాణ ముగా గ్రహించిరి శైవమాగమములపై నెక్కువ యాధారపడి యుండుటచే, బ్రాహ్మణేతరులలో శైవు లధికసంఖ్యాకులుగా నుండిరి. ఇందులకు మరియొక కారణము కలదు. శైవప్రవక్తలగు 63 గురు నాయనార్లు బ్రాహ్మణేతరులే! దక్షిణదేశమున బ్రాహ్మణే తర సన్యాసులు మఠాధిపతులుగా ననేకులు కలరు. వేదములకంటె నాగమములు సులభగ్రాహ్యములగుటచేతను, నాయనార్లు స్వభా షలో శైవగ్రంథములు వ్రాయుటచేతను నాయనారులు బ్రాహ్మణే తరులగుటచేతను బ్రాహ్మణేతరులలోనే శైవ మధికముగా వ్యాపించి ప్రబలెను. విద్యావంతులైన బ్రాహ్మణు లుభయప్రమాణముల నొప్పుకొనిరి. ఈ కారణముచే సామాన్యప్రజలలో వేదముల యందుకంటె నాగమములయం దెక్కువ ప్రామాణ్యము కలిగెను

ఆంధ్రకర్ణాట దేశములలోని పరిస్థితులు కొంచెము భిన్న ములు. శైవములో దేశభాషా గ్రంథములు లేకపోయెను కావున బ్రాహ్మణులనే యనుసరింపవలసివచ్చెను వారు సులభులు కాక పోవుటచే వారిపై ద్వేషము ప్రబలి యుండెను, వర్ణాశ్రమ ధర్మ నిరస నము, వేదప్రామాణ్యము నొప్పుకొనకపోవుట, అను రెండును ప్రబ లెను. ఆగమ ప్రామాణ్యము మాత్రము తగ్గలేదు. శైవులైన బ్రాహ్మణ పండితులు కొందఱు శైవమును వేదముపై నాధారపడజేయవలెనని యత్నించిరి. వేదమూలములైనగాని యే మతములకు పునాదులు గట్టిగా నుండవు అందుచేత నుపనిషత్తుల, బ్రహ్మ సూత్రముల మొదలైన వేదాంత గ్రంథములను శైవ పరములుగా వ్యాఖ్యానింప మొదలిడిరి. ఇట్టి వారిలో శ్రీకంఠ శివాచార్యులు, శ్రీపతి పండితులు, మల్లికార్జున పండితా రాధ్యులు ముఖ్యులనవచ్చును. ఇంతియే గాక శివపారమ్యములు తెలుపు సూత సంహితాది పురాణగ్రంథములును నీ మత ప్రచార మునకును దోహద మొనర్చెను. ఇచ్చట లింగధారణము నిత్యమా, యైచ్ఛికమా, యను ప్రశ్నను పరిశీలించిన నది యైచ్ఛికమని, మాహేశ్వరులు కొందరు లింగధారణము చేయలేదనియు కనపడును. కొందరది మిక్కిలి ముఖ్యమని యందురు. మొహంజొదారో సంస్కృతిలో కూడా చిన్నవి, పెద్దవి, లింగము లనేకములు దొరి కినవి. దీనివలన నాకాలమునకూడ లింగధారణ ముండవచ్చును;

యభిప్రాయపడుచున్నారు. ఆగమములు పఠించిన వీరశైవులకు మాత్ర మది యవశ్యాచార్యమనియు నితరుల కైచ్ఛికమని కనబడుచున్నది.

## బసవనికి పూర్వ మాంధ్రశైవము

ఆంధ్రులు కర్ణాటకులు దక్షిణాపథవాసులు. వారు హంసాయిూశై ప్రక్కప్రక్కలనున్న దేశపువారగుటచే దగ్గరి బంధువుల వలె నుండిరి. అనేక శతాబ్దములు దక్షిణాపథమంతయు నేక పరిపాలనక్రింద నుండెను. వారి భాషలు, వారి యక్షర సమామ్నాయములు దాదాపు సమానములే! శైవవ్యాప్తిలో కూడ యీ సామ్యము చాలాకాలము వర్తిల్లెను. శ్రీశైల మనబడు శ్రీపర్వత ముభయప్రజలకు క్షేత్రముగా నుండెను. వైష్ణవము దక్షిణాపథమందు శైవము తరువాతనే వ్యాపించింది. దక్షిణదేశమునందువలె వైష్ణవము దక్షిణాపథమున వ్యాపింపలేదు. ఈ కాలములో కూడ దక్షిణాపథమున వైష్ణవులకంటె శైవులే యధిక సంఖ్యాకు లనవచ్చును. శైవముతో పాటు బౌద్ధ జైనములు కూడ దక్షిణాపథమున వర్ధిల్లుచుండెను. అప్పటికి శైవము తదనంతరపు వీరశైవమువలె గాక వర్ణాశ్రమ ధర్మము పాటించుచుండెను. అందుచేత కొంతవరకు బౌద్ధజైనములు వ్యాపించిన నవచ్చును. బౌద్ధజైనములకు కూడ శ్రీపర్వత మే యాటపట్టుగ నుండెను. చీనా యాత్రికుడు యువాన్‌చాంగు శ్రీపర్వతమని పేర్కొనెను. ఇటీవల శ్రీపర్వత మనగా నాగార్జునకొండ యని కొందరు పరిశోధకులు తెలుపుచున్నారు.

క్రీ॥శ॥ ఆరవ శతాబ్దమున శంకరాచార్య స్థాపితమైన యద్వైత మతము వ్యాపింప మొదలిడెను. దానివలన బౌద్ధజైనములకు కొంత దెబ్బ తగిలినది. బసవేశ్వరు డవతరించిన నాటికి దక్షిణాపథము యొక్క స్థితి యిట్లుండెను. బసవేశ్వరునితోపాటు శైవమును కాపాడుటకు కర్ణాటాంధ్ర దేశములలో కొందరు సుప్రసిద్ధ పండితులు శ్రమ చేసిరి. కర్ణాటక దేశమున శ్రమపడిన వారిలో బసవేశ్వరుడు గాక, ఏకాంత రామయ్య, పద్మరస అనువారలు ముఖ్యులు. ఆంధ్రదేశమున పాటుపడినవారిలో శ్రీపతి పండితులు, శివలెంక మంచెన, మల్లికార్జున పండితు లనువారు ముఖ్యులు. వీరిని పండిత త్రయ మందురు. వీరిలో మొదటి యిద్దరి వంశములు నేటివరకవిచ్ఛిన్నముగా సాగుచున్నవి. శ్రీ॥ శ్రీ॥ విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులువారు శ్రీపతి పండితుల వంశీయులు. ప్రస్తుతాంధ్ర పత్రికాధిపతులైన శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు మంచెన పండిత వంశీయులు.

ఆకాలమునాటికి పై నుల్లేఖించిన శైవములలో కొన్ని తెగ లాంధ్ర దేశములో ప్రచారమున నుండెను. దక్షిణదేశమునుండి యిచ్చట మహాప్రమాణములని తలపబడు నాగమములును, నాయనార్ల చరిత్రములును, దక్షిణాపథమునందలి శైవులలో ప్రచారములో నుండెను. వెనుక నే పాశుపత కాలాముఖమార్గములు దక్షిణాపథములో కొంత వ్యాప్తిలో నుండెను. కాని యాకాలమునాటికి వర్ణాశ్రమ ధర్మములయొక్క ప్రాబల్యము తగ్గలేదు. అప్పటి శైవులు వేదప్రామాణ్యము నుల్లంఘించలేదు. పైన చెప్పిన శైవ పండితులలో నొకరు "ఓ బసవలింగేశ్వరా! నేను వర్ణాశ్రమ ధర్మముల నుల్లంఘించలేను" అని యాక్రోశించెనట!

పశ్చిమ చాళుక్యులు జైనమతస్థులు. వారు జైనమత వ్యాప్తికి మిక్కిలి తోడ్పడిరి. చరిత్ర చూచిన ప్రతి మతమును రాజాదరణము వలనే వృద్ధి పొందినట్లు కనపడును. మతవ్యాప్తికి ప్రచారము, పీడ, రాజాదరణ మనునవి మార్గములుగా నుండెను. క్రీ॥ శ॥ 1155 వ సంవత్సరమున దక్షిణాపథమున నొక గొప్ప సన్నివేశము జరిగెను.

చాళుక్య చక్రవర్తుల సామంతుడైన బిజ్జలుడు రాజ్య మాక్రమించి స్వతంత్రు డయ్యెను. ఉత్తరమున కాకతీయులనుండియు, దక్షిణమున హొయసలులనుండియు చాళుక్యులు కాపాడుకొన వలసివచ్చెను. బిజ్జలునికి సమయము దొరికెను. మొదట బిజ్జలుడు జైనమతానుయాయియై తరువాత బసవనివలన శైవుడైనట్లు చరిత్ర తెలుపుచున్నది. బసవేశ్వరు డొక మహాపురుషుడు. తా నొక మతప్రవక్త కావలెనని భగవత్సంకల్ప మతనిలో జనించెను. ఆయన బిజ్జలుని మంత్రి యయ్యెను. బిజ్జలునికి దీక్ష యిచ్చి వీరశైవము వ్యాప్తిచేయ మొదలిడెను. ఈయన ప్రచారము చేసిన వీరశైవమున వర్ణాశ్రమములు లేవు. అందువలన ప్రజలకు కొంత సౌలభ్యము కనపడెను. రాజ్య బలముండుటచేత తన్మతవ్యాప్తికి కావలసినంత సాధనసామగ్రి యంతయు చేకూరెను. బసవేశ్వరుని శైవము పూర్తిగా నాగమములపై నాధారపడియున్నది. అందలి దీక్షావిధానము, నాచార వ్యవహారములు తుచ తప్పకుండ ననుసరించుటయే నాటి వీరశైవముయొక్క విధానములు. తన్మతవ్యాప్తికిని, పోషణమునకును, బసవేశ్వరుడు కొంత హింసకుకూడ పాల్పడినట్లు తెలియును. ఈ వీరశైవ వ్యాప్తియెదుట బౌద్ధజైనములు నిలువలేక పోయెను. ఒక శతాబ్దముపాటు ప్రచార మవిచ్ఛిన్నముగా జరిగెను.

## సంప్రదాయము—వాఙ్మయము

వీరశైవమున కాగమములే మాతృకలు. దాక్షిణాత్య సిద్ధాంత మతమునందువలె కాక చాలాకాలమువరకు నాంధ్రదేశములో దేశభాషాశైవగ్రంథములు లేవు. ఆగమములు పురాణములు మాత్రమే ప్రమాణములుగ నుండెను. తరువాత కొన్ని గ్రంథములు రచింపబడినను, నవికూడ సంస్కృతములో నుండిపోయినవి. ప్రజలలో మతవ్యాప్తి కావలెనన్న, యందరకు సులభముగా తెలియు భాషలో గ్రంథములున్న తప్ప వ్యాప్తి మిక్కుటముగాను, విశాలముగాను జరుగదు. వర్ణాశ్రమ ధర్మనిరసనము ప్రచారమునకు కొంత సహాయము చేసినను గ్రంథములు లేని లోటు తీరలేదు.

* శివునకు పంచముఖములుండెను. వీనిలో మధ్యముఖము ముఖ్యమైనది. అది మిగిలిన నాల్గింటికిని మూలభూతము. ఈ పంచ ముఖములనుండి యైదుగురాచార్యు లుద్భవించినట్లు శైవుల సంప్ర

* (పై విషయములను శ్రీ బండారు తమ్మయ్యగారి కృత పాల్కురికి సోమనాథ కవి చరిత్రమున చూడవచ్చును.) కలి యుగమున పైన పేర్కొనబడిన యైదుగురాచార్యులును నైదు మఠములు స్థాపించినట్లు శైవమతము తెలుపుచున్నది.

కాయము. ఈ యైదుగురాచార్యులు యే యే యుగముల పేరుపేరట నీ క్రింది పట్టికవల్ల తెలియగలదు.

| మూల పురుషుడు | కృత | త్రేతా | ద్వాపర | కలి |
|---|---|---|---|---|
| వీర | ఏకాక్షర | ఏకవక్త్ర | రేణుక | రేవణసిద్ధ |
| నంది | ద్వ్యక్షర | ద్వివక్త్ర | దారుక | మరుళసిద్ధ |
| భృంగి | త్ర్యక్షర | త్రివక్త్ర | గజకర్ణ | ఏకోరామ |
| వృష | చతురక్షర | చతుర్వక్త్ర | ఘంటాకర్ణ | పండితారాధ్య |
| స్కంద | పంచాక్షర | పంచవక్త్ర | విశ్వకర్ణ | విశ్వారాధ్య |

1 రేవణసిద్ధ—కొలనుపాక (హైదరాబాదురాష్ట్రం)
2 మరుళసిద్ధ—ఉజ్జని (మైసూరురాష్ట్రం)
3 ఏకోరామ—హిమవత్కేదారము (ఉత్తరదేశము)
4 పండితారాధ్య—శ్రీశైలము (ఆంధ్రదేశము)
5 విశ్వారాధ్య—వారాణశి (ఉత్తరప్రదేశము)

రేణుకాచార్యుల కాలముననే కొలనుపాకలో స్థాపింపబడిన మఠము మైసూరురాష్ట్రములో బాళెహొన్నూరను స్థలమునకు మార్పబడినట్లు గ్రంథములు తెలుపుచున్నవి బహుశః జైనముప్పటినుంచి పెడలిపోవుట యిందులకు కారణమయియుండును శ్రీశైలమందలి మఠము గుంతకల్లులో భిక్షావృత్తిమఠమను పేరుతోనున్నది మిగిలిన మూడును వానిపూర్వస్థానములలోనే యున్నవి

ఇచ్చట రెండువిషయములను చర్చింపవలెను. (1) బసవేశ్వరునికి పూర్వము వీరశైవమున్నదా? (2) లింగధారణముకూడ బసవేశ్వరునికి పూర్వమున్నదా? పై ప్రశ్నలలో మొదటిదానికి సమాధానము వచ్చినయెడల రెండవది సమాధియమే యగును. వెనుక వాతూలాగమమున వీరశైవముయొక్క యుల్లేఖయున్నట్లు తెలుసుకొనినాము వీరశైవముయొక్క ముఖ్యలక్షణములలో లింగధారణ మొకటి, వీరాగమమున నిట్లున్నది

విశబ్దం వావికల్పార్థే
రశబ్దో రహితార్థకః
వికల్ప రహితం శైవం
వీరశైవం ప్రచక్షతే.

మరియు వాతూలాగమమున నీట్లున్నది.

"శివలింగం కరాద్యంగే వీరశైవస్తుధారయేత్"

వెనుక దీక్షయొక్క ముఖ్యాంగమని తెలిపియుంటిని దీక్షయొక్క విశిష్టతను క్రిందిశ్లోకము తెల్పుచున్నది.

వీరమాహేశ్వరగ్రాహ్యం
శివాద్వైత ప్రకాశకం
పరీక్షితేభ్యోదాతవ్యం
శిష్యేభ్యోనాన్యథాక్వచిత్.

ఈ విధముగా నాగమములలో వీరశైవ ప్రశంసకలదు. అగమములు బసవేశ్వరునికి పూర్వమెన్నో శతాబ్దములనుండి యనువృత్తములగుచున్నవి. దీక్షయనునది మిక్కిలి ముఖ్యసంస్కారమై దానికి క్రిందివి ముఖ్యాంగములై యున్నవి. (1) విభూతి. (2) రుద్రాక్ష (3) పాదోదకము (4) లింగార్చనము (5) లింగధారణము (6) ప్రసాదస్వీకరణము. ఇవిగాక సమస్తేతర దైవవిసర్జనము, యితర సంప్రదాయాఽసహనముకూడ ముఖ్యసూత్రములు. కర్ణాటకదేశములో నెట్లున్నను, నాంధ్రదేశమున నీతిసూత్రవ్యాప్తికై ప్రజల నెక్కుడగా బాధించినట్లు కనపడదు. కాని జైనమతమునకు కొంత బాధ కలిగినట్లు పుదూరు, జోగిపేట, కొలనుపాక, అలంపురము మొదలగు కొన్ని స్థలములలో దృష్టాంతములు కలవు. ఇతరదేశములలో మతాఽసహనము పేరిట జరిగిన క్రూరకార్యములతో బోల్చిన నిదియొక లెక్కకాదు బహుశః కర్తా క్రమ ధర్మనిరసనమును వెల్లడించిన వీరశైవమతము కర్ణాటకదేశములో వ్యాపించినంతగా నాంధ్రదేశములో వ్యాపించకపోవుట కిది యొక కారణమైయుండును అప్పటి కాంధ్రదేశములో వ్యాప్తమై యున్న సామాన్యశైవము కూడ నిందులకు మరియొక కారణమై యుండును

ఇక లింగధారణమును మాత్రము—వెనుక మొహెంజొదారో సంస్కృతిలో చిన్నవియు, పెద్దవియు, లింగములుండెనని తెలుసుకొన్నాము వీనిలో కొన్ని చిన్నవి ధరింపదగినవై యుండవచ్చునని మార్షల్ చెప్పుచున్నారు ఇంతటితో బసవేశ్వరునికి పూర్వము వీరశైవముండెననియు, లింగధారణముకూడ నుండియుండెననియు తెలపవచ్చును దీక్షలో లింగధారణము ముఖ్యమని యీ క్రింది వాతూలాగమ వాక్యము వలన తెలియును "మూర్ధ్నికంఠే భుజే హస్తే వ్యాప్త్సనేనాభిమంపతే" సిద్ధాంత శిఖామణియను గ్రంథమున లింగధారణముమీద నొక ప్రత్యేక పరిచ్ఛేదమేకలదు బ్రాహ్మణుల నుండి ఆరాధ్యులనబడు శివద్విజులు లింగమును యజ్ఞోపవీతముతో పాటు ధరించుచుండిరి

ఇక వీరశైవ సాహిత్యమునకు వత్తుము అగమములతో పాటు క్రింది గ్రంథములు బసవేశ్వరుని పూర్వమువరకు ప్రమాణగ్రంథములలో కొన్నియని చెప్పవచ్చును

(1) శ్రీకంఠ శివాచార్యకృత శ్రీకంఠభాష్యము శ్రీ॥ శ॥ 980
(2) శివయోగి శివాచార్యకృత సిద్ధాంతశిఖామణి
శ్రీ॥ శ॥ 8 వ శతాబ్దము.
(3) శ్రీపతి పండితకృత శ్రీకరభాష్యము శ్రీ॥ శ॥ 12 వ శతాబ్దము.
(4) ఈశాన శివగురుకృత రేణుకవిజయచంపు శ్రీ॥ శ॥ 10 వ శతాబ్దము
(5) సిద్ధనాథకృత రేణుకవిజయము శ్రీ॥ శ॥ 960
(6) నీలకంఠాచార్యకృత క్రియాసారము . . . . .
(7) కేశదిబసవకృత శివతత్త్వరత్నాకరము.
శ్రీ॥ శ॥ 17 వ శతాబ్దాంతము
(8) ఈశాన శివాచార్యకృత ఈశాన శివగురుపద్ధతి.

పై వానిలో (4), (8) ఏకకర్తృకములు. శ్రీకంఠభాష్యము శంకర భాష్యముకంటె పురాతనమని కొందరి యభిప్రాయము శివాద్వైత నిర్ణయమను గ్రంథమునమున్న పీఠికలో శ్రీకంఠుని గురుపరంపర యీ క్రిందివిధమున నున్నవి.




ఈ విషయములో నింకను పరిశోధన జరుగవలసి యున్నది. శైవసిద్ధులలో గోళకీమఠ పరంపరయని యొకటికలదు. ఈ పరంపరలో నొక గురువైన సోమశంభువను నాయన తనపేర నొక పద్ధతిని రచించెను. ఈ మఠాను యాయులు దేశమంతటను వ్యాపించిరి. వీరిలో నొకరు కాలమరి రాజగురువని మల్కాపుర శాసనమందుకలదు. ఈసంప్రదాయముయొక్క యొకశాఖ దక్షిణదేశమునకు వచ్చి కేరళముదాక వ్యాపించి, యచ్చటచ్చట కొన్ని మఠములు స్థాపించినట్లు దృష్టాంతము లున్నవి. దక్షిణదేశమునకు వచ్చిన యీ మతగురువులలో యీశాన శివాచార్యులను నొకరాయన, రాజరాజ చోళచక్రవర్తికి గురువుగానుండెనట! పనుకనుల్లేఖించిన (4), (8) సంఖ్యగల గ్రంథములకర్త యీయనయే. ఈ మతము యొక్క యొకశాఖ తెనుగుదేశమున ప్రవేశించి దానికి చెందిన విశ్వేశ్వర శివాచార్యులను నాయన కాకతీయ గణపతి రుద్రదేవచక్రవర్తికి గురువైనట్లు మల్కాపుర శాసనమందలి యీ క్రింది శ్లోకపాదములు తెలుపుచున్నవి.

"విద్యామంటపవర్తినం గణపతిక్ష్మాపాలదీక్షాగురుమ్
శ్రీ విశ్వేశ్వరశంభు మీ క్షితవతాం తేచక్షుషీచక్షుషీ"

ఈయన మందడము (గుంటూరుజిల్లా) మొదలైన యనేక స్థలములలో మఠములు స్థాపించినట్లుకూడ కలదు. ఈ సంప్రదాయము చాలకాలమువరకు నాంధ్రదేశమునందుండెనని యీశాన గురుదేవపద్ధతియను గ్రంథపద్ధతిలో మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఈ సంప్రదాయమునకే చెందిన యఘోరశివాచార్యులను నొక గురువర్యునకు తెలుగుదేశమున ననేక శిష్యబృందముండెను. దాదాపు మున్నూరు సంవత్సరములు వీరి వ్యాప్తి తెనుగుదేశములో నుండెనని చెప్పవచ్చును. ఈ సంప్రదాయ వ్యాపనమువల్ల నాంధ్రదేశమున కొక యుపకారము జరిగెను. వైదిక ధర్మవిరుద్ధము కాని వీరశైవము ప్రచారమయ్యెను. ఆ కారణమున నితర ప్రాంతములలో జరిగిన మతోన్మాద కార్యము లిచ్చట జరుగలేదు. వీరశైవము వేద విరుద్ధమతము కాదని యనేకథా ధృవపడినది. వైదికమత మంగీకరించిన యొక్కటే యొక యాచారమును వీరు తిరస్కరించిరి. అది శివవహనక్రియ. ఇతర వీరశైవ సంప్రదాయములవలె వీరుచచ్చినవారిని భూస్థాపితము చేయుచుండిరి.

ఈకాలమునకు దగ్గరనే యాంధ్రదేశమున నొక గొప్ప సంఘటన జరిగెను. చాళుక్య చక్రవర్తియైన రాజరాజనరేంద్రుడు వైదికమత స్థైర్యమును గ్రహించి తన యాస్థాన కవీశ్వరుడైన నన్నయభట్టారకుని సకలజన గ్రాహ్యముగా పంచమ వేదమైన మహాభారతమును తెనుగులోనికి పరివర్తన చేయుమని కోరెను. అప్పటికి తెనుగు సర్వజనుల కందుబాటులోనున్న భాషగా నుండెను. వీర ద్రవిడము వైదికేతర మతము లాంధ్రదేశములో వ్యాపించుట కష్టపడెను. ఆంధ్రులలో నే జాతికి లేని యొక విశిష్టాచారము కలదు. దాదాపు ప్రతి యాంధ్రబాలుని యక్షరాభ్యాసము "ఓంనమశ్శివాయ" యని ప్రారంభించుదురు. దీనివలన శైవమతము వారిలో నెంత వ్యాప్తమైనదో, యందును వైదికశైవ మెంత యాదరణములో నున్నదో తెలియగలదు. ఇచ్చట నొక విశేషము చెప్పవలెను. టాలమీ యను పాశ్చాత్యయాత్రికుడు భారతదేశమంతయు సంచరించి, తన యాత్రా విశేషములలో 'త్రిగ్లిప్టాన్' లేక 'త్రిలింగాన్' అనెడి యొక దేశమో, పట్టణమో యున్నట్లు తెలిపినాడు. దీనివలన నాతడు సంచరించిన కాలమునకు త్రిలింగ మను దేశమో పట్టణమో యున్నట్లు గట్టిపడుచున్నది. త్రిలింగశబ్దములో లింగశబ్ద మంతిముఖ్యమై యున్నది. కాకతీయ సామ్రాజ్యమునకు పూర్వమే త్రిలింగముండెగా, తత్సామ్రాజ్యమునకు మూడు లింగములు సరిహద్దులుగా నుండెను గావున దానికి త్రిలింగ సామ్రాజ్యమని పేరు వచ్చెననియు త్రిలింగ పదముపుట్టెననియు చెప్పవచ్చుట చారిత్రిక వైపరీత్యమగును. ఈ విషయమును శ్రీ కె. వి. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు "లక్ష్మణరాయ వ్యాసావళి" యను గ్రంథమున సోపపత్తికముగా నిరూపించియున్నారు. మరియు క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దమున రచింపబడిన సిద్ధాంత శిఖామణి యను గ్రంథమున ని త్రిలింగశబ్దము కలదు. ఎనిమిదవ శతాబ్దము నాటికి కాకతీయ సామ్రాజ్యమే లేదని నిశ్చయమేకదా. కొందఱు విమర్శకులు "తెలుగు", "తెనుగు" శబ్దములను "త్రిలింగ", త్రినగ" శబ్దములనుండి పుట్టెనని యొక వింతవాదమును లేవదీసినారు. తెనుగు శబ్దము నన్నయభట్టారకునే "తెనుంగున మహాభారత సంహిత రచనబంధురుడయ్యె" నని వాడినాడు. తెలుగుశబ్దముకూడ పైన చెప్పబడినట్లు 'త్రిలింగాన్' శబ్దములోనుండి వచ్చెననుట సమంజసము. ఇంతియేగాక యాంధ్రజాతి యుత్తర భారతదేశమునుండి వింధ్య దక్షిణప్రాంతమునకు వచ్చు త్రోవలో 'తేల్' అను నది దాటవలసివచ్చినది. 'ఉ' శబ్దము 'గం' ధాతువునుండి వచ్చినది. 'తేల్' నదిని దాటివచ్చుటచే వారికి 'తెలుగు'లని పేరు వచ్చినట్లు కొందరనుచున్నారు. ఎది యెట్లైనను 'తెలుగు' 'తెనుగు' శబ్దములు రెండును కాకతీయ సామ్రాజ్యమునకంటె ప్రాచీనములే యనుట నిశ్చయము.

## శైవగ్రంథకర్తలు

ఇనుక 6 గురు పండితుల పేర్ల నిచ్చియున్నాను. వారిలో ముగ్గురు కర్ణాటకులును ముగ్గురు నాంధ్రులును, మొదటివాడు బసవేశ్వరుడు. మిగిలిన యైదుగురును బసవేశ్వరునికి దాదాపు సమకాలికులే యని తోచును. బసవేశ్వరుడు తన గ్రంథములను దేశభాషయైన కన్నడములో రచించుటయు నంగును గేయరూపమున రచించుటయు గమనించదగిన విషయము. ప్రజలలో వ్యాప్తికై దేశభాషయు గేయకవిత్వమును మిక్కిలి యుపకారకములు. ఆయన గేయములకు "వచనముల"ని పేరు, అనగా సంభాషణరూపమున నుండును. ఇప్పటికిని కర్ణాటకదేశములో నవి మిక్కిలి ప్రజా

శయులో నున్నవి. కొన్ని తెనుగుభాషలోనికి కూడ పరివర్తనము లైనవి. బసవేశ్వరునకు సంస్కృతభాష వచ్చునో లేదో మన మెరుగము. ఆయన గేయము లాయనయే పాడుచు, ప్రచారముచేయుచు, ప్రజలను తన మతములో చేర్చుకొనుచున్నట్లు చరిత్రవల్ల తెలియును.

కర్ణాటకులలో రెండవవాడైన 'ఏకాంత రామయ్య' కుంతల దేశవాసి. చిన్నప్పటినుండి శివభక్తుడు. ఆయన స్వగ్రామములో సోమనాథ దేవాలయ మొకటి యుండెను అందుచేత సోమనాథ నామముగల దేవాలయములన్నిటి నాయన దర్శించెను ధార్వాడ జిల్లాలోని లక్ష్మేశ్వరగ్రామమున నున్న సోమనాథాలయములో పూజచేయుచుండగా 'అబ్లూరు' అను స్థలమున నివసింపుమని శివాజ్ఞయైనట్లు ప్రేరణకల్గెను. అచ్చట జైనపండితుల ననేకుల నాయన వాగ్వాదమున గెలిచెను శివునిపైన నేకాంతమైన భక్తి కలవాడు కావున నాయన 'ఏకాంత రామయ్య' యని పేరు వచ్చెను.

'పద్మరస' అను నాయన శివయోగి మల్లిఖార్జునని మనుమడు. ఆయన ధనికకుటుంబములో జన్మించెను. ఒక సామంతునివద్ద మంత్రిగా కూడనుండెను ఆయన బేలూరను గ్రామమున నివసించి, యొకానొక కాలమున ద్వారసముద్రమున రాజ్యమేలుచున్న బల్లాళరాజాహ్వానింపగా నొక వైష్ణవపండితుని వాదమున నోడించి శైవమిచ్చెనట. తర్వాత శైవమత ప్రచారము చేసుకొనుచు కాశీ యాత్ర వెడలి యచ్చటనే నిర్యాణముండెను పానందచరితము, దీక్షా బోధిని యను గ్రంథము లీయన రచించెను వానికి తెనుగు పరివర్తనములుకూడ కలవు

ఇక నాంధ్రపండిత త్రయము శ్రీపతి పండితుడు విజయవాడ నివాసియైన యాంధ్రబ్రాహ్మణుడు. చాళుక్యుడైన యారవ విక్రమాదిత్యుని సేనానాయకుడగు ననంతపాలుని కీయన మతగురువని చెప్పుదురు ఈయన వంశము కృష్ణాజిల్లాలోని గుడివాడ తాలూకా యొలకుర్రు గ్రామమున నిప్పటికిని యున్నది. ఈయన బ్రహ్మసూత్ర భాష్యము వ్రాసినట్లు వనుక తెలిపియున్నాను కాలమును బట్టి చూడగా బసవేశ్వరుని కన్న నీయన కొన్ని సంవత్సరములు పూర్వుడని తోచును. శైవమునకు వేదము నాధారముచేసి దానికి వేదాంత మతగౌరవము నిచ్చినందున నీయన మిక్కిలి ప్రశంస నీయును.

మంచనయు నాంధ్రబ్రాహ్మణుడే! 'పద్మరస'వలె నీయనయు ననేక జైనపండితులను వాదములో నోడించెను ఈయన కాశీయాత్రకుపోయి యచ్చటకూడ శైవమత ప్రచారమును చేసెను బసవేశ్వరుని దర్శనము కళ్యాణి పట్టణమునకుపోయి చేసి, యాయన మన్ననల బడసెను. ఈయన మతప్రచారమును గూర్చి కన్నడమున ననేక గ్రంథములు కలవు. ఈయన వంశముకూడ యిప్పటికిని యున్నది. మల్లిఖార్జున పండితుడు మూడవవాడు. గోదావరీ తీరమందలి ద్రాక్షారాము మీయన స్థానము. ఈయనను గూర్చియే పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రమును రచించెను. ఈయన యనేక గ్రంథములు రచించెనందురుగాని 'శివతత్వ సారము', 'శ్రీ ముఖదర్శన గద్యము'వను రెండుమాత్రమే మనకు లభ్యములైనవి. బసవేశ్వరుని దర్శించుటకు కల్యాణీ నగరమునకు పోవుచుండగా నాయన నిర్యాణము పొందినట్లు విని, వెనుకకుమరలి వచ్చెను. పై యార్గురి గ్రంథములును శైవమతవ్యాప్తికి మిక్కిలి తోడ్పడెననుట నిక్కువము

## ఆంధ్రదేశములోని శైవమఠములు

ఇదివరకే రైదుమఠము లున్నవనియు, కొంతకాలమునకు మొదటిదైన 'కొలనుపాక మఠము' మైసూరులోని 'బాళెహొన్నూరు'కు మార్చబడినట్లును, చెప్పియుంటిని ఈ స్థలమునకు కదిలిపురమనియు, రంభాపురమనియు కూడ నామాంతరములుకలవు. రేణుకాచార్యులవారు కొలనుపాకలో జన్మించెను. ఇది నల్లగొండ జిల్లాలో నున్నది ఇప్పటికిని యిచ్చట వీరశైవులున్నారు. జైన శిథిలములుకూడ కలవు. ఈ విషయము స్వాయంభువాగమములో నీ యీ క్రింది శ్లోకము తెల్పుచున్నది.

తథారేవణ సిద్ధస్య కుల్యపాక పురోత్తమే
సోమలింగాత్తు జననం అవాసః కదళీపురే॥

ఒక సన్నివేశము కలదు ఆంధ్రదేశమున సోమనాథ దేవాలయము లనేకములు కలవు ఈ పేరుకల శైవులును నితరులును కూడ కలరు. రేణుకాచార్యులవారు, పాల్కురికి సోమనాథుడు మొదలైన యనేక సుప్రసిద్ధశైవులు సోమనాథ దేవప్రసాదమున పుట్టినట్లు తెలియుచున్నది ఘూర్జరదేశమునందలి సోమనాథ క్షేత్రమే యితర సోమనాథ క్షేత్రముల నామములకు ప్రేరకమై యుండును. శ్రీశైలము కర్నూలు జిల్లాలో నున్నట్లును నచ్చటికి శైవేతర యాత్రికు లనేకులు నేటేట కూడుచున్నట్లును వెనుక తెల్పియున్నాను ఆంధ్రదేశములో శైవమతవ్యాప్తికి మహామాహేశ్వరుడైన రేణుకాచార్యు లిచ్చట పుట్టుట యొక కారణమై యుండును కావున యాంధ్రదేశములో కొలనుపాక, శ్రీశైలము లను రెండు సుప్రసిద్ధ మఠము లుండుట, యనేక సోమనాథ దేవాలయము లుండుట శైవమును ప్రచారమునుచేసిన మహా పండితు లుండుట చూడ నానాటి కాలమందు శైవమత మాంధ్రదేశమున మిక్కిలి వ్యాప్తమైనట్లు నిదర్శించుచున్నది రేణుక విజయమను గ్రంథమున నొక నుల్లేఖించిన విచిత్ర సన్నివేశము తెలుపబడియున్నది. సూత్రభాష్య రచనానంతరము శంకరాచార్యులవారు రేణుకుని సందర్శించి తనకు దీక్షయిమ్మని కోరెనట! అంత రేణుకుడు తగిన శిష్యుడు దొరకినందులకు సంతసించి దీక్షయిచ్చుటతోపాటు చంద్రమౌళీశ్వర లింగము నొకదాని పూజింపుమని యొసంగెనట. ఈ విషయము 'రేణుకవిజయము' 'గురువంశకావ్యము', 'వేదాంతసారవీర శైవ చింతామణి' 'శివతత్వరత్నాకరము' వను ప్రాచీనగ్రంథముల తెల్పబడినవి. ఒక్క గ్రంథములో నుండి యనువాదము నిత్తును.

తతస్సరేవణాసిద్ధః సంప్రదాయప్రవర్తినాం
శంకరాచార్యవర్యాణాం పారంపర్యక్రమాగతమ్.
రేవణా సిద్ధ సంప్రాప్తం చంద్రమౌళీశమప్యదాత్.
(శివతత్వసారము-కెళది బసవకృతము) పుట 108

ఈ గ్రంథమునకు రావుబహాదూర్ హెచ్. కృష్ణశాస్త్రి గారు పీఠికను వ్రాయుచు పైన తెల్పిన "చంద్రమౌళీశ్వరలింగ మిప్పటికిని శృంగేరి మఠములో పూజలోనున్నట్లును, క్రమముగా నది విద్యారణ్యులవారి యధీనములోనికి వచ్చినట్లును" తెల్పినారు. "ఇచ్చిత్రమేమనగా వీరశైవులైన కెళదిరాజులు శృంగేరి మఠమునెడల మిక్కిలి భక్తియుక్తులై యున్నారు. అందులకు వారు రేవణసిద్ధ సంప్రదాయానుయాయులని యూహింపవలును" అనికూడ వారు వ్రాసినారు

కొలనుపాకమఠము మార్చబడిన 'బాళెహొన్నూరు' గ్రామమును, 'శృంగేరియును' పదిహేను మైళ్ళ దూరములోనున్నవి రేణుకమఠమున నిప్పటికిని శంకరాచార్యులవారి ప్రతిమకలదు ఈ విషయ మింకను పరిశీలింపవలసినదై యున్నది. ఆచార్యరచయిత స్తోత్రములన్నియు సూత్రభాష్యరచనానంతరకాలము వగుట, యీ యూహకు బలకరము. ఆంధ్రదేశములో శంకరుని యద్వైతమతానుయాయులు మిక్కిలి యధికసంఖ్యాకులు వారందరికిని శివపక్షపాత ముండుట నిశ్చయము. కావున వీరశైవులద్వైతులతో వివదింపలేదు ఈ వివాదరాహిత్యము, మతోన్మాద రాహిత్య మాంధ్రవీరశైవమునకు గొప్పగుణములు

కర్ణాటకమున వీరశైవులు లింగాయతులనియు తెలుగు దేశమున జంగములని పిలువబడుచున్నారు. బ్రాహ్మణులలోకూడ వీరశైవులున్నట్లు వెనుక తెలుపబడినది జంగములు లింగమును సామాన్యముగ దండకు కట్టుకొందురు. కొందరు మణిబంధమునకును, మరి కొందరు కంఠమునకుకూడ ధరించుట కలదు సామాన్యముగ నీలింగముల నెవరికి కనబడక సువర్ణాదిలోహములతో చేయబడిన పేటికలలో నుంచుటకద్దు 'జంగం' శబ్దము జంగమశబ్దమునుండి వచ్చినది. ఇట్టి వారందరును సంచారలింగములని యాగమములు తెలుపుచున్నవి ఆంధ్రదేశములో నీజాతివారు వర్తకము, చేనేత వ్యవసాయము, బట్టలకుట్టుట మొదలైన వృత్తు లవలంబించుచున్నారు కొందరు శివాలయములం దర్చకులుగా కూడ కలరు విశ్వబ్రాహ్మణులు కూడ వీరశైవులలో నొక తెగయే! వారు సామాన్యముగ కంసాలి, వడ్రంగి వృత్తుల నవలంబించుచున్నారు. జంగమ గృహములకు శిష్యవర్గము కలదు. వారు వారి పూజల నందుచున్నారు. ఈవిధముగా వీరశైవులు గ్రామార్థికములో భాగస్థులై, వివిధ వృత్తుల నవలంబించుచున్నారు. ఇది యాంధ్రగ్రామజీవనములో భాగమై పోయినది. అందువలననే గ్రామములు కలహములు లేకుండ నున్నవి.

## పాల్కురికి సోమనాథుడు

బసవేశ్వరుని తరువాత వీరశైవ మాంధ్రదేశమునంగూడ కంటె నాయన ప్రదేశమగు కర్ణాటక దేశమున నెక్కువ వ్యాప్తమయ్యెను ఈ మతము తెనుగుదేశములో వ్యాప్తమగుటకు బసవేశ్వరుని తరువాత కొన్ని సంవత్సరములకు పుట్టిన సోమనాథుడు ముఖ్య కారణుడు. కావున నీయననుగూర్చి కొలదిగా తెలుపుట యప్రస్తుతము కాదు. ఈయన ఖరనామ సంవత్సరము పుట్టెననుటకంటె క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వార్ధమున జరిగె ననవచ్చును. ఆయన జన్మస్థానముకూడ వివాదగ్రస్తమే! కాని యది హైదరాబాదు రాష్ట్రమందలి పాలకురికి యని బహుళ సంఖ్యాకులు విశ్వసించుచున్నారు. ఇందులకు కొన్ని దృష్టాంతములు కలవు ఆ గ్రామమున సోమనాథాలయము కలదు. సోమనాథునిదియని యొక శిలాప్రతిమ చూపుదురు. దానిపై "సో—న" యను నక్షరములు మధ్యాక్షరము లేకుండా కనపడుచున్నవి వీరశైవ కుటుంబము లిప్పటికిని కలవు. రేణుకాచార్యులను సోమనాథునకును, నొకే రాష్ట్రమున పుట్టుట యపూర్వ సంఘటనము ఈయననుగూర్చి యెక్కువగా ప్రశంసించినను గాని యొక బ్రాహ్మణకుటుంబంలో జన్మించెననియు, ఉపనయనము కాలక శైవదీక్ష గ్రహించెననియు తపఃప్రభావమువల్ల నాయనకు కవితాశక్తి కలిగినట్లును మాత్రము చెప్పవలెను. బసవపురాణము, పండితారాధ్యచరిత్ర యనునవి యాయన ముఖ్యగ్రంథములు వీటిని గూర్చి వెనుక మనవిచేసియున్నాను రెండు గ్రంథములును జాను తెనుగుభాషలో ద్విపదవృత్తములో వ్రాయబడినందుచే, వీటికి ప్రజలలో ప్రచార మెక్కువయై తద్వ్యక్తమునకు దోహదమయ్యెను. బసవపురాణము తమిళ కర్ణాట భాషలలోనికి అనువదింపబడినది. ఈ గ్రంథములలో తమిళ సిద్ధాంతమునకు మూలపురుషులగు కొందరు నాయనారుల చరిత్రము లున్నవి ఈయన చుట్టును బహుళ వాఙ్మయము ప్రబలెను ఈయన సంస్కృత కావ్యములను కూడ వ్రాసెను వీనిలో నతని కవితా సామర్థ్యమును, వాదపటిమయు చూడనగును బసవోదాహరణము నొక స్తోత్రము మిక్కిలి రసవంతమై యలరారుచున్నది

శా॥ యస్సంగీతనిధిః, యమాహురధిపం యేనార్చితం నాన్యతం
యం స్తౌతి, యత ప్రదీయ ముదఘాత్, యద్వీర వ్రతం
యస్యాంగం సహోదరిత కరుణా, యస్మిన్ మహాత్వాదికం
తత్వం త్రిణజంతి పాతు బసవామాత్యో మాదామునేః.

ఈ శ్లోకమువలన సంస్కృతశైలి తెలియును.

వీరశైవమతచరిత్రలో బసవేశ్వరుని తరువాత సోమనాథుడే సుప్రసిద్ధుడనవచ్చును ఆయన గొప్ప వ్యక్తి కావున, సంఘ.

## శైవరాజ్యములు

ఏ మతమైనను రాజుల ప్రాపువలనే వృద్ధినొందినట్లు తెలుసుకొనియున్నాము అట్లనే వీరశైవముకూడ రాజాదరణమును పొందెను కాకతీయ సామ్రాజ్యస్థాపకుడగు కాకతిప్రోల చక్రవర్తి ఓజ్జలునికంటె కొంచెమో కొద్దియో పెద్దవాడు. అనగా ప్రోలుని వార్ధక్యము ఓజ్జలుని యౌవనము సమకాలీనములు. ఓరుగల్లు కాకతి చక్రవర్తుల వంశమువారు శైవులై తన్మతమునకు మిక్కిలి దోహద మొసంగిరి. అది రాజ్యమతమయ్యెను. చక్రవర్తులందరును శైవులే కాకతీయ గణపతి రుద్రచక్రవర్తి ఈ కాల శివగురువుల యొక్క శిష్యుడని వెనుక తెలుసుకొనియున్నాము. పాల్కురికి సోమనాథుడు ప్రస్తావించిన కాలాంతమున మొదటి ప్రతాపరుద్రుని సమకాలికుడై యుండును. సోమనాథుడు ఓరుగల్లునకు కూడ వచ్చినట్లు చెప్పుదురు. సోమనాథుని కావ్యములలో విద్యానాథుని

ప్రశంసకలదు. ప్రతాపరుద్ర యశోభూషణ కర్తయగు విద్యానాథుడు మొదలైన యనేక మహాకవులు సాహిత్యము నెంత పెంచిరో వీరశైవము నంతగా ప్రాకింపజేసిరి. శ్రీనాథుడు రచించినట్లు చెప్పబడు క్రీడాభిరామమున నోరుగల్లు పట్టణమునందలి శైవమత ప్రదర్శనములు బహురమ్యముగా వర్ణింపబడినవి. ఆ వర్ణనలు చదివినవారు తత్ప్రదర్శనములలో బ్రాహ్మణేతరు లెక్కువగా పాల్గొనినట్లు తలంపకపోరు. ఈ గ్రంథము చదివినయెడల నందు వర్ణింపబడిన మతము వీరశైవమే యనియు నది ప్రజలలో విశేష వ్యాప్తి నొందినదనియు గట్టిగా చెప్పనగును. ఈ కాలమున మతములనుగూర్చి వాదోపవాదము లున్నను తదనుయాయుల యున్మాదము కనపడదు. ఓరుగల్లు కాక గోదావరీ తీరమున ద్రాక్షారామము పశ్చిమమున కాళేశ్వరము, దక్షిణమున శ్రీశైలము లను క్షేత్రములు ముఖ్యములు. కాకతీయ సామ్రాజ్యపతనమువరకు తత్సామ్రాజ్య చరిత్ర మిక్కిలి తేజోవంతమై యున్నది.

కాకతీయ సంప్రదాయమునే యొకవైపు విజయనగర చక్రవర్తులును మరియొకవైపు, అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరము మొదలైన స్థలముల పరిపాలించిన రెడ్డిరాజులు ననుసంచిరి. ఈ కాలమునాటివి యనేక శాసనములు కలవు. వానిలో శైవపండితుల యొక్కయు గురువులయొక్కయు శివద్విజులయొక్కయు ప్రశంసలు కలవు. ఆ కాలమునాటికి బ్రాహ్మణా బ్రాహ్మణ వీరశైవు లున్నను వారు స్పర్ధించలేదనియు తోడుతోడుగా శైవప్రచారము చేసిరనియు నమ్మవచ్చును. శ్రీనాథాది మహాకవులుకూడ నీ ప్రచారమునకు మిక్కిలి దోహదమొసగిరి.

విజయనగరము నేలిన సంగమ సాళువవంశములు రెంటను, శైవమతము ననుసరించెను. శంకరాచార్యుల తర్వాత మతాకాశమున సూర్యుడై వెలింగిన విద్యారణ్య మునీంద్రుని భిక్ష యిది. శైవముతోపాటు శంకరుడు సంపాదించిన చంద్రమౌళీశ్వర లింగముకూడ విద్యారణ్య మునికి సంక్రమించెను. తాను శృంగేరీ మఠమున కధ్యక్షుడై రాష్ట్రమునందలి బహుళజనోపయోగమునకై పుష్పగిరి విరూపాక్ష పీఠములను స్థాపించెను. ఇవియు సామాన్య శైవ వ్యాప్తికి తోడయ్యెను. ఈవిధముగా సామాన్య వీరశైవములు స్పర్ధలేకుండ ప్రక్కప్రక్కన వర్ధిల్లెను. కర్ణాటకమందలి మత చరిత్ర యింతకంటె కొంచెము భిన్నము. ఈ విధముగా పదునాల్గవ శతాబ్దాంతమువరకు శైవమత ప్రచారము జరిగెను. పిమ్మట రెడ్డిరాజులును మతవ్యాప్తికి ఖడ్గము నుపయోగించినట్లుకాని యితర మతముల నసహ్యించుకొనినట్లుగాని యగపడదు. కృష్ణరాయలు కూడ యీ మతసమాన సంప్రదాయమునే యనుసరించెను. తాను వైష్ణవుడయ్యు నితరమతములకు తన యాస్థానమందు తావొసంగెను.

## ఆంధ్రదేశములోని శైవస్థలములు

పరికించి చూచిన నాంధ్రదేశములో విష్ణుస్థలములకంటె శైవస్థలము లెక్కువగానున్నవి. ఇదివర కుల్లేఖించిన శ్రీశైల ద్రాక్షారామ లింగములు కాక పంచభూత లింగములలో నొకటైన వాయులింగము కాళహస్తియందున్నది—ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తీశ్వరాయను మకుటమున నొక శతకము నీ దేవుని కంకితము చేసినాడు. మరియు తత్స్థల మహాత్మ్యమునుకూడ రచించినాడు. ఇప్పటికిని శైవమతము పదునాల్గవ శతాబ్దాంతమున కెట్లుండెనో యట్లే యున్నదని గట్టిగా చెప్పవచ్చును. వేమనపద్యములలో నొక పద్యములో శివాలయములేని యూర నివసింపవలదని హెచ్చరించినాడు. ఆంధ్రదేశమందంతటను మహాశివరాత్రి మిక్కిలి పవిత్ర దినము. ఇంతియేగాక శివుని భార్యయైన శక్తియొక్క యంశలు ప్రతిగ్రామమునందును గ్రామదేవతలుగా వెలసినవి. అన్ని మతములవారును వీరిని కొలుతురు. శివశక్తి లోకమాతృయొక్క రూపములగుటచే వీరందరు శైవులే యనవచ్చును. ఇట్లే రెండు మతములును పరస్పరము సంబంధము కలవై శైవమును పెంచిన వనుటలో నెట్టి సందేహమును లేదు.

## ఉపసంహారము

జనాభా లెక్కలు తీసుకొన్న శైవులు ఆంధ్రదేశములో నధిక సంఖ్యాకులని నిశ్చయము. ఇతర ప్రదేశములలోగల మతాంతః కలహము లిచట లేవు. వీరశైవమతమునకు ప్రచారము చేయవలసిన కాలము కొన్ని శతాబ్దముల క్రిందటనే గతించెను. కావున శైవమత మట్లే యున్నది యున్నట్లుండిపోయెను. బ్రాహ్మణులలో వీరశైవుల నారాధ్యులనియు, బ్రాహ్మణేతరులను జంగములనియు పిలుచుచున్నారు. ఈ రెండవ తెగవారిని లింగబలిజెలని కూడ వాడుట కలదు. శైవమతమును గూర్చిన వాఙ్మయము మిగుల నపారముగా నున్నది. ఇట్టి గ్రంథములలో ననేకములు సంస్కృత పురాణములు మొదలైన గ్రంథముల యనువాదములు. కాని వీరశైవమతచరిత్రము వ్రాయుట కెక్కువగా నాధారములు కానరావు. ఆ మతమును గూర్చిన గ్రంథములలో చరిత్రాంశముల నేరుకొనవలెను.

నాటిక:

# విచ్చుకత్తులు

శ్రీ మంథా వెంకటరమణారావు

మంగలిషాపు; పైడయ్య కత్తి పదునుపెడుతున్నాడు. వయస్సు 70 సం॥ ఉంటాయి, కాని దృఢమైన నల్లటి దేహం. ముఖంలో ముసలితనం ఉట్టిపడుతున్నా, కన్నులు ఇంకా ఏదో శక్తిని, కాంతిని వాటిలో ఇముడ్చుకున్నాయి. తలమీది వెంట్రుకలు పండిపోయి ఉండటం సహజం, ఒంటిమీదఉన్నవి, ఒక చిరుగుల పట్టబనియను, గళ్ళలుంగీ.

తిరుగుడు కుర్చీలో కూర్చున్నాడొకవింతటి ఆసామీ- అతని జుత్తు కెరటంలా మీదికిలేచి వెనుకకు పడుతోంది. మెడక్రింది వరకూఉన్నాయి పొడుగాటి వెంట్రుకలు. కళాయిపోయినఅద్దంలో ముఖపు ప్రతిబింబాన్ని వెతుక్కొనే ప్రయత్నంలో ఉన్నాడతను. అతని వయస్సు 45-50 సం॥ అనుకొని ఉండవచ్చు.

**ఆసామీ:** (అద్దంలో ముఖం చూసుకోటానికి బ్రహ్మప్రయత్నం చేస్తున్నవాడల్లా ఒక్కసారి బాధగా) అమ్మా !

**పైడయ్య:** (చటుక్కున ముందుకువచ్చి ఎంతో శ్రద్ధ కనపరుస్తూ) ఏమిటయింది బాబూ!

**ఆసా** : (క్రిందికిదిగి) తేలో ఏదో!

**పైడ** : (ఆత్రంగా) తేలో ఏదో ఏమిటయింది?

**ఆసా** : ఏమిటవుతుంది—కుట్టింది

**పైడ** : అపకొలాడుతున్నారాబాబూ—

**ఆసా** : నిక్కోనా!! సరి సరి .. అబ్బ ఇంకానొప్పెడుతూనే ఉంది!

**పైడ** : నా దుకాణంలో తేళ్ళా! సరిసరి బాబూ! నాకు జ్ఞానం వచ్చిన రోజునుంచి చూస్తున్నా నా దుకాణం— ఒక్కరోజు! చిన్న తేలుపిల్ల చిన్న పిల్ల ఎవరికైనా . ఛీ! కొంచెం అన్నా కనబడలేదంటే నమ్మండి.

**ఆసా** : కరవడం తేలుకి నా ఖర్మం.

**పైడ** : పురికొరిచినా అంత బాధుండదు బాబూ. తేలుకరవదమే బాబూ!

**ఆసా** : అంగుళం తేలుందో పాముందో చూడుమరి వేగం... ఇక్కడ గంటలకొద్దీ పడి ఉంటేందుకు నాకు టైము ఏడవ లేదు

**పైడ** : కోపం చెయ్యకండి బాబూ! తేలుకాదు కూర్చోండి

**ఆసా** : చూపకుండా నీ హామీ ఏమిటి మున్నని.

**పైడ** : మహా అయితే ఒక నల్లిపిల్ల అయ్యుంటుంది బాబూ .. చూడండి.

(కుర్చీదిండు ఎత్తుతాడు)

**ఆసా** . (చటుక్కున రెండడుగులువేస్తూ) అమ్మ బాబోయ్!!

**పైడ** : (చిరునవ్వు నవ్వుతాడు ఏదో విజయం పొందినట్టుగా)

**ఆసా** : మనిషిని అమాంతంగా పిప్పిచేస్తాయి—ఎంతెంతో... ఎన్నో!!!

**పైడ** : ఏనుగుని మింగేస్తాయిబాబూ మా నల్లులు—తమకింకా తెలీదు.

**ఆసా** : నీకు తెల్సే ఈ నాటకం ఆడుతున్నావా? సరి! మరో దుకాణం ఏదీఉండి ఏడవలేదు కాబట్టి నీదాన్లో చావడం.

**పైడ** : నిజం సెలవియ్యండి బాబూ ఏ మొగవాడు నాతో పోటీ పడిపెట్టి ఈ ఊర్లో నిలబడగల్డు? ఇప్పుడయితే నేను ముసలాడ్నయిపోయేను కాని బాబూ—ఇప్పుడైనా పని అంతా ఎవ్వ్రగెడీ, అక్టుకెట్ బాబూ ..

**ఆసా** : ఏడిసినట్టే ఉంది

**పైడ** . కూర్చోండి బాబూ ఫరవాలేదు.

**ఆసా** : (కూర్చుంటూ) ఆ నల్లుల్ని కొంచెం కూతమార్చరాదూ సంవత్సరానికోసారన్నా? డబ్బిచ్చుకుని, పైగా వీటికి అనువయిపోయి వీటిచేత కొట్టుతినడం కూడాను .వేగం కానీ; గడ్డంగీసి చాలు.

**పైడ** : తమ తల మాసిపోయింది—ఒక్క పదినిముషాలు ఓర్చుకోండి చాలు.

**ఆసా** : పొమ్మంటావా? గడ్డం గీస్తావా?

**పైడ** : తమ చిత్తం...ఎలా కానిమ్మంటే అలాగే కానిస్తాను. నా పోటీ కదా అని తమకి మనవిచేసేను తలమీకి గడ్డి కుప్పలా ఉందని...

పైడ : ఎల్లక్కే...
వ్యక్తి : కాదు.
పైడ : (ఆశ్చర్యపోయి) అం.. ఏమిటి బాబోయ్! తమరలా అంటారు
వ్యక్తి: నీ కాలంలోనే కాదు, నీ కొడుకుకూడా చూడు...
పైడ : కొడుకా!!
వ్యక్తి : ఏం?
పైడ : (మాట్లాడడు)
వ్యక్తి : ఏం ఒక్కసారి ఆగిపోయావ్...
పైడ : కొడుకులెవరూ లేరుబాబూ.. తమ దయవల్ల...పిల్లలే లేరుబాబూ...
వ్యక్తి : (ఆశ్చర్యాన్ని మరుగుపరుస్తూ) నవ్విపోతారు ముసలాడా మనవలు కూడా ఉండవల్సిందే నీకు! ఆశ్చర్యంగానే ఉంది.
పైడ : ఎందుకు బాబూ?
వ్యక్తి : నువ్వసలు పెళ్ళిచేసుకోలేదా?
పైడ : తమ తల బాగా మాసింది....క్రాపు చేయించమంటారా?
వ్యక్తి : అలానే కానీ. ముందు నాకు చెప్పు
పైడ : (క్రాపుచెయ్యడంలో మునిగి) అదే అయితే ఏ ఏడుపూ ఉండకపోను బాబూ... తమరిష్టం... లేవకండి.. బెంచీ మీద కూర్చోండి...
వ్యక్తి : ఇంకో పెళ్ళాన్ని తెచ్చుకోలేకపోయావ్? ఏం చింతా ఉండకపోను
పైడ : (వింతగా) ఎందుకు బాబూ?
వ్యక్తి : పిల్లలకోసం...
పైడ : (క్షణం మౌనం వహించి) తల్చుకుంటే గుండెకాయ పగిలిపోయి, భయం పుట్టుకొస్తున్నాది. మరో పెళ్ళి!!
వ్యక్తి : పిల్లలు కావాలంటే అదే చెయ్యాలి. ఏడ్చి ఏం లాభం?
పైడ : పిల్లలు పుట్టక కాదు బాబూ...
వ్యక్తి : పిల్లలుంటే వారన్నమాట......అయితే మీ ఇద్దర్లో ఎవరి లోపం లేదూ , ఎవ్వరూ బతకలేదా...
పైడ : .. బతకలేదు బాబూ...
వ్యక్తి : (ఆశ్చర్యపోయి) నిజంగా? (సర్దుకొని) ఏ డాక్టరుకన్నా చూపించుకోవల్సింది...పిల్లలు పుట్టిపోతూవుంటే అది తప్పించడానికి వీలుంది తెల్సునా?
పైడ : (నిరసనగా నవ్వి) డాక్టర్లా బాబూ! ఈ బూమిమీద డాక్టర్లా...ఉహుఁ...
వ్యక్తి : చాలా గుప్తంగా మాట్లాడుతున్నావ్...
పైడ : నా కొడుకు నాకుండేటట్టు చేసుంటే చెయ్యలే పోయేడు బాబూ! ఈ డాక్టర్లా!
వ్యక్తి : పుట్టింది ఒక్కడే కొడుకా?
పైడ : ఇంకా ఎక్కువమందెందుకు బాబూ...మిగిలిన ప్రాణం కాస్తా బాధపెట్టి తియ్యడానికి
వ్యక్తి : ఔను...చాలా కష్టంగానే ఉంటుంది...... ఎన్నాళ్ళు బతికి, పోయేడు...
పైడ : పాతికేళ్ళు బాబూ...
వ్యక్తి : పాతికేళ్ళు!! అమ్మయ్యో! చెట్టంత మనిషి...
పైడ : ఔను బాబూ...
వ్యక్తి : ఎంతపని! చేతి కందుకొచ్చిన కొడుకు...ఎలాపోయేడు! ఏమయింది...ఏ జబ్బు?
పైడ : (మౌనం)
వ్యక్తి : పెళ్లికూడా అయిందేమిటి కొంపతీసి!
పైడ : ఒక ఎనుబోతులా ఉండేవాడు బాబూ...(ఊపిరి బిగపట్టి) కొవ్విపోయిన ఎనుబోతులా...
వ్యక్తి : ఏంమాటలోయ్!! అలానే పోలుస్తారా పోయినకొడుకుని!
పైడ : అబద్ధం కాదుబాబూ. కొవ్వుబలిసిన ఎనుబోతులా ఉండేవాడు ..
వ్యక్తి : నీ ఉద్దేశం అంత బలంగా అనా?
పైడ : చిత్తం!

[మౌనం]

ఒడ్డూ, పొడుగూ తమలానే ఉండేవాడు ..
వ్యక్తి : నన్నూ కొవ్వుబల్సిన ఎనుబోతే నంటావేంటి కొంపతీసి!
పైడ : (వినిపించుకోకుండా) మహా గొప్ప తెలివిబాబూ ..
వ్యక్తి : నిజంగా?
పైడ : బాగా తెలివిఉండేది బాబూ...ఎంత ముందాలోచన!
వ్యక్తి : (విచారంగా) అలాటివాళ్లికి భగవంతుడు ఆయుష్షు ఇవ్వడు...
పైడ : అలా అనకండిబాబూ...అలాటి కొడుకే దక్కకుండా తండ్రి గుండె విరక్కొట్టిపోతాడు.
వ్యక్తి : ఏదన్నా ఒకటే...ఎంత కష్టం! ఈ ముసలికాలంలో నువ్వొక్కడివి...
పైడ : ఏంచేస్తాను బాబూ ...
వ్యక్తి : ఎలా పోయేడో చెప్పేవ్ కాదు...
పైడ : ఎలాపోయేడా. (మౌనం) గుండె బాబూ...గుండె...
వ్యక్తి : అంత దుక్కలా, ఎనుబోతులా ఉండేవాడన్నావ్?
పైడ : మనిషి ఎంత దుక్కలా ఉన్నా గుండె-పిడికెడేకదు బాబూ.. అది సరిగా పనిచెయ్యలేదు బాబూ. బుర్రా అన్నీ బాగా పనిచేసేయి.. మరి గుండెకూడా బాగా పని చెయ్యాలి కదు బాబూ, బతకడానికి...
వ్యక్తి : గుండె ఆగిపోయిందా?
పైడ : ఔను బాబూ...గుండె రక్తం చిమ్మడం మానేసింది బాబూ...ఎర్రటి రక్తం...తేనెలాంటి రక్తం చిమ్మడం మానేసింది బాబూ...

వ్యక్తి : [ముఖం ఎర్రగా మారుతుంది]

పైడ : ప్రమాదంగా కొట్టేవాడు కాదు.. ఈయాటలే. నేనారోజు ఊళ్లోలేను. పట్నంవెళ్లేను.. ఇది జరిగిపోయింది... నే ఒచ్చేసరికి దాన్ని పాతిడంకూడా అయిపోయింది...

వ్యక్తి : నువ్వదింటూ, తెలిసిఊరుకున్నావా?

పైడ : ఊరుకుంటానా? మర్నాడు వాణ్ని ముఖం వాచిపోయేటట్టు తిట్టేవాణ్ని...ఆ కోపం అంతా దానిమీద రాత్రి చూపెట్టేవాడు. .దాంతో నేను తగ్గవల్సివచ్చేది...దాని కోసం ఆ పిల్లకోసం. ఇంతమట్టుకి వస్తుందని తెలుస్తే.

వ్యక్తి : చాలా అన్యాయం జరిగింది.. నువ్వు పిల్లని కాయవల్సింది...

పైడ : (గొంతు తగ్గించి) ఏం చెప్పను బాబూ...ఆఖరికి ఆ పిల్ల భాగం తీసుకున్నాను ...పెద్దజట్టీ అయింది ఒకరోజు నాకూ వాడికీ... (పళ్లుకొరికి) వాడు.. ఆ రాడీ ఆ పిశాచి...నాకూ ఆ పిల్లకీ నా కూతురులాటి పిల్లకీ ..

వ్యక్తి : (తలదించుకొని) ఊఁ.

పైడ : నే నసలు పొరుపవోడ్ని .. పీకపోయినా, ఏమిటయినా వాడి ఊసే మానుకుందామని పంతంపట్టేను . కాని ఇలా అయిపోతుందని అనుకోలేదు...

వ్యక్తి : తలఅయిందిగా.. ఈ గడ్డాం ఇంక తీసేయి...

పైడ : (కత్తెరబల్లమీదపెట్టి, కత్తితెచ్చినూరుతూ) వాడు మరి నా కంటబడలేదేబాబూ. అందరిముందూ ప్రమాణికంచేసేను ...నాకేమిటయినా సరే ..వాడు కనిపిస్తేమాత్రం... కత్తితో పరా పరా పీకకోసెస్తానని... నా బలం ఎలా ఉండేదనుకున్నారుబాబూ.. అప్పుడు !

వ్యక్తి : అప్పుడు నీ కంతకోపం ఉండడం సహజమే...కాని, నిజంగా నీ కొడుకు కనిపిస్తే వాడిపీక నరికేగలవా?

పైడ : వాడుకొడుకా బాబూ నాకు! తమ రెలా అంటున్నారు.

వ్యక్తి : నీ రక్తం అతనిలో లేదంటావా?

పైడ : ఏమయినాసరే...వాడు కనిపిస్తేమట్టుకు ఆపని చేసి ఉందును...

వ్యక్తి : ఏవో పొరపాట్లు జరుగుతూ ఉంటాయి పయిడయ్యా అంతమాత్రానికి కొడుకుని, కన్నకొడుకుని, చంపేస్తానని తండ్రి పగపట్టడం చాలా విచిత్రంగాఉంది...ఆ నిమిషాని కలా ఉంటుంది. కాని కొన్నేళ్ళయాక నీ కొడుకుని నీకు చూడాలని తప్పకుండా ఉంటుంది...క్షమించాలని ఉంటుంది...

పైడ : ఏమిటిబాబూ! తమ రలా అంటున్నారు ..
(దగ్గిరగావెళ్లి గడ్డాం గియ్యడం మొదలెడతాడు)

వ్యక్తి : మనం మనుష్యులం పైడయ్యా. పొరపాట్లుచేస్తూ ఉంటాం. నీ కొడుకుకూడా మారిపోయి ఉండొచ్చు... అతను తిరిగి మనిషిగా మారిపోయి ఉండొచ్చు—చేసిన దానికి ఎంతగానో పశ్చాత్తాపపడి విచారిస్తూ ఉండొచ్చు.

పైడ : వాడా! వాడి సంగతి నాకు తెలీదా బాబూ...ప్రతి రక్తకణం విషంగా మారిపోయింది...మరింక అది కొాగుపడుతుందా ?

వ్యక్తి : గుండె సరిగా పనిచేసి, చెడురక్తం మంచిదయిపోయి ఉండొచ్చు ..

పైడ : కాదు బాబూ...
(గడ్డాంగీసే పనిలో ముఖంపైకెత్తి ఎందుకో ముఖంలోకి వింతగా చూస్తాడు)

వ్యక్తి : ఏం? అలా చూస్తున్నావ్ ?

పైడ : తమని ఎక్కడో చూసేనుబాబూ ఇదివరకు....

వ్యక్తి : (తత్తరపాటుతో) నన్నా !!

పైడ : ఔనుబాబూ!

వ్యక్తి : ఏదో పొరపాటు—

పైడ : కాదుబాబూ . ఎక్కడో చూసేను ..

వ్యక్తి : నే నిక్కడికి రాలేదే ఎప్పుడూ...

పైడ : ఆఁ! తెల్సిందిబాబూ. .వాడు ..

వ్యక్తి : ఎవరు ?

పైడ : వాడు...నా కొడుకు. .మీలానే ఉండేవాడు ఎంత దగ్గిరపోలిక...

వ్యక్తి : నన్నే నీ కొడుకంటావేంటి, కొంపతీసి...

పైడ : భాధా! తమకీ ఆ పిశాచానికీ పోటాబాబూ...

వ్యక్తి : నా కెందుకో బాగా నమ్మకంగా ఉంది నీ కొడుకు మారిపోయిఉంటాడు మనస్సు ఎప్పుడూ ఒక్కలాఉండదు ..

పైడ : వాడిసంగతి మరెత్తకండి బాబూ.. మసిబొగ్గు నాపిలాస్తే బాబూ !

వ్యక్తి : దానికి నిప్పంటిస్తే ఎలాఎర్రగా మెరుస్తుంది.. ?

పైడ : ఎంతసేపు బాబూ అది. మళ్ళాఅది పనికి రానిబూడిద ఎంతసేపులో అవాలి...

వ్యక్తి : ఒకప్రశ్న అడుగుతాను పైడయ్యా...నిజమైన జవాబియ్యి

పైడ : తప్పకుండా అడగండిబాబూ...

వ్యక్తి : నీ కొడుకే, చేసినదానికి పశ్చాత్తాపపడి, నీ కాళ్లదగ్గర పడి, క్షమించమని, ఒస్తాడనుకో .

పైడ : (మాట్లాడడు...మిగిలిన కొద్దిపాటి గడ్డాన్ని తీస్తూఉంటాడు)

వ్యక్తి : నువ్వు క్షమిస్తావా ?
(గడ్డాంగియ్యడం పూర్తవుతుంది ...పైడయ్య 'పాము' కరిచినట్టు ఉలిక్కిపడతాడు... గడ్డాం క్రిందిభాగాన్ని

తీక్షణంగా చూస్తాడు...అక్కడవున్న చిన్నకుర్చీని తీసి పారచూస్తాడు—)

ఏం పైడయ్యా...

పైడ : (ఆవేశంతో) బాబూ...

(కత్తి ముఖందగ్గరికి తెచ్చి) బాబూ! నా కొడుకే....ఈ ఈ నిముషం, నా దగ్గరికొచ్చి . క్షమించమని అడుగుతే వెంటనే ఏంచేస్తానో తెల్సునా బాబూ!

(మరింత దగ్గరిగా కత్తితెచ్చి కత్తితో వ్యక్తి పీకని చూపిస్తూ)

ఆ పీకని, పరపరా కోసేస్తాను బాబూ! ముక్కలుముక్కలుగా కోసెస్తాను బాబూ!

(పైడయ్య ముఖం భయంకరంగా ఉంటుంది. అతని పళ్లు వికారంగా పైకిఉంటాయి)

వ్యక్తి : (మొదట కొంత గాభరాపడిపోతాడు. కుదుటపరచుకొని, పైడయ్య ముఖంలోకి అదోరకంగానూ, అంతభయంకరంగానూ చూస్తూ) పైడయ్యా! ఇరవైఏళ్ల క్రిందచేసిన తప్పుకి పశ్చాత్తాపపడి క్షమించమనివస్తే, కొడుకుని క్షమించలేవూ? (ఊపిరి బిగపట్టి ముఖందగ్గరగాపెట్టి) నాకే నీలాంటి తండ్రికాని ఉంటే (చేతులు రెండూ పైడయ్య పీకదగ్గరికి తెస్తూ) పీకనులిపి విసిరేస్తాను....పీక నులిపి విసిరేస్తాను!

* పైడయ్య దెబ్బతిన్నట్టు వెనక్కి తగ్గుతాడు. ఇద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకుంటారు ఒక అరనిముషం - ఏదో అర్థం అయినట్టు. వ్యక్తి, చరచరా మకాణం దిగిపోతాడు... పైడయ్య వెర్రివాడ్లా అటువేపే చూస్తూ ఉంటాడు కత్తి పట్టుకొని— *



# అష్టదిగ్గజములు

శ్రీ నిడుదవోలు వేంకటరావు

సాహితీసమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలకాలమున 'అష్టదిగ్గజములు' అను పేర ఎనమండ్రు కవులు విలసిల్లిరట్లుగా తెలుగువారి కందఱకు సుపరిచితమైన విషయము. ఆ కవులందఱును తెలుగుకవులేయని నేటివఱకును వాఙ్మయ చరిత్రకారుల యభిప్రాయము. కాని యీ నడుమ వెలువడిన ఆంధ్రకవి తరంగిణిలో కృష్ణరాయ చరిత్రమున గ్రంథకర్తలు అష్టదిగ్గజములలో నైదుగురు మాత్రమే తెలుగు కవులనియు, తక్కిన ముగ్గురును సంస్కృత కర్ణాటకకవులై యుందురను నభిప్రాయము వెల్లడించి యున్నారు. వారట్లు వెల్లడించుటకు కారణము లేవియు నందు తెలిపి యుండలేదు—కాగా, పారంపర్యముగా వచ్చుచున్న సంప్రదాయమును బట్టియు, వాఙ్మయచరిత్రకారుల వ్రాతల ననుసరించియు పరిశీలించినచో, అష్టదిగ్గజములలో ముగ్గురు సంస్కృతకర్ణాటకవులై యుందురను నభిప్రాయ మెంతమాత్రమును సమంజసము కాదనియు, వారందఱు తెలుగువారే యనియు స్పష్టమగుచున్నది. ఈ విషయమును గూర్చి యిదివఱ కవరేవిస్తముగా వ్రాసినది తెలుపుదము, అష్టదిగ్గజము లెవరో నిరూపించుటయే యీ వ్యాసము యొక్క యుద్దేశము ప్రపథమమున నీ వాదమును గ్రంథస్థముచేసిన ఆంధ్ర కవి తరంగిణీ కారులు వ్రాసినదాని నిందుదాహరించుచున్నాను

ఆంధ్రకవి తరంగిణి సప్తమ సంపుటము పుటలు 144—145 లో శ్రీకృష్ణదేవరాయల చరిత్రమున నిట్లు గలదు.

## అష్ట దిగ్గజములు

"రాయల యాస్థానములో దిగ్గజములవలె నెనమండ్రు కవులుండెడివారని ప్రతీతి కలదు. ఈ యష్ట దిగ్గజములకు గృహములుండు తిప్పలూరు అను గ్రామము సర్వాగ్రహారముగాఁ జేసి రాయలు దానమిచ్చెనని యొక శాసనమువలనఁ దెలియుచున్నది ఈ దాన మెప్పు డిచ్చెనో ఆ దానపరిగ్రహీతలగు ఎనమండుగురు కవు లెవరో తెలియదు ఈ సందర్భమున రాయలు వ్రాయించిన శాసనము లభింపలేదు ఈ గ్రామమున గొమ్మరిపన్ను గ్రాహ్య చేయుచు, ఇతరులు వ్రాయించిన శాసనమునుబట్టి యీ విషయము తెలియవచ్చినది.

ఈ అష్ట దిగ్గజములని ప్రఖ్యాతి గాంచినవా రాంధ్ర కవులని చరిత్రకారుల యభిప్రాయము

"ఆతని యాస్థానమునందు పేరిట నెనమండ్రు తెలుగు కవులుండిరనుమాట పరంపరగా వచ్చుచున్నది అల్లసాని పెద్దన, నంది తిమ్మన, ధూర్జటి, మాదయగారి మల్లన, అయ్యలరాజు రామభద్రుడు, పింగళి సూరన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుఁడు అనెడి యెనమండ్రును అష్టదిగ్గజములని వాడుక కలదు.

ఇందు మొదటి నలుగురును, రామకృష్ణుడును శ్రీకృష్ణరాయల కాలములోనివారు అతని యాస్థానమునఁ గవులుగా నున్నట్లు నిదర్శనము లున్నవి. కాని తక్కిన ముగ్గురును అష్టదిగ్గజములలోనివారు కారని నా యభిప్రాయము వారినిగూర్చి ఆయా కవుల చరిత్రము నందు వ్రాయఁదలచితిని.

అష్టదిగ్గజములని ప్రఖ్యాతిగాంచిన వారిలోఁ బైన వ్రాసిన యైదుగురును గాక తక్కినవారు సంస్కృత కర్ణాటకకవులై యుందురని నా యుద్దేశము కృష్ణదేవరాయల కాంధ్రమువిన నభిమాన మెక్కువ యనుమాట నిశ్చయమే దేశభాషలందు తెలుగు లెస్స యని నుడివినవాఁడే దీనినిబట్టి అష్టదిగ్గజము లాంధ్రకవులే యని తలంపరాదనియు నాతని యాస్థానమున సంస్కృత కర్ణాట కవులు కూడ గలరనియు వారిని కూడ రాయలు సమానగౌరవముతో మాచెననియుఁ దలంపవలసియున్నది"

పై దానిలో తిప్పలూరి శాసనమునుబట్టి కృష్ణరాయల కాలములో నే అష్టదిగ్గజ కవిశ్వేగులకొక యగ్రహారము దానమీయబడినదని, వారి పేర్లు మనకు తెలియకపోయినను వా రెనమండ్రు కవులని స్పష్టమగుచున్నది. కృష్ణరాయలు దానమిచ్చిన కాలము మనకు తెలియకున్నను, అది క్రీ. శ. 1528 (తిప్పలూరి శాసనకాలము) కి ముందు కాలమని నిశ్చయముగ చెప్పవచ్చును. మఱియు కొంతమంది చరిత్రకారులు నిరూపించినట్లు కృష్ణరాయ నిధనకాలము క్రీ. శ. 1526 ప్రాంతమగుచో, నీ దానకాలము క్రీ శ. 1520—26 సంవత్సరముల మధ్యనని చెప్పవలెను అష్టదిగ్గజములను శ్రీకృష్ణదేవరాయలు, తమ రాజ్యారంభకాలమున నెలకొల్పియుండునని శ్రీ నేలటూరివారి యభిప్రాయము.[1]

ఈ తిప్పలూరి శాసనమే కాక, మైసూరుప్రాంతమున నందిదుర్గలో సోమశంకరస్వామి ఆలయమున శ్రీకృష్ణదేవరాయని శాసనములో, నీ యష్టదిగ్గజముల ప్రస్తావనయున్న యీ క్రింది శ్లోకమును కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రి గారు ప్రకటించియున్నారు.

శ్లో॥ యత్కీర్తిర్భువనైక భూషణ మహోదన్వన్నవప్రసాదాన్న రా
స్సర్వ్వరాజ సమాన తా ముపగతా సంప్రాప్య దిక్తింబహా

1. "*Very early in his reign, he constituted an Academy of Telugu Poets, the members of which were known as Astadiggajas. Studies in History of the third Dynasty of Vijayanagara P. 421.*

ఆస్థాన కవులయుండెడివారని యనుచున్నది. అందు రుద్రకవి యాశావర్గ సింహాసనమువాఁడైనాఁడు" పుట. 28.

"రుద్రకవి రాయల యాస్థానమున 'సంక్రాంతిలెంప్లు వసిం చెను" పుట. 29.

రామభద్రకవి, పుస్తేటి రామభద్రకవియని తొలుత తెలిపిన వారువారే.

పైని వ్రాసిన విశేషములు ప్రాచ్యలిఖిత పుస్తకాలలో R 764 సంఖ్యగల "రుద్రకవి విషయము" అను గ్రంథములో నున్నవి.

6. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు పూర్వ ముదాహ రించిన గ్రంథములోనే, అష్టదిగ్గజముల పేళ్ళ నిట్లిచ్చియున్నారు. (పుట 421)

*Peddana - Timmana - Dhurjati (Senior) - Mallana Ramarajabhushana- Ramakrishna - Pingali Surana and Rudra are said to have been the members of the Academy over which the Raya himself presided*

"పెద్దన—తిమ్మన—ధూర్జటి (ప్రథముఁడు) మల్లన—రామ రాజ భూషణుడు—రామకృష్ణుఁడు. పింగళిసూరన, రుద్రకవి— వీరు కృష్ణదేవరాయ లధ్యక్షుడుగానున్న అష్టదిగ్గజ కవిసంఘములో సభ్యులు—"

ఈ అష్టదిగ్గజములనుగూర్చి వ్రాసిన వారిచ్చిన పేళ్ళ న్నియు పాఠకుల సౌకర్యముకొఱకు నిక్రిందివిధముగా మాపు చున్నాము.

| గురుజాడ శ్రీరామమూర్తి 1893 | వీరేశలింగము 1895 | చిలుకూరి వీరభద్రరావు 1903 |
|---|---|---|
| 1 అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన |
| 2 ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) |
| 3 భట్టుమూర్తి | రామరాజ భూషణుఁడు | రామరాజ భూషణుఁడు |
| 4. పింగళి సూరన | పింగళి సూరన | పింగళి సూరన |
| 5. తెనాలి రామలింగము | తెనాలి రామకృష్ణుడు | తెనాలి రామకృష్ణుఁడు |
| 6. రామభద్రకవి (రామాభ్యుదయము) | అయ్యలరాజు రామభద్రకవి | అయ్యలరాజు రామభద్రుఁడు |
| 7 శంకరకవి | మాదయ్యగారి మల్లన | మాదయ్యగారి మల్లన |
| 8 ధూర్జటి | ధూర్జటి | ధూర్జటి |

పై పట్టికలలో భటుమూర్తికి, రామరాజ భూషణుఁడును, పింగళి సూరనయు, రాయల కాలమునకు వెనుకనున్నవారని చరిత్రల మూలమున వ్యక్తమగుచుండుటచేతను, వారు కవులుగా గ్రంథ కర్తలుగా ప్రఖ్యాతి చెందుట క్రీ. శ. 1550-60 ప్రాంతమగుటచేతను అష్టదిగ్గజములలో వారిని చరిత్రకారులు పరిగణింపుటలేదని— ముందు తెలిపితిని. పై యిరువురును కృష్ణరాయలవారి కాలమున యుండకులుగా నున్నట్లు మనకు నిదర్శనము లుంకుటచే అష్టదిగ్గజము లలో తరువాతి కాలమువారు, వీరిని చేర్చియుందురు వారికాలమును గూర్చి మనకు నేను సునిశ్చితముగా తెలియుటచేత, మిగిలిన యారు గురినిగూర్చి మొదట చర్చించి, ఆ వెనుక తక్కిన యిరువురినిగూర్చి తెలిపెదను—ఈ ఆర్గురిలో 1 అల్లసాని పెద్దన-2 నంది తిమ్మన 3 మాదయ్యగారి మల్లన. వీరినిగూర్చి వినాదమే లేదు రాయవాచక మున 116 పుటలో నిట్లు చెప్పబడి యున్నది "రాయలవారున్గాను చాలా సంతోషపడి ముక్కుతిమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదన గారి మల్లన మొదలైన కవీశ్వరులతో కృతులంగుకోవలెనని కవితా నాయ కులతో పలుకరించి ఆ తీరున అయ్యాలని అనంగా కళ్ళాయి, కళ్ళాయితాళి చేకట్లు, కేసరిపేరులు, కోకతాకలు యిచ్చి, పారిజాతా పహారణమున్ను, మనుచరిత్రాను చెప్పమని అనతి యిచ్చినారు"

కృష్ణరాయ విజయమున (కుమారధూర్జటి కృతము) పై మూడు పేళ్లతోపాటు మనుచరిత్ర మొక్కటిమాత్రమే పేర్కొనబడి యున్నది

సరస సాహిత్యరచన విస్ఫురణమెఱయ
సారమతులో క్షి మాదయగారి మల్ల
నార్యుఁడల యల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కు తిమ్మన మొదలైన ముఖ్యకవులు 3-48

వినుతించిరపుడువారికి
కనకాంబర భూషణములు ఘనతనొ ? 3-46

బంధుర కవీంద్రకృతులలోఁ బ్రాథేఁపన్న
మనుచరిత్రాది కృతులందు మహిమఁ దెలఁగ

| కొమఱ్ఱాజు లక్ష్మణరావు 1915 | ప్రభాకరశాస్త్రి 1922 | డా॥ నేలటూరి వేంకటరమణయ్య 1935 |
|---|---|---|
| అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన |
| ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) |
| రామరాజ భూషణుఁడు | భట్టుమూర్తి | రామరాజ భూషణుఁడు |
| పింగళి సూరన | పింగళి సూరన | పింగళి సూరన |
| తెనాలి రామకృష్ణుఁడు | తెనాలి రామకృష్ణుఁడు | తెనాలి రామకృష్ణుఁడు |
| అయ్యలరాజు | పుస్తేటి | రుద్రకవి |
| రామభద్రుఁడు | రామభద్రయ్య | |
| మాదయ్యగారి మల్లన | కవిరాట్టు | మాదయ్యగారి మల్లన |
| ధూర్జటి | రుద్రకవి | ధూర్జటి |

సకలసామ్రాజ్య వైభవసరణి మెఱయ
ధరణియేలుచునుంగె నద్ధరణి విభుఁడు 4-142

4. ధూర్జటి—ధూర్జటి వంశీయులగు కుమార ధూర్జటి లింగరాజ కవి చెప్పియుండుటచే నీతడు కృష్ణరాయల కాలమున అష్టదిగ్గజము లలో నొకడని నిశ్చయముగ చెప్పవచ్చును.

5 తెనాలిరామలింగ కవి లేక రామకృష్ణకవి.

ఈ పట్టికలో మొదట రామలింగకవి నామము తరువాత రామకృష్ణకవి నామము పేర్కొనుట గమనింపదగినది. శ్రీ ప్రభాకర శాస్త్రులవారి ఉద్భటారాధ్య చరిత్ర పీఠికమూలమునను, శ్రీ డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారి 'తెనాలిరామకృష్ణుడు' అను వ్యాసము మూలమునను నితడు అష్టదిగ్గజములలోని వాడని నిశ్చితమైనది.

6 రామభద్రకవి—మొదటిపట్టికలో రామభద్రకవిని రెండు మూడు నాలుగు పట్టికలు అయ్యలరాజు రామభద్రుడని, 5 వ పట్టిక పుస్తేటి రామచంద్రయ్య యని పేర్కొనుచున్నవి. రామాభ్యుదయము అను ప్రబంధమును రచించిన, అయ్యలరాజు రామభద్రకవిని, కొన్ని లక్షణగ్రంథములు పుస్తేటి రామభద్రయ్య అని పేర్కొనుచున్నవి. కావున నితడే కృష్ణరాయల కాలమున నున్నట్లును, అష్టదిగ్గజములలోనివాడనియు విమర్శకులు వ్రాసియున్నారు. కాని రామాభ్యుదయ రచయితయగు అయ్యలరాజు రామభద్రయ్య కృష్ణదేవరాయల కాలమువాడు కాడు. అతడు సదాశివరాయల కాలమునను, కృష్ణరాయని అల్లుడగు అళియరామరాయని కాలమునను జీవించియున్నట్లు, అయ్యలరాజు వారి వంశ వృత్తాంతమును, రామాభ్యుదయమును చెప్పుచున్నవి. రామాభ్యుదయము అళియ రామరాజు మేనల్లుడగు గొబ్బూరి నరసరాజునకంకితము. క్రీ. శ. 1560 70 ప్రాంతము నాటిది. కావున రామాభ్యుదయ కర్త అష్టదిగ్గజములలోనివాడు కాడని చెప్పవచ్చును.

అయ్యలరాజు రామభద్రుడు గాక, కృష్ణరాయల కాలమున రామభద్రకవియను పేరతో మఱియొక కవి యున్నాడు. అతడు సకల కథాసార సంగ్రహము అను కృతిని కృష్ణరాయల ప్రోత్సాహముచే రచియించియున్నాడు—ఇది తొమ్మిది యాశ్వాసములు గల పద్యకావ్యము—తొమ్మిదవ ఆశ్వాసము మధ్యను గ్రంథము ఆగిపోయినది—సంస్కృతమున గరులవారు 1 సకల కథాసార సంగ్రహము రచించిరిగదా! దాని ననుసరించి రామభద్రకవి తెలుగున దీనిని రచించినాడు. తెలుగు సకల కథాసార సంగ్రహము ముద్రితము కాలేదు—ఇందలి యవతారిక భాగము మాత్రము (మొదటినుండి పద్యములతోను) ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం 27 సం 1 లో ప్రకటితమైనది.

సకల కథాసార సంగ్రహమున, రామభద్రకవి తెలుగున ప్రాచీనులయు, తన సమకాలికులయు కవుల కృతులనున్న పద్యములను బోలిన పద్యములను చాల రచియించియున్నాడు. అందు, తిక్కన, అల్లసాని పెద్దనల ననుసరించి పెక్కు పద్యములు వ్రాసినాడు. వానిలో సమకాలికుడైన పెద్దన మనుచరిత్రము పద్యములకు చాల పద్యములు ప్రతిబింబములు వ్రాసియున్నాడు.

ఈ విషయము నిరూపించుటకు కొన్ని సంవాదములను రెండు గ్రంథములనుండి చూపుచున్నాను.

సీ॥ వదన సౌందర్య విస్తారాంబు సంజాత
 కంజంబులన వాని కన్నుదోయి
మదన సామ్రాజ్య సమ్యక్ పీఠిక యనంగ
 సరసమై వాని వక్షస్థలంబు -
కర్ణకుండల రత్నకాంతులఁ గొన నిక్కు
 వగల మీఱెడు వాని యోలు భుజములు
అరుణ ప్రవాళ సంతతి రుచిసంపద
 నదలింపఁజను వాని మృదుపదములు

గీ॥ సింగముల భంగములఁ గొంచెఁ జేయు నడుము
దంతురుని యందమును నొందఁజాలు నుదురు
వానినవ్వుఁ బువ్వులను నవ్వు వాసికయును
గప్పుకొప్పున నొప్పిన గొప్పు కురులు

సకల కథాసార సంగ్రహము 6 వ ఆశ్వాసము 127 పుట

సీ॥ వదన ప్రసూన లావణ్యాంబు సంభూత
 కమలంబులన నొప్పు కన్నుల మరు
నిక్కి వీనులతోడ నెక్కసక్కెము లాడు
 కవగొనున్నవి కీరి ఘనభుజములు
సంకల్ప సంభవాస్థాన వేదిక
 నవవిస్తీర్ణ కనుపట్టు నీరియురము
ప్రతినటించును చిగురుటాకుల తీరు
 రీతి నున్నవి వీరి మృదుపదములు

గీ॥ పేరు కోటలె యన దిబ్బి నిరుబాళ్లు
సానఁబట్టిన రాపాడి వజ్రమనియ
పవను సూరికెచేసి వెన్నెలకున్
వీరిఁ, గాపున్నఁ గలదె యీ మరి కొంగి

మనుచరిత్ర 2-36

చ॥ అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానురూప పరిపుల్ల కలాప కలాపిజాలమున్
గటకచరత్కరేణుకర కంపిత సాలము శీతశైలమున్.

—మనుచరిత్ర

చ॥ అట, జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిత వింధ్యచారు వి
స్ఫుట ఘనమూర్ధ్ని నిర్గత సుశోభిత పుణ్యశిరస్సరిజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగుర నూత్న తరంగ సంగతో
త్కట జవ ఫేన నిర్గత సుగంధి మహానది నర్మదా నదిన్.

సకల కథాసార సంగ్రహము.

మ॥ అనిమేషత్వము మాన్పి చిత్తరువు రూప స్వేదతావృత్తి మా
న్పి నవస్వేద సమృద్ధి బోనకళ మాన్పెన్ మోహవిభ్రాంతితో
వెస గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయ మొప్పన్ మను
ష్యుని భావించుట మానవత్వము మెయిన్ జూపట్టె నాతిరిన్

—మనుచరిత్రము.

1. ఆ ముక్తమాల్యదలో 'ప్రతిపురాణోప సంహిత లేర్చి కూర్చితి సకల కథాసార సంగ్రహంబు'—అను వాక్యమున్నది గదా: ఇందులో కొంతభాగము మాత్రము లభ్యమైనది. అందు వ్యాసతీర్థులవారి ప్రశంస యున్నది. చూ. సకల కథాసార సంగ్రహము. ప్రభాకరశాస్త్రిగారి వ్యాసము.

మ॥ అతిహేమత్వము దూఱి చంచలపు మోవస్వేదభావంబు గ్ర
ద్దన వారించె నిమ్నాత్మఘర్మజల విస్తార ప్రపూరంబు తో
డఁ బదేలాంగన కర్యోడెన్ భ్రమరకీటన్యాయమై యుప్పి య
మ్మనుజేంద్రున్ భ్రమియించునంతటనె రహిన్ మర్త్యత్వమున్
సంధిలెన్.

—సకలకథాసార సంగ్రహము.

సీ॥ కానక కన్న సంతానంబు గావునఁ
గానక కన్న సంతానమయ్యె
.. . . .....
నరయగోత్ర విధానమయ్యె నేఁడు
ద్విజకులాదరణ వర్తిష్ణుండుఁ గావున
ద్విజకులాదరణ వర్తిష్ణుఁడయ్యె
వివిధాగమాంత సంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుఁడయ్యె

గీ॥ కటకటా గాళరథి సముత్కట కరీంద్ర
కటకలిత దాన ధారార్ద్ర కటకమార్గ
గామియై ల్లు చరించు నుత్కట కరీంద్ర
కటకవితదాన ధారార్ద్ర కటకతటుల

—రామాభ్యుదయము

సీ॥ కానక కన్న సత్సూనుండు నేఁటికి
కానక కన్న సత్సూనుఁడయ్యెఁ
పుణ్య జనోత్కృష్ట పురుషుండు నేఁటికి
పుణ్యజనోత్కృష్ట పురుషుఁడయ్యె
ద్విజసఖ్యులనుగూడి తిరుగువాఁడు నేఁడు
ద్విజముఖ్యులనుగూడి తిరుగుటయ్యె
గోత్రపావనుఁడైన కొమరుండు నేఁటికి
గోత్రపావనుఁడైన కొమరుఁడయ్యె

గీ॥ మత్తగజదాన ధారార్ద్ర మార్గములను
దగుల నీడల నెప్పుడుఁ దిరుగువాఁడు
మత్తగజదాన ధారార్ద్ర మార్గములను
దగుల నీడల నెప్పుడు తిరుగుటయ్యె.

—సకల కథాసార సంగ్రహము

రామభద్రకవి నామ సామ్యమును పురస్కరించుకొని వీరేశ లింగము పంతులువారు తమ కవుల చరిత్ర రెండవభాగములో 85 పుటలో అయ్యలరాజు రామభద్రుడే, సకల కథాసార సంగ్రహము రచించెననియు, రెండింటికి కర్త యొక్కడే కాబట్టి తన పద్యమును నొకదానినుండి మఱియొకదానిలోనికి యథేచ్ఛగా గ్రహించినాడనియు వ్రాసియున్నారు. కాని, రామాభ్యుదయ కర్త రామభద్రకవి వేఱు—సకల కథాసార సంగ్రహకర్త రామభద్రకవి వేఱు—అని యీ క్రింది కారణములచే స్పష్టముగా నిరూపింపవచ్చును

| రామాభ్యుదయకర్త—రామభద్రకవి | సకల కథాసార సంగ్రహకర్త—రామభద్రకవి |
|---|---|
| 1 గ్రంథాంతగద్య<br>ఇది శ్రీమత్కొంటి మెట్టి రఘువీరశతక నిర్మాణ కర్మఠ జగత్ప్రఖ్యాతిప్ర నయ్యయ్యలరాజ తిప్పయామాత్య సర్వతోభద్ర పౌత్ర కృష్ణయామాత్య పుత్ర పరిశీలిత రామానుజ మత సిద్ధాంతసార్వభౌమ ముమ్మడి వరదాచార్య కటాక్ష వీక్షాపాత్ర హృదయ పద్మాధిష్ఠిత శ్రీ రామభద్రకవిప్రణీతంబైన రామాభ్యుదయమను మహాప్రబంధంబు<br>ఈ గద్యలో చెప్పబడియున్న రామభద్రకవి వంశస్థుఁ డయ్యలరాజు నారాయణకవి, వారిగోత్రము కౌండిన్యగోత్రమని చెప్పుటచే నీ రామభద్రకవి కౌండిన్యగోత్రుఁడు. | ఇది శ్రీ రామభద్రప్రసాద లబ్ధకవిత్వ మహత్త్వ విశారద శారద సత్కవి మిత్ర కాశ్యపగోత్రపవిత్ర రామభద్ర దక్షమంత్రాభద్ర రామభద్రప్రణీతంబైన సకల కథాసారసంగ్రహంబు.<br><br>పై గద్యనుబట్టి యీ రామభద్రకవి కాశ్యపగోత్రుఁడు. |
| 2 స్మార్త మత ప్రవిష్టుఁడు<br>3 ఈతడు తొలినుండియు రామభక్తుఁడు. | సకల కథాసార సంగ్రహావతారికననుసరించి యితడు అద్వైతి. ఈతఁడు బాలకృష్ణభక్తుఁడు ఈ గ్రంథమునందే, [1]కృష్ణరాయ లీ కవినిగూర్చి<br>"నీవును బాలకృష్ణపద నీరజభక్తుఁడ వార్యచిత్తమో దావహ సద్గుణుండవు అని పలికినట్లుగా చెప్పియున్నాడు. |
| 4 రామాభ్యుదయకర్తశైలి ప్రౌఢమై సంస్కృతాంగ్రపద చమత్కార ప్రయోగములతో నొప్పుచుండిన ప్రత్యేకవిశిష్టత గలది. ఆదినుండి యంత్యమువఱకు నొకరీతి నుండును<br>5. ఈ రామభద్రకవి కవిస్తుతిచేసినను ప్రత్యేకముగానె తనకు సంబంధించిన వారిని పేర్కొనలేదు. | సకల కథాసారసంగ్రహకర్తశైలి ఇతర కావ్యానుసరణములను దలపింపఁజేయుచు ప్రౌఢపదప్రయోగములతోనుండక ధారాశక్తి గలిగియుండును.<br>ఇతనికి శారద కవి యను మిత్రుఁడు గలడు కవి స్తుతిచేయుటయే గాక ఎలకూచి సాహిత్యలక్ష్మ చిత్ర కవిత్వప్రభావంబు లొక్కొక్క చోటం గనుపట్టు అని వ్రాసియున్నాఁడు |

సకలకథాసార సంగ్రహము వ్రాతప్రతి సంఖ్య 855. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము. దీనికి మఱియొక ప్రతి గలదు. దాని సంఖ్య 856. ఈ రెండును కాగితప్రతులు. బ్రౌనుగొరవారు సి.వి. 1840 అక్టోబరులో వ్రాయించినారు. వారి యభిప్రాయము ననుసరించి యిది ప్రశస్త గ్రంథము కాదు. ఇందు 8 ఆశ్వాసములందులో ఏడవ యాశ్వాసములో 799 పద్యము లున్నవి.

1. ఈ బాలకృష్ణవిగ్రహమును కృష్ణదేవరాయ లుదయగిరిదుర్గమును జయించినప్పు డందున్న బాలకృష్ణవిగ్రహమును తెచ్చి విజయనగరరాజధానిలో ప్రతిష్ఠించెను. దర్శనీయమగు నీ బాలకృష్ణవిగ్రహము మద్రాసు మ్యూజియమునందున్నది. (మాడుగుల శ్రీ కరశాస్త్రిగారి వ్యాసము.

పై వానినిబట్టి యిరువురవేఱని స్పష్టమగుచున్నది. అయినను సకల కథాసారసంగ్రహకర్త రామభద్రకవి కృష్ణరాయలకాలము వాడని పై కాలనిర్ణయమువలన నిరూపితమగుచుండుటచే నీత డష్టదిగ్గజములలో నొకడని నిర్ణయింపవచ్చును మఱియు రామాభ్యుదయకర్తయే సకల కథాసారసంగ్రహమునుండి పై పద్యమును గ్రహించెనని స్పష్టమగుచున్నది

ఆంధ్రకవి తరంగిణి 10 వ సంపుటములో అయ్యలరాజు రామభద్రకవి చరిత్రమున నీ సకల కథాసారసంగ్రహమునుగూర్చి యిట్లు వ్రాయబడియున్నది.

"పై వచనములో ఎలకూచి సాహిత్యలక్ష్మీ చిత్ర కవిత్వ ప్రభావంబు లోకోత్తరంబుగ గనుపడ రచియింపవలయునని యున్నది ఈ యెలకూచి యెలకూచి బాలసరస్వతియై యుండును. బాలసరస్వతి శిష్యుడో, అతనికి తరువాతివాడో రామభద్రుడను పేరు గల యొకానొక కవి యీ గ్రంథమును రచియించి గ్రంథమునకు గౌరవము గలుగుటకై కృష్ణదేవరాయలు తన నీ గ్రంథమును రచింపుమని కోరినట్లు కృత్యాదిని వ్రాసికొనియున్నాడు"
—(పుట 13)

మఱియు నందే 15 పుటలో పైని చూపిన 'కావక కన్న కంతావంబు' అన్న రామాభ్యుదయములోని సీసపద్యమును 'రెండవ రామభద్రుడు గ్రంథచౌర్యమొనర్చి తన గ్రంథమున చేసికొనె ననుటయే సమంజసము' అని వ్రాయబడి యున్నది

కవితరంగిణీ గ్రంథకర్తలు సకల కథాసార సంగ్రహము, ఎలకూచి బాలసరస్వతియో, మఱియొకరో వ్రాసినారను నభిప్రాయము గలవారై పై విధముగ వ్రాసిరి కాని వారు వ్రాసినట్లుగా నిది 'ఎలకూచి' అని యున్నంతమాత్రమున నాతడు ఎలకూచి బాలసరస్వతియే యని నిర్ధారణచేయుట యెట్లు? ఆ వంశీయులలో ఎలకూచి బాలసరస్వతి పెద్దముత్తాత తిరుమలేంద్రుడు పళియ రామరాయలచే నెనికల్లు గ్రామమునుగొన్న మేటి పండితుడు—అతడును నెలకూచియేకదా అతడు క్రీ శ 1510 ప్రాంతమువాడు అతడే సకల కథాసార సంగ్రహకర్త పేర్కొన్న యెలకూచి యన్నచో కాలముకూడ నప్పురాదు కాబట్టి యీయెలకూచి క్రీ శ 1600 సంవత్సర ప్రాంతములనున్న బాలసరస్వతికాదు—ఇంతకు గ్రంథకర్తల యభిప్రాయానుసారము బాలసరస్వతి శిష్యుడో, అతనికి తరువాతివాడో రామభద్రుడని పేరుగలకవి రచించెననిగదా! అప్పుడా రామభద్రుడు క్రీ శ 1650-60 ప్రాంతములవాడగును ఆ కాలమున సకల కథాసార సంగ్రహము రచితమగుటచే రామాభ్యుదయమునుండి గ్రంథచౌర్యము చేసెనని పై రీతిని వ్రాసిరి

కాని సకల కథాసార సంగ్రహము సావధానముగ పరిశీలించినచో పై యభిప్రాయము లెంతమాత్రము సరికావని చెప్పవలసి యున్నది. ఈ క్రింది సంవాదములను పరిశీలింపుడు. ఈ సంవాదములలో రెండుపద్యములు సకల కథాసార సంగ్రహములోనివి. ఆ రెంటింటికి పోలికపద్యము లొకటి తారాశశాంక విజయమునుండి, మఱియొకటి అనిరుద్ధ చరిత్రమునుండి యుదాహృతములైనవి.

మ॥ కలిమింగొంచెటు శ్రోత్రియుల్ సతులకొంతుల్ దీర్పగా లేక యా
కలకంఠుల్ తమ బాసి చక్కదనమున్ గాంభీర్యమున్ మన్మథో
త్కల సారంభము వాగ్విజృంభణము సత్తారుణ్యముంగల్గు వా
రలతోఁ బొంది తముం గణింపరనుచున్ గ్రంథంబులందట్లు వ్యా
కులులై వ్రాసినమార్గముల్ దలఁతురే గుంభిన్ భుజంగాగ్రణుల్.
—సకల కథాసార సంగ్రహము.

ఉ॥ లోకములోన కొందఱుబలుల్ సతులన్ దనియింపలేక న
ష్టాకమనీష నవ్య పురుషుల్ తమభామల నంటకుండ తా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁగూడిన పాపమంచు న
య్యాకులపాటు చూచియిటు లాకులపా లొనయంగ నేఁటికిన్॥
—తారాశశాంక విజయము.

సీ॥ జలజాక్షి నుస్యంబు సన్మార్గ మనియెంచి
తరుణి దుర్మార్గంబు దలఁచ మఱచి
అతివ ముఖాబ్జంబు నకలంకమని యెంచి
యింతి కలంకంబు నెంచ మఱచి
సుందరి చిఱునవ్వు శుచియని మదినెంచి
నలివేణి యలుచి దాఁ దెలియమఱచి
శోభాంగి చనుగవ సువృత్తి మనియెంచి
భామ దుర్వృత్తింబు పలుక మఱచి
గీ॥ కలికి శృంగార తతియెంచి కాంతపరుని
కలిపి రమియించునట్టి సంగతులు మఱచి
సుగుణివంటి మహాత్ముంబుగాని యొసఁటిని
అజ్ఞుఁడనఁ బ్రాజ్ఞుఁడన నెవ్వ రరసిచూడ॥
—సకల కథాసార సంగ్రహము

సీ॥ సకియ కౌనుదలంచి సన్మార్గమనుఁ గాని
యింతి దుర్మార్గత నెంచఁడయ్యె
చెలువ చన్గవ దలంచి సువృత్తమనుఁ గాని
తరుణి దువృత్తింబు దలఁపఁడయ్యె
అతివ మోముఁ దలంచి యకలంకమను గాని
తెఱవ కళంకంబు తెలియఁడయ్యె
సుదతి నవ్వుఁ దలచి శుచి యనుగాని య
వ్వెలఁదుక యపుచి భావింపఁడయ్యె
గీ॥ గురునివంటి మహాత్ముఁ డీక్కరణి తరుణి
చక్కదనమే గుణంబుగ సంస్మరించుఁ
గాని వ్యభిచారదోషంబుఁ గాంచడయ్యె
నజ్ఞుఁడనఁ బ్రాజ్ఞుఁడన నెవ్వఁ డరసి చింత.
—అనిరుద్ధ చరిత్ర - కనపర్తి
అబ్బయామాత్యుఁడు [1]

తారాశశాంక విజయమును రచించిన శేషము వెంకటపతి విజయరంగ చొక్కనాథుని కాలమువాడు. అనగా క్రీ. శ. 1780 ప్రాంతమువాడు అనిరుద్ధచరిత్ర లేక కవిరాజ మనోరంజన కృతికర్త అబ్బయామాత్యుఁడు క్రీ. శ. 1750—70 ప్రాంతమువాడు. కవితరంగిణీ గ్రంథకర్తల యభిప్రాయము ననుసరించి, సకల కథాసార సంగ్రహమున రామభద్రకవి వీనిని పై గ్రంథములనుండి గ్రంథచౌర్య మొనరించినచో నీ గ్రంథము 17 వ శతాబ్ది చివర భాగమునదో, ఆవెనుకదో వ్రాయబడియుండవలెనుగదా! కృష్ణదేవరాయల తరువాత రెండు శతాబ్దుల వెనుకనున్న కవి, కృష్ణరాయని పేర నెటు కృతిని వెలయింపగలడు? ఒకవేళ వెలయించినను నప్పుడందలి బాలకృష్ణ భక్తిప్రసంగమెట్లు ప్రసక్తము కాగలదు? కాబట్టి పై విషయములు పర్యాలోచించిన సకల కథాసార సంగ్రహకర్త రామభద్రకవి కృష్ణరాయల అష్టదిగ్గజములలో నొకడని నిశ్చయింపవచ్చును.

1. గ్రంథచౌర్యము - మానవల్లి రామకృష్ణకవి. భారతి. జనవరి 1937 సం 14. సం 1. 1—20 పుటలు.

7. చింతలపూడి ఎల్లకవి లేక రాధామాధవకవి. ఈతడు రాధామాధవములో స్పష్టముగా

శా. రాధామాధవమద్భుతాంకితముగా ప్రౌఢక్రియం జెప్పిన
న్మాధుర్యంబున కృష్ణరాయ విభుకర్ణాటేశు మెచ్చించినా
రాధాకృష్ణప్రతిమాన సత్కవులలోనన్ భూమణ్డలిలో
రాధామాధవ నామమందిన జగత్ప్రఖ్యాత చారిత్రుడన్

అని చెప్పుకొన్నాడు ఇక్కడ కృష్ణరాయలు, భావప్రతిమాన సత్కవులు అనగా ఆంధ్రకవితా పితామహ అల్లసాని పెద్దన పేర్కొనబడినారు. ఇంతేకాక, గ్రంథమధ్యమునగూడ శ్రీ కృష్ణుని గూర్చి చెప్పెడునట్టున, "అరిమురి శ్రీ కృష్ణరాయ దాత్మకలంగన్" అని కృష్ణరాయనామముతో పేర్కొన్నాడు ఈత డష్టదిగ్గజములలో వాడు కావుననే నాంతరంగికముగా నిట్లు వ్రాయగలిగినాడు. మఱియు నీతడు కృష్ణరాయని వెనుక అచ్యుతరాయని ఆ స్థానమున నున్నవాడు. అతని స్కంధావార లేఖకుడు మంత్రియునగు సంజయ తిమ్మరసుకు కృతినిచ్చినాడు. ఈ ఆస్థానసంబంధము పూర్వ మీతడు కృష్ణరాయని యష్టదిగ్గజములలోని వాడగుట స్పష్టము చేయుచున్నది.

8. కందుకూరి రుద్రకవి ఈతను కృష్ణదేవరాయలవారి యష్టదిగ్గజములలో నొకడని వారి వంశవృత్తాంతము దెలుపుచున్నది. 1 మఱియు నీతడు రాయలయాస్థానమున నీశాన్య సింహాసనము నధిష్ఠించెనని యందు చెప్పబడినది. ఇదియొక్కటియే రుద్రకవి యష్టదిగ్గజములలోవాడని చెప్పుటకు చాలును—దీనినిబట్టి మనకొక నూతన విషయము తెలియుచున్నది. రాయల కొలువుకూటమునవున్న భవనము భువనవిజయముగదా! భువన భారమును భరించునవి అష్టదిగ్గజములు—కావున భువనవిజయ నామ మన్వర్థమగునట్లుగా రాయలవారు కొలువుకూటములో—ఎనిమిది దిక్కుల నెనిమిది సింహాసనములుంచి, అం దెనమండుగురు అష్టదిగ్గజ కవీశ్వరులను వానిపై కూర్చుండ చేసెడివారని తెలియుచున్నది.

ఈ భువన విజయము, పూర్వరాజ భవనములలో నొక తరగతి భవనము—భువనవిజయమను పేరితో గాక భువనతిలకము భువనమండనము అను పేళ్లతో కొన్ని భవనములనుగూర్చి భోజుడు 'సమరాంగణ సూత్రధారము' అను గ్రంథములో నిచ్చియున్నాడు 1 అందీ అష్టసింహాసన ప్రశంసలేదు బహుశః కృష్ణరాయలే దీనిని మొదట యీ భవనములలో నిర్మాణము చేయుటకు హేతుభూతుడై యుండును. అష్టదిగ్గజములను వ్యవహారము కృష్ణరాయల కాలమునుండి యీ వ్యవహారము కలుగుట కిదియే కారణమై యుండవచ్చును.

పై చర్చయొక్క సారాంశమిది కృష్ణరాయల కాలమున అష్టదిగ్గజములనబడు నీ క్రింది యెనమండుగురు కవులు విలసిల్లిరి.

(1) అల్లసాని పెద్దన (2) నంది తిమ్మన (3) మాదయ్యగారి మల్లన (4) ధూర్జటి (5) తెనాలిరామలింగ కవి (6) రామభద్రకవి (7) రాధామాధవ కవి (8) రుద్రకవి—

వీరందఱును అచ్చముగా తెలుగు కవులే కాని సంస్కృతము కర్ణాట కవు లెంతమాత్రమును కారు.

ఈ అష్టదిగ్గజములను సంప్రదాయము కృష్ణరాయని కాలము నుండి వ్యాప్తమైనది. గోల్కొండ నవాబుల యేలుబడిలో నున్న సంస్థానములలో అష్టదిగ్గజ కవులుండెడివారు. తూర్పుగోదావరి మండలమున పెద్దాపురము సంస్థానమున శృంగారకవి, మధురకవి, బంధకవి, చిట్టికవి, నిమిషకవి, త్వరకవి ఘోరకవి, శతఘంటకవి అని అష్టదిగ్గజములుండెడివారు. ఇట్లే కార్వేటి నగర సంస్థానమున కూడ అష్టదిగ్గజములు వెలసినట్లు ప్రతీతియున్నది. వీరు మాకరాజా వెంకట పెరుమాళ్లురాజా కాలమున నుండిరి. ఋగ్వేది కవి, వెంకట నారాయణ కవి పోలిపెద్ది వేంకటరాయడు, పాలమంగలము అప్పయ కవి సారంగపాణి, శ్రీశైలకవి, ముడుంబ అప్పయాచార్యులు, రాయభట్టు వీరరాఘవ కవి. ఋగ్వేదకవి వేంకటాచలకవి అనువా రెనమండ్రు కవులు.

అష్టదిగ్గజములనుగూర్చి నాకు తెలిసిన విషయములను కొన్నింటినిందు ప్రకటించితిని. భావిపరిశోధనమున నింకను విశేషములు బయలుపడవచ్చును. ఆంధ్రవాఙ్మయమున స్వర్ణయుగమని చెప్పదగిన కృష్ణరాయని కాలమున విలసిల్లిన అష్టదిగ్గజము లెవరో యింతవఱకు నిర్ణీతము కానందున నింతగా వ్రాయవలసివచ్చినది రాయలవారి కాలమున వెలసిన కవు లెనమండ్రును తెలుగు కవులే యనియు వారు పై నుదహరించినవారనియు వ్యాసముయొక్క సారాంశము.

---

1 ప్రాసాద మేకం భువనతిలకమ్ పరిచక్షతే
చతురశ్రీకృతేక్షేత్రే భాగద్వాదశ భాగికే
చతుష్క భాగికోమధ్యే చతుః స్తంభోవిధీయతే
తచ్చహిర్వా హికోఽలిందో ద్వితీయోఽపిచభాగికః
నవకోష్టాంశ్చ కర్ణేషు ప్రాసాదాన్ వినివేశయేత్
..ద్దారుకంచ కర్తవ్యం తేషామంతర సంశ్రయమ్
తతో ఽర్ధ భాగికా భిత్తిః కర్తవ్యా సర్వతో బహిః
భద్ర భాగాయతో భద్రావినిష్క్రాంతి శ్చతుర్థకః
చతుష్క భాగి కాలింద ద్వయేన పరివేష్టితః
త్రిభాగ విస్తృతం భద్రం తద్బహిర్భాగనిర్గతమ్
భాగికం ప్రతి భద్రంచ కార్యాసుధియతః ఎమమ్
భాగార్ధ భాగతో భిత్తిర్భద్రస్య పరితో భవేత్
విధి రేష నిధాతవ్యః.

'భువనమండనము' భువనతిలకము. అను రాజభవనములు భోజుని చతురాంగణ సూత్రధారము – 30 అధ్యాయము ౦ జగృహాధ్యాయము భువనమండనము. *Vol I Gaekuard Series.*

అస్త్యేవ పీఠనిర్ముక్త శాలాభిః పరితోఽష్టభిః
అన్యోన్యశాలా సంబద్ధే యదాసా వేదదీయతే
కర్ణప్రాసాద శోభితః కోష్ఠైఃశాలోర్ధ్వమైర్యతః
ప్రాసాద సుందరో జ్ఞేయః తదా భువన మండనం.

**కథానిక:**

# త్రినేత్రుడు

శ్రీ రావూరి భరద్వాజ

ఆ కాలంలో గుణనిధి పేరు ఆబాల గోపాలానికీ సుపరిచితమైనదే! అతనికి విశాల సామ్రాజ్యముండటమూ, ఆ సామ్రాజ్యం సకల సుఖాలకూ నిధానమై ఉండటమూ అందుకు కారణం కాదు. అతడు విద్యాధికుడు. ఆ కారణాన పండితులను కవులను అమితంగా ఆదరించాడు. స్వతహాగా కొన్ని కావ్యాలను రచించాడు. ఎన్నిటినో అంకితం పొందాడు. నిజానికివి కూడా సరైన కారణాలు, కావు. డబ్బు కాంక్షించు కవులు, ఏ రాజునైనా ఇంద్రుడని చంద్రుడని పొగడవచ్చు. దానకర్ణుడనీ, అభినవదధీచి అని కీర్తించవచ్చు. కాని సామాన్య జనం అలా అంటుందా? పట్టుమని పాతికమంది కవులు కీర్తించి నంతమాత్రాన, అశేష జనావళి ఆ మాటలను విశ్వసిస్తుందా? లేదుగానీ గుణనిధి ఏలుబడిలో ఉన్న ప్రజలందరూ అతన్ని కీర్తిస్తున్నారు సరయిన పరిపాలన—అంటే—ప్రజల కష్టనిష్ఠురాలు తనవిగా భావించి చేసే పరిపాలన, గుణనిధికి జన్మతో బుట్టిన విద్య.

క్రిమి చీడకుండా, తల్లిపొత్తిళ్ళలోని పసిపాపలులాగా ప్రజలు సుఖజీవనం చేస్తున్నారు. అదృష్టవశాత్తూ ఆ దేశపు నైసర్గిక పరిస్థితులుగూడా అందుకు అనుకూలంగా ఉన్నాయి. రెండు శైలాల మహానది ప్రవహిస్తున్నది. ఒకవైపున పెట్టనికోటలాగ పర్వతపంక్తులున్నాయి ఈ మూడుదిక్కులనుండీ శత్రుభయమన్న మాట లేదు. నాల్గవదిక్కున మరొక రాజ్యమున్నది కొన్ని దశాబ్దాల నుండీ, ఈ రెండు రాజ్యాలూ అన్నదమ్ములలాగా మెలగుతున్నాయి సంపత్సమృద్ధి కారణంచేత విద్యాసముపార్జనాసక్తులు, లలితకళాప్రియులు, జనం నిండా కిలకిలలాడుతున్నారు. జీవితం, జీవితం లాగా కాక, రుచిరస్వప్నంలాగా వారు అనుభవిస్తున్నారు.

అయితే ఈ రుచిరస్వప్నం ఎక్కువకాలం ఉండలేదు. అది భగ్నమయ్యే సమయం సమీపించినట్లు అనేక చిహ్నాలు హెచ్చరించాయి.

ఒకనాడు గుణనిధి కొలువులో ఉండగా, భటుడొకడు తత్తరపాటుతో ప్రవేశించి, గౌరవ పురస్సరంగా వంగి అభివాదం చేసి, ఉత్తరమొకటి రాజాగారికిచ్చాడు. సాహిత్య మీమాంసతో, ఉగిసలాడిపోతున్న సభ ఒక్కసారి ప్రశాంతమైపోయింది. రాజాగారు లేఖను మంత్రి[illegible] [illegible]. కొన్ని క్షణాలపాటు మంత్రిగారు మాట్లాడనుకూడా మాట్లాడలేక పోయారు. తర్వాత గొంతు సవరించుకొని నిలబడి, సభికుల నుద్దేశించి ఇలా అన్నారు:—

“మహాజనులారా” మంత్రి కంఠం బొంగురుపోయింది. “ఇంత కాలంనుండీ మనం ఏ కష్టమూ ఎరుగక సుఖంగా రోజులు వెళ్ళబుచ్చాం. నిజం మాట్లాడితే మనకు ‘సుఖం’మీద విసుగు పుట్టింది గూడాను. భగవంతుడు గూడా బహుశః ఇదే అభిప్రాయంతో ఉన్నాడేమో మరి! ఏనాడూ వినని మహావిపత్తు ఇప్పుడొకటి మనల్ని చుట్టుముట్టనున్నది. అణకువగల బానిసలాగా, ఇన్ని రోజులనుండీ అణిగిమణిగి ఉంటున్న మహానదికి తీవ్రంగా వరదలు వస్తున్నట్లు తీర రక్షకభటులు ఇప్పుడే వార్తను పంపించారు. వరదల ఉధృతాన్నిబట్టి చూస్తే, మహానది ఏ క్షణంలోనైనా, పొంగి దేశాన్ని ముంచెత్తగలదని తీరరక్షణశాఖ ప్రధానోద్యోగి అభిప్రాయపడుతున్నాడు. ఐనా మనం భయపడవలసిన పనిలేదు. సైనికశక్తినంతా తరలించి, వరద ప్రమాదాన్నుంచి దేశాన్ని రక్షించే ప్రయత్నాన్ని ఇప్పటనుంచే ప్రారంభించవలసిందిగా సర్వసైన్యాధ్యక్షునికి ఉత్తరువు లిస్తున్నాను.”

ముఖ్యమంత్రి ఏదో చెబుతూనే ఉన్నాడు. సభికులు వింటూనే ఉన్నారు. జనాన్ని తొలగద్రోసుకొంటూ మరొక భటుడు ప్రవేశించి మరొక జాబును మంత్రిగారికిచ్చాడు. మంత్రి నడుము విరిగినవాడిలాగా, ఆసనంలో కూలబడ్డాడు. రెండు చేతులమధ్యా తల ఇరికించుకొని నేలచూపులు చూస్తూ ఉండిపోయాడు ఆ ఉత్తరంలోని విషయమేమిటోనని సభ గుసగుసలు పోయింది. ఒకరిద్దరు ‘రెండవ లేఖలోని విశేష మేమి’టని కూడా అడిగారు.

మంత్రిగారు చాలా సేపటికి గానీ తెప్పరిల్లలేదు. అయినా ఆయన నిలబడలేకపోయాడు. గుణనిధి అనుజ్ఞ తీసుకొని, కూచునే ఆ లేఖలోని విషయం వివరించాడు.

“నదీప్రవాహం గట్లు త్రెంచుకొని దేశంమీద ఉద్ధృతంగా తరంగాలు గ్రామాలకు గ్రామాలను నాశనం చేస్తున్నాయి. మహానది మహావేగంతో, కోపించిన మత్తేభంలా దేశంమీదకు పరుగులెత్తుతున్నది. మహాజనులారా! ఒక్క మనవి!!” ఈ మాట అని మంత్రి కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. అతని కన్నుల నుండి అశ్రువులు [illegible]. ప్రజా శ్రేయస్సే రాజరికం వారికి ముఖ్యధర్మమని, మీరు [illegible] చేసుకొన్నారు. మహారాజులు, ఈ విపత్తులోనూ ఆ ధర్మాన్ని విడనాడవని [illegible] చేస్తున్నాను. కానీ, ఇంతటి

ఘోర ప్రమాదావసరంలో ప్రభుత్వం మీకు చేసే ఉపకారం చాలా స్వల్పకాలంలో ఉంటుంది. మీ ఆత్మరక్షణను మీరే చేసుకోండి. ఎవరి ప్రాణాలను వారు దక్కించుకోండి. అవకాశమున్న మేరకు ఇతరులకు తోడ్పడండి. ప్రభుత్వం మీకు సహాయపడటానికి సర్వవిధాలా ప్రయత్నిస్తుంది. ఇక సభ ముగించేదాం."

* * * *

ఆనాడు శంకరుడు చాలా చికాగ్గా ఉన్నాడు. అతి ముఖ్యమైన విషయాలు నివేదించటానికి వచ్చిన ప్రముఖులను కసిరికొట్టాడు. ఆప్యాయంగా లాలించే నందీశ్వరుణ్ణి పారద్రోలాడు. కాలుకాలిన పిల్లిలాగా అటూ ఇటూ తిరిగాడు. అందివచ్చిన వస్తువులను ఈడ్చితన్నాడు. పార్వతీదేవి ఇదంతా గమనిస్తూనే ఉంది. కారణంకోసం ఆవిడ ఆలోచించలేదు. తరచు భర్త చేసే పిచ్చిపనులు సర్దుకోలేక ఆవిడ సతమతమయిపోతున్నది. మొన్నటికి మొన్న ఆ భస్మాసురిడికి, ఆ దిక్కుమాలిన వరమొకటి ఇచ్చాడు. వాడా వరాన్నే తిప్పికొట్టటానికి సిద్ధమయే సరికి—తప్పించుకొందుకు నానాబాధలూ పడవలసి వచ్చింది. విష్ణుమూర్తి లేకపోతే ఏంగానూ? ఆ జలంధరుడికి అల్లాగే ఇచ్చాడు వాడు—చివరికి తన ఇంటనే పడ్డాడు. ఆ గండం గడవడానికి ఎన్ని చిక్కులు పడవలసి వచ్చిందో జ్ఞప్తికి తెచ్చుకొంటే, పార్వతీదేవి హడలిపోతుంది.

"ఏది చేసినా ఇంతేనా! ఒక ఆలోచనలేదు పాడూ లేదు. ఏది అడిగితే దాన్ని ఇచ్చేయడమే! అదృష్టవశాత్తూ ఏ భక్తుడూ నన్ను అడగలేదు. అడిగితే నన్నివ్వడానికికూడా ఈయన సందేహించరు. తను భక్తులభుణ్ణని, మహోదారుణ్ణని అంతరంగంలో ఉండివుండాలి. అది నిరూపించుకోవటంకోసం, నానాబాధలూ పడతారు. వ్యవహారం చూస్తుంటే—మళ్ళా ఏదో కొంపమునిగినట్టే ఉంది" అనుకొన్నది పార్వతి.

"ఏమిటండీ?" అని పార్వతి అడగలేదు. కాని శంకరుడే "ఏమిటంటే" అంటూ ప్రారంభించాడు. "నా కొద్దుబాబో అని మొత్తుకొంటున్నా వినకుండా దేవలోకం ఈ బాధ్యత నా నెత్తిన కట్టింది. మొదట్లో సాధకబాధకాలు తెలియక నేనూ అంగీకరించాను. దీనివెనుక బ్రహ్మాండమైన కుట్ర ఉన్నట్లు ఇటీవలదాకా నాకు తెలియదు." అన్నాడు శివుడు.

"తలా తోకా నాకు తెలియటల్లేదు" అన్నట్టు ముఖం పెట్టింది గిరిజాదేవి; ఆమాట పైకి అనటానికి ధైర్యంలేక.

"నీకు ప్రతిదీ విడమర్చి చెప్పాలి" అని విసుక్కున్నాడు రుద్రుడు. "సృష్టించే బాధ్యత బ్రహ్మది. పోషించటం విష్ణుమూర్తి వంతు. లయం నా పాలబడ్డది."

"ఇందులో కుట్ర ఏమున్నదీ?" అని మెల్లగా అన్నది గిరిజ హడలిపోతూ.

"పాపకానికి పుట్టిందానివి! నీకు తెలివిలేదు అంటూ అనుకోవటం నాదే పొరపాటు." అని రెండుసార్లు అటూ ఇటూ తిరిగాడు శివుడు. "అదిగాక! నీ మాత్రం తెలీదా? నా నా జంతుజాలన్నీ, మనుషుల్నీ, కొండల్నీ, గుట్టలను, అన్నిటినీ కేవలం సృష్టిచేసి గమ్మున కూర్చున్నాడు బ్రహ్మ. ఆయన్ని కేమాక్షేపణా లేదు. ఆ ఉన్నదానితో, అలా యిలా రెండురోజులు నాటకమాడించేస్తాడు విష్ణుమూర్తి. సంహారణం నా కాళ్ళకు చుట్టుకొంది. నా విధి నేను తప్పకుండా చేయవలసేంత వాడిని. జీవకోటి యావత్తూ నన్ను ప్రబలశత్రువుగా చూడటం, నేను సంహారకుణ్ణనే! అసలున్న కిటుకేమిటంటే, ఉండే లొసుగు లేవో సృష్టిలోనే ఉన్నాయి. అవి విష్ణుమూర్తిగారి హయాంలో పరాకోటి నందుకొంటాయి. అంతటితో అవి చరమదశకొస్తాయి. ఆ కొస్తాపని నా చేతిమీదుగా జరిగిపోతుంది. ఉన్న పద్ధతి ఇదీ! అయితే ఎవ్వరూ ఇల్లా అనుకోరు. నే నెట్లా చావను?" అన్నాడు మృత్యుంజయుడు; తనకు చావులేదన్న విషయం తాత్కాలికంగా మరిచి.

"నిజమే సుమా!" అన్నది పార్వతి ఈ వివేకం ఇప్పుడే తనకు కలిగినట్లు. నిజానికి ఇందులో ఆవిడ కేమాత్రం ఉత్సాహమూ లేదు. అలా లేనట్లు పైకి కనుపించితే 'ఆయన' మరి మండిపడతాడు. అదీగాక శంకరుడు అల్పసంతోషి. కొంత ఊదర ఎవడు కొట్టినా ఉబ్బి తబ్బిబ్బవుతాడు. ఈ బలహీనత పార్వతి ఏనాడో గమనించింది. తన కేపని కావలసివచ్చినా, భర్తను కొంత ఉబ్బేసి నెరవేర్చుకోవటం ఆవిడ కలవాటయింది. రవంత ప్రోత్సాహకరంగా మాట్లాడితే చాలు; చిత్తయిపోగలడు.

"పార్వతికి కొంతలో కొంతైనా 'జ్ఞానోదయం' కలిగినందుకు శంకరుడు చాలా సంతోషించాడు.

"నిజంగా ఇందులో నా తప్పేమిటి?" అన్నాడతను భార్యతో. "నీళ్లు సృష్టించింది బ్రహ్మ. దానికి ప్రవహించే శక్తి నిచ్చిందికూడా అతనే కదా?"

"ఔను" అన్నది పార్వతి.

"దానిచేత రకరకాల చేష్టలా చేయిస్తున్నవాడు హరి. అవును కదా?"

"ఔను."

"గుణనిధి రాజ్యానికి సరిహద్దుగా ప్రవహిస్తున్న మహానది భయంకరమైన వరదలతో పొంగుకొని, అతని దేశాన్నంతా ముంచివేసింది. విదింట మూడువంతుల దేశం వరదలో మునిగిపోయింది. వేలాది గ్రామాలు మునిగిపోయాయి. లక్షలకొలది చచ్చిపోయారు. పంటభూములన్నీ నీటిమయమయ్యాయి. పశువులు...సరేసరి. బ్రతికున్న కొద్దిమందీ, నరకయాతన పడుతున్నారు. ఈ ఘోర కలికి కారణం నేనేనని, వారి ఉద్దేశ్యం. స్థితి కారణకర్త విష్ణువనీ, ఈ మహాఘోరానికి కారకుడు అతగాడనీ వారనుకోవటం లేదు. హరికి నామీద, లోలోపల చెడ్డ అభిప్రాయాలున్నాయి. నా గౌరవాన్ని తింపదలచాలనీ, నా యశస్సును కళంకితం చేయాలనీ, తీవ్రంగా ప్రయత్నిస్తున్నట్లు నే ననుమానిస్తున్నా. లేకపోతే, ఇటువంటి దారుణమైన పనిచేయవలసిన అవసరమేమిటో నాకు బోధపడకుండా ఉన్నది. ఏహ్యాతి ఏహ్యమైన ఫలితాల నిచ్చే

లోకాలు ప్రశాన్మయ నాటడమూ, విష్ణువు వాటిని పోషించడమూ; చివ
రకు ఆ తిరుగులిక్కా లయదిండకలసిన బాధ్య నేనా?"

పార్వతికిగూడా ఇది చాలా అన్యాయమనే తోచింది. "అయితే—మీ రిప్పు డేమిటి చెయ్యాలను కొంటున్నారు?" అన్నది.

"అదే నాకూ తోచటంలేదు" అన్నాడు శివుడు తల గోక్కుంటూ. చంద్రరేఖ భయంతో వెనక్కు ముణుచుకొంది.

"పోనీ మీరు మరోశాఖ తీసుకోగూడదూ?" అని సలహా ఇచ్చింది పార్వతి.

"ఓ. నీ ఆలోగన దివ్యంగా ఉన్నది" అన్నాడు శివుడు. అంతలోనే, తను ఇందాక పార్వతిని, తెలివిలేని దద్దమ్మగా అనీ పోసుకొన్న సంగతి జ్ఞప్తికొచ్చి "అయినా ఇప్పుడేమీ చెప్పలేను. ఆలోచించి చూస్తాను." అన్నాడు.

## 2

సుఖాలమీద సుఖాలురావటం కష్టమే కావచ్చు. కష్టం వెంట కష్టం, బాధ వెంట బాధ ఇనకపోతరల్లే రావడం మహా సులభం.

ఇప్పటికే రాజ్యం నానా కచాటుగానూ ఉంది కొన్ని లక్షలమంది జనం, కొన్ని గంటల్లో చనిపోయినప్పుడు, ఆ దృశ్యం గోహించటంగూడా కష్టమే! చచ్చినవారు చావగా బ్రతికినవారు కూటికీ గుడ్డకూ అల్లాడిపోతున్నారు. సుక్షేత్రాలన్నీ వరదలపాలయ్యాయి. రాజ్యమంతటికీ అన్నవస్త్రాగులిచ్చే భూములు ఇసక మేటలు వేశాయి తిరిగి వాటిని సాగుచెయ్యాలంటే కొన్ని సంవత్సరాలు పడుతుంది. విశేషమైన జననష్టం సంభవించిన కారణంగా, మానవశ్రమగూడా కలసినంత లభించటం లేదు ఉన్నవారైనా రోగ పీడితులు, క్షుధాబాధితులూను. వారిచేత పనిచేయించటం గుణనిధికి ఎంతమాత్రం ఇష్టంలేదు. అయితే మరి పున ర్నిర్మాణ మెలా? శ్మశానవాటికలాగా మారిపోయిన ఈ విశాల ప్రదేశమంతా ఇలా పడిఉండవలసిందేనా?

"కాదు ప్రభూ!" అన్నాడు ముఖ్యమంత్రి "మనం ఇంతవరకు ఒకరిని యాచించలేదు. యాచకులను ఆదరించకపోనూలేదు, కాలం మారినప్పుడు, కాలానుగుణంగా మనమూ మారాలి. ప్రభువులు అన్యథా భావించరన్న విశ్వాసంతోనే నాక సూచన చేయదలచుకొన్నాను. మన పొరుగురాజు మిత్రావసుని సహాయం, మన మీ సమయంలో అర్థించుదాము. మనకు సంభవించిన ఈ ఘోరాపద, ఆ మహారాజుకు తెలియకపోదు. కష్టకాలంలో, సోదరప్రభువుకు అపాటి సాయం మిత్రావసు చేయగలడన్న నమ్మకం నా కున్నది. రేపే, ఒక సౌహార్ద ప్రతినిధిని, అతనివద్దకు పంపాలని అనుకొంటున్నాను....ఇందులో..."

గుణనిధి, కళ్లవెంట బొటబొట నీరుకారింది. "ఇది ఆత్మాభిమానాన్ని హత్యచేస్తుందేమో?" నన్న సందేహం వెలిబుచ్చాడు గుణనిధి.

"మనం ప్రజలకోసం చేస్తున్నాముగానీ, స్వీయానికి కాదు. ఈ సాయం మనకు రాకపోతే, మిగిలిన ఈ ప్రజానీకానికి మనం కూడు గుడ్డ ఎలా ఇవ్వగలం? చేతులా ఇంతమందిని మృత్యుముఖంలోకి నెట్టగలమా? ఇంతకాలమూ మనం, వారి ఉపకృతులు తిన్నాము. సమయమొచ్చినప్పుడు, "మన గౌరవం—మన ఆత్మాభిమానం" కించపడుతుందని, వారిని చంపటమా? మీ, నా గౌరవా గౌరవాలకోసం, ఇన్ని లక్షలమందిని బలిచేయటం నా అభిమతం కాదు. మీ అభిప్రాయమేమిటి? మిత్రావసు మన సాటి రాజు సహృదయుడు. ఈ ఆపత్సమయంలో మనలను ఆదుకొంటాడు మీ ఉద్దేశ్యమేమిటో చెప్పండి! కూడు గుడ్డలకు కరువైన దేశంలో, ఎంత మాతృదేశాభిమానమున్నా మనుషులు ఉండలేరు. అది లభించే మరోచోటుకు తప్పకుండా పోతారు మనం సత్వరమే తగిన విధానం ఆలోచించకపోతే, ఈ ప్రజ మరోచోటికి వలసపోతారు పోక తప్పదు. అప్పుడు మీరు, నేను, మన మన ఆత్మగౌరవాలు మాత్రమే ఇక్కడ మిగిలిఉండటం జరుగుతుంది..."

"ప్రభూ!"

అంటూ భటుడొకడు వచ్చాడు.

"ఏమిటి?" అన్నట్టు కనుబొమలతో ప్రశ్నించాడు మంత్రి.

"మిత్రావసు ప్రభువు సైన్యసన్నద్ధుడై వస్తున్నట్టు ఇప్పుడే వేగులవాని వార్త"

గుణనిధి నిలువునా కుంగిపోయాడు. మంత్రి ముఖాన గోటిగాటుకు నెత్తురులేదు. ప్రూన్పడిపోయాడు. రవంతసేపటికి తెప్పరిల్లి "ప్రభూ! కష్టాలలో ఉన్న మనకు ప్రతిదీ అశుభాన్నే తలపింప చేస్తున్నది. మనకు సంభవించిన ఈ దుర్దశకు చింతించి, మన క్షేమాసమాచారాల నడగడంకోసమయి మిత్రావసు వస్తున్నారేమో.."

"సైన్యంతోనా?" అన్నాడు గుణనిధి.

కొన్ని గంటలలో అంతా ముగిసిపోయింది. సమయంకోసం కాచుకుచూచున్న మిత్రావసుకు, చక్కని అవకాశం లభించింది. దేశం నానా బీభత్సంగా ఉంది. సైన్యంలో ఎక్కువభాగం (ప్రజల్ని రక్షించే కార్యక్రమంలో) నాశనమైంది. ఉన్న సైన్యానికి, ప్రజలకు తిండిలేదు. మీదు మిక్కిలి ఎంతో అసంతృప్తి అందరిలోనూ గిలగిలలాడుతున్నది. ఒక దేశాన్నాక్రమించటానికి కావలసిన పరిస్థితు లివేనూ. మిత్రావసు ఈ అవకాశాన్ని చక్కగా వినియోగించుకొన్నాడు. కొంత సైన్యాన్ని వెంటబెట్టుకొని, గుణనిధిమీద యుద్ధం ప్రకటించాడు. విరివిగా ఆహారపదార్థాలిచ్చి, ప్రజలను, కొందరు సైనికులను, అధికారులను తనవైపుకు తిప్పుకొన్నాడు మిత్రావసు. ఇంత స్వల్పపు లంచానికి—కేవలం కూటికి—మానవుడు ఇంతగా లోబడిపోతాడని మిత్రావసుగూడా అనుకోలేదు. ప్రభుభక్తి పరాయణులైన కొందరు మాత్రం గుణనిధి తరఫున యుద్ధంచేశారు. మిత్రావసు సైనికశక్తి అధికమైనది కావటంవల్లా, అధికారులు కోట రహస్యాలను వెల్లడించడంవల్లా, గుణనిధి ఓడిపోయాడు. మంత్రి పోరాటంలోనే మరణించాడు.

అంతఃపురం అగ్నిప్రవేశం చేసింది. గుణనిధిగూడా ఆత్మహత్య చేసుకోబోయాడు. కానీ ఏదో మహత్తరమైన శక్తి అతని నా పని నుండి విరమింపజేసింది. శత్రుసైనికులు, విజయోత్సాహంతో, కోటలోకి ప్రవేశిస్తున్న తరుణంలోనే, గుణనిధి రహస్యమార్గంగుండా తప్పించుకొన్నాడు. గుణనిధికోసం మిత్రావసు కోటనంతా గాలించాడు. అతని జాడ ఎక్కడా కనపడలేదు.

* * * *

ఆపూట శంకరుడు ఉత్సాహంగా ఉన్న సమయం కనిపెట్టి "దాని విషయం ఏమాలోచించారండీ?" అన్నది పార్వతి.

"దేనివిషయం?" అన్నాడు శంకరుడు.

'మరీ ఇంత మరుపేమిటో' అని మనసులో అనుకొన్నది పార్వతి "అదే! మీ శాఖను మార్చుకోవటం గురించి" అన్నది పైకి మామూలుగా.

"మార్చుకోవటం నా కంతగా నచ్చలేదు"

"అయితే అనుభవించండి" అన్నది పార్వతి కష్టపడుతూ. "పదవులేమో కావాలి. బాధ్యతలు మట్టుకు ఉండకూడదు. ఒక చెంప 'లోకమంతా నన్ను ఆడిపోసుకొంటుందో' అని గోల పెట్టుకుంటిరి. మరో చెంప పదవిని బట్టుకొని వేళ్ళాడుతుంటిరి. అంత వ్యామోహం ఉన్నవారు, అలా అనుకోవటం దేనికి?" అని నాలుగు పెట్టింది పార్వతి.

నిజంగా శంకరుడికి కోపం రావలసింది రాకపోగా, చిరునవ్వొకటి నవ్వేశాడు.

"నువ్విలాగే అంటావని నాకు తెలుసు అదృష్టవశాత్తూ నేనూ నీలాంటివాడనే అయితే,.. ఇక చెప్పవలసిం దేముంది!" అని కొనసాగి, "నేను తీవ్రంగా ఆలోచించాను గట్టిగా పట్టుబడితే, శాఖ మారకపోదు. అలా మార్చుకోవటంవల్ల మరో ఘోరమైన ప్రమాదం కలిగే సూచనలు కనుపించాయి. ఇక మార్చుకోవటమన్న ఉద్దేశాన్నే మార్చుకొన్నాను" అన్నాడు.

"ఘోరమైన ప్రమాదమే!" అని ఆశ్చర్యాన్ని నటించింది పార్వతి. శంకరుడున్న ఉత్సాహంలో, పార్వతి కంఠంలోని అవహాస్యాన్ని గుర్తించలేకపోయాడు.

"విశేషంగా! ఇలా మార్చుకొన్నందువల్ల, బ్రహ్మవిష్ణులు నన్ను గురించి ఎంత మాట్లాడినా మాట్లాడవచ్చు 'శంకరుడు ఉత్త అర్భకుడనీ, ఆ శాఖను నిర్వహించలేక మావద్దొచ్చి ప్రాధేయపడ్డాడనీ, మేమే దయదలిచి మార్చామనీ, ఇటువంటి చేతగాని వాళ్ళకు ఏపని చెబుదామన్నా భయంగానే ఉన్నదనీ,—రేపటి నుండీ వాళ్ళు ప్రచారం ప్రారంభిస్తారు. వినేవాళ్ళకు గూడా ఇది నిజంగానే ఉంటుంది. ఇప్పుడు నే ననుభవిస్తున్న అపనిందకంటే, అవమానకరమైన నిందను, అప్పుడు తలొగ్గక తీరదు. ఇంతదూరం ఆలోచించే, నేనా ఉద్దేశాన్ని మార్చుకొన్నాను"

"శాస్తిచిక్కు వచ్చిందే!" అని రుసరుసలాడింది ఉమ. "మార్చుకొంటే, దుష్ప్రచారం. ఉంచుకొంటే అపనిందలు. —దీనికి తగ్గ ప్రతిక్రియ మీరు చెయ్యలేరటండీ? వాళ్ళ తల తిక్క వదలగొట్టే ఉపాయమొక్కటి ఆలోచించండి. ఆ సరస్వతి లక్ష్మి, వాళ్ళముందర తలెత్తుకొని తిరగలేకపోతున్నాను."

"కనీసం నీకోసమైనా చూస్తాను" అన్నాడు శివుడు.

"ఈ హాస్యానికేమి లెస్తురా..." అంటూ లోపలికి వెళ్ళిపోయింది పార్వతి.

## 3

గుణనిధి అలా నడిచిపోతూనే ఉన్నాడు. రాజలాంఛనాలన్నీ కోటలోనే విడిచిపెట్టాడు గనుక అతన్నిప్పు డెవరు గుర్తుపట్టలేరు. రోజులు, వారాలు, నెలలు నడిచాడు. నదులను దాటాడు, పర్వతాలను అధిగమించాడు. వందలాది జనపదాలను దర్శించాడు. చివరి కొక మహారణ్యం చేరుకొన్నాడు. అతని ఆత్మ కక్కడ శాంతి గోచరించింది కొన్ని క్రోసులదూరంవరకూ గ్రామమంటూ లేదు. ఒకవేళ మనస్సు మళ్ళీ మానవదర్శనం కోరినా, అది లభించనంత దూరం రావాలన్న నిర్ణయంకొందికే, అతని అరణ్యం ప్రవేశించాడు. అరణ్యాల్లో దొరికే ఆహారంతోనే తృప్తిపడాలి మనస్సు వేసే వెర్రి వేషాలకు తంధానకొట్టే సమాజం లేనందువల్ల, అదికూడా చెప్పినట్టు వింటుంది అదీగాక ప్రశాంతిగాగూడా ఉంటుంది.

ఒకటి రెండు రోజులు శ్రమపడి గుణనిధి ఒక కుటీరాన్ని నిర్మించుకొన్నాడు. కాయగసరులు తింటూ కాలం గడపాలనుకొన్నాడు. జీవించినంత కాలమూ, భగవధ్యానం చేసుకోవాలనుకొన్నాడు. ఏ క్రూరజంతువో భక్షిస్తే విచారించవలసిందేమీ లేదనుకొన్నాడు.

ఎంత త్రోసివేసుకొన్నా గుణనిధికి తన వెనుకటి జీవితం జ్ఞప్తికి రావటం మానలేదు ఒకప్పుడు మహోన్నతంగా, భోగభాగ్యాలతో తులతూగిన గుణనిధికి, బికారిగా, ఈ కుటీరంలో ఉన్న గుణనిధికి మధ్య భేదంకన్న, సన్నిహితత్వమే అధికంగా ఉన్నట్లు అతను అనుభూతి చెందేవాడు ఎంత ఆలోచించినా అతనికి ప్రత్యుత్తరం లభించని ప్రశ్న ఒకటి మాటిమాటికీ వాడిగా బాధపెడుతుండేది. లోకం ఇలా ద్వంద్వమయం ఎందుకు కావాలి? వెలుగు వెంట నీడ, ఆరోగ్యం వెనుక వ్యాధి, సుఖం పొదిగిటిలో దుఃఖం, విజ్ఞానం అడుగుల్లో మూఢత్వం, నవ్వుప్రక్కనే విషాదం, ఉండవలసిన అవసరమేమిటి? కాకపోతే ఒకటి అనవచ్చు. చీకటి లేకపోతే వెలుగును గుర్తించడమెలా? దుఃఖం లేకపోతే సుఖంలోని 'సుఖం' అనుభవంలోకి వచ్చేదెలా? నిజమే. మాధుర్యాన్ని మాధుర్యంగా గుర్తించటానికి, చేదు రుచిచూడ నక్కర్లేదు. చేదు రుచి చూడకపోయినా, మాధుర్యం మాధుర్యమే అవుతుంది గాని పులుపు కాదు గదా! అయినప్పుడు, ఈ అజ్ఞానము, దుఃఖము, మూఢత్వము, వ్యాధి, లోకంలో ఉండటానికిగల కారణం కనుపించదు. ఇప్పుడు లోకమనుభవిస్తున్న యాతనామయ జీవితంలో, మహ్రాతిక మూడు వంతులు, అనుకోనిదేదో వచ్చిపడటంవల్లనే జరుగుతున్నవి. ఎంత ప్రయత్నించినా, యాతనామయ జీవితపుటునికి సమర్థనీయం కావటం లేదు. ఏదో ఒక కారణం—వీటన్నిటికీ మూలమైన

కారణం—ఒకటి ఉండివుంటాయి. ఆ కారణం కనుగొంటే, జీవిత సూత్రం చేజిక్కినట్లే!

గుణనిధి, ఆ మహత్తరమైన కారణాన్ని గురించి ఆలోచించ సాగాడు. ముందు తననుండి ప్రారంభించాడు. సంవత్సరం క్రిందట—తను ఎలా ఉన్నాడు? ఎలా ఉన్నాడో గుణనిధి ఊహించుకొన్నాడు. ఈనాడు ఎలా ఉన్నాడు? ఎలా ఉన్నదీ తెలిసిపోయింది. నూరు సంవత్సరాల క్రిందట తన తాత ఉన్నాడు ఏభై ఏండ్ల క్రిందట తండ్రి ఉన్నాడు. ఈనాడు తను ఉన్నాడు. కాని నూరు సంవత్సరాల క్రిందట ఉన్న తన పితామహులను, ఈనాడున్న తనను చూడలేడు. సంవత్సరం క్రిందట రాజభోగాలతో తులతూగు తున్న తను, ఈనాటి "తనను" చూడలేడు. కారణ మేమిటి?

ఏదో ఆలోచన మనస్సులో గిలగిల కొట్టుకొంటోంది బయికి రావాలని ప్రయత్నిస్తోంది. కాని ఏవో అడ్డంకులు. సంవత్సరం క్రిందటి 'తనను' చూసుకొన్నాడు గుణనిధి. ఈనాటి 'తనను' చూసుకొంటున్నాడు అయితే రేపటి 'తను' ఎలా ఉంటాడు? ఏమౌతాడు? గుణనిధికి ఏదో సూత్రం దొరికినట్లయింది. మనస్సులో గిజగిజలాడుతున్న ఆలోచన, అవరోధాల నధిగమించింది. మానవుడు గతాన్ని చూడగలడు. వర్తమానాన్ని చూడగలడు. భవిష్యత్తునే దర్శించలేకపోతున్నాడు

"లోకంలో ఉన్న చాలా అనర్థాలకు, బాధలకు, యాతనలకు ఉన్న కారణం ఇదే! మానవుడు భవిష్యత్తులోకి తొంగిచూడలేడు. ఆ శక్తే మానవహస్తగతమైతే, ప్రపంచం ఎంతో సుఖపడుతుంది" అనుకొన్నాడు గుణనిధి

తనకు సంవత్సరం క్రిందటే, ఇప్పటి పరిస్థితి తెలిస్తే తన దేశం ఇంతగా అరాజకం గాదు. మహానది వరదలతో బీభత్సం చేయకముందే, తన ప్రజలందరిని సురక్షితప్రాంతాలకు తరలించి ఉండేవాడు మిత్రశత్రు సైన్యాలను సరిహద్దు దాటకముందే, తుత్తునియలు చేసిఉండేవాడు దురదృష్టం తనకాశక్తి లేదు

* * * *

"ఇక నువ్వు తలెత్తుకొని తిరగవచ్చు" అన్నాడు శివుడు పని మాలి భార్యను ఆపి

"ఏదైనా తిరుగుడు ఆలోచించారా?"

"తిరుగులేనిది మళ్ళీను.." అన్నాడు శివుడు. "బ్రహ్మ విష్ణులు ఏ ప్రచారమైతే నన్ను గురించి చేస్తారనుకొన్నానో, అదే ప్రచారాన్ని వారికంటె ముందే నేను ప్రారంభిస్తాను. వాళ్లు అసమర్థులు గనుకనే ఈ కాపును నిర్వహించలేక నాకప్పగించా రంటాను"

తన భర్త ఇంత దప్పని ఆలోచన చేస్తాడని పార్వతి అను కొని ఉండదు, ఆవిడ ముఖం క్షణకాలం నల్లబడిపోయింది. శంకరుడు దాని గమనించి,

"నీకీ ఆలోచన నచ్చినట్లు లేదే!" అన్నాడు.

పార్వతి మాట్లాడలేదు.

"పోనీ నువ్వు చెప్పరాదూ! ముక్కోపిలా నీకు పట్టనట్టుగా ఉంటావు ఏసరంతైనా ఆలోచించవు ఆలోచించి చెప్పినవాటి కేమో మూతి విరుస్తావు. నీతో ఎలా వేగడం? ఇంతకన్నా ఘనమైన ఆలోచన నాకు రాదు. ఆలోచించటం నావల్ల గాదు. ఓపిక ఉంటే కాస్త నాకోసం ఆలోచించు. లేదా—నువ్వు నోరెత్తకు. నా గోడవ నేను పడతాను" అన్నాడు శివుడు పెద్దగా అలిసిపోయి.

తన కేదో సూత్రం తెలిసిపోయింది గాని, అది మాత్రం బైట పెటనన్న అర్థంలో పార్వతి మాట్లాడింది. తన చాకచక్యంవల్ల అంతకన్నా మంచిమాత్రం ఇక ఉండబోదన్న విశ్వాసం భర్తకు కుదిర్చింది. శంకరుడు అదేమిటో చెప్పమని అడిగాడు. గంటసేపు బ్రతిమిలాడించుకొని గాని పార్వతి ఆ 'గుట్టు' వెళ్ళగక్కలేదు.

"బ్రహ్మదేమిటి లెండి ముసలాడు. ఉన్న తెలివికాస్తా ఆ విష్ణుదగ్గరే ఉంది. మీరు ఆ విష్ణుకే ఎసరుపెట్టాలి" అన్నది పార్వతి

"అదే! ఎలా?" అన్నాడు శివుడు.

"వస్తున్నాను" అన్నది పార్వతి "స్థితికారుడు అతనేగదూ! దాన్ని మీరు మార్చాలి. మానవులు—ముఖ్యంగా వీళ్ళేగా మనల్ని ఆడిపోసుకొంటున్నది! ఈ బాధలన్నీ పడటానికి కారణం, ముందేమి జరుగుతుందో తెలీకపోవటం. ఫలానావ్యాడు, ఫలానా చోట, ఫలానా అపాయం జరుగుతుందని, ఫలానావాడికి ముందే తెలిసిపోయిందనుకొండి వాడా అపాయాన్ని సులభంగా తప్పు కొంటాడు. సుఖంగా జీవిస్తాడు"

ఇలా పార్వతి చెప్పుకుపోతున్నది సగంనుండీ చిరునవ్వు నవ్వుతున్న శంకరుడు రానురాను నవ్వు పెద్దదిచేసి, చివరికి పొట్ట చేత్తో బట్టుకొని నవ్వాడు. గంగాదేవి జటాజూటాన్ని పట్టుకోక పోతే ఆ నవ్వు అదురుకు కిందపడిపోయేది. నెలవంక ముఖంమీదికి జారి, తిరిగి సర్దుకొంది. చాలా సేపటికి గాని, శంకరుడు మామూలు శంకరుడు కాలేదు

"ఇదేనా నీ ఆలోచన! దీనికేనా ఇంతసేపు బ్రతిమిలాడించు కొన్నది! అహాఁ, అందుగ్గాదు. ఇటువంటి దిక్కుమాలిన ఆలో చన నీకొచ్చినందుకు నవ్వుతాను. జీవితాన్ని నడిపేది విష్ణువారూ, అందులో ఏమున్నా లోసుగులొస్తే భరించవలసింది అతనేవారూ, ఆ కాపిని తీసేస్తే, ఆ వొచ్చే మంచితనం అతనికే చెందుతుందిగానీ, నాకెలా చెందుతుంది?" అన్నాడు శివుడు; తన భార్య తెలివి తక్కువతనాన్ని కనిపెట్టేశానన్న సంతోషంతో.

కాని పార్వతివద్ద దీనికి తగ్గసమాధానం సిద్ధంగానే ఉంది.

"మీరిలాంటి తెలివితక్కువ ప్రశ్న వేస్తారని అనుకొంటూనే ఉన్నాను. అలాగే అడిగారు. అది గాదండీ—వచ్చే కష్టాలు తెలుసుకొని సుఖపడేవాడు; వచ్చే మృత్యువును కూడా తెలుసు కొంటాడుగదా! తెలుసుకొని తప్పుకొంటాడుగదా! అలా తప్పు కోవటమే జరిగినప్పుడు భూలోకంలో ఇక మృత్యువు ఉండటానికి తావెక్కడిది? లయమే లేనప్పుడు లయకారకులైన మిమ్ముల్నెలా తప్పు పడతారూ?" అన్నది పార్వతి దబాయింపు గొంతుతో.

శంకరుడు పక్కన చేరయ్యాడు. ఏదో సమర్థించుకో బోయ్యాడు గానీ, పార్వతి ఆ ఛాన్సు ఉడకనివ్వలేదు.

"అయితే భూలోకవాసు లందరికీ, ఆ వరం పొరేయ మంటావా?" అన్నాడు శంకరుడు.

"ఏమో నాకు తెలీదు. మీ యిష్టం" అన్నది ఉమ.

"అందుకే నువ్వంటే నాకు చిర్రెత్తుకొస్తుంది. ఏది చెయ్యాలో నువ్వు చెబితివి. ఎట్లా చెయ్యాలో నన్ను చెయ్యి మంటుంటివి ఇందులో ఏమున్నా అర్థముంది? ఎట్లా చెయ్యాలో తెలిసిన వాడికి, ఏమి చెయ్యాలిసింది యెందుకు తెలియదో నాకర్థం కావటంలేదు" అని కోపగించుకొన్నాడు శివుడు.

అది కోపానికిమల్లే లేదు గావున—పార్వతి నవ్వింది.

"మీరనేది, మీకు ఎట్లా చేయవలసింది తెలియదనేనా?" అన్న దావిడ నవ్వు నాపుకొంటూ.

ఎట్లాగైనా భర్తచేత 'అవును' అనిపించుకొందామని పార్వతి సరదాపడ్డది మొదట. కానీ భర్తగారి దీనావనం చూసి, ఆ సరదాను చంపుకొన్నది.

"మీరేది చేసినా ఉప్పెనగానే ఉంటుంది. అందరికీ ఒకే సారి పారేస్తే ఏమౌతుందో ఏమిటో? ముందు—కాస్త యోగ్యుణ్ణి చూసి ఇవ్వండి. సత్ఫలితం కలిగితే తరివ్మాతవాళ్ళకివ్వొచ్చు"

శంకరుని కూడా ఈ సలహా నచ్చింది.

* * * *

తరువాత శంకరుడు యోగ్యునికోసం అన్వేషణ ప్రారంభించాడు. ప్రమథగణాన్ని భూలోకంలోకి పంపుతూ "ఉత్తముడైన వాణ్ని వెదకండి. మనం చేయబోతున్న పని మహా క్లిష్టమైనది, అందుచేత చాలా రహస్యంగా ఉంచండి. నేనే వెదుకుదును గానీ, నాకేమో తీరిక లేకుండా ఉన్నది. వెళ్ళిరండి" అన్నాడు శంకరుడు.

ప్రమథులు 'చిత్తం'మని సెలవు తీసుకొన్నారు

* * * *

గుణనిధి తపస్సు పరాకోటి నందుకొన్నది. అతని తపశ్శక్తికి దేవలోకం దద్దరిల్లిపోతున్నది. స్వతహాగా తపస్సంటే గుణనిధికి ఇష్టంలేదు. కానీ అది తప్ప మరొక గత్యంతరం లేకపోయింది అప్పటికే అతను మానవాతీతుడైనాడు. సర్వేంద్రియాలు, లోభ మోహాలు అంతరించాయి. 'రేపును'గురించి 'ఈనాడు' ఆలోచించే వాడు. 'రేపు'—'ఈనాడు'లాగా లేకపోయేది. తనకింకా భావి దృష్టి రాలేదనుకొనేవాడు. తిరిగి తపస్సు చేసేవాడు. ఈవిధంగా నెలలకు నెలలు దొర్లిపోతున్నాయి ఫలితంగోమట్టుకు మార్పు ఉండేదికాదు. రాను రాను గుణనిధి తీవ్రంగా తపస్సుచేయసాగాడు. అతని తపోధాటికి దేవలోకం హడలిపోతోంది.

* * * *

"మరొక రహస్యం!" అన్నాడు శివుడు భార్యనుద్దేశించి.

"ఏమిటది?"

"ఖచ్చితంగా మనకు కావలసిన మనిషే దొరికాడు. భూలోకంలో గుణనిధి అనే బ్రాహ్మణుడు, భావిదృష్టికోసం తపస్సు చేస్తున్నాడు. దేవమండలికి ఈ విషయం తెలిసికూడా పట్టించుకో లేదు. ఇంతకంటే మదువుకాలం మనకు దొరుకుతుందని నే ననుకోను. అతని కాశక్తి నిద్దామనుకొంటున్నాను. నీ ఉద్దేశమేమిటి?"

"ఇది మరీ బాగుంది!" అన్నది పార్వతి. "మీకంటే నాకెక్కువ తెలుసునా? అలాగే ఇవ్వండి. మరొకరైతే ఒరగబెట్టే దేమిటి? గుణనిధి ఒరగబెట్టం దేమిటి?"

## 4

గుణనిధి ఉలిక్కిపడ్డాడు. ఎక్కడో తీవ్రమైన పంచలనం జరుగుతున్నట్టు పసికట్టాడు. ఎక్కడ జరుగుతోంది? గుణనిధి చుట్టూ కలయచూశాడు. అంతా ప్రశాంతంగా ఉన్నది. అయితే ఈ కలవరపాటుకు కారణ మేమిటి? అంతా నూతనంగా, చిత్రంగా ఒకదానిలో ఒకటి మిళితమయిపోయినట్లు, రంగురంగుల ముక్కలలాగా ఉన్నది. కొంప తీసి తనకు. .

గుణనిధి ఒకపారి తీవ్రంగా కంపించిపోయాడు మెదడులో మెలుకురు మెరుపు మెరిసినట్లు అనుభూతి పొందాడు. 'రేపు'ను గురించి ఆలోచించాడు. కళ్ళముందు తెర తొలగినట్లయింది. కొన్ని క్షణాలు అంతా గజిబిజిగా ఉంది. రేపుతో, గుణనిధి అరణ్యంలో నుండి పోతున్నాడు. అతని ముఖాన చిరునవ్వు చిందులాడుతున్నది. ఉత్సాహంతో అడుగులు వేసుకొంటూ పోతున్నాడు 'గాండ్రు'మన్న ధ్వని వినిపించింది. పొదలు కదిలాయి. భయంతో గుణనిధి వణికిపోయాడు. 'తన విజ్ఞానమంతా పరిండవలసిందేనా?' అని ఖేదపడ్డాడు. లేనిసత్తువ తెచ్చుకొని గబగబా చెట్టెక్కాడు. ఇంతలో మరొక దెసనుండి అటువంటి ధ్వనే వినిపించింది రెండు పులులూ ఎదురుపడ్డాయి ఘోరంగా పోరాడుకొన్నాయి. గుణనిధి చెట్టుమీదనుండి ఇదంతా చూస్తూనే ఉన్నాడు. ఇంతలో ఒక పులి తీవ్రంగా గాయపడి, ప్రాణరక్షణార్థం కాళ్ళో లు పరుగుపుచ్చుకొంది. రెండవ పులి దాన్ని తరుముతూ వెంబడించింది. మృగద్వయం దూరం వెళ్ళిపోయినట్లు రూఢికాగానే గుణనిధి చెట్టు దిగి, తిరిగి త్రోవపుచ్చుకొన్నాడు —

"రేపు నాకు ఈవిధంగా జరుగుతుందన్నమాట. ఒకవేళ నేను ప్రయాణం చెయ్యకపోతేను ..?" అనుకొన్నాడు గుణనిధి.

* * * *

"కొరివితో తల గోక్కున్నట్లయింది" అన్నాడు పరమేశ్వరుడు చీకాకుగా.

"ఏమి జరిగిందేమిటి?" అన్నది పరమేశ్వరి, ఏదో టీకమీద కొచ్చింపనుకొంటూ.

"ఆడదానిమాట వింటే ఏదైనా జరుగుతుంది—నువ్వేదో తెలివిగలదాన వనుకొన్నాను.. నీ మాట విని గుణనిధికి శక్తి నిచ్చాను.. ఇన్నిటికీ నిన్న నవలసిందేమీ లేదులే! నిను తోచిందేదో నువ్వన్నావు ఆ మాట నమ్మమని ఎవరు చెప్పారు?" అన్నాడు తనలో తాను అనుకొంటున్నట్లు.

"పార్వతి కిమ్మనలేదు."

# III వ తరగతి ప్రయాణీకుల రైలుపెట్టెలు

# దక్షిణ రైల్వే మీద

## ఇప్పుడు లభింపగలవు

వివాహములకు, * సరదాకు, * యాత్రలకు,
ప్రయాణములు చేయువారికిమిక్కిలి వుపాయమైనవి.

* వంటగది, భోజనశాల, స్నానపు గది వగైరాలతోను, ఎలెక్ట్రిక్ పంకాలతోను

**38** ప్రయాణీకులకు కులాసాగా ప్రయాణము చేయుటకు అనుకూలమైనది. సరసమైన రేట్లు.

వివరములకు:

## చీఫ్ కమర్షియల్ సూపరింటెండెంటు,

## దక్షిణరైల్వే, మద్రాసు.

---

# బ్యాంక్ ఆఫ్ బరోడా, లిమిటెడ్.

(స్థాపితము 1908)

| | |
|---|---|
| అనుమతి పొందిన మూలధనము | రు 2,40,00,000/- |
| జారీచేసిన & చందా వేసిన మూలధనము | రు 2,00,00,000/- |
| పిలువబడిన మూలధనము ... | రు 1,00,00,000/- |
| చెల్లించబడిన మూలధనము ... | రు 1,00,00,000/- |
| రిజర్వు నిధి & ఇతర రిజర్వులు ... | రు. 1,28,00,000/- |

## హెడ్ ఆఫీసు : బరోడా

దక్షిణ ఇండియా బ్రాంచిలు:-

* హైదరాబాదు * బెంగుళూరు * మద్రాసు
* కోయంబత్తూరు.

ఇండియాలోని అన్ని ప్రధాన కేంద్రాలలో బ్రాంచీలు ఏజన్సీలు గలవు.

ప్రపంచములోని అన్ని ప్రధాన నగరాలలో కరెస్పాండెంట్లుగలిగి, ఈ బ్యాంకు ఎగుమతి, దిగుమతి వర్తకులకు అవసరమైన సేవచేయ సంసిద్ధముగా నున్నది

వివరములకు వ్రాయండి:

| | |
|---|---|
| కే. గోపాలరావు, మేనేజరు, మద్రాసు. | మాథ్యు ఎస్. డి' సౌజ, జనరల్ మేనేజరు. |

---

# ధాతువర్ధని

శుక్లనష్టమునకు ప్రశస్తమైనది. కాళ్లనొప్పులు బలహీనత, గుండెదడ, మేహములు, నిశ్శక్తి, అతిమూత్రము, మొ॥ ఖండించి ఇంద్రియమును వృద్ధిపరచి అధిక సంభోగ శక్తి నిచ్చును. సీసా రు. 4-12-0 వి. పి. రు. 1-0-0

# అబలసుధ

స్త్రీల కుసుమ వ్యాధులు, అకాల బహిష్టు, ఋతుబద్ధము, ఋతుశూల, ఒడలు నొప్పులు, తలనొప్పి, గుండెదడ, కాళ్లులాగుట, మనస్థిమితము లేకపోవుట, నిద్రపట్టకుండుట, నడుమునొప్పులు, బలహీనత, మలబద్ధము, హిస్టీరియా మొదలగునవి హరించును

సీసా రు. 3-0-0 వి. పి. రు. 1-0-0

# అమృతప్రాశ

సర్వమేహములు, మేహపొడలు, జల-కీళ్ళనొప్పులు, నడుము నొప్పులు, కాళ్ళు చేతులు మంటలు, తిమ్మిరలు మొదలగునవి హరించి, రక్తశుద్ధిచేసి వృద్ధిచేయును.

డబ్బా రు. 3-8-0 వి. పి. రు. 1-0-0

## ఇండియన్ మెడిసన్ హౌస్

లక్ష్మీటాకీసు రోడ్డు . : విజయవాడ-1.

"ఈ మానవులంత సందేహజీవులు ఏ లోకంలోనూ లేరు. అనుమానాలతో కొట్టుకలాడిపోతున్నారు మనుషులు. అన్నీ ప్రశ్నలే, అన్నీ అనుమానాలే..... ఛీ ఛీ" అని అసహ్యించుకొన్నాడు శివుడు. "గుణనిధి అరణ్యం దాటి ఒక పల్లె చేరుకొన్నాడు. ఒకాయన ఆతిథ్యమిచ్చాడు. గుణనిధి సంతోషంతో అంగీకరించాడు. భోజనానంతరం, అతగాడు తీరిగ్గా కూచుని, 'భావి'లోకి చూశాడు. ఆ గృహయజమాని మూడు రోజుల్లో, బందిపోటు దొంగలచేత హత్యచేయబడతాడని తెలిసింది. ఆ విషయమే అతనితో చెప్పాడు గుణనిధి. గృహమేధి నమ్మలేదు. నమ్మలేదు సరిగదా గుణనిధి దొంగలతాలూకు మనిషేమో నని అనుమానించాడు. కాకపోతే, అంత ఖచ్చితంగా ఎలా చెబుతాడని, గృహయజమాని సందేహించాడు. గుణనిధిని తన్ని తోశాడు. అదృష్టవశాత్తూ ఇరుగుపొరుగులు అడ్డువచ్చి, గుణనిధిని విడిపించారు. నా కెక్కడ విచారమేస్తున్నదంటే, నిజం చెబుతున్నా ఈ మనుషులు ఎందుకు గ్రహించలేరా అని!"

"అది నిజమని వారికి తెలీదు గనక" అనుకొన్నది పార్వతి. "అయితే ఏం చేద్దామంటారు?"

"అదే తోచటంలేదు. ఏం చేస్తే బాగుంటుందని నువ్వనుకొంటున్నావో ముందు చెప్పు"

పార్వతికి చక్కని అవకాశం దొరికింది.

"ఆఁ నా ముఖం నేనో తెలివితక్కువ దద్దమ్మను నేనేమనుకొంటే మటుకేం లెండి" అని ఎత్తిపొడిచింది

శంకరుడు కొన్ని నిమిషాలపాటు మౌనంగా ఉండి, తరువాత యిలా అన్నాడు —

"ఏదో ఒక విచిత్రం ఉంటేగానీ, మానవుడు విశ్వసించడు అందుకని అతనికి మరో నేత్రం ప్రసాదిద్దామనుకొంటున్నాను. ఆ మూడవ నేత్రం భవిష్యత్తులోకి చూడగలిగేట్లు ఏర్పాటు చేస్తాను. మామూలు మనుషులకు భిన్నంగా, అపురూపంగా ఉంటాడు గనుక, అప్పుడు గుణనిధి మాటలను ప్రజ విశ్వసించవచ్చు. అవునా?" అన్నాడు శంకరుడు

"మీకు నేను చెప్పతగననుకొంటి." అంటూ ప్రారంభించింది పార్వతి

"అయినా చెప్పు వింటాను—" అన్నాడు శివుడు

"గుణనిధికి తన గతాన్నిగురించే తెలుసు గాని, లోకంలో ఉన్న వారందరి గతాలనుగురించి తెలీదుగదా?"

"నిజమే, తెలీదు. అయితే?"

"అతను చెప్పే భవిష్యత్తు సరైనదని ప్రజ లెలా నమ్ముతారు? ఇత డెలా నమ్మించగలడు?"

"ఈ సమస్య ఇక లేదు" అని నిస్పృహను ప్రకటించాడు శివుడు.

భర్త ఇంతగా నీరసించిపోవటం పార్వతికి ఇష్టంలేదు. లక్ష్మీ సరస్వతులవద్ద, రజంత తలెత్తుకొని తిరగడానికైనా, శివుని చేత ఓ ఘనకార్యం చేయించాలి. ఇక [illegible] న్నాడు. భర్తకు ఇష్టమై అపవాదులు భరిస్తే భరించవచ్చు. తన కేమీ అభ్యంతరం లేదు కానీ తను అలా కాదు కనీసం తనకోసమన్నా శంకరుణ్ణి ఉత్సాహింప చేయవలసిన అవసరం ఉన్నది. అందుకని—

"కాలమేమిటి చేస్తుందిలెండి" అన్నది పార్వతి.

శంకరుడు ఆశగా చూశాడు.

"అతనికి—అదే—గుణనిధికి; ప్రతివారి గతాన్నీ తెలుసుకొనే శక్తికూడా ఉండాలి. గత చరిత్రను ఖచ్చితంగా చెప్పగలిగినవాడు, భవిష్యత్తును గూడ చెప్పగలడన్న నమ్మకం ప్రజలకు సులభంగా కలుగుతుంది. అతని మాటలు అక్షరాలా పాటిస్తారు. తరువాతి ఫలితం మనకు తెలిసిందేనా.." అన్నది పార్వతి.

"సరే" అన్నాడు శంకరుడు.

"మీరుగూడా ఆలోచించండి. చివరికి పాపం నామీదకేస్తే నే నొప్పుకోను."

"వెయ్యటానికిమట్టు కేముందిలే" అన్నాడు శివుడు. "ఇతను గూడా, నాలాగ త్రినేత్రుడైనాడు. ఒకకన్ను గతాన్ని చూస్తుంది. మరొక కన్ను వర్తమానాన్ని చూస్తుంది. ఇంకొకటి భవిష్యత్తును దర్శిస్తుంది. [illegible] బావుంది."

"గుణనిధిగూడా త్రినేత్రుడయ్యాడు గాని, మీలాగా మాత్రం కాదు."

ఎంత ఆలోచించినా ఈ మాటలకు అర్థం శివునికి స్ఫురించలేదు

* * * *

కొంతకాలం దైహికసంబంధమైన శ్రద్ధ లేకపోవటంచేత, గుణనిధిని ఇప్పు డెవ్వరూ గుర్తుపట్టలేరు. మీసాలు, గడ్డాలు పెరిగాయి. జుట్టు జడలు కట్టుకుపోయింది. అపూర్వమైన రెండు శక్తులు అతని స్వాధీనం కావటంచేత, శరీరం వింతకాంతితో మిలమిలలాడుతుండేది. ముఖాన దివ్యతేజస్సు ప్రస్ఫుటిస్తుండేది. అతనికి రాజరికంమీద, భోగాలమీద, ఆసక్తి పూర్తిగా నశించిపోయింది. ఈ దేహం అశాశ్వతమైనదని అతనికి తెలుసు. 'పరమహంస' పంజరంనుండి వెళ్ళినతరువాత ఈ కట్టె ఎందుకూ పనికి రాదని అత డెప్పుడో గ్రహించాడు. బ్రతికిన నాలుగు నాళ్ళూ, లోకానికి కొంత ఉపకారంచేసి దాటిపోవటం మేలనుకొన్నాడు. అంగులోనూ తనకు మహత్తరశక్తులు లభించాయి. వీటి సాయంతో, ఈ "యాతనామయ జగత్తు"ను స్వర్గసీమ చేయవచ్చుననుకొన్నాడు. తన సేవ మానవజాతికై నిర్దేశింపబడ్డది గనుక, అరణ్యవాసం ఇక పనికి రాదనుకొన్నాడు. 'లోకం'లోకి వచ్చాడు.

ప్రజలు గుణనిధి చుట్టూ తండోపతండాలుగా పోగుపడ వచ్చారు. ఇంతవరకూ వారు చూసింది రెండు నేత్రాల మానవులనే! గ్రంథాలలో మాత్రం, శంకరునికి మూడు నేత్రాలనీ, దేవేంద్రునికి దేహమంతటా నేత్రాలనీ...చదివారు. కానీ చూడలేదు. ఈనాడు ఈ "శివకన్నుల దొర" ప్రత్యక్షమైనాడు. ఇతను దేవాంశ సంభూతుడని కొందరనుమానించారు. మరికొందరు [illegible]

ఆ పరమేశ్వరుడే ఇలా భూలోకంలో అవతరించాడని రూఢిచేసుకొన్నారు. కొందరు ఈ రెండువాదాలనూ ఖండించారు. దేవతలు అనిమిషులు. ఇతను కాదు ఇదీ వారివాదన. "లోకంలో అనేక రకాలయిన ప్రాణు లుద్భవిస్తూ ఉంటాయి. ఆరుకాళ్ళ ఆవులు మూడుతలల ఎద్దులు ఎన్నో వస్తున్నాయి. వచ్చాయి. అంతమాత్రాన ఇవన్నీ దేవాంశ సంభూతాలే అవుతాయా?" అన్నారు వారు దీనితోడు గుణనిధికూడా తాను మానవుడనేనని, తపోబలంవల్ల వీటిని సాధించానని చెప్పుకొన్నాడు నమ్మినవారు నమ్మారు. దేవుడుగా ఆరాధించినవారు ఆరాధించారు.

## 5

మానవుల్లో ఇంతటి శక్తి ఉంటుందని గుణనిధి కనీసం— కలగని ఉండడు. అతని కిలాంటి శక్తులున్నాయని తెలిసినప్పటి నుండీ, మరిన్ని మహత్తులు ఆరోపించి, తమతమ ఇబ్బందులన్నీ తీర్చమని అతన్ని చుట్టు ముట్టసాగారు. దురదృష్టమేమిటంటే— గుణనిధికి, భూతభవిష్యద్విషయాలే తెలుసుగానీ, వాటిని తొలగించడం తెలియదు ఫలానా రోజున ఫలానా మనిషికి ఫలానా గండమున్నదని చెప్పగలడు చెప్పి నమ్మించనూ గలడు. ఈమాత్రం చెస్తే తను—ఆ అపాయాలనుండి వారె సులభంగా రక్షణ ఏర్పాటు చేసుకోగలరని అతను ఊహించాడు తద్విరుద్ధంగా ఇప్పుడు జరుగుతున్నది. ఆ అపాయాలనుండికూడా అతనే రక్షించాలని ప్రజలు పట్టుబడుతున్నారు. 'ఆ శక్తి నాకులేదు మొర్రో' అంటున్నా వారు వినిపించుకోవటంలేదు. దీనికి ప్రతిక్రియ ఏమిటో గుణనిధి చెప్పలేకపోతున్నాడు

ఒక రోజున ఒక వ్యక్తి గుణనిధి దగ్గరకొచ్చి, "స్వామీ! నాకు ఒక్కడే కొడుకు విద్యాభ్యాసంచేసి ఇటీవలే ఇంటి కొచ్చాడు. అతనికి వివాహం చేయాలనుకొన్నాను,' అని చెప్పబోతున్నాడు

"నాకు తెలుసు" అన్నాడు గుణనిధి "నీకేమో విద్యావతి కోడలుగా కావాలంటున్నావు నీ భార్య సంపన్నయువతి కావాలంటున్నది. నీ కొడుకు రూపవతి కావాలంటున్నాడు గత మూడు మాసాలనుండీ, మీరు ముగ్గురూ ఈ విషయంమీద వాదోపవాదాలు జరుపుకొన్నారు. 'నామాట వినకపోతే, నా యింటికి రానవసరం లేదని నువ్వన్నావు. 'నామాట వినకపోతే, నేను పుట్టింటికి పోతా,' నని నీ భార్య బెదిరించింది 'ఏ కురూపినో బలవంతాన కట్ట ప్రయత్నిస్తే, నేను ఆత్మహత్య చేసుకొంటా,' నని నీ కొడుకన్నాడు అవునా?"

ఆ వ్యక్తి భక్తితో, భయంతో వణికిపోయాడు. గుణనిధి రెండు కాళ్ళూ పట్టుకొని, కళ్ళకద్దుకొన్నాడు

"స్వామీ! తమరు త్రికాలవేదులు. మీకు తెలియనిదంటూ ఈ ప్రపంచంలో ఏమీలేదు. చదువుల సరస్వతి అనదగ్గ కన్యకావాణ్ని నేను చూట్లాడాను. మా కుర్రవానికి ఆ కన్యతో ఎప్పుడు వివాహమౌతుందో దయచేసి చెప్పండి" అని ప్రార్థించాడు.

గుణనిధి మూడవ నేత్రంతో భవిష్యత్తులోకి చూసి, దీర్ఘంగా నిశ్వసించాడు. అతని వదనం మ్లానితమైంది. కన్ను లశ్రుసిక్తాలైనాయి.

ఆగంతకుడు గతుక్కుమన్నాడు.

"ఏమిటి స్వామీ! ఆకన్యతో మావాడికి పెండ్లికాదంటారా"

"కాదు"

ఆగంతకుడు నిట్టూర్చాడు

"లక్ష్మీసంపన్నురాలవుతుందంటారా?"

"కాదు"

ఆ వ్యక్తి ఆశ్చర్యపడ్డాడు.

"కాక—రూపసితోనే వివాహమవుతుందని తమ భావమా?"

"కాదు"

"మీ హృదయాన్ని నే నర్థంచెసుకోలేకపోతున్నాను" అన్నాడు భయంగా ఆగంతకుడు

"అతనికి వివాహమే కాదు"

"ఎప్పటికీనా?"

"వివాహప్రయత్నాలన్నీ జరుగుతాయి. విద్యారూపసంపన్నురాలైన కన్య దొరుకుతుంది కానీ, నాయనా, వివాహం జరుగదు . .. "

"అభ్యంతరం లేకపోతే..." నసిగా డతను

"వివాహానికి కొన్ని రోజులు ముందు, నీ కొడుకు నావికా విహారార్థియై నదిలో పోతుంటాడు. మొసలి వాతపడతాడు."

ఆ వ్యక్తి భోరుమని ఏడ్చాడు గుణనిధి రెండు కాళ్ళూ పట్టుకొని "ఎలాగైనా నా కొడుకును రక్షించం"డని ప్రాధేయపడ్డాడు. విలవిలలాడాడు

"మరణ కారణమేమిటో మీకు చెప్పాను. ఆ కారణం రాకుండా చూసుకోండి. సత్ఫలితం కలగవచ్చు."

* * * *

ఇలా ఊరూరా తిరుగుతూ, కుంతలదేశ మొచ్చాడు గుణనిధి ఈ ప్రాంతాని కతను రావటం ఇదే ప్రథమం కుంతలీయులకు గుణనిధి విషయం సంపూర్ణంగా తెలియదు. కాని, దైవశక్తులున్న విచిత్ర మానవు డొకడు ఇతర రాజ్యాల్లో పర్యటిస్తున్నాడని, భూత భవిష్యద్విషయాలను, కరతలామలకంగా చెబుతున్నాడనీ గాలివార్తలు విన్నారు అతనిక్కడికి వస్తే బాగుండునని కొందరనుకొన్నారు. కొందరు స్వయంగా వెళ్ళి ఆహ్వానించాలనుకొన్నారు.

గుణనిధి ఒక్కొక్క గ్రామాన్ని చూసుకొంటూ, వారికి గత విషయాలను చెప్పి నమ్మక కలిగిస్తూ, భవిష్యత్తును సూచిస్తూ ప్రయాణాలు చేస్తున్నాడు. అతనికి 'కాలం' చాలడంలేదు. ఒక్కొక్క చోట వారాలకొద్దీ ఉండిపోవలసివస్తున్నది. వేలాది ప్రజలకు చెప్పవలసిరావడంతో, అతను అలసిపోతున్నాడు.

విశ్రాంతి తీసుకోవటానికికూడా వీలుదొరకటంలేదు.

ఒకచోట ఒక గృహస్థు కొరవిల్లాడు. కూతురు గర్భవతి. మనుమడో మనుమరాలో తెలుసుకోవాలన్న ఉబలాటంతో గుణనిధిని సంప్రదించాడు.

"నాకు తెలిసిన విషయం చెప్పకపోవటం దోషం. చెప్పి మీ మనశ్శాంతిని భగ్నం చెయ్యటానికి ఆత్మ అంగీకరించటంలేదు" అన్నాడు గుణనిధి.

"ఇబ్బందిలేదు చెప్పండి." అన్నాడు గృహస్థు.

"నా మాటలమీద మీకు సంపూర్ణ విశ్వాసమున్నదిగదా?" అన్నాడు గుణనిధి.

గృహస్థు "ఉన్న"దన్నాడు.

"నీ కూతురు సుఖప్రసవం కాదు. ప్రసవసమయంలో చనిపోతుంది ఈ వియోగం భరించలేక నీ అల్లుడు విరాగి అయిపోతాడు. కూతురు దిగులుతో నీ భార్య మంచమెక్కి నవసి నవసి చచ్చిపోతుంది. నేటికి సరిగ్గా, అయిదు నెలలకు నేను చెప్పినవన్నీ జరుగుతాయి"

అ గృహస్థు హృదయవిదారకంగా రోదించాడు. 'ఎలాగైనా నా కుటుంబాన్ని రక్షించ' మని వేడుకొన్నాడు. గుణనిధి హృదయం కరుణ రసప్లావితమైంది. కానీ అతను చేయగలిగిందేమీ లేదు ఎంతో శ్రమమీదగానీ, అ గృహస్థు ఇంటికెళ్ళలేదు

అతరువాత గుణనిధి చాలాసేపు ఆలోచించాడు తనదగ్గర కొచ్చేటప్పుడు అతను ఎంతో సంతోషంతో, బంగారు కలలు కంటూ వచ్చాడు. తను చేసిందేమిటి? హృదయభేద్యమైన విచారాన్ని అతనికి కలిగించి పంపాడు. ఇందువల్ల అ గృహస్థు లాభించిందేమీ లేదు. లేకపోగా, మరొక అయిదు నెలలకు విధిగా అనుభవించవలసిన దారుణానుభవాలను, ఇప్పటినుంచే అనుభవిస్తున్నాడు ఇది అతన్ని రక్షించటం కాదే!

ఇప్పుడా గృహస్థు ఏమి చేస్తున్నాడా అని గుణనిధి చూశాడు. అతను గోడనానుకొని విచారిస్తున్నాడు కూతురు పొట్టమీద కొడుకొంటూ నేలమీద దొర్లుతున్నది. భార్య గుండెలు పగిలేలా రోదిస్తున్నది, అల్లుడు తల గోడకేసి కొట్టుకొంటున్నాడు.

"ఘోరం" అనుకొన్నాడు గుణనిధి.

"ఆకుపచ్చని కలలాగా, అందంగా గడిచిపోతున్న వారి జీవితాల్లోకి నిప్పు రవ్వను విసిరాను."

* * * *

కుంతలదేశాధీశుడైన సమరసేనుని కీనాడు కొత్తిగా తీరికలేదు. మరొక రెండు రోజులలో అతని జన్మదినోత్సవాలు జరుగుతాయి. నేమంతటా ఈ ఉత్సవాలు జయప్రదంగా నిర్వర్తింపబడటానికి కావలసిన జాగ్రత్తలు తీసుకోవటంలో సతమతమాతున్నాడు. ఇప్పటికే రాజధానీనగరం అత్యద్భుతంగా అలంకరించబడ్డది. ప్రత్యేకాకర్షణలుగా, మూడురోజులపాటు కాశ్మీరాంగనల నృత్యప్రదర్శనాలు ఏర్పాటుచేశాడు. సమరసేనుడు స్వతః రసహృదయుడు, శృంగారకవి. ప్రతిసంవత్సరమూ [illegible] ఇందుకోసం వెచ్చింపబడుతుంటాయి. దేశదేశాంతరాల నటులు, నృత్యగాంధర్వులు, గాయకులు, కవులు, ఆహ్వానింపబడుతుంటారు. సన్మానితులవుతుంటారు. ఈ వేడుకను పురస్కరించుకొని సమరసేనుడు ఇరుగు పొరుగు రాజులను ఆహ్వానించటమూ, వారు ఆనందంతో పాల్గొనటమూ మామూలుగా జరుగుతుంటుంది.

ఈ సంవత్సరంకూడా అలాంటి ఏర్పాట్లన్నీ జరిగాయి. అయినా ఎక్కడన్నా లోపమున్నదేమోనని సమరసేనుడు పరిశీలిస్తూనే ఉన్నాడు. అలాంటి సందర్భంలో సేవకు డొకడువచ్చి 'గుణనిధి తమ దర్శనం కోరుతున్నా' డని చెప్పాడు. సమరసేనుని హృదయం సంతోషంతో గంతువేసింది 'ఈ సంవత్సరం ఇదొక నూతనా కర్షణ' అనుకొన్నాడు. ప్రవేశపెట్టుమని సేవకుని కాజ్ఞ యిచ్చాడు.

* * * *

"మిమ్మల్ని గురించి విన్నాను ఈనాడు చూశాను. అయాచితంగా వచ్చినందుకు నా ధన్యవాదాలు" అన్నాడు సమరసేనుడు.

ఈరకమైన సంభాషణ గుణనిధికి నచ్చలేదు.

"ప్రభూ!" అన్నాడు గుణనిధి "మీతో ఒక రహస్యం చెప్పవలసిన అగత్యం ఏర్పడ్డది."

"ఏమి" టన్నట్లు కనుబొమలు కుంచించాడు సమరసేనుడు.

"నావిషయం మీకు తెలుసు...." అవునన్నట్లు సమరసేనుడు తల ఊపడంచేత గుణనిధి చెప్పకుపోయాడు "దయచేసి మీ జన్మదినోత్సవ ప్రయత్నములను ఆపుచేయండి...ఒక ప్రమాదం సంభవించ నున్నది"

సమరసేనుడు ఉలిక్కిపడ్డాడు.

"ప్రమాదమే!" అన్నాడు తెప్పరిల్లి.

అందరి రాజులతోబాటు మీరు అగ్నిమిత్రుణ్ణికూడా ఈ ఉత్సవాని కాహ్వానించారు."

"ఆహ్వానించాను" అన్నాడు సమరసేనుడు ఏదో జ్ఞాపకం తెచ్చుకొని. అతని నేత్రాలు కాంతివిహ్వలములైనాయి. మందహాసం క్షణకాలం మెదిలి అదృశ్యమైంది

"దయచేసి మీరా ఆహ్వానాన్ని రద్దుచేయండి. అగ్నిమిత్రుడు సర్వసైన్యాలను తరలించుకొని వస్తున్నాడు. సైనికులను, రాజధానికి సమీపంలో దాచి, నామమాత్రపు భటవర్గంతో, ఈ మహోత్సవంలో పాల్గొంటాడు. రాజభటులందరూ, ఉత్సవానందములో మునిగిఉండడంచేత, అతని సైన్యాన్ని గుర్తుపట్టలేరు. ఏమరుపాటుగా మీకోటమీదకు లంఘించి దాన్ని వశంచేసుకోవాలని అగ్నిమిత్రుడు ఆలోచిస్తున్నాడు. మిమ్మల వరకు ఖైదీగా పట్టుకొంటాడు. దేశం అరాజకమౌతుంది." అన్నాడు గుణనిధి.

"నేను నమ్మలేక పోతున్నాను" అన్నాడు సమరసేనుడు. "అగ్నిమిత్రుడు నా ప్రాణ మిత్రుడు. మిత్రద్రోహానికి తలపడతాడని, నే నూహించలేను"

"ప్రభూ! ఎవరికీ తెలియని మరోరహస్యం చెబుతాను. అప్పుడైనా నన్ను విశ్వసిస్తారా."

అంగీకారంగా తల పంకించాడు సమరసేనుడు.

గుణనిధి కొన్ని క్షణాలు భూతకాలపు దృశ్యాలు తలచి ఇలా అన్నాడు:—

"గతసంవత్సరం జరిగిన మీ జన్మదినోత్సవానికి అగ్నిమిత్రునితో పాటు, అతని సోదరిగూడా వచ్చింది. జగత్తు సౌందర్యవతియైన సునంద మీ మనస్సును ఆకర్షించింది. ఆమెను వివాహం చేసుకోవాలని మీరు నిశ్చయించుకొన్నారు ఆమె అభిప్రాయం గూడా తెలుసుకొందుకు మీరు ప్రయత్నించారు. జ్ఞాపకం తెచ్చుకోండి. ఒకనాటి సాయంత్రం సునంద ఒంటరిగా, మీ ఉద్యానంలో ఉన్నది. అదే సమయమని మీరువెళ్ళి మీ అభిప్రాయాన్ని చెప్పారు. సునందవదనం కోపంతో ఎర్రబడ్డది అదిమీరు సిగ్గుగా భావించారు ఆరాత్రే సునంద ఈ విషయాన్ని అన్నతో చెప్పింది. అగ్నిమిత్రుడు ఇది సమయంకాదని ఊరుకొన్నాడు. ఆ తరువాత మీరొక రాయబారినిగూడా పంపారు. సరైన సమాధానం మీకు రాలేదు. అకస్మాత్తు అగ్నిమిత్రునిలో దిన దిన ప్రవర్ధమానమౌతూనే ఉంది. ఈనాటికిల్లా పరిణమించ నున్నది. . ఇప్పటికైనా నామాట నమ్ముతారా ?" అన్నాడు గుణనిధి

సమరసేనుడు ఆశ్చర్యపోయాడు. ఇదంతా నిజమే! అయినప్పుడు భవిష్యత్తుమాత్రం ఎందుకు నిజం కాకూడదు? అతనికొక సందేహం తీర్చుకోవాలనిపించింది అడిగాడు—

"నాతో వివాహమంటే, సునంద కిష్టంలేదని నే నమ్మం చేసుకొంటున్నాను ఎందు కిష్టంలేదో చెప్పగలరా? "

గుణనిధి ఆలోచించి, 'పోనీవ్వండి' అన్నాడు.

"లేదు తెలుసుకోవాలనుకుంటున్నాను "

గుణనిధి తప్పించుకోవాలని ప్రయత్నించాడు సమరసేనుడు చెప్పితీరాలన్నాడు.

"ప్రభూ! మీరింత బలవంతం చేస్తున్నారు గనుక, అప్రియమైన సత్యాన్ని చెబుతున్నాను మీరు అన్యథా భావించకండి." అని కొన్ని క్షణాలు ఆలోచించాడు "మీతండ్రిగారికి చాలాకాలందాకా సంతానం లేదు సంతానభాగ్యంకోసం ఆయనగారు చాలాపరితపించారు. ఎన్నో వివాహాలు చేసుకొన్నారు అయినా సంతు కలగలేదు. చివరి ప్రయత్నంగా మీతల్లి గారిని వివాహమాడారు సంవత్సరాలు గడిచిపోతున్నాయిగానీ, సంతానభాగ్యం కలగలేదు. రాజ్యం దేవాలయాధీనం చేసి తపోభూములకు వెళ్లిదామనుకొంటున్నారు ఈసంగతి అంతఃపురానికి తెలిసింది. మీతల్లిగారు రాజ్యం మరొకరిస్వాధీనం కాకుండా చెయ్యాలనుకొన్నారు. అలా చేయాలంటే, సంతానవతి కావటంతప్ప మరోమార్గంలేదు. సంతానవతి కావటానికి అవకాశం లేదు మీ తండ్రిగారియోగ్యగస్తులవ్వడమే అందుకు కారణం. మీకు మొన్నటివరకూ సైన్యాధిపతిగా వున్న వీరవర్మ, ఈసందర్భంలో అంతఃపురానికి సహాయం చేశాడు. మీరు జన్మించారు. రాజ్యం దక్కింది. ఈ సంగతి అగ్నిమిత్రునికీ అతని సోదరికీ తెలుసు. అందుకే.. "

"ఆపు" అని గర్జించాడు సమరసేనుడు. అతని కళ్ళు నిప్పులు చిందుతున్నాయి. పెదవులు బిగపట్టాడు. ఆపాదమస్తకం కణికపోతున్నాడు.

# 6

యమకింకరులవంటి భటులు గుణనిధిని పట్టుకొన్నారు. శృంఖలాబద్ధునిచేసి, రహస్య కారాగారంలో బంధించారు. బైటినుండి ఉత్సవధ్వనులు వినిపిస్తున్నాయి మంగళవాద్యధ్వనులు గాలిలో తేలిపోతున్నాయి గాయకుల మధుర సంగీతం, రాజభటులు హెచ్చరికలు, కరతాళధ్వనులు, మృదంగ నినదము, ఉండి ఉండి గుణనిధికి వినిపిస్తున్నాయి.

* * * *

గుణనిధి నీరసంగా కారాగృహాభిత్తికకు జారగిలబడ్డాడు

"నే నిటువంటి అపూర్వశక్తులకోసం ఎందుకు ప్రయత్నించాను ?"

గుణనిధి తననుతాను ప్రశ్నించుకొన్నాడు.

లోకంలోని - ఎక్కువ బాధలకు కారణం అవి అకస్మికంగా రావటమే ననుకోవటం, అకస్మికంగా చనిపోతాడంకన్న, ఫలానివాడు చనిపోతాడని తెలిసి చనిపోవటం దారుణం; ఇక ముందెప్పుడో బాధలువస్తాయని, ఇప్పటినుండే, వాటికోసం బాధపడటం, రానున్న విపత్తులు ముందే తెలుసుకోవడంవల, వాటికి తగు చికిత్సలుచేసి, జీవితం సుఖమయం చేసుకోవచ్చునన్న దురూహ (!) తనను పట్టి పల్లార్చాయి. భవిష్యత్తును తెలుసుకొనడంవల్ల అన్ని వేదనలు రూపుమాసిపోతాయని తను విశ్వసించాడు అందుకోసం ప్రయత్నించి ఆశక్తి పొందాడు ఫలితం తనను నమ్మకపోవడం గతాన్ని తుణంగా చెప్పినప్పుడుగానీ, భావిని పూర్తిగా విశ్వసించరు అప్పుడుగాని అందరూ తన మాట నమ్మరు. అలా నమ్మినప్పుడే ప్రతివారూ, రానున్న శుభాశుభాలను ఇప్పుడే తెలుసుకొని, తగువిధంగా ప్రవర్తిందరు. అలా జరిగిననాడు లోకం ఆనందధామమౌతుంది స్వర్గసీమ అవుతుంది .

ఇలా అనుకొన్నాడు గుణనిధి కొనకు జరిగింది వేరు. వర్తమానంలో, గౌరవనీయులుగా, పూజనీయులుగా చెలామణీ అవుతున్న వేలమంది గత చరిత్రలు, హేయాతి హేయంగా గుణనిధికి కనుపించాయి భయంకరమైన హింసలు, దారుణమైన హత్యలు, దోపిడులు, అసత్యాలు, అశ్లీలజీవితాలు, భగ్నప్రణయాలు.. లక్షలకు లక్షలు. తీవ్రంగా, నగ్నంగా, గుణనిధికి అర్థమైనాయి. అంతర్బహిర్జీవితాల వడుమ, రహస్యంగా, ఇంత కుళ్ళుపుంటుందని గుణనిధి ఊహించలేదు.. .

భవిష్యత్తు — ఇప్పుడు 'పాడిగిటిలో ఒదిగలబడి' చిరునవ్వు కిరణాలను వదజల్లే పసిపాప, పాలు త్రాగుతూనే, గావుకేక పెట్టి, రక్తం కక్కుతూ [ముందెప్పుడో]చనిపోతుందని తుక్కునాకే

తెలిసిన ఆ మాతృమూర్తి హృదయవేదన; మధురానుభూతులతో, రుచిరస్వప్నాలతో, తీవ్ర వాంఛలతో జీవితాలను తీరాలమీద నడిపించే యువమిథునానికి—రెండు సంవత్సరాలలో వియోగం సంభవిస్తుందని ఇప్పుడే తెలిసినప్పటి ఉన్మాదావస్థ; విజయ కాంక్షతో, రణక్షేత్రంలో, వీర విహారం చేస్తున్న సైనికునకు—ప్రభుభక్తి, దేశభక్తి ఉద్దీపనలు కాగా, వైరివీరులను మగ్గ మూచం చేస్తున్న సైనికునికి—తను చిత్రవధచేయబడి, తనశవాన్ని కాకులు, గద్దలు పొడుచు తింటుంటుంటే, పురుగులు లుకలుక మంటుంటాయని అర్థమైపోయినప్పుడు; ఎంతఘోరం! తను ఇటువంటి ఫలితాల వాంఛించి, ఈ విచిత్ర శక్తులను పొందలేదు.

*　　*　　*　　*

ఇంతలో పెద్దగోల వినపడ్డది వేలాది పదధ్వానములతో చెవులు మార్మోగిపోతున్నాయి ఆయుధాల ఖణంఖణ ధ్వనులు, ఆర్తనాదాలు, ఏడుపులు, విజయధ్వానాలు

"బహుశః అగ్నిమిత్రుని సైనికులు కోటలోకి ప్రవేశించి ఉంటారు" అనుకొన్నాడు గుణనిధి.

## 7

శంకరుడు ఆలోచిస్తూ కూర్చున్నాడు. పార్వతి నిశ్శబ్దంగా ప్రవేశించింది.

"విన్నాను. ఇప్పుడే నందీశ్వరుడు చెప్పాడు" అన్నది పార్వతి మెల్లగా.

శంకరుడు ఆలోచిస్తూనే అటూఇటూ తిరిగాడు. పార్వతి భర్తముఖంవంకే చూస్తున్నది.

"ఈ ప్రయోగం ఫలిస్తుందనుకున్నాను. కొంతంత ఆశతో ఎదురుచూశాను. చివరికి విష ఫలితాన్నిచ్చింది" అన్నాడు శంకరుడు దిగులుగా.

"ఎందుకని?"

"అదే ఆలోచిస్తున్నాను. లోపమెక్కడున్నదో కనపడి చావటంలేదు."

పార్వతి మాట్లాడలేదు

"నువ్వెక్కడైనా పసిగట్టావా?" శివుడన్నాడు.

పార్వతి ఏ సమాధానమూ ఇవ్వలేదు. చిన్న నవ్వు నవ్వింది. శంకరుడుగూడా నవ్వాడు. కానీ అది నవ్వులాగలేదు. ఏమి చేయటానికీ తోచనప్పుడు చేసే చేష్టలాగా, మారిపోయి ఉన్నది.

"నాది సమాధానంకాదు" అంటూ ప్రారంభించింది ఉమాదేవి. "మొదటినుండీ నేను గుణనిధిని పరిశీలిస్తూ వచ్చాను. అతను భవిష్యత్తును గురించి చెప్పటంలో గూడా అట్టే సమన్వయం లేదు. ఒకాయనకు, కొడుకువివాహం గురించి చెబుతూ 'మరణ కారణ మేమిటో చెప్పాను. ఆకారణం రాకుండా చూసుకోండి. సత్ఫలితం కలగవచ్చు, అంటాడు. ఇన్ని కారణాలను, సంఘటనలను చెప్పిన గుణనిధి; వాళ్లా కారణాలు రాకుండా చూడగలరో లేదో ఫలితం ఎలా ఉంటుందో స్పష్టంగా ఎందుకని చెప్పలేకపోయాడు? సమరసేనునితో మాట్లాడుతూ, 'రెండుమూడు రోజుల్లో అగ్నిమిత్రుడు సైనికుల్ని తీసుకొస్తున్నాడని, ఏమరుపాటుగా కోటమీద దాడిచేసి దాన్ని వశంచేసుకొంటాడని, మిమ్మల్ని బందీగా పట్టుకుంటాడని' భవిష్యత్తును గురించి వెల్లడిస్తాడు అలాగే అగ్నిమిత్రుడు వచ్చాడు. కోటను వశం చేసుకొన్నాడు సమరసేనుణ్ణి ఖైదీగా పట్టుకొన్నాడు. బాగానేఉంది. అయితే - సమరసేనుని గత వృత్తాంతం చెప్పిన తరువాత, తను ఏమౌతానన్న ఆలోచన గుణనిధికి రాలేదు. ఇంతమంది భావి జీవితాలనుగురించి, సోపపత్తికంగా చెప్పగలిగిన గుణనిధి, తనే ఎందుకు ఖైదీ అయినాడు? ఇలా అవుతానని ముందుగా అతనికెందుకు తెలియలేదు? తెలిసి చేశాననటానికి వీల్లేదుకదా! ముందు వీటికి మీరు సమాధానమివ్వండి" అన్నది పార్వతి.

సమాధానమివ్వడానికి శంకరుడు దక్కడలేదు. అతను వెళ్ళిపోయిగూడా చాలాసేపయింది.

"పాపం! గుణనిధి ఘోరంగా చనిపోయాడు. ఇటువంటి మంత్రశక్తులున్నవాళ్ళు బ్రతికుంటే శేరానికి అనర్థకమని అగ్నిమిత్రుడు కొరడాలతో కొట్టించి చంపాడు. ముక్కలను ఉరి గొల్పాడు. పాపం! మాకోసం అతను చిత్రహింసలు పడ్డాడు" అనుకొన్నది ఉమ.

*　　*　　*　　*

పార్వతీదేవి సందేహాలను, ఆతరువాత గూడా శంకరుడు తీర్చలేదు. అప్పటికీ ఇప్పటికీ అసందేహాలు సందేహాలుగానే ఉండిపోయాయి.



# చిలకమర్తి-నాటకకర్త

శ్రీ దివాకర్ల వేంకటావధాని

ఆంధ్రమునఁ గాకక వాఙ్మయమునకు నాటక వాఙ్మయము కూడఁ దొలుఁదొల్త ననువాదరూపముననే వెలువడియుండెను. తరువాతఁ బ్రతిభాశాలులైన విద్వాంసులు కొంద ఱాంగ్ల నాటకములను, గొందఱు సంస్కృత నాటకములను నాదర్శముగాఁ గ్రహించి స్వతంత్ర నాటకములను వ్రాయఁదొడంగిరి. సంస్కృత మార్గానుయాయులైన ప్రసిద్ధాంధ్ర నాటకకర్తలలో కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారొకరు. గయోపాఖ్యానాది నాటకములు బహు నాటకసమాజములచే బహు వారములు ప్రదర్శితములై వారికి నాటక కర్తగాఁ గూడఁ గీర్తితెచ్చినమాట నిజమేయైనను వారి నవలలకుఁ గలిగినంత వ్యాప్తి నాటకములకుఁ గలుగలేదనుటలో నతిశయోక్తి యుండఁజాలదు. వారు నవలా రచనలో సిద్ధహస్తులు. వారి నవలలు చదువనివారును, చదివి యానందింపనివారును ఆంధ్రదేశమునందలి యక్షరాస్యులలో నుండరు. కాని వారి గ్రంథకర్తృత్వము నవలా రచనముతోఁ గాక నాటకరచనములతోనే యారంభించియుండెను. క్రీ. శ. 19వ శతాబ్ది చివరిరోజులలో రాజమహేంద్రవరమున శ్రీ ఇయ్యుణ్ణి హనుమంతరావు నాయుఁడుగారి ప్రోత్సాహమున నెలకొల్పఁబడిన హిందూ నాటకసమాజమువారు ప్రదర్శించుటకై వారు కీచకవధ, ద్రౌపదీ పరిణయము, గయోపాఖ్యానము, పారిజాతాపహరణము, రామ జననము, సీతాకళ్యాణము, నలనాటకము, ప్రసన్న యాదవము మున్నగు పెక్కునాటకములను రచించి యుండిరి. తరువాత వారు చతుర చంద్రహాసము ప్రహ్లాద నాటకము అను స్వతంత్ర నాటకములనే కాక పార్వతీ పరిణయమునకును, భాసకృత నాటకములకును అనువాదములనుగూడ వెలయించియుండిరి. శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారును, శ్రీ హనుమంతరావు నాయుఁడు గారును పై నాటకసమాజమున సభ్యులై ప్రముఖములైన స్త్రీపురుష పాత్రలను సమర్థతతో నిర్వహించుచుండిరి. వారే కాక యితర నటకులు కూడఁ బలువు రభినయమున వారితేరినవారేయయ్యుఁ బద్యములను పాడు నలవాటులేనివారగుటచేఁ బ్రధానముగా నా నాటక సంఘమువారి కొఱకు రచించుచుండిన కొన్ని మొదటి నాటకములు పంతులుగారు వచనమయములుగానే వ్రాయుట సంభవించెను. మొదట నవి యన్నియు నముద్రితములుగానే యుండిపోయెను. ప్రత్యేక నాటకసమాజములను దృష్టియందుంచుకొని వ్రాయఁబడుచుండు నాటకములలో నటకుల యభిరుచి సామర్థ్యముల ననుసరించియే పద్య గద్యములు రచింపఁబడుచుండుటయు, నవి తొలుత నముద్రితములుగానేయుండి ప్రదర్శన సమయములందలి యనుభవములఁ బురస్కరించుకొని చేయఁబడు మార్పు చేర్పులతోఁ దరువాత ముద్రితములగుచుండుటయు సహజమైన పద్ధతియే. కీ. శే. ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి నాటకములు కూడ నారంభములో నిట్లు రచింపఁబడినట్టివే. వారివలెనే చిలకమర్తివారు కూడ దరువాత ముద్రింపవలసినప్పు డా నాటకములలో నటకుల ననుసరించి కాక పాత్రల ననుసరించి తమ యిచ్చవచ్చినట్లు పద్యములను జొప్పించియుండిరి. ముద్రితములైన వారి స్వతంత్ర నాటకములలో గయోపాఖ్యానము, ప్రసన్న యాదవము, పారిజాతాపహరణము, చతుర చంద్రహాసము, ప్రహ్లాద నాటకము అనునైదును సుప్రసిద్ధములైనవి. మిగిలినవి ముద్రితములైనవో లేదో తెలియదు.

చిలకమర్తివారి నాటకములలో నేకాక యాంధ్రనాటకములలో నెల్ల మిక్కిలి ప్రసిద్ధిప్రచారములు గాంచినది గయోపాఖ్యానము. దీనికి ప్రచండయాదవ మను నామాంతరముకూడఁ గలదు. సూర్యశిఖున కర్ఘ్యమొసంగుసమయమున భార్యతో విమానగామియై యాకసమునఁ బోవుచుండిన గయుఁడు తన యంజలిలో నిష్ఠీవనము వైచుటచేఁ బ్రచండుఁడై యాదవవంశతిలకమైన శ్రీకృష్ణ దేవుఁ డాగ్రహించినను అవివేకమున నుమ్మివేసిన పాపాత్ముని సంహరింతునని ప్రతిన గావించుటయు, గయునకు శరణొసంగిన యర్జునునితో స్నేహబాంధవ్యముల నరకుచేయక దారుణముగాఁ బోరుటయు ననుసందర్భములను బురస్కరించుకొని కవిగారీ నాటకమున కారంభవనామము కల్పించియుండిరి. కాని యీపేరు పుస్తకములోనున్నదే కాని ప్రచారములో నెక్కుడను వినరాదు. ఇందలి కథ కృష్ణార్జునులతో సంబంధించినదైనను భారతములో నున్నట్టిది కాదు. ఏతత్కథావస్తుకములైన గ్రంథము లాంధ్రమున నాలుగైదున్నవి. అందు మొదటిది నాదిండ్లగోపమంత్రి కృష్ణార్జున సంవాదము నుపేర రచించిన ద్విపదకావ్యము. తరువాత వలిచేరు వేంకటరామప్రధాని, కస్తూరిరంగకవి, రామయామాత్యుఁడు అనువారు దానినే పద్యకావ్యములుగా వెలయించియుండిరి. చిత్రభారతమున నిటువంటి కథ యొకటి యున్నది కాని దానికిని నాటక కథకును జాలభేదమున్నది. గయుఁడు కృష్ణునిచేతిలోఁ గాక గాలవుఁడను నొక ఋషి చేతిలో నుమిసియుండినట్లును, అతఁడు కృష్ణునితోఁ జెప్పుకొనఁగాఁ గృష్ణుఁడు కుపితుఁడై గయుని సంహరింపఁ బ్రతినచేసినట్లును, గయుఁ డర్జునుని శరణుచొచ్చుటచేఁ గృష్ణార్జునులకు యుద్ధము జరిగినట్లును నందు వర్ణింపఁబడియున్నది. చిలకమర్తివారు పై గ్రంథములన్నిటిలో రామయామాత్యుని గ్రంథమునే చాల సన్నిహితముగా ననుసరించియుండిరి. అలఁతిమార్పులతో నందలి పద్యములే కొన్ని నాటకమున రూపాంతరము నొందినట్లు కనుపించును. కృష్ణుని ప్రతిజ్ఞ విన్నపిమ్మట భీతుఁడై గయుఁ

వేషధారియునవై తొలుత బ్రహ్మలోకమునకును దరువాతఁ గైలాస
మునకును నరిగియుండెను. శంకరుఁ డభయమొసంగ నంగీకరింప
నప్పు డాతఁడు

"నాగలోకమునకు నేఁగి డాగియున్న
బలియు హరిభక్తుఁ డాతఁడు పట్టియిచ్చు
నంబుధిస్యముఁ జొచ్చి యొదిగియుండెదనన్న
హరిమాయ యదియును నరసి చూడు"

నిత్యాదిగా విలపించియుండెను. ఈ వాక్యములను నాటకమునందలి

పాతాళమున కేఁగి బ్రతుక వచ్చునటన్న
బలిచక్రవర్తి నన్నప్పటియిచ్చు
జలధి నాయకుఁ వేఁడి శరణుచొచ్చెదనన్న
వటపత్రశాయిద్రో యటవసించు

నను సీసపద్య పాదములతోఁ బోల్చి చూచినచో నా మూలమును నాటక మెంత సన్నిహితముగా ననుసరించెనో తెలియవచ్చును

గయోపాఖ్యానము వీర రస ప్రధానమైన నాటకము హాస్య కరుణము లిందప్పటప్పట సంగరసముగా నున్నవి. శంకరుఁడు చివర శోక్యము కలిగించుకొనకయుండినచో నాటకము విషాదాంతముగా ముగిసియుండును. శరణాగత త్రాణమున నొక్క అర్జునకే కాక పాండవులందఱికిని గల దీక్ష యిందుఁ జక్కఁగా వర్ణింపబడినది. ఇందలి కథలోనే సహజమైన యాకర్షణ శక్తియున్నది. బాల్యసఖులును బావమఱఁదులు నైన కృష్ణార్జునులకు గయుని మూలమున వైరము సంభవించు ననన్న వృత్తాంతము నాటకమున నారదునికి వలెనే పాఠక సామాజికులకుఁగూడ వింతిం తనరాని యౌత్సుక్యము చేకూర్చును. ఇట్లు జరుగునని సాధారణముగా నెవ్వరును దలంపరు అందుచేత నీ కథ సాగుకొలఁది తత్పర్యవసానము నెఱుంగు కుతూహలమును గ్రమక్రమముగాఁ బెంపొందించు చుండును. గయుఁడుష్ట్రి ప్రదాన మొనరించు నచ్యుతుని యంజలిలో నుమియుట ఘోరమైన దోష మేయయ్యు వాఁడు దాని నుద్దేశపూర్వకముగా నొనరించిన వాఁడు కాకపోవుటచేతను, సహజముగా నతఁడు భగవద్భక్తిపూరిత హృదయుఁడును, సుగుణగణ శోభితుఁడును నగుటచేతను సామాజికులాతని యెడ సానుభూతి వహించి యెవ్వరైన నాతని కభయమిచ్చి రక్షించిన బాగుగా నుండునని యూహించుచుందురు. సర్వవిషయముల సమర్థుడైన శ్రీకృష్ణసాచియందుకుఁ బూనుట వారి కెంతయో యానంద కలిగించును. సామాజిక సానుభూతి సంధుతకముగా గయుని శీలమును జిత్రించుటలోఁ జిలకమర్తి కవి యఖండమైన నైపుణ్యము ప్రదర్శించినాఁడు. చివర శంకరుఁడు ప్రత్యక్షమై గయకృష్ణార్జునుల మువ్వురియందునుగల తప్పు నిరూపించి రణమునకు విరమణము కలిగించుట కలహప్రియుఁడైన నారదునిమాట యేమో కాని యితరులందఱికిని అతి ప్రీతి కలిగించును. కాశకుని హాస్యము కొన్నిచోట్ల నస్వాభావికమై యతిమాత్రముగా నున్నను మొత్తముమీఁద హృదయరంజకముగానే యొప్పారుచున్నది. పంచమాంకమునఁ గృష్ణార్జునుల యుద్ధమందు సంస్కృతి లక్షణమునకు విరుద్ధముగా రంగముమీఁదనే ప్రదర్శితమై యున్నది. ప్రథమాంకమున గృష్ణుఁడు యమునాతటమునందుఁ దానుగావించిన బాల్యక్రీడల వర్ణించుటయు, ద్వితీయాంకమునందలి గయుని సత్యలోక వర్ణనమును గొంత దీర్ఘతరములై నాటక కథాగమనమును నిరోధించుచున్నట్లున్నవి. యమునాజలదేవత కృష్ణునకు నీ చేతిలో నుమిసిన వాఁడు గయుఁడని యెఱింగించుటయు, నశరీరవాణి కృష్ణుఁడు కావించిన ప్రతిజ్ఞవిషయము గయునికిఁ దెలుపుటయుఁ, బంచమాంకమునఁ గృష్ణుఁడు మత్స్యావతారమును శంకరుఁడు క్షీరసాగరాదులను నర్జునునకుఁ జూపుటయు నతిలోక మహిమతోఁ గూడి నాటక సహజత్వమున కించుకలోపము నాపాదించుచున్నవి. ద్వితీయాంకమున గయుఁడు మొదట సత్యలోకమునకును దరువాతఁ గైలాసమునకును నరిగి బ్రహ్మశంకరుల శరణు వేఁడుటయుఁ, జతుర్థాంకమున నక్రూరుఁడు రాయబారము వైఫల్యము నెఱింగించిన పిమ్మట సుభద్ర, రుక్మిణి, సత్యభామ, దేవకీ వసుదేవులు నొకరి తరువాత నొకరువచ్చి కృష్ణుని నర్జునుతో సంధి గావించుకొమ్మని ప్రార్థించుటయుఁ గొంత పునరుక్తిదోషమునకును గుఱియగుచున్నవి. కుటిలమతులయ్యు నీ సందర్భమునఁ బాండవులకు బాసటగా వచ్చిన దుర్యోధన కర్ణాదుల దురుద్దేశమును సూచించిరే కాని కవిగారు మరల వారి ప్రసక్తి యెత్తుటను దెచ్చియుండలేదు. కృష్ణునకు సుభద్రకును రుక్మిణీ సత్యభామలకును, దల్లిదండ్రులకును నొసంగిన ప్రత్యుత్తరములు మార్దవమునకు దూరములై నిసర్గ కరుణామయుఁడైన యా దేవునికి లేని కాఠిన్యమును గల్పించుచున్నవి. యుద్ధాంతమునఁ గృష్ణుఁడు "కుటిలాచారులు ధార్తరాష్ట్రులకు మీకున్నయట్లే, దానికై పటుశస్త్రంబులఁ బత్తిదర్పముయి సంపాదించిరో లేదో యంచెటులైనం గనఁగోరి యాహవము కేళీలీలఁ గల్పించితి" నని యర్జునునితోఁ బల్కుట పాండవులయెడ నాతనికిఁ గల పక్షపాతమును దెల్పుచున్నను అతఁ డర్జునునితోఁ బోరిన తీవ్రతను బురస్కరించుకొని చూచినచో సత్యేతరమువలెఁ గానిపించుచున్నది. ఇట్లప్పటప్పటఁ గొన్ని కొరతలు గోచరించినను మాఁగలొల్కు పద్యములును, మధురములైన సంభాషణములును, సహజ రమణీయమైన వస్తువును ఆంధ్రుల కీనాటకము నత్యంతాదర పాత్రము గావించినవి. గయోపాఖ్యాన నాటకప్రతులు లక్షకుఁ బైగా నాంధ్రదేశమున నమ్మకమైపోవుటయే దానియెడ నాంధ్రులకుఁ గల యభిమానమునకుఁ దార్కాణము.

పారిజాతాపహరణమును చిలకమర్తివారు గయోపాఖ్యానము రచించిన మరుసటి సంవత్సరము (1890) తమ యిరువదియాఱవ యేట రచించియుండిరి. సుప్రసిద్ధమైన ముక్కు తిమ్మనార్యుని ప్రబంధమే యీ నాటకకథకు మూలము కాని యా ప్రబంధములో వలెఁగాక నాటకమునఁ గథ సరిగాఁ బారిజాతాపహరణముతోనే ముగియుచు నా నామమును సార్థకము చేయుచున్నది. పుణ్యక వ్రతమిషమున నారదుఁడు సత్యభామా గర్వభంగ మొనరించిన వృత్తాంత మిందు విడువఁబడినది. నిజమునకుఁ బారిజాతాపహరణ వృత్తాంతమునకును దానికిని వంత సంబంధము లేనేలేదు. చిత్ర రథుని రాయబారము చిలకమర్తివారు సృష్టించినదే. ఆ రాయబారమునకును, బృహస్పతి హితోపదేశమునకును ఫలితముగా నింద్రుఁడు నాటకమున గృష్ణునితో సంధిచేసికొని యుద్ధమును బరిహరించెను. పారిజాతపుష్పములపొన్నున కేకాని పత్యశింపని తచిమహ కోరక,

యించుక వెగటు కలిగించును. చతుర్థాంకమునఁ గృష్ణ నరకాసురులకు జరిగిన సంభాషణము కేవల వాగాడంబరమై, యాత్మశ్లాఘలకాలవాలమై యనవసరముగాఁ బొడిగింపఁబడినది. ఆ యంకమున నడిచిన కార్యము మృగ్యము. స్వల్పములైన ఈలోపముల నటుంచి చూచినచో రసపాత్రపోషణమునను, సంభాషణ చమత్కారమునను, కథాసంవిధానమునను ఈ నాటకము సర్వవిధముల మిన్నగా నున్నది. పంతులుగారికిఁగూడ నీ నాటకమునందే యభిమానమెక్కువ. "నా నాటకములలో గయోపాఖ్యానము శ్రేష్ఠమని జను లభిప్రాయపడుదురు. ప్రసన్నయాదవము శ్రేష్ఠమని నా యభిప్రాయ"మని స్వీయచరిత్రలో వా రాయభిమానమున కక్షరరూప మొసంగియుండిరి.

చతుర చంద్రహాసము మరణాంతమైన నాటకము. తాను కావించిన ప్రయత్నములన్నియు వ్యర్థమై శత్రువుల కుపకారములుగాఁ బరిణమించుటయేకాక తన కపకారులగుటఁగూడ సంభవించుటచే దుష్టబుద్ధి వేదనాగ్ని దందహ్యమానుఁడై స్వయముగాఁ బొడుచుకొని చనిపోవుటతో నాటకము ముగియుచున్నది. ఈ నాటకమునకుఁ జతుర చంద్రహాసమని పేరుపెట్టఁబడినను ఇందు నాయకుఁడు దుష్టబుద్ధియను బాదరాయణుఁడే. ఇందు జరిగిన కథాతంత్రమున కంతకును సూత్రధారుఁ డాతఁడే. అతనియందు రాజద్రోహము, స్వార్థపరాయణత, లోభము, క్రూరత మున్నగు గుణములన్నియు మూర్తీభవించియున్నవి. తాను చేయఁదలఁచిన కార్యమును సిద్ధింపఁజేయుటకై యాతఁ డెట్టిఘోరము నొనర్చుటకును వెనుదీయఁడు చివరికి నిజాకాపరిపూర్తికై యాతఁడు సుగుణాలవాలయైన తనకూఁతు సౌఖ్యమునుగూడ మంటఁగలుప యత్నించెను; సాధువైన యింద్రదత్తునిఁ గపటమార్గమున బంధించెను; కౌశల్యసంపన్నుఁడైన చంద్రహాసుని రెండుపర్యాయములు చంపింప నిశ్చయించెను. అతఁడు పురుషకారమునే నమ్మి దైవమును బూర్తిగా విడనాడియుండుటచే నాతని యత్నములన్నియు సుమంత్రాధిష్ఠితములయ్యు బూడిదలోఁ బ్రేల్చిన హవ్యములవలె నిష్ఫలములైపోయెను. కవి యాతనియందుఁ జిత్రించిన దౌష్ట్యము ప్రతిక్షణమందును గోచరించి సామాజికుల కాతనియెడ హేయభావమునే కలిగించునుగాని సానుభూతి కలిగింపఁజాలదు. పైఁగా దుష్టుఁడైన యాతఁ డట్టిచావు చచ్చుట వారి కెంతో యానందమును జేకూర్చును. అందుచే నీనాటకము మరణాంతమయ్యు విషాదాంతకృతకు దూరమైపోయినది. నిజమున కీనాటకమునఁ జంద్రహాసుఁడు ప్రదర్శించిన చాతుర్యమేమియును లేదు. సహజ సుగుణశాలియైన యాతఁ డదృష్టవశమునఁ జిక్కుగండములు తప్పించుకొని మహైశ్వర్యమునకుఁ బాత్రుఁడయ్యెను. చతుర చంద్రహాసపదములందుఁ గానవచ్చు సాద్యంతరసామ్యము శ్రవణసుభగమైయుండుట యను కారణము తప్ప నీ నాటకమున కాపేరుంచుట కింకొక కారణము కానరాదు. ఈ నాటకమున దుష్టబుద్ధిజీవితము పురుషకారముయొక్క యల్పతను, చంద్రహాసునిజీవితము దైవముయొక్క బలీయస్త్వమును చక్కఁగా వ్యక్తముచేయుచున్నవి.

ఈ నాటకమున దుష్టబుద్ధిపన్నిన పన్నాగము లెప్పటికప్పుడే తప్పక ఫలించునట్లుగాఁ గనఁబడి యవి యన్యథాపరిణమించినవి. అవి నిష్ఫలములగుటకు దైవము చాలకపోవుటయే కారణము. కాని దుష్టబుద్ధి ప్రజ్ఞాలోపము కారణముకాదు. అతఁడు సేనాపతుఁ గుళిందరాజుపైఁ గోప మెక్కించినప్పుడు చూపినబుద్ధిచాతుర్య మింతింతని చెప్పరాదు. తన యత్నము లన్యథాకరింపఁబడి నప్పు డాతఁడు నిరుత్సాహమును గాని వైరాగ్యమునుగాని ప్రదర్శింపక ధీరుఁడై క్రొత్తక్రొత్త మార్గములకు విత్తనములు చల్లుచుండుట యెంతో ప్రశంసనీయముగా నుండును. మదనునికిని దుష్టబుద్ధికిని శీలమునను, వర్తనమునను హస్తిమశకాంతర మున్నది. ఆ తండ్రికొడుకుల ప్రవృత్తిలోఁగల తారతమ్యము నాటకమున స్పష్టముగా వివరింపఁబడినది. ఏ యన్యాయము నెఱుఁగని మదనుఁడు, చివరఁ గాళికాలయమున భీమభైరవులచే ఖండింపఁబడి తండ్రి దౌష్ట్యమునకు బలియగుట విషాదభావమున కెంతో వన్నె చేకూర్చుచున్నది. చంద్రహాసుఁడు కావించిన జనవర్ధన మించుక దీర్ఘమై ప్రబంధమార్గమునుబట్టినది. నాటక కార్యము రెండుమూఁడు ముఖ్యసన్నివేశము లందాకస్మిక సంఘటన (*Chance*) పై నాధారపడియున్నది. చంద్రహాసుఁడు నిద్రించుచున్న సమయమున విషయ కాంచనమాలతో వచ్చుటకేగి యుత్తరమును జూచి యందక్షర పరివర్తనము చేయకుండినచో నాటకకథ యింకొక విధముగా జరిగియుండును. అట్లే కాళికాలయమునకుఁ జంద్రహాసునికి బదులు మదనుఁ డేగకుండినచో భీమభైరవులు దుష్టబుద్ధి తలంచినట్లేమియు నాలోచింపక యాతనినే సంహరించియుండురు. కథాకార్య మీ విధముగా నాకస్మికాపతితములైన సంఘటనలపై నాధారపడియుండుట తత్సంఘటనమునందలి లోపమేయని విమర్శకుల యభిప్రాయము. మదనుఁడు త్తరమును జూచినంతనే యిసుమంతయు సనుమానింపక తండ్రిపరోక్షమునందే సోదరికిఁ బెండ్లికావించుటయు, నంత పట్టుదలయుఁ బ్రతిభయుగల దుష్టబుద్ధియందు మార్పుకావించిన వా రెవరో పరిశీలింపక చంద్రహాసుఁడే యట్లొనర్చి తన్ను వంచించియుండునని తలంచి యూరకుండుటయు వింతకలిగించుచున్నవి

చతుర చంద్రహాసమునందలి ప్రధానరసముకూడ వీరమే. తన యభీప్సితముల సమగ్రసిద్ధికై యొనర్చు ప్రయత్నములందు దుష్టబుద్ధి ప్రదర్శించు నుత్సాహ మిందు స్థాయిభావము. చతుర్థాంకమున విషయాచంద్రహాసు లొండొరులఁ గాంచి వలపునఁ బడిన సందర్భమున శృంగారరసము పోషింపఁబడినది. కుమార మరణము నారసి దుష్టబుద్ధి కాళికాలయమున విలపించునెడఁ గరుణరసచ్ఛాయలు గోచరించుచున్నవి. ఇంతయుమీఁదఁ గ్లిష్టతరమైన కథయు, సిద్ధప్రాయములైన దుష్టబుద్ధియత్నములు హఠాత్తుగా భగ్నము లగుటయుఁ, జంద్రహాసుఁడు దుస్తరములైన యాపదలు తరించి తన యోగ్యతకుఁ దగిన యైశ్వర్యము నొందుటయు నాటకాద్భుతరసపుఁ బుష్టి చేకూర్చుచు సామాజికుల మానసముల దృఢముగా నాకర్షించుచున్నవి.

ప్రహ్లాద చరిత్రము భాగవతమునందలి కథ యాధారముగా వ్రాయఁబడిన నాటకము. ఇం దాఱంకములున్నవి. మొదటి నాలుగంకములకును ప్రహ్లాద చరిత్రమునకును నంత సన్నిహిత సంబంధము లేదు. విష్ణువు శ్వేతవరాహ రూపమున హిరణ్యాక్షుని వధించుటయు, హిరణ్యకశిపుఁడు తపశ్చరణమునకై యేగినప్పు డింద్రుఁ

నాతని యంతఃపురముచొచ్చి లీలావతిని చెఱపట్టుకొనిపోవుటయు, హిరణ్యకశిపుఁడు తపస్సునుండి తిరిగివచ్చి లీలావతికిఁ దన తపశ్చరణ ఫలసంపాదన వృత్తాంతము తెలియఁగించుటయు, హిరణ్యకశిపుఁడు తన పరోక్షమున నింద్రుఁ డొనరించిన దుండగమునకుఁ బ్రతిక్రియగా నింద్రలోకముపై దండెత్తి యింద్రుని స్వర్గపదభ్రష్టు నొనరించుటయు నిందలి ప్రధానాంశములు. వీనిలోఁ బ్రహ్లాద జనన వృత్తాంతముతోఁ గూడిన ద్వితీయాంకమునకే ప్రహ్లాద చరిత్రతో నించుక సంబంధమున్నది. మిగిలిన కథయంతయుఁ బ్రహ్లాద చరిత్రయను నాటక నామమును బురస్కరించుకొని చూచినచో ననవసర విస్తరణమువలెఁ గానఁబడుచున్నది దానిని సంకుచిత మొనరించి సంగ్రహముగా సూచించియుండినచో నెక్కువ సమంజసముగా నుండియుండును.

రస నాయకదృష్టితోఁ జూచినచో నీ నాటకమును రెండు భాగములుగా విభజింపవచ్చును. మొదటి నాలుగంకములలో వీరము ప్రధానరసము. దాని కింద్రుఁడును హిరణ్యకశిపుఁడును నాలంబనములు. చివరి రెండంకములలోని రసము భక్తి దీని కాలంబనము ప్రహ్లాదుఁడు. ఏతద్భాగద్వితయమునకు హిరణ్యకశిపుని యునికి యొకవిధమైన సంబంధము కల్పించుచున్నది. ఎట్లయినను హిరణ్యాక్షుని మరణముతో నారంభించిన కథ వంకరలు తిరిగి తిరిగి చివరికి హిరణ్యకశిపుని మృతితో ముగియుటలో సహజమైన పరిణామక్రమము గోచరించుటలేదు తుది యంకము హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునిఁ జంపుటకై యొనర్చిన పలుప్రయత్నముల కూడిక. ప్రహ్లాదుఁ డా గండములన్నియుఁ గడచి యక్షతుఁడై బయటఁ బడుట నారాయణుని భక్తరక్షణ పరాయణతను, భక్తి ప్రభావమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నది. ద్వితీయాంకమున నింద్రుఁడు లీలావతిని జెఱపట్టుటకై వచ్చినప్పుడు శుక్రుఁడు పల్కిన పల్కు లాతని ప్రభుభక్తికిని, లీలావతి వచనము లామె పాతివ్రత్యమునకును దార్కాణముగా నున్నవి. హిరణ్యాక్షుని మరణమునకు హిరణ్యకశిపుఁడును దితియు విలపించిన సందర్భమున కరుణరసము లెస్సఁగాఁ బోషింపఁబడినది.

తృతీయాంకమున హిరణ్యకశిపుఁడు తన తపశ్చర్యను వర్ణించినఘట్టము కథనాత్మకమై యనాటకోచితముగా నున్నది. చతుర్థాంకము మొదటనున్న దేవాంతక నరాంతకుల సంభాషణ మనవసరదీర్ఘమై, యనుచితప్రలాపములతోఁ గూడి, నాటకకథాగమనమున కాటంకము గలిగించుచున్నది. ఇంద్ర హిరణ్యకశిపుల ప్రసంగము ప్రసన్నయాదవమునందలి నరకమహేంద్రుల సంభాషణమునకుఁ బ్రతిరూపమై యున్నది. చండామార్కుల పాఠశాల ప్రస్తుత కాలమందలి పల్లెటూళ్లలోని ప్రాథమిక పాఠశాలలను దృష్టియందుంచుకొని వ్రాయఁబడినట్లున్నది. ఆ యుపాధ్యాయులకు శిష్యులపై వాత్సల్యముకాని, ఆ శిష్యులకు గురునిపై భక్తిగౌరవములుకాని లేశమైనఁ గానిపించుటలేదు. ప్రహ్లాదుఁడు తోడి బాలురకుఁ జెప్పిన హరిభక్తిప్రభావము సందర్భోచితమై చక్కఁగనే యున్నది కాని యాతఁడు హరినొక్కనిఁ బ్రశంసించుచు దేవతాదులను నిరసించుటమాత్ర మతిశయోక్తిరూపముగాఁ గానవచ్చుటలేదు. నరసింహమూర్తి హిరణ్యకశిపుని సంహరించుటకై యాతనిఁ జెంతకు లాగినంతనే యవనిక వ్రాలినట్లు సూచింపఁబడినది. అప్పుడు విప్రచిత్తి నరాంతకప్రహ్లాదులు నరసింహుని నఖక్రీడావిహారమును మాటలతో వర్ణించియుండిరి. వధ రంగమునఁ బ్రదర్శింపరాదను సంకేతములోఁ గవిగా రీవిధానము నవలంబించి యుందురు. కాని యంక మధ్యమున నిట్లుచేయుట నాటక సంప్రదాయమునకు విరుద్ధముగా నున్నది.

## సామాన్య లక్షణములు:—

చిలకమర్తివారి నాటకములకు సంస్కృతమునందలి కాళిదాసాదులనాటకములే మార్గదర్శకములు. వారు సాధ్యమైనంతవఱకు సంస్కృత నాటకలక్షణములనే సమగ్రముగా ననుసరించుటకు యత్నించియుండిరి వారి నాటకములన్నియుఁ బంచషాంక పరిమితములై యుండుటయు, నందలి విదూషక కంచుకుల పాత్రల చిత్రణమును, నాంది ప్రస్తావనా విష్కంభ ప్రవేశకాదుల విధానమును నీ విషయమును దృష్టాంతీకరించుచున్నవి. సంస్కృతలాక్షణికులు రంగప్రదర్శన యోగ్యములుకావని చెప్పిన యనుచిత నీరసోద్వేగకర విషయములను వారు పెక్కుచోట్ల విష్కంభాద్యర్థోపక్షేపకముల మూలముననే సూచించియుండిరి ఒక్క గయోపాఖ్యానమున మాత్రము కృష్ణార్జునులయుద్ధమును రంగముననే ప్రదర్శించిరి. చతుర చంద్రహాసమున నొక్కచో నిద్రించుచున్న చంద్రహాసునిఁ బ్రవేశపెట్టియుండిరి. సంస్కృతసంప్రదాయమునకు విరుద్ధముగా వారు కొన్ని యంకములను రంగములుగా విభజించిరి

వారి నాటకములన్నియుఁ బౌరాణికములైనవి. ప్రఖ్యాతములైన వస్తువులనే గ్రహించి వా రెడనెడ స్వల్పములైన కల్పనలు కావించి యీ నాటకములను రచించియుండిరి. మూల కథలకుఁగాని పాత్రలకుఁగాని యతిభిన్నముగా వారు కావించిన కల్పనలేవియుఁ గానరావు. కొంచెమించుమించుగా వారి నాటకములన్నియు వీరరస ప్రధానములైనట్టివే. పారిజాతాపహరణ, చతుర చంద్రహాసములలో మాత్రము శృంగార రసచ్ఛాయ లించుక గోచరించుచున్నవి హాస్యమున వారు సిద్ధహస్తులు. ప్రతి నాటకమునందును నేదో యొక కారణమును బురస్కరించుకొని వారు హాస్యమును బ్రవేశపెట్టియేయుండిరి. కొన్నిచోట్ల నీ హాస్యప్రసంగములు దీర్ఘములై యౌచిత్యపు మర్యాద నతిక్రమించుటయుఁ గానవచ్చును. పారిజాతాపహరణమునందలి రంభా సంభోగ ప్రసంగ మిందుకు దృష్టాంతము.

వారి నాటకము లన్నింటియందును లక్షణానుగుణములైన నాందీప్రస్తావనలున్నవి. కొన్ని నాందులలో శబ్దముచేతను గొన్నిటిలో నర్థముచేతను వారు వస్తునిర్దేశము కావించియుండిరి గయోపాఖ్యానమున శరణాగతత్రాణమును బ్రహ్లాద చరిత్రమున భక్తియుఁ బ్రశంసింపబడినవి చతుర చంద్రహాసమున శాబ్దికమైన వస్తు నిర్దేశమున్నది. కొన్ని నాటకములలో నాందీ పద్యములందో లేక ప్రస్తావనారంభములందో విద్వత్సభావందనమాదరింపబడియున్నది. ఒక్క గయోపాఖ్యాన నాటకమునఁ దక్క వారి ప్రస్తావనలన్నియు సూత్రధార పారిపార్శ్వక సంభాషణాత్మకములే. వీనిలో నన్నింటి

# John Dickinson & Co. Ltd.,

(INCORPORATED IN ENGLAND)

**కాగితము ఉత్పత్తిదారులు మరియు వ్రాతపరికరములు, తయారుచేయువారు**

## గ్రాఫిక్ ఆర్ట్సు, మరియు తత్సంబంధపు పరిశ్రమలకు

**కావలసిన పూర్తి యంత్రములు సరఫరా చేయువారు**

---

లెటర్ ప్రెస్; ఆఫ్ సెట్-లిథో; ఫొటో గ్రేవర్, అన్లైన్,
డై-స్టాంపింగ్; కాపర్ ప్లేట్ మరియు టిన్-ప్రింటింగ్ ప్రెస్‌లు

---

ప్రాసెస్ ఎన్‌గ్రేవింగ్; ఫొటో-లిథో మరియు
ఫొటో గ్రేవర్ - ఎక్విప్ మెంటు

---

స్టీరియో టైపింగ్; ఎలెక్ట్రో టైపింగు, నికెలింగ్;
బుక్ బైండింగ్ మరియు టైప్-కాస్టింగ్ ప్లాంటు,

---

కాగితపు సంచులు, కాగితపు అట్ట-పెట్టెలు, కవర్లుచేయు మెషీనులు

---

ఇంటర్ టైప్ లైన్ కంపోజింగ్ మెషినులు
హడిగో ఫోటో-మెకానికల్ టైప్-సెట్టింగ్ మెషినులు

---

హూగ్లీ అచ్చుపిరాలు

---

**పూర్తివివరములకు, సాంకేతిక సలహాలకు, నిపుణతతో కూడిన మెకానికల్ సర్వీసుకు**

ఈ దిగువ ఆఫీసులో లభించును.

# జాన్ డికిన్సన్ & కో., లిమిటెడ్,

(ఇంగ్లాండులో స్థాపింపబడినది)

**పోస్టు బాక్సు నెం. 77. : : మద్రాసు-1.**

యందును సుస్మృతికరణమును శంగమును, గవి ప్రశంసయుఁ గాన వచ్చుచున్నవి. ప్రస్తావనలలో వస్తునిర్దేశము కావించుటకై కవిగా రంతగా యత్నించియుండలేదు. ఋతువర్ణన మొక్క గయోపా ఖ్యానమునందే గోచరించుచున్నది. అందైనను నాటకమునందలి ప్రధాన రసము వీరరసమైయుండ శరదృతువు కాక వసంతర్తువు వర్ణింపబడినది. గయోపాఖ్యాన ప్రహ్లాద చరిత్రలలోఁ బాత్రప్రవేశ సూచన యున్నది. పారిజాతాపహరణమున బాత్రప్రవేశ సూచనకు బదులు సూత్రధారుఁడు నాటకశాలనే నాటకోచితములైన యాయా స్థలవిశేషములుగా భావింపవలెనని సదస్యులను గోరినట్లున్నది. ప్రసన్న యాదవములోఁ బ్రస్తావనాంతమున సూత్రధారుఁడు సభా సదులకు "మీరీ నాటకమున నీ యీ సంఘటనలు చూచి యానం దింపుఁ"డని విన్నవించి నిష్క్రమించియుండెను. ప్రహ్లాద చరిత్ర మునఁ గవిగారి నవీనవిధముల సత్కరించి యాదరించిన శ్రీ పిఠా పుర సంస్థానాధిపుల ప్రశంసయున్నది. ఇది యభ్యుదయ పరం పరాభివృద్ధి నాకాంక్షించుచుఁ బ్రబంధావతారికలలో చివరనుండు వదనమును బోలియున్నది. రెండు మూఁడు నాటకములలోఁ గవిగారు నాటక ప్రదర్శనము రమణీయముగా నుండవలెనన్న నేర్పరులును ప్రయోగకుశలులును నైన నటకుల యావశ్యక మెంతో కలదని, వివరించియుండె చతుర చంద్రహాసమున నిట్లే దృశ్యకావ్యములలోఁ గన్న శ్రవ్యకావ్యము లందుండు ఘనత వర్ణింపఁబడినది. అందే కవిగారు పరివర్తనములపైఁ గంటె స్వకపోల కల్పితములైన స్వతంత్రనాటకములపైఁ దమకుఁగల యభిమానమును వెల్లడిచేసియుండిరి ప్రసన్నయాదవము "మల్లయా ర్యుండు నా మేనమామయగుటఁ గవిత యెటులున్న నిక్కృతిగణుతిఁ గాంచు"నని కవిగారు సూత్రధారునితో నిర్భేదము చెప్పుకొని యుండిరి. చతురచంద్రహాసములోఁ బ్రస్తావనాంతమున నాటకము నందలి నీతియొక పద్యమున వివరింపఁబడినది. ఈ విధముగా వీరి నాందీప్రస్తావనలలో నొండురెండు స్వతంత్రరీతులు గోచరించు చున్నను బూర్వలక్షణానుసరణముకూడ వ్యక్తమగుచుచేయున్నది. దుష్టబుద్ధిమరణముతో ముగిసిన చతుర చంద్రహాసమునఁ దప్ప మిగి లిన యన్ని నాటకముల చివర లక్షణానురూపములైన భరత వాక్యములు వ్రాయఁబడియున్నవి

పంతులుగారి యైదు నాటకములందుఁ బలుచోట్ల విష్కంభప్రవే శకములను వాడియున్నారు. సంస్కృతములోవలెఁ దెలుఁగున భాషాప్రయోగమునుబట్టి పాత్రల యుత్తమ మధ్యమాధమత్వముల తెలుసుకొనుట కవకాశము లేకపోయినను వారా పాత్ర లొనర్చు కార్యములనుబట్టి వారి యంతరువులను నిర్ణయించినట్లు కనఁబడు చున్నది. దీనినిబట్టియే కాఁబోలు వారు ప్రహ్లాద. చరిత్రయందలి శేవాంతక వరాంతకుల సంభాషణమును బ్రవేశకమని పేర్కొని యున్నారు. మిగిలినవి పెక్కు విష్కంభములనియే సూచింపఁబడి యున్నవి. కాని వానిలోఁగూడఁ బ్రవేశకము లనఁదగినవి రెండు మూఁడున్నవి. వారు సాధారణముగా యుద్ధములను, బ్రయాణము లను సూచించుటకై యీ ప్రవేశక విష్కంభములను వాడి యున్నారు. పారిజాతాపహరణ ప్రథమాంకారంభమునందలి నారద

పదికాపరుల సంభాషణము విష్కంభప్రాయమై యున్నది. ప్రసన్న యాదవ తృతీయాంకము మొదటనున్న దేవలమాణిభద్రుల సంభాషణము ప్రవేశకముగాఁ గాక నాటకరంగముగానే యుండఁ దగియున్నది. విష్కంభప్రవేశకములందలి పాత్రలే తరువాతఁగూడఁ బ్రవేశించి నాటకకథను గొనసాగింపుచున్నప్పుడు వానిని కేవలము సూచ్య ములుగాఁ గాక దృశ్యములుగా నుండుటయే యుచితము.

పంతులుగారు నాటక సమాజములతోడను నటులతోడను సన్ని హిత సంబంధము కలవారైయుండుటచేఁ దమ నాటకములందు సార స్వత ప్రయోజనమునకే కాక రంగప్రయోజనమునకుఁగూడఁ దగి నంత ప్రాధాన్య మొసంగియుండిరి. నిజమున కీ రెండు ప్రయోజన ములను సరిగా నెఱవేర్పఁజాలనిచో నాటకము శ్రవ్యకావ్యముల కంటె నట్టి వైశిష్ట్యమును గలిగియుండ నేరదు. పంతులుగారు తమ నాటకములలో సామాన్యజనులవినోదమునకై మాత్రమే పనికివచ్చు నట్టి రంగములనెన్నిటినో వ్రాసియుండిరి. హాస్య రసభూయిష్ఠము లైన వారి రంగములన్నియు నీదృష్టితో వ్రాయఁబడినట్టివేయని చెప్పవచ్చును. నాటకకథ కట్టిభంగము కలుగకుండ వానిలోఁ జక్కఁటిని దొలఁగించుటకో తగ్గించుటకో యవకాశ ముండుటయే యిందుకు దార్కాణము

సంస్కృత నాటకములలోఁ దఱచు కానవచ్చుచుండు పాత్ర ప్రవేశసూచనలును, భావిశుభాశుభనిర్దేశములును, నాటకీయ చమత్కారములును బంతులుగారి నాటకములలో నెన్నెన్నో గోచ రించుచున్నవి గయోపాఖ్యానమున గయుని పట్టుకొనుఁగు మరణ మును, ప్రహ్లాదచరిత్రమున లీలావతి తన మెడలోని హారము నెవ్వరో తొలగించినట్లు కాంచిన స్వప్నమును నాకథలలో వారికిఁ గలుగఁ బోవు నసుఖములను సూచించుచున్నవి. పారిజాతాపహరణ ప్రథమాంక మున రుక్మిణీ వైరవునిఁగూర్చి "అతఁడు మాపాలిటికి నేఁడపరనారదుఁ డయ్యెనని పల్కుట" నారదపాత్రప్రవేశమును, చతుర్థాంకమున నింద్ర యమ బృహస్పత్యాదులు ధర్మమాహాత్మ్య నిర్ణయమునుగూర్చి చింతించు సమయమున నింద్రుఁ "డిందిరా మనోహరుఁడను నయ్యరవింద నాభుఁడీ సమయంబున నిందుండిన బాగుండు"నని పల్కుట శ్రీ కృష్ణ పాత్రప్రవేశమును జక్కఁగా సూచించుచున్నవి. చతుర చంద్ర హాస తృతీయాంకమున దుష్టబుద్ధి చంద్రహాసునిఁ గుంతలపురమునకుఁ బంపుచు "రూఢిగ నీవు స్వర్గమునందున్నట్లుండు"మని పల్కుటయు, చతుర్థాంకమునఁ గాలాయనుఁడు చంద్రహాసునితో "నీ పందిళ్ళ నడుమ నిల్చిన నీవు పెండ్లికొడుక"వని తలంచెదనని పల్కుటయు నచ్చటి కథా సందర్భములనుబట్టి చూచినచో ధ్వనిగర్భితములై గంభీరభావ చమత్కారమును బ్రదర్శించుచున్నవి. ఇట్లే గయో పాఖ్యానమున నర్జునుఁడు సహదేవునితోఁ బ్రసంగించుచుఁ గృష్ణుఁడు తమ కొనరించిన యుపకారములనుగూర్చి చెప్పి "అ తను జేతనంత సుఁడు పాండునందులకుఁ బరమశత్రుఁడుగదా" యని పల్కుటయు, వెంటనే గయుఁడు శరణార్థియై యరుదెంచుటయు నచ్చటి యా సంభాషణమున కెంతో వన్నె చేకూర్చుచున్నవి. కవిగారీవిధముగా నాటకీయ చమత్కారములను బ్రదర్శించినచోట్లు పెక్కుగలవు.

పారిజాతాపహరణమునఁ గైరవుఁడు నిదురమత్తుచే కాంపపదిక నింక వరోయనుకొని యామె నామెముందే దూషించుచుండగా నిట్టి చమత్కారమునకు నెలవై యున్నది.

పంతులుగారికిఁ జెక్కు రాజకీయ సాంఘికాది విషయములపైఁగల యభిప్రాయము లీ నాటకములలోఁ బ్రసక్తాను ప్రసక్తముగా వెల్లడిచేయఁబడియున్నవి. వారు శ్రీ వీరేశలింగం పంతులుగారి శిష్యులగుటచే స్త్రీవిద్య విషయమునను స్త్రీ జనాభివృద్ధి విషయమునను విశాలాశయములు వహించియుండిరి. ప్రసన్న యాదవమున వారు "ముదితల్నేర్వఁగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్" అని కృష్ణుని ముఖమునఁ దమ యభిప్రాయమును వ్యక్తము చేసియుండిరి. అట్లే చతురచంద్రహాసమునఁ గన్యలు తమ యిచ్ఛకు వచ్చిన వరులను స్వేచ్ఛగా వరింప వలకోశముంపవలెననియుఁ, దల్లిదండ్రులు స్వార్థచోదితులై వారి కిచ్ఛలేక యొకరికిచ్చి పెండ్లిచేయుట యయుక్తమనియు సూచించియుండిరి. ఇట్లని స్త్రీలు సర్వస్వతంత్రులై యెల్లవిషయములంగును సౌఖ్యము కలిగించుకొనుట వారి యిష్టము లేదు. గయోపాఖ్యానమున సుభద్రారుక్మిణీసత్యభామాదులు శ్రీకృష్ణ వర్జునునితో సంధికిఁ బురికొల్పిన సందర్భమున స్త్రీలు పురుషుల వ్యవహారములలో జోక్యము కలిగించుకొనరాదని ధ్వనింపఁజేసియుండిరి. చతుర చంద్రహాస నాటకమున వారు జ్యోతిషమునఁ దమకుఁగల యవిశ్వాసమును వెల్లడిచేయుటయే కాక జ్యోతిషులు దాని నెట్లు దుర్వినియోగము చేయుచుందురో కూడ వివరించియుండిరి. ఆ నాటకమునందే వారు పులిందునిఁ బ్రజలు విడిపించిన సందర్భమునఁ బ్రజాశక్తిప్రాభవమును వివరించి దానిముందు నిరంకుశత్వము నిలువఁజాలదని విశదీకరించిరి. రణనిహతులును, సోమయాజులును మరణానంతరము స్వర్గమునకరిగి రంభా సంభోగము ననుభవింతు రను విషయమును వారు పారిజాతాపహరణమునఁ బలువిధముల గేలిచేసి యట్టివారికిఁగూడ దా మొనరించిన పుణ్యపాపముల ననుసరించి నరకానుభవము తప్పదని నిరూపించిరి. చతుర చంద్రహాసమున నా రొక్కచో మదనునిచే

అస్తమానోదయములఁ బ్రత్యహమునందు
కంపమంతుని కెంఁగెల్ల వరసి చూడ
జంతు సంతతికి మరణానంతరమున
జన్మమగుచుండువనితోఁచు స్వాంతమందు

వని పల్కించి తమకుఁ బునర్జన్మసిద్ధాంతమునఁ గల ప్రత్యయమును ప్రకటీకరించిరి.

శ్రీ పంతులుగారు గయోపాఖ్యాన పారిజాతాపహరణాది నాటకములను నవలలను రచింప నారంభించుటకుముందే వ్రాసియుండిరి. తరువాత వారు రచించిన నాటకములకంటె నవలల సంఖ్యయే చాల హెచ్చు. వారి నాటకములలో నైతిక వర్ణనములందును దీర్ఘస్వగతములందును నవలారచన ప్రభావము హెచ్చుగా గోచరించుచుండును. వారి వచనరచనమున సంవాదశైలికంటె గథనవర్ణన శైలియే ప్రాచుర్యము వహించును. పురాణకథలనే వా రెక్కువ మార్పులేకుండ నాటకీకరించి యుండుటచే వారి నాటకములలోఁ గథా విస్తరణమున నంత వింతదన మేదియు గోచరింపదు. గయోపాఖ్యానమున శరణాగతత్రాణ స్నేహబాంధవ్యములకును, జతుర చంద్రహాసమున స్వార్థసిద్ధి పుత్రికా ప్రేమలకును నించుక సంఘట్టనము (*Conflict*) గోచరించుచున్నను మొత్తముమీఁద వారి నాటకములలో సామాజిక హృదయాకర్షణమున కెక్కువగా నుపయోగించు సంఘట్టన ప్రభావ మధికముగాఁ గానిపింపదు.

పంతులుగారు నాటకసమాజమునందలి నటుల యానుకూల్యము ననుసరించి తొలుత వచననాటకములనే వ్రాసినను దరువాత వాని నన్నిటిని పద్యబాహుళ్యములు కావించియుండిరి. వా రన్ని సందర్భములందును బలు పాత్రలకుఁ బద్యములు వ్రాసియుండిరి. ఈ పద్యములు పెక్కుచోట్ల సంస్కృతనాటకములందలి శ్లోకములనే పోలియుండును. సాధారణముగా వారు పద్యమునందలి పూర్వభాగమున విషయమును జెప్పి యుత్తరభాగమున దృష్టాంతమునో, నిదర్శనమునో, యర్థాంతరన్యాసమునో చెప్పుచుందురు. వర్ణన సందర్భములందును భావోద్వేగమును వ్యక్తముచేయు సందర్భములంగును మాత్రమే కాక వారు సాధారణ సంభాషణములను గూడఁ గొన్నియెడలఁ బద్యములందే సాగించుచుందురు. ధారాశుద్ధి మూర్తివములందును, సంఖ్యా బాహుళ్యమునందును వారి పద్యరచనకును తిరుపతి వేంకట కవుల పద్యరచనమునకుఁ జాల సామ్యము కానవచ్చును. ఈ యిరువురి పద్యములునుగూడ మృదుపదఘటితములును, సరళ సుందరములునై యెంతో నాటకోచితములుగా నుండును. అందుచేతనే యాంధ్రదేశమునందలి యతు రాఘ్యులందరికి వారి నాటకపద్యములందొకటియో రెండో సుఖస్థములై యుండకమానవు. పంతులుగారి ప్రహ్లాద చరిత్రమునందలి పెక్కు పద్యములు పోతనగారి పద్యములకుఁ బ్రతిబింబములుగా నున్నవి. ఒక్క యా నాటకమునందే కాదు మిగిలిన నాటకములందుఁగూడ వారి పద్యములలో మూల ప్రభావ మెంతో గోచరించును. వారి పద్యములలో కొన్ని యనుప్రాస విశేషములతోఁ గూడి వినులవిందుగా నుండును. ఒకటి రెండుచోట్ల శ్లేషతోఁ గూడిన పద్యములును గలవు. గయోపాఖ్యానమున వసంతర్తు శాల్యమును చెప్పిన సందర్భమునను జతుర చంద్రహాసమున నింద్రజాలిక మంత్రులను చెప్పిన సందర్భమునను గల పద్యము లిందుకుఁ దార్కాణములు. ఇట్లే వారు రెండు మూఁడుచోట్ల బహు పాదములుగల సీసములను వ్రాసి యందే సంవాదము జరిగించియుండిరి. మొత్తముమీఁద వారి పద్యరచనమువలన నాటకముల కపూర్వమైన యందచందము లావహిల్లిన వనుటలో నతిశయోక్తి యుండదు.

పంతులుగారి శైలి మధురమంజులమైనది. అది శారదాభ్రమువలెఁ బ్రసన్నమై, వర్షాకాలవాహినివలె విందారి, వసంత వనశోభవలె భావముల నాకర్షించి పరమానంద మావహించుచుండును. వచనమునఁగాని పద్యములలోఁగాని యెచ్చటను గ్లిష్టములైన వాక్యయోజనలును, మాయయాలపదములును గానిపింపవు. వారి రచన పదమాధుర్యమునకును, భావసౌష్ఠవమునకును పెట్టినది పేరు. కొన్నిచోట్ల వారనుప్రాసములను వాడిరి వాక్య

ములను గలవు. "జృంభితకోత్పంథ కంభిగుంపును నీ కాంభోజరాజ రంభాసంభోగార్థియై సభారంభంబుల నీ యింద్రదుందిరమున కరుదెంచెను" మున్నగున వింకను నిదర్శనములు. కాని యిట్టివి మొత్తముమీఁద రెండుమూఁడుకంటె చెప్పఁజాలవు. ఇట్లే వారొక పీపదమ్మునఁ బ్రస్తరించు, విస్తరించు, సుస్తరించు, కుస్తరించు, నిస్తరించు అను క్రియల నొక్కొక్క టొక్కొక్కపాదమున వాడినారు (చతురచంద్ర) "దేవా! చంపకమాలికి మదనునిఁ దెచ్చి కూర్పుమన్నఁగూర్చి నీ మనోరథసిద్ధిఁ జేయుఁగు" (చ చం 398) నన్న వాక్యమున మదనశబ్దముపై శ్లేషయున్నది. గుప్త బుద్ధి తన కుమారుఁడైన మదనున కొలైనఁ జంపకమాలిని భార్యగాఁ జేయఁ దలంచుట యూహించినచో నిందలి చమత్కారము బోధపడును. పారిజాతాపహరణ ద్వితీయాంకమునఁ గృష్ణుఁడు,

"రుక్మిణీ సత్యభామ లిద్దరకు నేను
బంచితిని గూర్మి తులఁదూచుభంగి గాఁగ
నిపుడు వైదర్భికంటెఁ బువ్వుకూర్మి
యతిశయంబుగఁ గన్పడు నామెయందు"

అని తలంచునప్పుడు వాడిన "పువ్వుకూర్మి"యను ప్రయోగము సుకుమారభావమును స్ఫురింపఁజేయుచుఁ గవిగారి పదప్రయోగౌచిత్యమును వేనోళ్ళ విశదీకరించుచున్నది. నారదుఁడు తెచ్చి యిచ్చిన పారిజాతకుసుమమును గృష్ణుఁడు సత్యభామ కీయక రుక్మిణి కిచ్చుటను బురస్కరించుకొని చూచినప్పు డిందలి చమత్కారమున కానందింపని వారుండరు. పంతులుగారి గయోపాఖ్యానమునందలి "అల్లుఁడా రమ్మని" ఇత్యాది పద్యము లాంధ్రదేశమున నాబాలవిదితములైనట్టివి. వారి రచన చాలవఱకు వ్యాకరణానుగుణమై, లాక్షణికమై యొప్పారుచుండును. కాని యచ్చటచ్చట "చాలింక, కాంగిరులు, మీరెల్లు తివమాదరించిరి, పూర్ణయౌవనప్రాయమూ, మూర్ఛితివియా" మున్నగు వ్యాకరణౌరిక ప్రయోగములు కొన్ని కానవచ్చుచున్నవి. కాని వీనినంత పెద్ద దోషములుగా నెన్నవలసిన పనిలేదు. వారన్ని నాటకములలో నన్ని పాత్రలను గ్రాంథికమే వాడియుండిరి. వారు ప్రతి నాటకమునందును బ్రస్తావనలో గుణదోషప్రసక్తి తెచ్చి పౌరుషేయ రచనలలో దోషములుండకమానవని చెప్పుచుందురు. అది నిజమే. అసలు గుణగ్రహణపారీణులు రసము వంకకే దృష్టి సారింతురు గాని దోషముల వెదకుటకై యత్నింపరు. అట్టివారికిఁ బంతులుగారి నాటకములు పండుగనాఁటి భోజనములు.

ఆంధ్రమున నాటకము లప్పుడప్పుడే యవతరించుచున్న యా తొలి నాళ్లలో రూపసౌష్ఠవమునను, లక్షణ సామగ్ర్యమునను, సంభాషణ చాతుర్యమునను, ప్రయోగార్హతా పాటవమునను, భావగాంభీర్యమునను, రసభావ పోషణమునను అసమానములైన యిట్టి నాటకములు రచించి పంతులుగా రాంధ్రవాఙ్మయమున కభ్యుదయము చేకూర్చిరనుటలో నతిశయోక్తి యుండఁజాలదు. సంస్కృతమార్గగాములైన యాంధ్రనాటకములలో నిప్పటికిని బంతులుగారి నాటకములకే యగ్రస్థానము లభించుననుట వారి నాటక నిర్మాణ ప్రతిభకు స్థిరమైన తార్కాణము.

---

# బెడద

శ్రీ చోడవరపు రామశేషయ్య

## పాత్రలు

| | | |
|---|---|---|
| ధనంజయరావు | శివరావు | కాళిదాసు |
| అమరేంద్రుడు | నగేంద్రుడు | మాధవరావు |
| వెంకటేశు | సుశీల | అనసూయ |

### మొదటి రంగం

** ధనంజయరావు గృహం; సమయం: ఉదయం— హాల్లో సోఫాలు, కుర్చీలు, ధనంజయరావు కాఫీ తాగుతూ ఆలోచిస్తుంటాడు. ఇంతలో కాళిదాసు:

ధనంజయరావు: ఇదిగో, వచ్చావు! కబురు పంపాలనుకుంటున్నా.

కాళిదాసు: అనుకోగానే వచ్చాను కాబట్టి అనుకున్నపని అయినట్లే.

ధ : కాకపోవడమేమిటి! కాళిదాసు తలచుకుంటే కాని పని ఒకటి ఉంటుందా?

కా : అమాయకుణ్ణి చేసి ఆడించాలనుకున్నట్టుంది.

ధ : అది కాదోయ్; ఒక గొప్ప చిక్కు వచ్చి పడ్డది.

కా : ధనంజయరావు కేమిటి! చిక్కేమిటి!! రావడమేమిటి!!!

ధ : అవునోయ్, ఈ కాలం పిల్లవాళ్లు ముసలివాళ్లను త్రోసి రాజని స్వంతంగా సంబంధాలు కుదుర్చుకుంటున్నారు.

కా : చదువుకోవడంచేత కలిగిన బాధ స్తుంటావా?

ధ : బాధ స్తుంటే కాకపోతే చదువుకైన ఖర్చులన్నా గిట్టకపోతే అసలు పెండ్లేమిటోయ్?

కా : (నవ్వుతూ) కలిగినవాడికికూడా కట్నంమీద ఆశేనా, బావా?

ధ : ఉంటే పోతుకుంటాయా? ఒక్కగాని ఒక్క కొడుకు; అచ్చటా ముచ్చటా తీరవద్దు.

కా : అచ్చటా ముచ్చటా ఆడవాళ్లకుగాని మనకేమిటి? కొడుకు, కోడలు సుఖంగా కాపురం చేస్తుంటే చూచి సంతోషించక బావా?

ధ : మీ అక్కయ్యకూడా అయోమయంలో పడిపోయింది.

కా : అయితే నీవు మాత్రం బయట ఎందుకుపడాలి? తల్లి కొడుకుల ఇష్టంప్రకారం పోరాదూ?

ధ : వాడికి పిచ్చిపుట్టి శివరావు కూతుర్ని వరించానంటే తండ్రినైకూడా తలఒగ్గవలసిందేనా?

కా : (ఆశ్చర్యంతో) అనసూయనా?

ధ : అవును.

కా : అమరేంద్రుడు బుద్ధిమంతుడు కాబట్టి గుణవంతురాలిని వరించాడు.

ధ : డబ్బులేందే గుణమెందుకోయ్? పోనీ అరవైవేలు ఇవ్వలేకపోతే ఇవ్వలేకపోయాడు. కనీసం ఇరవైవేలన్నా ఇవ్వకపోతే ఎట్లాగోయ్?

కా : (ఆశ్చర్యం) ఇరవైవేలే! శివరావుకున్న నాలుగు ఎకరాలు హరించాలని కలిగిందా ఏమిటి?

ధ : ఆడపిల్లకు అంతమాత్రం ఇవ్వకపోతే అనువైన సంబంధ మెట్లావస్తుంది?

కా : అవునుగాని మరి కొడుకుగతి?

ధ : ఏం? ఇటు ఇస్తే అటు పుచ్చుకోడూ, శివరావు మాత్రం?

కా : (ఆలోచన) నీవు అరవైవేలు రాలేదని విచారపడుతున్నావు కదా; ఆ అరవైవేలు నేనిస్తా ఉమను చేసుకో రాదూ?

ధ : అరవై వేలిస్తావా?

కా : అవును, పెద్దల్లుడికి ఇచ్చినంత ఇస్తాను.

ధ : బాగానేవుంది; ఉమకూడా చక్కని పిల్ల.

కా : ఇక ఆలోచన ఎందుకు? 'తథాస్తు' అను.

ధ : అహా, తథాస్తే కొంపతీసి. తల్లీ, కొడుకులు నన్ను బ్రతకనిస్తారా? అయినా, మా ఆవిడతో అని చూస్తా. అదుగో, అమరేంద్రుడు వస్తున్నాడు. వాణ్ణి ఒప్పించు.

కా : వలలో బంధించనే బంధించావు; బావా.

ధ : మరి అల్లుళ్ళు ఊరికేనే వస్తారుటోయ్?

(అమరేంద్రుడు ప్రవేశించి)

అమరేంద్రుడు : ఓహో! మామగారా! మామగారు మా ఇల్లే మరచి పోయినట్లున్నారు?

కా : ఇల్లు మరిస్తేమాత్రం అల్లుళ్ళను మరుస్తామా?

అ : అవును, అక్కర తీరేవరకు.

కా : అది పూర్వం మాట.

అ : ఇప్పుడో!

కా : అందల మెక్కించి ఊరేగిస్తాం.

ధ : సరె, కాళిదాసూ, నేను పొలం వెళ్ళివస్తా పాలేళ్ళు దొరలైనారు.

కా : దొరలు సోమరులైతే ఇంగులో వాళ్ళ తిప్పేముంది? సరె వెళ్ళిరా, బావా. (ధనంజయరావు వెళ్తారు) ఇప్పుడే నిద్రలేచావేమకుంటా అల్లుడు!

అ : అవునండి, ఈవేళ చాలా ఆలస్యంగా లేచేను. లేకపోతే కాఫీ, భోజనం రెండు ఒక్కసారి అయ్యేవి. (లోపలికి చూస్తూ) వంక బేబు! కాఫీ తీసుకురా.

కా : ఈవేళ మామూలు తప్పిందంటే ఏదో విశేషముంది

అ : మీరు వస్తే విశేషాల కేమితక్కువ!

కా : అయ్యో, నా రాక నీకు నిద్రాభంగానికి కారణ మయిందా?

అ : మీరిట్లాట రాకపోతే నేనే మీదగ్గరకు వచ్చేవాణ్ణి

కా : (ఏమీ ఎరగనట్లు) నాతో అంత పని పడిందా! అయినా ముసలివాళ్ళతో పడుచువాళ్ళ కేమి పని ఉంటుంది?

అ : ముసలివాళ్ళంగదా అని ఊరుకుంటున్నారా?

కా : నేను నీకేం అర్థం రావటం లేదే

అ : మీరుకాదు, మా నాన్న.

కా : (నవ్వుతూ) అయితే సంగతేమిటో తేల్చుకోవలసిందే.

అ : ఈ తేల్చవలసింది మీరే

కా : నేనా! పడుచువాళ్ళ పోకడలు తెలియని నేనా!

అ : అదికాదు, మామగారూ! బి. ఎ ప్యాసైనవాణ్ణికూడా పిచ్చివాడిక్రింద లెక్కగట్టితే ఎట్లా? స్వవిషయంలో కూడా స్వతంత్రం లేకపోతే

కా : (మనస్సులో) అవును, స్వతంత్రం లేకపోతే శుద్ధ దండుగ అనుకో? (వంక బేబు ఒక కప్పు కాఫీతో ప్రవేశం)

అ : ఇదేమిటి! మామగారికో!

కా : నేను త్రాగే బయలుదేరాను

అ : కాఫీ కేముందీ, ఎన్నిసార్లయినా తాగవచ్చు.

కా : ఈ కాఫీ తాగినకొద్దీ సమస్యలెక్కువౌతాయ్.

అ : సంసారంలోని సమస్యలన్నింటికీ కాఫీయే కారణ మంటారా?

కా : అందుకు సందేహమేముంది? ఈ రోజుల్లో ఈ కాఫీ ఎరుగున్నారా? అంతవర కెందుకు? స్వతంత్రమంటే అసలు ఏమిటో తెలిసేదా? ఏ పిల్లను తెచ్చిచేస్తే ఆ పిల్లే లక్ష్మి అనుకొనేవాళ్ళం.

అ : అయితే ఈ రోజుల్లో ఇష్టం వచ్చిన పిల్లను చేసికోవటం తప్పంటారా?

కా : ఇష్టం వచ్చిన పిల్లను చేసికొనేటప్పుడు కట్నం కోరడ మెందుకూ?

అ : కట్నం చేసికొనేవాడి కోరకు కాదు; ఆవచ్చే అమ్మాయికి.

కా : (ఆశ్చర్యం) అమ్మాయికోసమా? మరి అబ్బాయి చదువు కున్నది ఎందుకు?

అ : అబ్బాయిసంపాదిస్తే అమ్మాయికి పంచిపెట్టాలని ఎక్కడుంది?

కా : అయితే అమ్మాయిలూ చదువుకుంటున్నారు కాబట్టి వాళ్ళూ సంపాదిస్తారు

అ : ఉద్యోగం దొరక్క మగవాళ్ళే పతిమతి పైబోతుగా వుంటే ఆడవాళ్ళకు ఎక్కడినుంచి వస్తాయ్?

కా : అయితే ఆడపిల్లలకు కాలేజీ లెందుకు?

అ : ఈ సహశిక్ష వుండబట్టేగదా మేం కోరిన పిల్లను చేసి కొనడానికి అవకాశం వచ్చింది?

కా : సహశిక్ష స్వయంవరాలకా? లేక సౌభాగ్యంకోసం కాదన్నమాట?

అ : లేకసౌభాగ్యం స్వయంవరంలోనే ఉందంటాను.

కా : అయితే కట్న మెందుకు?

అ : కట్నం లేకపోతే కాపురం పడిపోతుందా, మగవాడు?

కా : రెండు నావలమీదా కాళ్ళు పెట్టడం నవనాగరికతా లక్షణం కాబోలు!

అ : నవనాగరిక లక్షణం కాబట్టి నాలుగు డబ్బులు చేతిలో వుండా లనడం

కా : అయితే మా అమ్మాయిని చేసుకో, కట్నం ఇవ్వలేని శివ రావు కూతు రెందుకు?

అ : మీ అమ్మాయినా?

కా : అవును, అరవై వేలు ఇస్తా.

అ : (ఆలోచిస్తూ) అరవై వేలా!...

కా : ఏం; మాట్లాడవేం? నీవు స్వయంగా లక్షాధికారివి. ఇంకా అరవై వేలు వస్తున్నాయి.

అ : అవును కాని

కా : 'కాని' ఏమిటోయ్? ఈ కానికోసమేగదా మీ ఆదుర్దా?

అ : కాదు, మామగారూ; అనసూయ అయితే అనుకూలంగా ఉంటుందని.

కా : ఏం? మా అమ్మాయికి గుణం తక్కువా? రూపం తక్కువా?

అ : అది కాదు; ఉమను నేను చిన్నప్పటినుంచీ ఎరుగు దున్నాను కాని కాని అనసూయ నా హృదయంలో...

కా : ఆమె నీ హృదయంలో నాటుకునిపోతే కట్నానికి కక్కుర్తిపడటా వెందుకు?

అ : అవును, కానీ; నాన్నను మరి సంతృప్తిపరచవద్దూ?

కా : చదువుకున్నందుకు ఆమాత్రం సమాధానం చెప్పలేవూ?

అ : (మౌనం)

శా : ఏం, మాట్లాడవేం?

అ : నాకంత సాహసం లేదు.

శా : అంత సాహసంలేనివాడివి ఎందుకు ప్రేమించావు? పరాయిపిల్లను అల్లరి పెట్టడానికా?

అ : ఈ అమరేంద్రుడు అంత నీచుడుకాడు. నేనామెను ప్రేమించానంటే కేవలం ఆమె అందానికి మురిసికాదు; ఆమె గుణాలనుచూసి ఆ అణకువ, ఆ అమాయకత్వం, ఆ సౌజన్యం నన్ను ఆకర్షించాయి. ఇది క్షణమైన మోహం కాదు; అనురాగం.

శా : అయితే ఇంకా అనుమానిస్తావెందుకు?

అ : కాదు, మామగారూ; ఒక్కగాని ఒక్క కొడుకుని. నాన్న నన్నెంతో గారాబంగా పెంచాడు. విద్యాబుద్ధులు చెప్పించాడు యోగ్యునిగా చేశాడు. నామీద ఎన్నో ఆశలు పెట్టుకుని ఉన్నాడు. అటువంటి తండ్రిని నా సుఖంకోసం ధిక్కరించడం న్యాయమంటారా?

శా : కాని, పెళ్ళంటే బొమ్మలపెళ్ళిటోయ్; మూడుముళ్లు వేయడానికి?

అ : కాదు, కాని విజ్ఞానానికి విలువలేదంటారా? కన్న తండ్రిని త్రోసి రాజనడం విజ్ఞానమంటారా?

శా : జీవితం కాస్తా పాడైపోతూవుంటే విజ్ఞానమేమిటోయ్? అయినా పిల్లల చదువులతో చితికిపోయిన శివరావును ఇంకా చిదగొట్టడం విజ్ఞానమా?

అ : నిజమే; కాదు, కాని ఆయనమాత్రం తన కొడుక్కి కట్నం కోరకుండా ఉంటాడా?

శా : అది తరవాత సంగతి. ముందు కూతురిపెండ్లికి ఉన్న నాలుగు ఎకరాలు అమ్మివేయవలసిందేగదా? అటువంటి పరిస్థితిలో నరేంద్రుడు ఎం. బి. బి. ఎస్. ఎట్లా పూర్తి చేయగలుగుతాడు?

అ : (ఆలోచన) అవును, అదీ నిజమే. ఈ సాధక బాధకాలన్నీ తీరుస్తారనే మీతో ఈ విషయం ముచ్చటించాను.

శా : మీనాన్న ఒకరు చెబితే వింటాడా?

అ : మీరు వినేటట్లు చెప్తారని నాకు నమ్మకముంది.

శా : నాకంటె మీఅమ్మ పూనుకుంటే ఈపని చక్కబడు తుంది.

అ : అమ్మా! అమ్మకు అనసూయ కోడలుకావటం ఇష్టమే కాని అచ్చటా ముచ్చటా లేకపోతే ఎట్లాగంటోంది.

శా : నిజమే; వియ్యపురాలికి ఆమాత్రం కోరిక ఉండదూ! కాని మీనాన్న వింటే మీ అమ్మమాట వినాలిగాని ఎవరి మాట లెక్క చేయడు. ఆ లక్ష్మి అడుగుపెట్టినతరవాతే గదా మీ ఇంట్లో లక్ష్మి తాండవిస్తోంది. లక్ష్మి కంట తడిపెట్టితే కాదనే సాహసం మీనాన్న కుండదు.

అ : ఏమో, మీతో కాబట్టి ఇంత ధైర్యంగా మాట్లాడానుగాని అమ్మతో ఇదంతా చెప్పడమెట్లా?

శా : అవును, నిజమే; సరే, నేనుకూడా వస్తాను. ముందు ఆమెను ఒప్పిస్తే తరవాతసంగతి చూద్దాం.

అ : అట్లాగే...కాని, నా కిస్తానన్న కట్నమిచ్చి ఉమను నరేంద్రునకిచ్చి పెండ్లిచేయకూడదూ? అతనూ చాలా బుద్ధిమంతుడు గదా? ఇది జరిగితే మనకేమీ చిక్కు లేకుండా పోతుంది కదా?

శా : (ఆలోచన) అవును, ఇది మంచి ఆలోచనే. సరే, పద; మీ అమ్మతో ఆలోచిద్దాం.

అ : రండి, లోపలకుపోదాం. నాన్న పొలంనుంచి రాక పూర్వమే మాట్లాడటం మంచిది.

శా : (చిరునవ్వు) ఈ రోజుల్లో కుఱ్ఱవాళ్లకు తండ్రి అంటే ఇంత గౌరవమూ, భయమూనా

[ఇద్దరూ లోపలకు వెడతారు.]

## రెండవ రంగం

* * శివరావు ఇంటిబయటి చావడి సమయం: ఉదయం — శివరావు ఆలోచిస్తూ పచారు చేస్తూవుంటాడు.

శివరావు : ఎంత ఆలోచించినా దారి తెన్ను కన్పించడంలేదు... అను పెండ్లిచేస్తే నగేంద్రుడి చదువుకు స్వస్తి చెప్పాలి. పోనీ, వాడి చదువు సాగిద్దామా అంటే అనసూయ పెండ్లి ఆపివేయాలి. ఇంక ఈ ఆపడం ఎంతవరకు? ఇప్పటికే ఇంట్లో పోరు పడలేకుండా ఉన్నాను. పోనీ, ఊళ్లో అంటావా! ఉలుకుపోని అమ్మలక్కలకు ఈ శివరావే దొరికాడు. విద్యాధనాలు రెండు అవసరమయ్యేసరికి నాకోటి దాలిచాలని రైతుకు మానమేషాలు లెక్క పెట్టాల్సివస్తోంది.. ఏమిటి దారి?

నగేంద్రుడు : (ప్రవేశించి) నాన్నగారూ! పిలిచారా?

శి : అవునయ్యా, ఇలా కూర్చో! అనసూయ పరీక్షా ఫలితాలు ఈ దినమే కాదు విలువడేది?

న : అవును; కాని, ఇంకా పేపరులు రాలేదు.

శి : అనసూయ తప్పక పాసవుతుందని అనుకుంటాను.

న : అవును, నాన్నగారూ; అందుకనే పది రూపాయలు పెట్టి బహుమతి ఇవ్వడానికి త్యాగరాయకృతులు తెచ్చా.

శి : (గద్గద స్వరం) నీకు చినిగిన చొక్కాలా; నీ చెల్లెలికి త్యాగరాయకృతులూనా?

న : పెలవలేకదా నాన్నగారూ; ఇంట్లో ఏ చొక్కా వేసు కుంటే ఏం?

శి : అంతకంటె చేయవగింది మాత్రమేముంది నాయనా!

న : నాన్నగారూ! ఐశ్వర్యం లేనివారికి అగౌరవమేనా?

శి : ప్రస్తుత మంతే...

న : విద్యకు విలువ లేదంటారా!

శి : పిచ్చివాడా! విద్యకు గౌరవమే ఉంటే ఈ విషం

శా : ఇవ్వడం తప్పితే పుచ్చుకోవటం ఎరగని మేమందరం పడిగాపులు పడివుంటే లేరంటావేమిటి?

వ : మామగారు, నిజంగా సమస్యలోనే పడ్డారు.

శా : ఇంట్లో కన్నెపిల్ల వున్నప్పుడు కావలసినన్ని సమస్యలోయ్. అరవైవేలిచ్చి మా ఉమను ఇస్తాను; ఏమంటావ్?

శివ : చేసేది లేనివాడు ఇక్కడవుండగా నన్ను అడగడమెందుకూ?

వ : లేదు, మామగారూ; నేను ఇప్పుడు పెండ్లిచేసుకోను

శివ : (ఉలిక్కిపడి) ఇదేమిటోయ్?

వ : క్షమించండి, నాన్నగారూ, చదువు పూర్తి కానీయండి.

శివ : అంతవరకు ఆడపిల్లను అట్టే పెట్టమంటావా?

వ : అట్టేపెట్టడ మెందుకు?

శివ : ఉన్న పొలం కాస్తా అమ్మివేయమంటావా?

వ : ఏంచేస్తాం!

శివ : అమ్మకు, నాన్నకు అక్షయపాత్ర ఇస్తావా?

వ : నాన్నగారూ, నిజంగా ఆపనే చేయాలిసివస్తే నేను చేస్తాను; గాని మిమ్మల్లను బయటికి రానిస్తానా?

శా : అరవైవేలు అడగకుండా ఇస్తుంటే అడుక్కోవటం ఏమి కర్మమోయ్, అల్లుడా?

వ : అరవై వేలకి ఆత్మహత్య చేసుకోమంటారా?

శివ : నీవొక్కడవేనా ఈ ఆత్మహత్య చేసుకునేది?

శా : కట్నాల చదువులలో జాల్లో కూడా కాలే! ప్రయాగ మేమిటోయ్!

వ : అదృష్టముంటే కాశీలో కూడా ఐశ్వర్యం దొరకుతుంది

శివ : ఐశ్వర్యం కాదు, సన్యాసం.

వ : తల్లిదండ్రుల సేవకంటె నాకు మరో ఐశ్వర్యం అక్కర లేదు.

శా : దానికైనా డబ్బు కావాలి గదోయ్

వ : ఆత్మవిశ్వాసముంటే అన్నీ అవే వస్తాయి

శా : ఆత్మవిశ్వాసమని చేతికందింది వదలిపెడ్తారా?

శివ : ఇటువంటి తెలివితక్కువవాళ్లు అంతకంటె ఏంచెప్తారు?

వ : ఇది తెలివితక్కువైతే మరి పురుషార్థమేమిటి?

శివ : ఓహో, అట్లాగా; ఇదంతా పురుషుని పౌరుషం కాబోలు. సరే, నీవు నీయీ పౌరుషంతోనే బ్రతుకు, ఫో.

వ : నాన్నగారూ!. .

శివ : కడుపు కట్టుకొని కష్టపడ్డ మమ్మల్నే కాదంటే ఇక నీకు, మాకు సంబంధమేమిటి? (కోపంతో వెళ్తూ)

శా : ఇదిగో, శివరావూ! వెళ్లకు, ఏదో చిన్నతనం

శివ : చిన్నతనమైతే చిన్నగానే మాట్లాడేవాడు. తను గొప్ప ఆదర్శపురుషుడ ననుకుంటున్నాడు. (వెళ్తాడు).

శా : కని పెంచినందుకు ఇదిటోయ్, మీరుచేసే ఉపకారం!

వ : మామగారూ! (గద్గదికంగా) నాన్నగారి కింతకోపం వస్తుందనుకోలేదు.

శా : ఇప్పుడైనా మించిపోయిందిలేదు; ఉమను చేసుకో.

వ : మామగారూ; ఇంత చదువుకుని కట్నానికి కక్కుర్తి పడమంటారా? పెద్దలు నాబోటివారికి దారిచూపిస్తారని ఆశిస్తున్నాను.

శా : చదువుకున్న వాళ్లంతా కట్నాలకు ఎగబ్రాకుతుంటే నీ యీ ఆదర్శ మేమిటోయ్?

వ : అపవాదం ఉండకూడదంటారా?

శా : ఈ అపవాదం అనర్థానికే దారితీస్తుంది.

వ : ఆత్మవిశ్వాసిని అనర్థం ఏమీచేయలేదు. (అనసూయ ప్రవేశం)

అ : మీ మాటల కంతుండదు. రండి, భ..

వ : రండి, మామగారూ! అనసూయ [illegible] పరీక్ష [illegible].

అ : మామగారు నాకు తప్పకుండా సర్టిఫికెట్టు ఇస్తారు.

శా : అత్తగారు ఇవ్వవలసిన సర్టిఫికెట్టు నేనిస్తే ఆవిడ ఊరుకుంటుందా?

వ : ముందు మీరివ్వండి (అందరూ నవ్వుతారు)

శా : సరే, పదండి. (అందరూ వెడతారు)

## మూడవ రంగం

** శివరావు గృహం, లోపల చావడి; సమయం మధ్యాహ్నం అనసూయ తివాచి మీద కూర్చుండి ఆలోచిస్తూ ఉంటుంది

అన : అందరూ భోజనంచేసి హాయిగా నిద్రపోతున్నారు. ఎంత ప్రయత్నించినా నాకుమాత్రం నిద్రపట్టలేదు. నాన్నగారు నా చదువు ఆపివేయమంటున్నారే!...అవును, వారుమాత్రం ఏంచేస్తారు డబ్బులేనప్పుడు? . ప్చ్! కలలేనప్పుడు విచారపడడమెందుకు? వీణనైనా వాయించుకుందాం

[లోపలినుంచి వీణ తెచ్చి శ్రుతులు సరిచేస్తుంది]

ఏలనీయదరాదు పరాకు జేసే
వేళ సమయముగాదు
రా॥ కనకమయచేల సుజనపాల
నా॥ శ్రీరమాలోల విధృత శర
జా॥ శుభద కరుణాలవాల ఘన
నీల నవ్యవనమాలికా భరణ
రారా దేవాదిదేవ రారా మహానుభావ
రారా రాజీవనేత్రా రఘువరపుత్రా॥ ఏల॥

(సుశీల ప్రవేశం) రా, సుశీలా; ఇంత ఎండలో వచ్చావు!

సుశీల : నీకు అభినందనాలు చెప్పడానికి.

అన : ప్యాసయినందుకు ఆనందముంటు గదా, అభినందనాలు అందుకోవడానికి?



# చూడు—, యేమనుకున్నావ్!
# నా ఆరోగ్యానికీ, అందానికీ
# ఆదే ఆధారం!

ఒకరి అనుభవం మరొకరికి విశ్వాసం యిస్తుంది. సుఖజీవనానికి పూలబాట వేస్తుంది. భరింపరాని గర్భవేదనతో, దిగజారిన మనస్సుతో జీవితాన్ని యీడ్వవలసిన మహిళలకు "లోధ్ర", విశ్వసనీయమైన శరణ్యం.

## 'లోధ్ర' ఋతు దోషాలను దూరంచేసి
## ఆరోగ్య సౌందర్యాలను పెంపొందిస్తుంది

# "లోధ్ర" అన్నిచోట్లా లభ్యమవుతుంది.

కేసరి కుటీరం లిమిటెడ్ - రాయపేట - మద్రాసు.

సు : అదేమిటి, అట్లా అంటావ్!

అన : ఏం ప్యాసయితే ఏం లాభం!

సు : నీ విచారానికి కారణమేమిటో తెలియటం లేదు.

అన : కారణమేముంది! కట్నాలిచ్చి విలువ చదువుకు లేదు గదా! ఏం చదువుకుంటే ఏం!

సు : మగవానికి మనుగడమీద మక్కువ ఆరోజు కారోజుకు ఎక్కువైపోతోంది.

అన : ఈ మనుగడ స్త్రీ ధనంతోనే సాధ్యమౌతుందా!

సు : అభిమానమున్నవాడు అట్లా చేస్తాడా!

అన : అటువంటి అభిమానం లేనివాణ్ణి అంటగట్టుకోవడం ఎందుకు? కన్య బ్రహ్మచారిణిగా ఉండకూడదా?

సు : అప్పుడు మనను మన ఆడవాళ్లే మగవాళ్లకంటే ఎక్కువ అల్లరి పెడ్తారు.

అన : ఇంత అన్యాయమా!

సు : సంఘం స్త్రీని అవమానపరచటమే పనిగా పెట్టుకున్నప్పుడు మనం ఏంచేయగలం?

అన : ఆదర్శానికి ఆహుతి అయిపోవాలి గాని ఇటువంటి సంఘానికి భయపడటమా!

సు : ఇది మనకు సాధ్యంకాదు. కన్నవారు కన్నె చెరవిడిపించుకోవడానికి కటకట పడుతూవుంటారు.

అన : కాబట్టి కన్య కర్మ కన్యకే,

సు : ఆధునిక సభ్యతా మహోత్సవం. ఆయన అరణ్యవేదైతే పుచ్చుకున్నారు; కాని ఆదరించడం తెలిసిందా?

అన : ఎం.ఏ. ప్యాసయిన మాధవరావు కూడా అంతేనా!

సు : ఆపది అంటే అలుసైపోయినప్పుడు ఆయన తప్పేముంది!

అన : ఇంత చదువుకుని నీవుకూడా ఇట్లాగే మాట్లాడుతున్నావా!

సు : ఈ చదువులు మనలను ఉద్ధరించేవి కావు.

(కాళిదాసు ప్రవేశము)

కా : అభినందనాలు చెప్పడానికి ఎండలోనే పరుగెత్తుకుని వచ్చావా; అమ్మాయీ! (ఇద్దరు నిలబడతారు)

సు : ఎండ తగ్గిపోయింది; నాన్నా.

కా : రేపు అనసూయను విందుకు పిలు.

సు : ఒక ప్రక్కన కుందుతూవుంటే విందు లేమిటి ఆమెకు!

కా : (ఆశ్చర్యం) కుందుతోందా! ఎందుకు!!

సు : వారంటే ఉన్నది కాబట్టి అడిగినంత ఇచ్చి వా పెడద వదల్చుకున్నారు. మరి మామయ్య సంగతి నీకు తెలిసిందే గదా?

కా : (బాధగా) అటు ఇటు గొప్ప చిక్కు తీసుకుని వచ్చావే. పెండ్లి అయి నీవూ, పెండ్లికాక ఆమె; ఇద్దరి పరిస్థితి ఒకటిగానే వున్నట్లుంది.

సు : నాన్నా, నీ మనస్సుకు బాధ కలిగించానుకుంటాను.

కా : లేదమ్మా, ఆడపిల్లలు వుంటే అగచాట్లు తప్పవాయా!

[నగేంద్ర, అమరేంద్రుల ప్రవేశం]

న : ఇదిగో, అమ్మా; అమరేంద్రుడు నీకు అభినందనాలు చెప్పడానికి వచ్చాడు.

అన : (తలవంచి) ధన్యవాదాలు. (నమస్కరిస్తుంది)

కా : ధన్యవాదాలకు కాదు; దాంపత్యానికి వచ్చినట్లుంది.

అమ : ఎప్పుడూ పరిహాసమేనా, మామగారూ!

అన : సుశీలా; అమ్మను చూడవు!

సు : పద, పోదాం; అనసూయా.

కా : అనకాలం వచ్చినప్పుడు అంగలార్చి అమ్మాయిల పెండ్లిండ్లు ఎట్లా అవుతాయ్!

సు : పెండ్లిండ్లకు పెద్దలున్నారుగదా; నాన్నా! (ఇద్దరు వెళ్లుదురు)

శివరావు : (ప్రవేశించి) ఓహో! అమరేంద్రుడా!

కా : అమ్మాయికి అభినందనాలు చెప్పడానికి వచ్చాడు.

శివ : బి. ఇ. ప్యాసయినావుట గదోయ్!

అమ : అవునండి; మామగారూ.

కా : మామగారిని మంచిమాట చేసుకుంటేనే మనుగడోయ్.

శివ : అందరికి అతని మామలయ్యే మహాభాగ్యముంటుందా!

కా : మహాభాగ్యని కేముంది! మనుగడకు సరిపోయే మాట కటి ఇస్తే సరి.

అమ : వెడదామా, నగేంద్రం!

న : సరే; పద.

అమ : వెళ్లివస్తా; మామగారూ! నమస్తే.

కా : రత్నంలాంటి కన్య వుంటే మనవాళ్ళు లాక ఏంచేస్తావు!

[అందరు నవ్వు; అమర, నగేంద్రులు వెడతారు]

శివ : ఏమిటోయ్, కాళిదాసూ; ఈ చలోక్తులు.

కా : సరసం తెలినివాడు సహాస్యం పుచ్చుకోవడం మంచిది.

శివ : 'రసం' రసాతలానికిపోతే ఇంకా 'హా' కూడా ఎక్కువ మంచి వస్తుంది!

కా : నిరాశకు నీరా మంచిస్నేహితుడోయ్.

శివ : కాళిదాసులోని కారం చాలదా!

కా : ఈకారం కంటిలోపడితే మరి కలియుగమే లేదు.

శివ : త్రేతాయుగం చూడాలనేగదా!

కా : ఆశ నిరాశకాదు లేవోయ్.

శివ : అమరేంద్రుడు అల్లుడౌతాడంటావా!

కా : అందుకు సందేహమా! అమరేంద్రుడు అనసూయకోసం అలమటించి పోతున్నాడు. కాని...

శివ : 'కాని', ఏమిటి?

కా : ధనంజయరావుకు ధనంమీద మమకారం జాస్తుంది.

శివ : న్యాయమేగదా.

కా : న్యాయాన్యాయాలు అమరేంద్రునిచేతిలో ఉన్నాయి.

శివ : తల్లిదండ్రులనుకాదని అతనేమిచేయగలడు!

కా : తల్లిని మేమిద్దరం ఒప్పించాం.

శివ : అట్లాగా! ఇంతవరకు తెచ్చినతరవాత తండ్రినిమాత్రం ఒప్పించలేకపోతావా!

పిల్లల్ని కన్నవాళ్ల అవస్థలు అర్థమవరాలి! నీకేం తెలుస్తాయ్!

సు : మహిళా సంఘాలన్నీ కలిసి కట్నవిరోధక శాసనం చేయించ నిశ్చయించుకున్నాయి; నాన్నా.

కా : ఎంత పిచ్చిదానవమ్మా! శాసనాలు సంకుచిత భావాన్ని సంస్కరిస్తాయా!

న : అవును, సుశీలా; మనస్సు మారనంతవరకు శాసనం ఏం చేయగలదు!

ధ : ఇవన్నీ ఉబుసుపోని మాటలు. ఆచారాన్ని ఎవరు కాదంటారు!

కా : ఈ ఆచారంవల్ల కలిగే అనర్థాలు కళ్లార చూస్తూ కూడ మనం పెద్దవాళ్లం కళ్లు మూసుకోవడం మంచిదేనా, బావా! చూడు, మాధవరావు ఎం. ఏ. ప్యాసయినవాడు, వివేకవంతుడు, బుద్ధిమంతుడు; ఇదిగాక లక్షాధికారి. బి. ఏ. ప్యాసయిన సుశీలను చేసుకుని కూడా అతనేం పొందగలిగాడు!

ధ : ఏం! అరవై వేలు పుచ్చుకోలేదూ!

కా : ఆ అరవై వేలు ఈ దినం అక్కరకు వచ్చాయా! ఈ అరవై వేలు ఇస్తాను, ఉమను చేసికొనమంటే అనురాగం లేని అర్థం అనవసరమని నగేంద్రుడు తిరస్కరించేశాడు. ఏమీ లేని నగేంద్రుడు ఇంత త్యాగం చేస్తే అన్నీ ఉన్న అమరేంద్రుడు కట్నానికి ఆశిస్తాడా!

అ : నాన్నా, నన్ను నలుగురిలో అవమానపరుస్తావా!

ధ : కట్నం పుచ్చుకుంటే అవమానం కలుగుతుందా!

అ : అనుకూలమైన భార్య కాకపోతే అనుదినం అవమానమే గదా, నాన్నా! (కోపగించి) నన్ను గారాబంగా పెంచావు; విద్యాబుద్ధులు చెప్పించావు; విజ్ఞానవంతుణ్ణి చేశావు. ఈనాడు కట్నానికి బలి ఇస్తావా! నాన్నా, నీవు ఇప్పించిన విజ్ఞానాన్ని నీవే నష్టంచేస్తావా!

ధ : (కంగారు) ఆఁ, ఆఁ, లేవోయ్; ముందు కాళ్లమీద నుంచిలే, అనుచిత ఆచారానికి ఆదర్శవంతుడైన కొడుకుని బలి ఇచ్చేటంత దుర్మార్గుణ్ణి కాదులే లే, ఇంతవరకు లోభం నా కండ్లను కప్పి నీ మనస్సును నొప్పించింది. కాళిదాసూ, నీవు వెళ్లి శివరావుతో చెప్పవోయ్, లగ్నపత్రిక పంపమని.

కా : సంతోషం! బావా! సంతోషం! రెక్కలు కట్టుకొని ఇప్పుడే వాలుతాను.

న : సంస్కారమంటే ఇట్లా జరగాలి, సుశీలా. సంఘాలు ఏం చేయగలవు!

సు : నిజం.

మా : (విచారం) నేను రెంటికి చెడ్డ రేవడినైనాను. (తల వంచుకుంటాడు)

[తెర.]



# సింహావలోకనం

## ఇగ్నేషియా సైలోన్

19 వ శతాబ్దం రాజకీయంగాను, సాంఘికంగాను దారి తెన్నులులేని మిథ్యా సిద్ధాంతాలెన్నెన్నో సృష్టించింది. గత నలభైసంవత్సరాల్లోను ఇవన్నీ మన కళ్లఎదటే పట్టి పేకమేడల్లా కూలిపోయాయి.

అరమోడ్పు కన్నులతో ఈ పేకమేడలపైపై అవలోకిస్తున్న కొంతమంది మరి చేసేదేమీలేక ఆధ్యాత్మికంగా ఒక విధమైన అయోమయావస్థలో పడిపోయారు. వీరి కోలుకోడానికి దారి తెన్ను కనిపించడంలేదు. ఈ పరిస్థితిలో ధనస్వామ్యవాదము, ధనస్వామ్య వ్యతిరేకవాదము రెండూ సందిగ్ధస్థితిలో ఊగులాడుతున్నాయి. ఇప్పటి పరిస్థితి అంతా జాగ్రత్తగా సింహావలోకనం చేసుకుని తిరిగి మన కర్తవ్యం నిర్ణయించుకోవాలి ఈ సమయంలో మన జీవితాంతరార్థం అతి నిశితంగా అవగాహన చేసుకోవలసిన అవశ్యకతకూడా ఏర్పడింది. ఇది అత్యంత ప్రధానమైన విషయం

ఇది ఒక సామాన్యమైన సాహిత్యవివాదంగా పరిగణించి తటస్థంగా ఊరకోవడానికి వీలులేదు. పెద్దమనుషులుగా చెలామణీ అవుతున్నవారనేకులిప్పుడు యుగధర్మం యావత్తూ తమకే అనుకూలంగాఉన్నదని ఉద్ఘాటిస్తూ దగలాగిగలా తగిలించి డాబుగా ఊరేగుతూంటారు. ఇలాంటి వ్యక్తులనుగురించి నేనిప్పుడు ప్రస్తావించదలచలేదు. ఇంతకంటె సునిశితమైనదృష్టి కలిగిన దూరదృష్టవంతులనేకులీ యుగసమస్యలో చిక్కుకొని అనేకవిధాలుగా సతమతమౌతూంటారు. ఈ వ్యాసంలో ఇటువంటివారిని గురించే ప్రస్తావిస్తున్నాను

గడిచిన 80 ఏళ్లలోను రచయితల్లో ఆత్మహత్యకు పాల్పడినవారిసంఖ్య నానాటికీ మితిమీరిపోతున్నది. స్థూలంగా పరిశీలిస్తే ఆత్మహత్యల్లో చిన్నచిన్నవిభేదాలెన్నో గోచరించవచ్చును. అయితే అంతరాంతరాల్లో వీటిసమస్య అంతా ఒకేవిధంగా కనిపిస్తున్నది. వీటన్నిటికీ నీచే చెప్పినట్లు నేటికాలంలో మితిమీరిపోతున్న శూన్యవాదం (*Nihilism*) ఒక్కటే ప్రధానకారణం ఈకాలంలో సర్వే సర్వత్ర ఒకవిధమైన ఆందోళన, అనిశ్చితస్థితి, నైరాశ్యము, విసుగుదల వ్యాపించడంవల్ల మానవజీవితం కలుషితమైపోతున్నది. ఈ పరిస్థితి యావత్తు హైడెగ్గర్, జాస్పర్స్, సార్త్రి మొదలైన అస్తిత్వవాదుల (*Existentialists*) గ్రంథాల్లో సుస్పష్టంగానే ప్రతిబింబిస్తున్నది. ఇంతకంటె భయంకరమైనది ఎస్సెనిన్, మైకోవిస్కీ, ఎర్న్‌స్టటోలర్, కర్ తుహోల్‌స్కీ, స్టెఫాన్‌జ్వైగ్, క్లోస్‌మాన్, డ్రియూ లా రోషెల్, పావెసె మొదలైన విశ్వవిఖ్యాతరచయితల ఆత్మహత్యలు! అంతగా ప్రముఖులుకానివారింకా ఎంతోమంది ఉన్నారు. ఎంతోమంది రచయితలిలాగ నాడు మాత్రావశిష్టులై శేషగాథల్లో మనఎదట భాసిస్తున్నారు! ఇంతమంది విశ్వవిఖ్యాతరచయితలిలాగ ఆత్మహత్యలకు పాల్పడడానికనేక కారణాలుద్ఘాటిస్తున్నారు. ఆయా ప్రభుత్వాలుపెట్టిన యాతనలు, ఒంటరిజీవితము, దారిద్ర్యము, అనారోగ్యము, ఉద్విగ్నమైన మానసికపరిస్థితి మొదలైనకారణాలెన్నో వీరిని ఆత్మహత్యాప్రయత్నానికి ప్రేరేపించాయని అంటున్నారు.

కాని వీరు ఆత్మమృతికి పూర్వం రచించిన రచనలు, మిత్రులతో అన్న వాక్యాలు పరిశీలిస్తే వీరందరికీ జీవితం అంటే గాఢమైననైరాశ్యము విరక్తి ఏర్పడ్డాయనీ, జీవించడం కేవలం నిరుపయోగమని తేలిపోయిందనీ స్పష్టపడుతున్నది.

ఈ ఆత్మహత్యలకేవో కొన్ని కారణా లేకరువు పెట్టినంత మాత్రాన ప్రయోజన మేమీలేదు ఈ ఆత్మహననాల కాయాదేశాలలో అమలులో ఉన్న ప్రభుత్వాలే కారణమనడం కూడా ఒక విధంగా అతిశయోక్తే ఈ ఆత్మవధలన్నీ రష్యా, అమెరికా పశ్చిమ యూరోపు మొదలైన భిన్న భిన్న ప్రభుత్వాల అధికారచ్ఛాయల్లోనే సంభవించాయి. నైరాశ్య సిద్ధాంతాలే వీటికి కారణమనడంకూడా అంతగా సమంజసంగా కనిపించదు. ఈ రచయితల్లో మైకోవిస్కీ ముక్తకంఠంతో విప్లవ విజయగీతిక లాలాపించిన కవి. మిగిలినవారిలో చాలామంది మానవవాదంలోను, మతవిశ్వాసాల్లోను గాఢమైన అభినివేశం ఉన్నవ్యక్తులు. మనస్సుల్లో నైరాశ్యం అంతర్గర్భితంగాఉండడంవల్లనే వీరిటువంటి చర్యలకు పాల్పడ్డారని ఎవరైనాఅంటే అనవచ్చును. నిజాయితీకన్న భావనిరోధమే (*Inhibition*) ప్రాణాంతకంగా పరిణమించడం సహజమే!

ఈ విషాదసంఘటనలకు పూర్వమే మన వర్తమానయుగం పతనావస్థ ప్రారంభించింది. ఈ పతనాగ్నిజ్వాలల్లో సునిశిత హృదయులు, విజ్ఞులు అయిన రచయితలేకాక కొన్నికొన్ని తరగతుల జనము, కొన్నికొన్ని సంస్థలుకూడా ఆహుతి అయిపోతున్నాయి. ఈ పతనావస్థను శూన్యవాదమని మొట్టమొదటగా నామకరణంచేసిన తాత్త్వికుడు నీచే. టర్గినివ్ వ్రాసిన ఫాదర్స్ అండ్ సన్స్ అనే నవలలో శూన్యవాదపదం కనిపిస్తున్నది. కాని నీచే ఈపదం మరిఒకవిధంగా నిర్వచించాడు. నీచే తరవాతరేగిన యుద్ధాగ్నిజ్వాలలు, విప్లవప్రళయాలు మొదలైనవన్నీ ఆ విజ్ఞాని చెప్పినది అక్షరాలా నిజమని ఋజువు పరుస్తున్నాయి. అతని కాలంలో ఇది అంత సుస్పష్టంగా భాసించలేదుగాని ఆ తరవాత ఆ మేధావి చెప్పినదంతా కళ్లకుగట్టినట్లు దృష్టపడింది.

నీచే శూన్యవాదానికిచ్చిన సంగ్రహనిర్వచనం ఇది– న్యాయము, సౌజన్యము, సత్యస్వరూపము శాశ్వతానికి కూడ

వేదాలు! గాథవిశ్వాసాలు, ఆదర్శాలు - అన్నీ వట్టిమిథ్య. జీవితానికంతటికీ స్వార్థాన్వేషణ ఒక్కటే పరమలక్ష్యం. సాహసకార్యాలు అత్యంతప్రధానమైన సుగుణాలు. వీటికి లక్ష్యవివేచన అనవసరం. లక్ష్యం ఎలాంటిదైనా కావలిసిన విషయాలే. ఈ దృక్పథం ప్రకారం స్వార్థత్యాగబుద్ధితో ఆత్మార్పణం చేసిన వీరవరేణ్యులు, డబ్బు కక్కూర్తితో నరహత్యలు చేసినదుండగులు - సమానులే! - శూన్యవాదనిర్వచనంఅంతా ఈ ధోరణిలో సాగిపోతుంది!

మానవజాతి కింత ఘోరమైన పతనావస్థ కలగడానికి కారణమేమిటి? ఇలాంటి పాశవిక భావాలు ఉదయించడానికి ప్రథమ ప్రపంచసంగ్రామమే కారణమని విజ్ఞులంటున్నారు. అయితే, మానవ సభ్యత మొదలంటా కుళ్ళిపోతే—ప్రథమ ప్రపంచ సంగ్రామం ప్రారంభమయ్యేదా? ధనస్వామ్య నాగరికత యావత్తు అభ్యుదయ సిద్ధాంతంమీద ఆధారపడి ఉన్నది. యుద్ధంతో ఈ బండారం అంతా ఒక్కసారిగా బయటపడిపోయింది. మొదటి ప్రపంచ యుద్ధంలో విజయం సాధించిన దేశాల్లోకూడా చిరకాలంనించి గౌరవమర్యాదల కాస్పదమైన సామాజిక సంస్థలన్నీ పేకమేడల్లాగ కూలిపోవడం ప్రారంభించాయి. ఈ ప్రళయంలో బయలుదేరిన అవినీతి, అవిశ్వాసము సమాజం పునాదుల్లోకంటా జొరబడి పుట్టిల్లు కదిల్చివేశాయి. స్వార్థపరత దెబ్బతినడం ప్రారంభమయ్యేసరికి దీని సంరక్షణకోసం అనుగుణంగా వచ్చే నైతికదృక్పథము, ఆధ్యాత్మిక విశ్వాసాలు ఆసరాగా నిలబెట్టడం మొదలుపెట్టారు. దీనితో ఈ విశ్వాసాల బండారంకూడా బయటపడింది.

ఈవిధమైన యుద్ధానంతరపరిస్థితుల్లో ఇటలీలోను, జర్మనీలోను నియంతృత్వాలు కాలూదుకొని గట్టిగా నిలబడ్డాయి. కాని వీటివల్ల ఉన్న దుర్గతి తగ్గడానికి బదులు మరింత హెచ్చు పెరిగిపోయింది. పాపం! కన్సర్వేటివ్ తీవ్రమైన నియంతృత్వాలవల్ల ఆయా దేశాల్లోఉన్న శూన్యవాదం ఊడిచి పెట్టుకుపోగలదని ఆశించారు. వీరి కీఆశాభావం ఎందుకు కలిగిందో మనకేమీ బోధపడదు. నియంతృత్వం ధోరణిఅంతా అవగతమయ్యేసరికి అది కేవలం శూన్యవాదానికి రూపాంతరమే అని స్పష్టపడిపోయింది. ఈ నియంతృత్వాలు పూర్వంనించీఉన్న శృంఖలాలు కొన్ని ఇంకా దృఢంగా బిగించివేశాయి. అంతేగాని ఇవి వినూతనమైన నైతిక దృక్పథ మేదీ సృజించలేకపోయాయి. ఇంతేకాక నియంతృత్వ దేశాల్లో అమలులోఉన్న భీతి దాస్యభావాలవల్ల కేవలం పతనావస్థే ప్రారంభమైనదని చెప్పవచ్చును. ఇటలీ జర్మనీదేశాల్లో నియంతృత్వాలు పడిపోయినా జనం అంతరాంతరాల్లో వేళ్లు దన్నిన శూన్యవాదం అలాగే ఉండిపోయింది.

ఇంతకీ నియంతృత్వాలలో పరిస్థితి యథాప్రకారంగానే ఉండిపోయింది. ఇందువల్ల శూన్యవాదాన్నిగురించీ మానవసమస్యనుగురించీ తిరిగీ పునర్విమర్శ చెయ్యడానికి కొంచెం అవకాశం కలిగింది.

ఇక శూన్యవాదంలో శాస్త్రీయంగా పరిశీలించడానికి అనుకూలమైనసిద్ధాంత మేదీ కనిపించదు. నిజానికిది మానవజాతి అభ్యంతరాల్లో ఉద్భవించిన ఒక విషజ్వరంలాంటిది. ఈ జ్వరం పోకనివారికీ, దీనివల్ల విముక్తికాంక్షకులకీ మాత్రమే దీనినిగురించిన పరిశీలన బాగా ఉపయోగించగలదు. అయితే చాలామంది జనానికి ఈ జ్వరం అస్తిత్వమే అవగాహన కావడంలేదు. వీరందరు ప్రస్తుతపరిస్థితుల్లో ఇది ఒక సహజపరిణామమే అని భావిస్తుంటారు.

అస్తిత్వవాదం (*Existentialism*) శూన్యవాదంవల్ల ఉద్భవించే మానవికపరిస్థితిని చాలా విస్పష్టంగానే చిత్రించింది. దీని ధోరణి ఇది:

“మానవాత్మకు మానవుని అస్తిత్వానికి గల సంబంధాలన్నీ పూర్తిగా పటాపంచలైపోయాయి. మానవునికి స్వీయాస్తిత్వం కంటె వేరేలక్ష్య మేమీ లేదు. మానవుల్లో కేవలం జీవచైతన్యం కంటె వేరే పరమార్థం ఏమీ లేదు.” దీన్నిగురించి పరిశీలించేముం దొకవిషయం అందరు అంగీకరించాలి ఈవిధమైన చిత్రణంలో నిజాయితీ లేదని ఎవ్వరూ అనలేరు. ఈ నిజాయితీవల్లనే దీని ప్రాశస్త్యం స్పష్టపడుతున్నది. రచయిత తీవ్రంగా చిత్తశుద్ధితో మానవాత్మపరిస్థితి అభివర్ణించడంవల్లనే మానవాత్మాభ్యుదయానికి దారిచూపిస్తున్నారు. అయితే సాహిత్యం కాదూ బొంగరములేని ఈవిధమైన శూన్యవాదంమీద కాలూని నిలదొక్కుకోవడం కష్టం. రచయితలెవరైనా గట్టిగా నిజాయితీతో పరిశీలిస్తే ఈ శూన్యవాదం అంతు కనుక్కోవడం చాలా తేలిక. ఈవిధమైన నిజాయితీతో ఈ శూన్యవాదమే శరణ్యమని నమ్ముకొన్న రచయితల్లో చాలామంది కింక ఆత్మహత్యతప్ప వేరే గత్యంతర మేమీ లేదని స్పష్టపడిపోయింది. మరికొంతమంది కీశూన్యవాదం నిస్సారమనీ, మానవాత్మలో అమూల్యమైన విలువలున్నాయనీ కళ్ళకుగట్టినట్టు స్పష్టపడింది. దీనికి సుప్రసిద్ధరచయితల రచనలనించి కొన్ని ఉదాహరణ లివ్వవచ్చును.

వీరిలో మొదటివాడు ఎర్నెస్టుయూంగర్. ఇతడు జర్మనీ రచయిత. తన రచనల్లో ఇతడు శూన్యవాదం అవధులుదాటి చిట్టచివరికది నిస్సారమని గ్రహించి ముమ్ముందుకు పురోగమించాడు.

తన రచనలలో అతడు కార్మికులను (ప్రొలెటేరియన్సు) గురించి చాలా భయంకరంగా చిత్రించాడు. ఇతని రచనలలో వీరొక కొత్త తరహా యంత్ర మానవులు. వీరికి హృదయమూ, ఆత్మ, మెదడు వంటివేవీ ఉండవు. మన ఆధునిక సమాజం ఇలాంటి యాంత్రికమానవుల నెక్కువగా ఉత్పత్తిచేస్తున్నదని ఇతడభివర్ణిస్తాడు ఈ యంత్రమానవులందరు ఆయా దేశాల్లో బయలుదేరే అంతర్యుద్ధాలలోను, సామ్రాజ్య యుద్ధాలలోను చక్కగా ఉపయోగిస్తుంటారు. యుద్ధంలో ఆహుతులయిపోవడ మొక్కటే వీరి లక్ష్యం తదితర నైతికవిషయాలేవీ వీరు పట్టించుకోరు. ‘వీరిలో యాంత్రిక మనస్తత్వం అవధులు దాటిపోయి పరిపూర్ణమై ప్రకాశిస్తుంది! మానవాత్మ కింతకంటె వేరే అధఃపతన మేమీ లేదు. హిట్లరు అధికారంలో ఉన్న రోజుల్లోనే యూంగరు ఈ భయంకర శూన్యవాదానికి వీడ్కోలు చెప్పి ఆతర్వాత తన రచనలలో దీన్ని గట్టిగా తూర్పారబట్టాడు.

ఆల్బర్టు కామ్యు అనే ఫ్రెంచి రచయిత రచనల్లో కూడా ఇంచుమించుగా ఇలాంటి పరిస్థితే ప్రత్యక్షమౌతుంది. ఇతడు మొట్టమొదట రచించిన ‘లా మిథ్ సిసీఫ్’ అనే గ్రంథంలో మానవుని కాత్మహత్యతప్ప వేరే గత్యంతరం లేదనే నిర్ధారణను ఎంతో ఆడంబరంతో విచారిస్తూంటాడు.

అయితే ఆతరవాత వ్రాసిన 'లా పెస్ట్' అనే రచనలో మానవాళ్ళను కరుణార్ద్రత ఒక్కటే ఉద్ధరించగలదనే అభిప్రాయం ఆశాజ్యోతిలా మెరుస్తూంటూంది. దీనివల్లనే జీవితపరమార్థం అవగతం కాగలదన్న అభిప్రాయం కూడా ఈ రచనలో స్ఫురిస్తున్నది.

సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత ఆంద్రేమాల్‌రో రచనల్లో కూడా ఇలాంటి అభిప్రాయాలే వ్యక్తమౌతున్నాయి. ఇతను కొంతకాలం పాటు కమ్యూనిజం అంటే వల్లమాలిన వ్యామోహంతో రచనలు సాగించాడు. కమ్యూనిజంద్వారా నిజమైన మానవ సౌభ్రాత్రం వర్ధిల్లగలదని ఇతను డెస్మెన్స్ పగటికలలు కన్నాడు. అయితే క్రమంగా ఇతనికి కూడా శూన్యవాదం అంటే బాగా వెగటు బయలుదేరింది. దీనివల్ల క్రమక్రమంగా విశ్వమానవసౌభ్రాత్రం ఒక్కటే శరణ్యమన్న అభిప్రాయం బలపడింది. దీనికి మానవ వ్యక్తి స్వాతంత్ర్య మొక్కటే ముఖ్యసాధనమని కూడా ఇతడు గుర్తించాడు. మొట్టమొదట కమ్యూనిస్టు వ్యామోహంలో చిక్కుకొని విముక్తిపొందిన ఇతనికి జాతీయవాద మొక్కటే శరణ్యమని స్ఫురించింది. ఇతని ఇటీవలి రచనల్లో ఈ అభిప్రాయాలే స్పష్టంగా కనిపిస్తున్నాయి.

పై ఉదాహరణలవల్ల శూన్యవాద ప్రళయంనుంచి విముక్తి మార్గమొకటి స్పష్టంగా భాసిస్తున్నది. ఈ మార్గమే మానవాంతరాళాల్లో భాసించే ఆశాజ్యోతి.

నేను మున్ముందు విషయాన్ని గురించే బాగా వివరింపబోతున్నాను.

ఇది ఇలాగ ఉండగా - ఉన్న పరిస్థితులవల్ల విసిగిపోయి విప్లవమార్గా లవలంబించే వారందరిలోను సామాన్యంగా ఒకే విధమైన మానసిక పరిస్థితి కనిపిస్తున్నది. దీనికి శాస్త్రీయ శాస్త్రీయ వివేచన లేమి కారణాలుకావు. సామాన్యంగా యువకులందరిలోను ఇటువంటి మానసిక పరిస్థితి బయలుదేరుతూంటుంది నేను విప్లవవాదుల ఆత్మకథలు కొన్ని చాలా జాగ్రత్తగా పరిశీలించాను. వీరిలో కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అనార్కిస్టులు, ఫాసిస్టులు కూడా ఉన్నారు. స్వయంగా నాకు పరిచయులైనవారి రాజకీయ జీవితాలుకూడా జాగ్రత్తగా పరిశీలించాను. వీరందరి జీవితాల్లోను ఒకేవిధమైన పరిస్థితులు ప్రత్యక్షమౌతున్నాయి. ఎక్కడైనా కొన్ని విభేదాలున్నా అవి అంతగా పరిగణింపదగినవి కావు.

నిజానికి అంతరాంతరాంతరాల్లో .అబాహ్యంగా ఉండిపోయిన కారణాలవల్లనే కన్సర్వేటివులుగానో కమ్యూనిష్టులుగానో మారుతూంటాము. కొత్త విప్లవ దృక్పథం ఒకటి కంటబడగానే ఒక్కసారిగా మహావేశంతో అదే పట్టుకొమ్మగా పట్టుకుంటూ ఉంటాము.

ఈ పరిస్థితుల్లో మన అంతరాంతరాల్లో జరిగే పరివర్తనలన్నీ అతి జాగ్రత్తగా గమనించడం ఒక్కటే శరణ్యంగా కనిపిస్తున్నది.

గడిచిన రెండు మూడు దశాబ్దాల్లోను విప్లవ భావావిష్టులైన యువకుల చరిత్రలు చాలా విచిత్రంగా కనిపిస్తున్నాయి. వీరందరు మానవసంఘం యావత్తూ సమూలంగా కుళ్ళిపోయిందనీ దీనికి కార్మికవర్గ నియంతృత్వ మొక్కటే వరప్రసాదమనీ విశ్వసించి ఒక్కసారిగా విప్లవమార్గాలల్లోకి దూకారు. ఈ విప్లవసందేశం పార్టీ అవధులు దాటి క్రమంగా ప్రపంచం అంతటా వ్యాపించింది. అంతకు పూర్వంనుంచీ వ్యాపించిఉన్న శూన్యవాదాని కిది ఒక పెద్ద విముక్తిస్థానంగా మెరిసింది. ఆ రోజుల్లో—ఎలాంటి పరిస్థితుల్లో ఉన్నా—కార్మికవర్గం స్వాతంత్ర్యంవైపు పురోగమించిపోతున్నదనీ దీనివల్ల ఆయాదేశాల్లో నూతనోజ్జీవం కలగగలదనీ అందరు విశ్వసించారు. దీనికి కొన్ని తార్కాణాలున్నాయి. మాస్కోలో జారుప్రభుత్వకాలంలో కార్మిక నాయకులను నిర్బంధించడానికి ఒక పన్నాగం పన్నారు. ప్రభుత్వమే పోలీసు శాఖ ద్వారా ఒక కార్మిక సంఘం ఏర్పాటు చేయించింది

రహస్యంగా దాగిఉన్న కార్మికనాయకు లిందువల్ల బైటపడగలరనీ వారి నందరినీ వెంటనే నిర్బంధించవచ్చుననీ జారు ప్రభుత్వం భావించింది. కార్మికనాయకు లెవరు ఈ వలలో చిక్కుకోలేదుగాని మొత్తంమీద ప్రభుత్వం ఏర్పాటుచేసిన ఈ సంఘమే విప్లవాదర్శాల కాటపట్టై కూర్చుంది. దీనితో ప్రభుత్వం గత్యంతరం లేక వెంటనే దీన్ని రద్దుచేయించింది

ఇలాంటిసంఘటనలవల్ల కార్మికులంతా విధిగా విప్లవకారులౌతారని ఆరోజుల్లో అందరు గట్టిగా నమ్మేవారు. క్రమక్రమంగా ఈ నమ్మకాలన్నీ బాగా సడలిపోయాయి కార్మికనియంతృత్వంవల్ల స్వాతంత్ర్యభానూదయం కలగనేరదని స్పష్టపడిపోయింది. దీనితోపాటు మానవచరిత్ర విధిగా అభ్యుదయంవైపే పురోగమిస్తున్నదని విశ్వాసంకూడా అంతర్ధానమైపోయింది. నాజీల అధ్వర్యంలో పనిచేసిన బ్రహ్మాండమైన కార్మికసంఘాలన్నీ దీనికి చక్కని తార్కాణాలుగా కనిపించాయి ఇంకా కేలజార్ ప్రభుత్వము పెరన్‌ప్రభుత్వము స్థాపించిన కార్మిక సహకారసంఘాలు, కార్మికసంఘాలు ఈవిషయం మరింతస్పష్టంగా ఋజువు పరిచాయి. ఇది ఇల్లాగఉండగా కమ్యూనిజం కేవలం బందరాతి నియంతృత్వంగా మారిపోయేసరికి ఇన్నాళ్ళనించీ ఈవిషయంలో నమ్మకం లేనివారికి కూడా పై విషయంలో గట్టినమ్మకం కుదిరింది. క్రమంగా ప్రపంచంలోని కార్మికవర్గమంతా ఒకేవిధంగా పురోగమిస్తున్నదన్న విషయం కూడా కేవలం మిథ్యవని స్పష్టపడిపోయింది ఇంతేగాక వర్గవైరవ్యంకూడా ఆయావర్గాల సహజపరిస్థితులవల్ల ఉద్భవించేది కాదనీ, ఈ విషయంలో పరస్పరసంబంధ మేమీ లేదనీ స్థిరపడింది

దీనితో మానవజీవితంలో ఆధ్యాత్మికంగాను రాజకీయంగాను వినూతనమైనదృక్పథం ఒకటి ఏర్పడింది కార్మికప్రపంచం మానసికంగా భిన్నాభిన్నమైపోయింది. కార్మికులు పరస్పరవిరుద్ధమైన సిద్ధాంతాలేవైనా యథేచ్ఛగా అవలంబించిన ఉదాహరణ లెన్నో ఇటీవలిసంఘటనలలో కనిపిస్తున్నాయి. ఏ రోజొక్కప్పుడు ఫాసిజం కోసమే తమప్రాణా లర్పించవచ్చును. కొన్ని కొన్ని ధనికదేశాల్లో సమస్తభోగ్యాలు అనుభవిస్తూ సుఖంగా కాలక్షేపం చెయ్యవచ్చును.

అయితే బాగా వెనకబడినదేశాల్లోమాత్రం వీరింకా విప్లవవాదుల రాజకీయాధికారదాహాలకు ఆహుతిఐపోయే అవకాశం లేకపోలేదు. కార్మికులసంఖ్యాధిక్యంవల్లనే రాజకీయాల్లో వీరి కింతటి ప్రాముఖ్యం ఏర్పడింది. ఇంతటిప్రాముఖ్యమున్నవర్గం మరొకటి ఏదీలేదు. వీరిమీద మానవజాతిస్వాతంత్ర్యము, భవిష్యత్తు మొదలైన

దన్నో ఆధారపడి ఉన్నాయి. అయితే ఆయావర్గాలకు ప్రత్యేక చైతన్య మేదీ లేదనీ, కాగా కేవల మానవచైతన్యమే ప్రధానమైనదనీ నిర్ణయించుకున్నాము. ఏతావతా తేలిందేమంటే—మనం ఎక్కడనించి బయలుదేరినా—తిరిగి తిరిగి చివరి కక్కడికే చేరుతున్నాము.

గత దశాబ్దాల్లో మానవాత్మ పూర్తిగా కలుషితమైపోయింది. శూన్యవాదం క్రమక్రమంగా పై తరగతులవారి దగ్గిరినించి కింది తరగతుల వారిదాకా వ్యాపిస్తున్నది. క్రమంగా కార్మికులలో కూడా ఈ విషబీజాలు వ్యాపిస్తున్నాయి. అప్రతిహతమైన అధికారం సంపాదించడమూ, దానివల్ల ఎలాగో అలాగ పైకి నెట్టుకుపోవడమూ ఇవే శూన్యవాద సిద్ధాంతానికి పరమలక్ష్యాలని అనుకున్నాము. నేడివి ప్రపంచం అంతటా విలయతాండవం చేస్తున్నాయి. మనలో దాగిఉన్న భీరుత్వంవల్ల నైతేనేమి, వాదపాండిత్యంవల్ల నైతేనేమి చరిత్రగతి యావత్తు విజేతల పరంగానే ఉన్నదని ఉద్ఘాటిస్తున్నాము. అసలైన శూన్యవాద సారాంశం అంతా ఈ సిద్ధాంతంలో మూర్తీభవించింది. దుర్బలులు, పరాజితులు, అందరూ కేవలం దోషులేనా? పరాజితుడైపోయినంత మాత్రాన ట్రాట్‌స్కీని కేవలం దోషిగా జమకట్టడం న్యాయ్యమేనా? హైడ్రోజను బాంబు లెక్కువగా ఉన్నాయని ప్రపంచాన్ని భయపెట్టే వారిలోనే న్యాయం అంతా కరడుగట్టుకు కూర్చున్నదా?

చిన్నతనంలో మనం అందరమూ మన చుట్టూరా ఉన్న దుర్భరపరిస్థితులు చూసి భరించలేక అనేక విప్లవపంథా లవలంబించాము. ఈ పంథాలలో మనలో చాలామంది కార్మికులతో తాదాత్మ్యం వహించారు. అయితే ప్రపంచంలోని కార్మికు లందరిలోను ఈ రోజుల్లో అనేకమైన విభేదాలేర్పడ్డాయి. వీరందరు ఏదో మహత్తరమైన చారిత్రకాభ్యుదయ మార్గంలో పురోగమిస్తున్నారన్న సిద్ధాంతంకూడా నేల కూలిపోయింది. కళ్లు మూసుకుని వీరి వెంటబడేవారంతా తమ లక్ష్యం చేరుకుంటారనే నిశ్చయమేదీ కనిపించడంలేదు. మనుష్యుల సంగతి కనుక్కోవాలంటే కాయలు కాచిన చేతులకంటె కళ్లలోని చూపులే ముఖ్యమౌతున్నాయి. ఇంతకీ మనం తెల్సుకోవలసిన ముఖ్యవిషయం ఇది—కార్మిక నిర్బంధ కారాగారాల్లో పడి మూలుగుతున్న నిర్భాగ్యులు కోట్లవున్నారు. వారిని ఖైదుల్లో నిర్బంధించిన విజేతలు కొందరున్నారు!

ఈ పరిస్థితిలో మన మెవ్వరివైపు ఉన్నామో స్పష్టంగా నిర్ణయించుకోవాలి. ఈ సమస్యతో మనకేమీ సంబంధం లేదని మాట్లాడ కూర్చోవడంవల్ల ప్రయోజన మేమీ లేదు. ఈ కార్మికు లందరిని ఉరికంబాల కెక్కించడానికి సిద్ధంగాఉన్న నియంతలందరు మీరెవ్వైపు ఉన్నారో నిక్కచ్చిగా తేల్చి చెప్పవలసిందని మనల్ని మాటిమాటికి నిర్బంధిస్తున్నారు. ఇందువల్ల లేకున్నది ఉన్నట్టు తేల్చి చెప్పకతప్పదు. మనం ఈనాడు స్వాతంత్ర్యం పేరిట బీదప్రజలను గాని, బీదప్రజల పేరిట మన స్వాతంత్ర్యం గాని బలియివ్వడం లేదనిస్పష్టంగాఉద్ఘాటించాలి. బీదల బుజాలమీదనించి పైకెక్కి అధికారం చేజిక్కించుకున్న నియంతలకోసం మన స్వాతంత్ర్యం బలియివ్వడం కేవలం అన్యాయమని మనం అందరమూ గ్రహించాము. కనక స్వాతంత్ర్యంకోసం తమ సర్వస్వమూ అర్పించి కారాగారాల్లో మగ్గుతున్న వారి పక్షాన నిలబడడమే నేటి మన ధర్మము!

మానవత్వం పేరిట దారుణా లెన్నో జరుగుతూండడంవల్ల మన కీనాడు మానవతావాదమే నిరర్థకమేమో అని స్ఫురిస్తున్నది. ప్రస్తుత పరిస్థితుల్లో ఇలా గనిపించడం సహజమే గాని ఇంతకంటె శుభోదర్కమైన కాలంలో కనుచూపు మేరలోనే ఉన్నదని ఆశిద్దాము. ప్రస్తుతం మానవజాతి పూర్తిగా వికలమైపోయింది. ప్రస్తుత పరిస్థితుల్లో మనకు కొన్ని దృఢవిశ్వాసాలున్నాయని గాని లేవని గాని అనలేము. అట్లాగని కేవలం నైరాశ్యవాదం మన మవలంబించడం లేదు.

ప్రస్తుతం మనపరిస్థితి ఈ క్రిందివిధంగా సంగ్రహించవచ్చును. క్రైస్తవ సిద్ధాంతంలోని ప్రధాన సిద్ధాంతాలకు మన విశ్వాసాలకు చాలా దగ్గర సంబంధం కనిపిస్తున్నది. ఈ విశ్వాసాలు మానవాంతరాళాల్లో అంతర్గర్భితంగా ఉన్న అమూల్యనిధులు. అయితే ఈ విశ్వాసాలనుగురించి ఖచ్చితంగా ఉద్ఘాటించడానికి తగిన అర్హత నాకు లేదని విన్నవించుకొంటున్నాను. కాగా ఇది ఒక విధమైన నమ్మక మాత్రమే. అల్బర్టు కామ్యూ చెప్పిన కరుణార్ద్రతకంటె ఇది ఉదాత్తమైనది. దీనివల్ల మనం సర్వస్వతంత్రులమనీ మనపై ఎంతో గురుతర బాధ్యత ఉన్నదనీ ఇతరుల అంతరాంతరాల్లో నిహితమైన అమూల్య సత్యా లవగాహన చేసుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నదనీ స్పష్టపడుతున్నది. ఉదాత్తమైన మానవాంతరాత్మల సత్యోక్తులవల్లనే విశ్వమానవ సౌభ్రాత్రం ఏర్పడగలదు. బీదప్రజలంటే మనలో కలిగే ప్రేమ దీనివల్లనే వికసిస్తున్నది. ఇది స్వార్థపరత్వంవల్ల జనించిన ప్రేమ కాదు. లక్షలాది నిర్భాగ్యులు దారిద్ర్యంతో బాధపడుతూంటే సహించి ఊరుకోడంలో మానవత్వ మేమున్నది? ఇతరుల యాతనలు మనకేమీ పట్టనట్టూరుకోవడమంత అవినీతి అదే కాని మరేది లేదు. అయితే ఇదంతా అధికార రాజకీయాల కోసమే అనిమాత్రం అపార్థం చేసుకోకూడదు. నిస్సహాయులైన బీద జనాన్ని తమ అధికార సాధనోపకరణాలకు మెట్లుగా ఉపయోగించడంకంటె ఘోరపాతకమేదీ లేదు!

అయితే మనకున్న సమస్యలన్నీ పరిష్కరించే ఘోషాయీ చిట్కాలేవి మనదగ్గర లేవు. కాగా ఈ యథార్థ జ్యోతిలో జీవించడ మొకటే ప్రస్తుతం మన కర్తవ్యం.

ఆకాశం అంతా నేడు గాఢాంధకార బంధురంగా ఉన్నది. ఉన్న వెలుగులో ఎటు పోవడానికీ దారి కనిపించడం లేదు!

ప్రస్తుతం మన ఆధ్యాత్మిక పరిస్థితినిబట్టి కేవలం ఆత్మరక్షణతోనే సంతృప్తిపడడం గాని అహంభావంతో మైమరచిపోవడం గాని తగదు. ఇదే మన ప్రస్తుత పరిస్థితి!

అయితే మానవు లొకరొకర్ని అంతరాంతరాల్లో కంటూ అవగాహన చేసుకునే అవశ్యకత, ప్రేమ ఉన్నంతకాలము—నైరాశ్యానికి తావు లేదు! 'ఎన్‌కౌంటర్' పత్రిక నుంచి.

లోపలికి వచ్చిన సుబ్బన్నగారు ముందు గదిలో మంచంమీద కూలబడ్డారు. ఆయన భార్య లోపల్నించి ఆదుర్దాగా వొచ్చి "ఇన్స్పెక్టగారేమన్నా రేమిటండి?" అని ప్రశ్నించింది.

సుబ్బన్నగారు, చాలా చిరాకుగా, "పోనీవే పెధవ గోల! ఆటీన్ సోమన్న ఉంపుడుగత్తెను ఖూనీ చేసాట్ట. పోలీసువారు నన్నడగడానికి వచ్చారు, వా డెక్కడ దొరుకుతాడా అని! వాగోలకి నాకేం తెలియదని పంపించేశాను!" అన్నారు.

ఆయన పెద్దకూతురూ, చిన్నకూతురూ, భార్యా ఇక నేమీ మాట్లాడకుండా ఉండిపోయినారు. లాంతిర్ వెలుగు ప్రసరించని మూలలవైపు చూస్తూ ఆలోచనలో పడిపోయినారు సుబ్బన్నగారు.

## 2

ఆటీన్ సోమన్న అంటే ఆరోజుల్లో రాజమండ్రి పట్నం లోనూ చుట్టుపక్కల కూడా అందరికీ హడలే. ఈ భయం నివారించ డానికి పోలీసులు సోమన్నని జైల్లో పెట్టాలని అనేక విధాల ప్రయత్నించారు గాని—అతనిమీద ఏ నేరమూ రుజూ కాకపో వడంతోటి ఏమీన్నీ చెయ్యలేక పోయినారు. సోమన్న ఎక్కణ్ణించి వొచ్చాడో ఎవరికీ తెలియదు. ఎప్పుడూ గ్లాస్కో మల్లుపంచె కట్టి, అరిచేతులదాకా పెద్దాపురం సిల్కు తొడిగి, టర్కీ టవల్ తలకు చుట్టాడు. భారీమనిషి; ఎర్రనాగైన కళ్ళు. చామనఛాయ. కోర మీసాలు నిగనిగలాడుతూ మొహానికెంతో గాంభీర్యాన్నిస్తాయి.

సోమన్న చీట్లపేకలో ఘటికుడు ఒకప్పుడు, అతను ఆటీన్ తురుఫుముక్కలోటి ప్రత్యర్థుల్ని చిత్తుగా ఓడించి వున్నాడు. అప్పణ్ణించే అతనికి ఆటీన్ సోమన్న అనే పేరు స్థిరపడిందని ఆ చుట్టుపక్కల చెప్పుకుంటారు. సోమన్న రాజమండ్రి పరిసరాల్లో రహస్యంగా చీట్లపేకలాడే ప్రదేశాల్లోకి వెళ్ళి చీట్లాడే జీవనం చేస్తూ వుండేవాడు అతను ఆ ప్రాంతాలకొచ్చిన కొత్తల్లో. కొద్దిరోజుల్లోనే అతడు దొంగతనాలు చేస్తున్నాడనీ, భయస్థుల్ని—ఏం! ధైర్య స్థుల్ని సైతం బెదిరించి డబ్బులు గుంజుతున్నాడనీ వదంతులు వ్యాపించాయి కాని వదంతులుగానే భావించా రందరూ. వేటినీ రుజూ చేసుకోలేకపోయినారు పోలీసులు.

మొత్తంమీద సోమన్న అంటే అందరికీ లోలోపల ఒక బెదురు స్థిరపడిపోయింది. కొన్ని సంఘటనలవల్ల సోమన్న ధైర్య సాహసాలు ప్రజలకి తెలియడంతోటి ఈ బెదురు పెరిగింది. గోదా వరి ఉధృతమైన వరదలో ప్రమాదవశాత్తు పడిపోయిన ఐదేళ్ళ పిల్లని అతడు ప్రాణాలకి తెగించి గోదావరిలోకి దూకి రక్షించి వొడ్డున వేశాడు; ఆ నిముషాన గోదావరిలోకి దూకడానికి గజ ఈత గాళ్లు సైతం వెనకంజవేస్తారు.

ఒకసారి చీట్లపేక తగాదాలో తనమీదికి వొచ్చిన ముగ్గురు ప్రత్యర్థుల్ని గుండపిండిగా కొట్టాడతను; అప్పణ్ణించీ అతనంటే ఊళ్ళోనే కాకుండా, 'రౌడీ'లనతగ్గవారు కూడా ఇంకి మర్యాదగా ప్రవర్తించసాగారు.

అటువంటప్పుడే ఒక విచిత్రమైన సంఘటన జరిగింది.

రాజమండ్రిలోనే ఆర్యాపురం ప్రాంతంలో ఒక ఇరుకు సందులో పోలీసులకభేద్యంగా వుంటూవచ్చిన ఒక చీట్లపేకలాటల కేంద్రంవుంది; అది పెంకుటిల్లు. ఇంట్లోనే చెక్కలతోటి అటక లాగా ఒక అంతస్తు కట్టి, దానికి నిచ్చెన వేశారు; నిచ్చెన మెట్లెక్కి పైకివస్తే విశాలమైన గది వుంటుంది. ఈ గదిలో—సెలవు పది రోజులు జోరుగా చీట్లపేక సాగుతూవుంటుంది. చుట్టుపక్కల పెద్ద పెద్దవారే ఇక్కడ చేరి వేలకొలది డబ్బు పణం పెట్టి చీట్లాడుతారు.

ఆ పెంకుటిల్లు పైనించి చూడడానికి చాలా నిరపాయకర మైనదీ, పాతబడ్డ కొంపానూ. దానిలో చిన్న హోటలున్నది. ఒక నాడు సాయంత్రం వేళ; కిందహోటల్లో సామాన్యులు కూర్చుని కాఫీలు తాగుతున్నారు. పైన అప్పుడే ఆట మొదలెట్టారు. ఈతాకుల చాపపరిచి దానిమీద ఏడెనిమిదిమంది కూడున్నారు; అందరూ బాగా డబ్బులు వుండి వేరే పనిపాటలులేని రకం; చేతు లకి ఉంగరాలు మెరుస్తున్నాయి. జరీఅంచు కండువాలూ సిల్కు పంచెలూ వొంటిమీంచి జారిపోతున్నాయి. కత్తెరమార్కు సిగ రెట్లు పొగతోటి వాతావరణం ఊపిరాడకుండా వుంది. వాళ్ళ తలలమీద పెద్ద లస్టర్ లైటు వెలుగుతోంది. ఈ సమాజంలో సుబ్బన్నగారూ వున్నారు. ఆయనగారుకూడా అప్పుడప్పుడు వొచ్చి చీట్లాడ్డం కద్దు.

చీట్లాటకు ఇంకో చెయ్యి తక్కువ. అత నింకా రాలేదేమని విసుగా ఆటగాళ్లు ఎదురుచూస్తున్నారు. అంతక్రితం, ఆటీన్ సోమన్న అంటే ఎవరో చూడనివాళ్లూ, అతనంటే గొప్పగా చిత్రించుకుని అతన్ని చూడాలని అభిలాష మిక్కుటంగా గల వాళ్లూ అక్కడ విడారుకున్నారు. అందులో సుబ్బన్నగా రొకరు. ఆయన, తనపక్కన కూచున్న ఒకాయనతోటి, "ఏమండి సింహాచలంగారు, సోమన్న ఎప్పటికొస్తాడు!" అని ప్రశ్నించారు;

సింహాచలం, "ఈపాటికి వస్తూనేవుండాలి. అతనులేంది ఆట కుషారుగా వుండదు!" అన్నాడు.

ఏడుగంటలు దాటాక ఆటీన్ సోమన్న వొచ్చాడు పైకి. అతను అందర్నీ ఒకపారి కలయజూశాడు; సుబ్బన్నగార్ని చూసి నప్పుడెందుకో అతని నొసట ప్రశ్నార్థకం, ఆశ్చర్యార్థకం కన్పిం చాయి. అయితే వీటిని బలవంతంగా అణిచేసుకుని ఆటలోకొచ్చి కూర్చున్నా డతను.

అత న్నిదివరకే చూడాలని అభిలాషగలవారు, గొప్ప హీరోను చూసినట్టు చూశారు. సుబ్బన్నగారు ఒకటి రెండు నిమి షాలు అతన్ని రెప్పవాల్చకుండా చూశారు; తర్వాత సాఫీగా ఆటలో నిమగ్నమైపోయినారు. అరగంటసేపు ఇలాగే సాగింది ఆట మౌనంగా.

ఆ తర్వాత డబ్బులు ఎవరెవరివ్వాలో, ఎవరెవరు పుచ్చు కోవాలో అదే పంపిణీ వ్యవహారం జరిగింది. ఈ ఆటలో సోమన్న కొట్టే లాభం కన్పించలేదు, సుబ్బన్నగారు కొద్దిగా గెలుచు కున్నారుకూడా. సోమన్న రెండో ఆటకు ఉషారుగా వున్నాడు. డబ్బులు ప్రతి ఆటగాని ఎదుట చిన్న చిన్న కుప్పలుగా పోసుకుని

చూస్తున్నారు. నిజానికి అక్కడ ఆటగాళ్లు ఎవరికోసం ఆడుతున్నారో వాళ్ళే అతి నిర్లక్ష్యంగా కాళ్ళకింద తొక్కి—ఆడుతున్నారు. ప్రతివారి పక్కన సిగరెట్ పీకలగుట్ట ఒకటీ నిప్పుల్లో పోగు ఒకటీ తయారౌతోంది

రెండో ఆట ముగిసేసరికి 9 గంటలయింది. ఆటచివర సోమన్న అకస్మాత్తుగా మహోగ్రుడై లేచి తన ప్రత్యర్థి ఒకాయన మీద విరుచుకుపడ్డాడు. ఆట అకస్మాత్తుగా ఆగిపోయి మరునిమిషం ఆ చెక్కల గది రణరంగం అయింది. “ఏమిటి? ఏమిటి?” అని అందరూ కలసి వాళ్ళిద్దర్నీ విడదియ్యడానికి ప్రయత్నించారు. సుబ్బన్నగారు ఏమీ మాట్లాడకుండా ఒకపక్క గోడకానుకుని ఈ ద్వంద్వ యుద్ధాన్ని పరీక్షిస్తూ నిలబడివున్నారు.

సోమన్న తనతోటి సమబలుడైన తన ప్రత్యర్థిని కిందపడేసి తల చెక్క కుర్చీకేసి బలంగా బాదుతున్నాడు. ఇలాగే ఇంకో పదినిమిషాలు సాగితే ఎలావుండేదో...మిగతా సభ్యులందరూ నిశ్చేష్టులై నిలబడివున్నారు ఏమీతోచక, ఏమిటో అర్థంకాక.

ఈ సమయాన, సుబ్బన్నగారు అకస్మాత్తుగా తాను కూర్చున్న చోటినించి గబగబ రెండడుగులు ముందుకు వేసి, సోమన్న చొక్కాని మెడదగ్గిర పట్టుకుని బలవంతంగా పైకి లేపి నిల్చోపెట్టారు; ఆయన ముఖం మాత్రం ఏమీ మార్పు చెందలేదు. “సోమన్నగారు! దయచేసి ఈ ద్వంద్వయుద్ధం మానేసి ఏం జరిగిందో మాకూ చెప్పండి!” అన్నారు.

సోమన్న ఒక్కసారి బెబ్బులి లాగా హుంకరించాడు; కాని సుబ్బన్నగారి వేపోకసారి తేరపారిచూసి చప్పున ఉద్రేకం తగ్గించేసుకున్నాడు; తిరిగి తన కాళ్ళకింద లేవటానికి ప్రయత్నించుచున్న ప్రత్యర్థివేపు అసహ్యంగా చూస్తూ, “దొంగవెధవ. దొంగముక్క జేబులో పెట్టుకొస్తాడా పెద్ద ఆటకి! మీరు అడ్డం రాకపోతే ప్రాణం తీసేవాణ్ణి!” అన్నాడు అతని మాటల్లో అసహ్యమే ధ్వనించిందిగాని మొదట్లోవున్న కోపావేశం ఉద్రేకం లేవు.

అక్కడ సమావేశమైనవాళ్లకి సోమన్న యుద్ధం విరమించినందుకూ ఆశ్చర్యం కలగలేదు; ప్రత్యర్థి దొంగముక్కతోటిఆట ఆడినందుకూ కోపంరాలేదు. ఊరంతా గజగజలాడే సోమన్నని—సుబ్బన్నగారు పిల్లిని పట్టుకున్నట్టు పట్టుకుని లేవదీసి అతన్ని ఒక క్షణంలో లొంగదీశారేమిటి! అందులోనూ వెనకా ముందు పరిచయమైనా లేని వ్యక్తిని! అని ఆశ్చర్యం వేసింది వాళ్ళకు

ఆ వేళటికి ఆట విరమించారు వాళ్లు. దెబ్బతిన్నవాడిదగ్గిర ఒక ఇస్పేటుఆసుముక్క దొరికింది. అతన్ని అంతటితో వదిలేశారు. వెళ్లేప్పుడు, సుబ్బన్నగారు అందరిదగ్గరా మామూలుగానే సెలవు తీసుకున్నారు. అట్లాగే, సోమన్నతోకూడా, “సోమన్నగారు, వెళ్ళొస్తా.” అన్నారు గంభీరంగా.

సోమన్న నిచ్చెనమెట్లు దిగుతూన్న ఆయనవంక వింతగా చూస్తూ తలవూపాడు. తర్వాత పదిహేనునిమిషాలు నిశ్శబ్దంగా నిలబడిపోయాడు. సుబ్బన్నగారిచూపులు అతనిహృదయాన్ని తీవ్రంగా కలిచివేసినట్టుంది అతనికి.

## 3

ఆతర్వాతకూడా ఇతరులు ఆశ్చర్యపడేట్టుగా కొన్ని సంఘటనలు జరిగాయి. ఆటెన్ సోమన్న ఇంకెవ్వరిని లెక్కచెయ్యడు; ఇంకెవర్నయినాసరే వాళ్లు పెద్దా చిన్నా అనే తారతమ్యం చూడకుండానే వ్యవహరిస్తాడు. మరి సుబ్బన్నగారొచ్చి “ఏమిటి సోమన్నా!” అని కొంచెం కన్నెర్రచేస్తేచాలు స్తబ్ధుగా నిలబడిపోతాడు!

సుబ్బన్నగారు ఎంత అతనికి! ఊరివారికి, సోమన్న స్నేహబృందానికి ఇది ఆశ్చర్యం కలిగించింది. సోమన్న సుబ్బన్నగారి విషయమై ఎక్కడా ఏమీ నోరుమెదపడు; సుబ్బన్నగారూ అంతే; ఎవరైనా సోమన్నగురించి ఏమైనా అంటే, “పోనిండి రౌడీవెధవ! వాడికి దడుస్తారేమిటి!” అని హేళనగా నవ్వి ఊరుకునేవారు.

కాని మిగతావాళ్ళపరిస్థితు లంత తేలికగా లేవు. సోమన్న పలుకుబడి అలాగేవుంది అతనువెళ్లి అడగడం తరవాయి ఎన్నడూ ఎవరికి కానీ ఇవ్వని లుబ్ధులుగూడా పదీ పరకా మారుమాట్లాడకుండా ఇచ్చేస్తారు; చీట్లపేక సమాజాల్లోనూ అతని పలుకుబడి యథాప్రకారం సాగిపోతోంది.

ఒకనాడు సోమన్న నడిబజారులో ఒకాయనమీద కలియబడ్డాడు. పోలీసులొచ్చి విడదీశారు ఇద్దర్నీ. సోమన్నని స్టేషన్కి పట్టుకుపోయారు. గెంపవతిను బాగా దెబ్బతిన్నవాడుకావటంతోటి సోమన్నకి ఎలాగా ఆరునెలలయినా ఖైదు తప్పదు అని అనుకున్నారంతా.

కాని, సుబ్బన్నగారిచెవిని ఈమాట పడగానే ఆయన స్వయంగా స్టేషన్కివెళ్లి సోమన్న ‘భావిసద్వర్తన’కి తాను పూచీ పడి అతనికి జైలు తప్పించి విడిపించుకువచ్చారు. ఇంతకీ పోలీసు స్టేషన్లోగాని, బైటకు వచ్చాకగానీ ఆ ఉభయులూ ఒక్కమాటయినా మాట్లాడుకోలేదు

అదివరదాకా పోలీసుల్నిగూడా ధిక్కరిస్తూ — హుంకరిస్తున్న సోమన్న చప్పున చల్లబడి సుబ్బన్నగారితోటి బైటికి వచ్చేశాడు. పోలీసుస్టేషన్లో ఇన్స్పెక్టర్ గూడా ఆశ్చర్యపోయినాడు; ఏమిటిది? సుబ్బన్నగారంటే సోమన్నకి భయమా? గౌరవమా?

మరి సుబ్బన్నగారికి సోమన్న అంటే ప్రేమ ఎందుకో?

ఇన్నిప్రశ్నలూ సోమన్న తన ఉంపుడుగత్తెను ఖూనీచేసి పారిపోయినప్పుడు పోలీసులకి కలిగాయి. అందుచేతనే ఇన్స్పెక్టర్ గారు సుబ్బన్నగార్ని కలుసుకొని సోమన్నగారెక్కడవుంటాడో అని అడిగి వెళ్ళారు. ‘సద్వర్తన’కు పూచీ అంటే మరి!

ఇన్స్పెక్టర్ సదాశివరావుగారు మర్నాడు సుబ్బన్నగారింటికివచ్చి “సోమన్న దొరికేవరకు మిమ్మల్ని...” అన్నాడు. సుబ్బన్నగారు ‘సరే’ అని బయల్దేరారు మారుమాట్లాడకుండా. దీని అర్థమేమిటో తెలిసిన ఆయనభార్యా ఇద్దరుకూతుర్లూ లోలోపల కుమిలిపోతున్నారు. సోమన్న దొరక్కపోతే! వాడు పరమదుర్మా

గ్గుడు; ఏమైనా చెయ్యగలవాడికి సాహసుడు. అతనికి ‘సద్వర్తన’కి ఈయన పూచీపడడమేమిటి!...వాళ్ల దైవాన్ని ప్రార్థిస్తూండడం తప్ప వేరే గత్యంతరం లేకపోయింది.

ఈ సంఘటనను గురించి ఊళ్లోనూ రకరకాల ఊహాలు వ్యాపించాయి. ఇలా ఒక మాట అనుకుంటున్నారు. "ఇంక సోమన్న కనపడతాడురా! ఒట్టి మాట" అన్నా రందరూ ఏక గ్రీవంగా.

"సుబ్బన్న గారి కెందుకొచ్చింది ఆ రౌడీ వెధవతోటి! వా డెవడూ, ఈయన ఎవరూ? పరువుగా బతికేవాడల్లా ఇదొక గండం తెచ్చిపెట్టుకున్నాడు చెత్తకి" అన్నారు సుబ్బన్న గార్ని ఎరుగున్న వాళ్లు.

అయితే సుబ్బన్న గారు మాత్రం నోరు మెదపలేదు; జైల్లో అధికార్లు ఏమేమో ప్రశ్నలు వేశారు; వేటికీన్నీ ఆయన జవాబివ్వనే లేదు.

రెండు రోజులు జరిగిపోయినాయి. సోమన్న జాడ పోలీసుల కేమీ అంతు పట్టలేదు.

## 4

మూడో రోజు మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతాల సోమన్న స్టేషన్‌దగ్గిర ప్రత్యక్షమైనాడు. సరాసరి హాలిందాగా లోపలికి నడిచివచ్చిన అతణ్ణి చూసి ఇన్స్పెక్టర్ గారు చకితు డైనాడు. పక్కనే నిలబడివున్న పోలీసు తుపాకి గురి చేసుకున్నాడు కూడా. కాని సోమన్న "ఏం ఇన్స్పెక్టర్ గారు! సుబ్బన్న గార్ని ఖైదులో పెట్టారట, నాకు బదులు! నాకిందాక తెలిసింది. ఆయన్ని వొదిలెయ్యండి. ఇదిగో నే వొచ్చాగా!" అన్నాడు, ధైర్యంగా రెండు చేతులూ చాచి.

ఇన్స్పెక్టర్ అతని చేతులకి ‘పోలీసు కంకణాలు’ తగిలించి, "మరి నీకు ఆయన జామీన్ ఉన్నాడుగదూ?" అన్నాడు.

"ముందు ఆయన్ని వొదలండి" అని అరిచాడు సోమన్న ఉద్రేకంతోటి.

"మరెందుకు పారిపోయావు రెండు రోజులనించిన్నీ?" అంటూ ఇన్స్పెక్టర్ సుబ్బన్న గార్ని వొదలటానికి కావల్సిన ఉత్తర్వులు జారీచేశాడు.

ఇంతకీ ఇన్స్పెక్టర్ గారికి ఈ విచిత్రం అర్థం కాలేదు. సుబ్బన్న గారిని విడిపించటంలో సోమన్న కింత ఆసక్తేమిటి?

పది నిమిషాలలో సుబ్బన్న గారు బైటకొచ్చారు. ఆయన మొహం తేటగా లేదు. తీవ్రమైన బాధతోటి ఎర్రబారి వుంది. సోమన్న ఆయన వొస్తూవుంటే తలొంచుకున్నాడు. సుబ్బన్న గారు, చెరోపక్కనా పోలీసులతోటి మధ్యని నిలబడ్డ సోమన్నని చూడగానే ఉద్రేకం పట్టలేక "ఏం బతుకురా నీది! సోమన్నా! చివరికి ఖూనీకోరువి కూడా ఐనావు!" అన్నారు అతనిదగ్గిరగా వొచ్చి నిలబడి.

సోమన్నని ఇంకెవరన్నా ఈ మాటలే అంటే చేతినున్న సంకెలతోటే అవతలవాడిమీదకి దుంకేసివుండేవాడు. ఇప్పుడతను తల వొంచుకుని ఏమిన్నీ మాట్లాడలేదు. ఒకటి రెండు నిముషాలైనాక చాలా మెల్లిగా, గొణుగుతూగా, "నా బతుకే అంత! మీరిప్పుడు విచారించి లాభంలేదు" అన్నాడు విరక్తిగా.

సుబ్బన్న గారు, "సిగ్గులేకపోతే సరి, ఇంకా మాట్లాడుతున్నావు గాని! నోరు మూసుకో" అని అతన్ని కసిరి, ఇన్స్పెక్టర్ వేపు తిరిగి, "నేను వెళ్ళొస్తానండి" అని వెళ్ళిపోయినారు. ఆయన వెళ్ళటాన్నిబట్టి ఆయన హృదయవేదన ఎంతగా ఆయన్ని బాధిస్తోందీ ఇన్స్పెక్టర్‌కి బోధపడింది.

సుబ్బన్న గారు వెళ్లాక సోమన్నని ఇన్స్పెక్టర్ గారు ప్రశ్నించాడు. "సుబ్బన్న గారికీ నీకూ ఏమిటి పరిచయం!" అని.

సోమన్న యథాప్రకారం గంభీరంగానే "ఏమీ లేదు సుబ్బన్న గారు సుబ్బన్న గారే; నేను నేనే. అంతకుమించి నేను చెప్పేదేమీ లేదు" అన్నాడు.

మర్నాటినుంచీ ఖూనీకేసు విచారణ ప్రారంభమైంది.

విచారణ జరిగినంతకాలమూ సుబ్బన్న గారు కోర్టుకి వస్తూనే వున్నారు. అయితే నేరం స్పష్టంగా వుండడంవల్లనూ, సోమన్న తాను ‘నేరస్థుణ్ణి’ అని ఒప్పుకోవడంవల్లనూ ప్రాసిక్యూషన్ వారిపని తేలికయింది; సుబ్బన్న గారు సోమన్న తరఫున ఏదైనా వాదించి ప్రయోజనం లేదని మౌనంగా వూరుకున్నారు.

తీర్పు చెప్పేరోజు; ఆనాడు కోర్టుకి సోమన్న స్నేహితులు చాలామంది వచ్చారు. సుబ్బన్న గారూ ఆయన భార్యా కూడా ఇద్దరూ వచ్చారు. సోమన్న యథాప్రకారమే పోలీసుల మధ్య చాలా నిర్లక్ష్యంగా నిలబడివున్నాడు. సుబ్బన్న గారి మొహాన దిగులు వెల్లాడుతోంది స్పష్టంగా.

అందరికీ తెలుసు సోమన్నకి విధించబొయ్యే శిక్ష ఏమిటో.

జడ్జీ, "సోమన్న ఖూనీ చేసినట్టుగా దొరికిన సాక్ష్యం ఒక దర్వారపు ముసల్ది. మేమీ కేసులో నిజాన్ని గురించి చాలా తర్కించాము. సోమన్నే ఒప్పుకుంటున్నాడు గదా అని ప్రాసిక్యూషన్ వారి వాదన. అంతకంటే సోమన్నను అపరాధిగా నిరూపించటానికి వేరే సాక్ష్యాధారా లేమీ లేవు; అయితే సోమన్నె తాను దోషిని కాదని నిరూపించుకోలేదు. కనుక నేరస్థునిగానే భావించి, సరిగ్గా నిరూపణ కాలేదు గనక, తక్కువ శిక్ష విధిస్తున్నాను" అని ముగించారు తన తీర్పు.

సోమన్నని తిరిగి తీసుకెళ్లుతూవుంటే సుబ్బన్న గారు ఒకటి రెండు నిమిషాలు నిలబడి మాట్లాడాలని ప్రయత్నించారు; సోమన్న కూడా ఆయనవంక చూశాడు ఏమైనా మాట్లాడుతారని. చివరికి ఆయన ఏమీ మాట్లాడకపోయేసరికి, "నేను ఖూనీకోరుని. మీరు మర్యాదస్థులు, నాతో మాట్లాడకండి!..." అన్నాడు. అతని కళ్లల్లో నీళ్లు నిండివున్నాయి. గొంతు తడారిపోయింది. ఎప్పుడూ తల ఎత్తుకుని గర్వంగా తిరిగే అతని తల వాలిపోయింది.

FOR ANYTHING IN *Jewellery*

శ్రేష్ఠమైన పనితనమే
ప్రత్యేకత.

*Vummidi*
RAMIAH CHETTY, GURUSWAMY CHETTY & CO., *Jewellers*

---

Tel: "PRESUNDRY" Phone: 3519

## K. ORR & COMPANY,

**40, Chinnathambi Street,**
**MADRAS-1**



## Reliable Indenting House

- ★ **For all Kinds of Papers**
- ★ **Process Chemicals,**
- ★ **Printing Machinery**

**Stockist of Printing Inks & other allied sundries**

---

# ఏరో

పెన్

తక్కువ ధరకు
మంచికలము

ప్రకాశ్ పెన్ కంపెనీ, కాన్పూర్

సుబ్బన్నగారికి ఈ మాటలు గుండెలకి తగిలి బాధించాయి. ఆయన అక్కడ గుమిగూడివున్న జనాన్ని సైతం మర్చిపోయి సోమన్నని ఆసాంతం కౌగిలించుకున్నారు. "సోమన్నా, నిన్నీ గతికి తెచ్చింది నేనే. తప్పు నాది...ఫలితం నువ్వు అనుభవిస్తున్నావు!" అని గాఢమైన కంఠంతోటి విలపించారు.

అక్కడ నుంచున్న వారందరినీ ఈ దృశ్యం కదిలించింది. అయితే ఎవరికీ ఏమీ అర్థమైందికాదు. సోమన్న సుబ్బన్నగారి ప్రేమపూర్వకమైన ఆలింగనంలో మైమరిచిపోయినాడు; తరవాత అతన్ని పోలీసులు తీసుకెళ్లిపోయారు. పోతూ పోతూ సోమన్న తిరిగి చూసిన రెండు మూడు చూపులు సుబ్బన్నగార్ని మరింతగా బాధించాయి.

కొందరు మిత్రులు సుబ్బన్నగార్ని ఇంటిదాకా తీసుకొచ్చి వదిలిపెట్టారు. అందులో సుబ్బన్నగారికి బాగా స్నేహంగావున్న ఒకరు, "సోమన్న ఎవరూ! మీకేమిటంత సానుభూతి" అని మామూలుగా ప్రశ్నించారు.

సుబ్బన్నగారు, చెప్పేస్తేగాని నా మనస్సులో భారం తీరేట్టు కన్పించలేదు..." అని ప్రారంభించారు.

## 5

మా నాన్నకి మొదటి సంబంధం కొడుకును నేను; మా అమ్మకి నేనొక్కడ్నే. మా అమ్మ పోయాక నాన్న రెండో పెళ్లి చేసుకున్నారు. అప్పటికి నాకు పది పన్నెండేళ్లుంటాయి మా పిన్ని మంచిది. అందరూ అనుకున్నట్టుగా ఆమె నన్ను ఏమీ బాధ పెట్టేది కాదు; పైగా సొంతకొడుకును చూసినట్టు చూసుకునేది; అయితే ఆమె గర్భవతి ఐందగ్గరనించీ పరిస్థితి మారింది; ఆమెలో మార్పుకి కారణం నాకు మొదట అగమ్యంగా వున్నా, రానురాను బోధపడింది రహస్యం.

అప్పట్నించి పిన్నమ్మ ప్రవర్తనలోనూ మార్పువొచ్చింది. నాలోనూ చెప్పలేని ద్వేషం పెరిగింది. ఆ ద్వేషం, పిన్నిమీద కొంతగానూ, పిన్నికి కలిగిన శిశువుమీద మరింతగానూ రగుల్కొంది.

దీనికి దోహదమిస్తున్నట్టు నాన్నగూడా నా తమ్ముడిమీద ఎక్కువగా ప్రేమాభిమానాలు ప్రదర్శించసాగారు. అది సహజం అనే ఆలోచన పన్నెండేళ్ల కుర్రవాణ్ణయిన నాకు బొత్తిగా కలగలేదు; 'పాపాయి, పాపాయి' అని నాన్నా పిన్నీ 'వాడికే' అన్ని అవకాశాలూ కల్పిస్తుండేవారు. ఇదివరలో నే అడిగిందే తరవాయి అన్నీ వొచ్చేపరిస్థితి మారిపోయి, నన్నాయింట్లో పలకరించే దిక్కులేనట్టుగా ఐపోయింది. పైగా అయిందానికీ కానిదానికీ పిన్ని నన్ను దండిస్తూవుండేది. నాలో రగులుతున్న ప్రతీకారాగ్నిని కుర్రవాడిపైన చూపించేవాడిని. ఆ లేత తడికలు వాణ్ణి ఎవరూ లేకుండా చూసి కొట్టేవాణ్ణి; గిచ్చేవాణ్ణి... మొత్తంమీద నాలో నా తమ్ముడిమీద ఒక ద్వేషభావం స్థిరతనంతో పాతుకుపోయింది...

కాలం ఆగదుగదా! కొంత కాలానికి నాన్న పోయారు; ఇంటిపెత్తనం నా కొచ్చింది. నాకు పెళ్ళయి భార్య కాపరాని కొచ్చింది. పిన్నిగూడా ఒకనాడు—ఎన్నాళ్ళనించో ఆమెని బాధిస్తూవుండిన ఉబ్బసవు వ్యాధికి బలి ఐపోయింది. ఆమె చనిపోతూ పది హేనేళ్ళ—తన కొడుకుని నాకు అప్పగించివెళ్లింది. "నేను ఉన్నానుగా" అన్నాను పిన్నితో. కాని ఆ చిన్నప్పటి కసి నన్నొదిలిపోలేదనే చెప్పాలి...

బాగా తల్లిదండ్రి గారాబంతో పెరిగిన నా తమ్ముడు 'తల్లిదండ్రీ' లేనివాడు పాపం, అని ఊళ్లోవాళ్ళు, ఇరుగూ పొరుగూ జోకొట్టటంతోటి మరింత బిగిసి నామాట ఖాతరు చేసేవాడు కాడు. ఎప్పుడూ ఊళ్లో పిల్లలతోటి పోట్లాడి వచ్చేవాడు. న్యాయం ఎవరివైపునవున్నా నేనుమాత్రం ఎప్పుడూ నా తమ్ముణ్ణే బాదేవాణ్ణి. ఇంకో విశేషం ఏమంటే, వాడు ఎంత నామాట ఖాతరు చెయ్యకపోయినా, నేను గనక కన్నెర్రచేస్తే సరి, నోరెత్తేవాడు గాదు. నేనంటే లోపల ఏమనుకునేవాడో ఏమోగాని పైకి చాలా గౌరవం చూపేవాడు.

"నా భార్య అతన్ని ప్రేమగా చూసేది. చాలా తడవలు వాణ్ణి సహించలేక 'వీడికి కూడుపెట్టక" అని నేను ఆజ్ఞపెట్టినా వినక దొంగతనంగా అన్నం పెట్టేది.

వాడికి పెళ్ళీడు వొచ్చింది. వాడి భాగం వాడికి పంచి ఇచ్చి పెళ్ళిచేసి పంపిస్తే సరిపోతుందని మా కుటుంబానికి చెందిన పెద్దలు నాకు సూచిస్తూవచ్చారు. కాని నా పరిస్థితి తలకిందులుగావుంది. నాన్నగారు మా ఉభయులకీ ఉంచిన ఆస్తిలో కొంత భాగం నేను దుర్వ్యసనాలకింద వ్యయపరిచివున్నాను; ఇప్పుడు నా తమ్ముడికి నేను గనక ఆస్తి పంచాల్సివొస్తే—నాకు మిగిలేది స్వల్పం... నాలో ఆదినుండీ తమ్ముడంటే వున్న ద్వేషం తిరిగి వొకసారి ప్రజ్వలించింది. ఇప్పు డెలాగైనా వాడికి ఈ ఆస్తి పంచివ్వకుండా చేయగలిగితే...అని నేను ఆలోచించసాగాను.

దీనికి తగ్గట్టే వొకనాడు, నా తమ్ముడు, ఊళ్లోవున్న మంచి నీటి బావిదగ్గర ఒక అమ్మాయిని ఏదో అన్నాడని వాళ్ళవాళ్ళు వొచ్చి గోలచేశారు నా ఇంటిముందు. ఆరాత్రి వాడు, భయపడుతూనే నేను నిద్రపోయివుంటానని భావించి ఆలస్యంగానే వొచ్చాడు ఇంటికి. నేను నా వేళకటికైనా రానీ, ఇవ్వాళ అటో ఇటో తేల్చుకోవాలని కూర్చునివున్నాను.

వాడు లోపలికి రావటంతోటి "ఏరా, ఏం రానురాను ముదిరిపోతోంది వ్యవహారం! నేనేమైనా మర్యాదగా తలెత్తుకుని నలుగుర్లో తిరగాల్నా అక్కరలేదా!" అన్నానే కోపంతోటి మండిపోతూ. వాడేమీ నోరెత్తలేదు; వాడికి ఇరవైఏళ్లున్నాయని అయినా ఆలోచించక నోటికొచ్చినట్టు దుర్భాషలాడాను; ఆ పక్కనేవున్న కనికర్ర తీసుకుని గొడ్డును బాదినట్టు బాదాను. నా భార్య అడ్డంవస్తే దాన్నీ బాదాను.

'ఆ వేళ వాడు, వొళ్ళు ఏర్పడు బలహీనంగా అంటుకున్నాను. ఆగ్రహాన్ని తమాయించుకున్నాను. నేను తప్పు, నాకు

ధార్మిక సిద్ధాంతాలకుగాని ప్రాముఖ్యం ఇవ్వలేను. అలంకారికులు మానవహృదయంలో కొన్ని స్థాయిభావాలున్నాయనీ ఇవి కావ్యాస్వాద సమయంలో ఆయా విభావానుభావాదులవల్ల రసస్వరూపంలో అభివ్యక్తి పొందుతున్నాయనీ దీనివల్ల కావ్యానందం కలుగుతున్నదనీ ప్రతిపాదించారు. భరతుని కాలం మొదలు కొని జగన్నాథ పండితరాయల కాలంవరకు అభివృద్ధిపొందిన అలంకార శాస్త్ర చర్చ అంతా ఈ సూత్రంలో ఇమిడి ఉన్నది.

భరతుని నాట్యశాస్త్రంలో కేవలం రసదృష్టితప్ప మిగిలిన తాత్త్వికసిద్ధాంతాల ప్రసక్తి ఏమీ కనిపించదు. ఆతరవాత వచ్చిన అలంకారికులుకూడా ఈ రససిద్ధాంతానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు.

అయితే అభినవగుప్తుడు, జగన్నాథ పండితరాయలు మొదలైన అలంకారికులు కొందరు అలంకార శాస్త్రసిద్ధాంతాలలో మన వేదాంతసిద్ధాంతా లంతర్గర్భితంగా ఉన్నాయని ప్రతిపాదించారు. కాని వీరుకూడా తమ రసచర్చల్లో తమ తాత్త్వికసిద్ధాంతాల కేమీ ప్రాధాన్యం ఇవ్వలేదు. నిజానికి అలంకారికులందరు రసోల్లసితమైన కావ్యానంద మొక్కటే కావ్యలక్ష్యమని ముక్తకంఠంతో ప్రతిపాదించారు. కావ్యంలో రమ్యములు, అరమ్యములు, జుగుప్సితములు మొదలైన కావ్యవస్తువులన్నీ కవిభావుక భావనలో రససిద్ధి పొందుతున్నాయని ప్రతిపాదించారు. ఈ క్రింది శ్లోకం దీనికి తార్కాణం.

"రమ్యం జుగుప్సిత
ముదార మథాపి నీచమ్
ఉగ్రం ప్రసాది గహనం
వికృతం చ వస్తు
యద్వాప్యవస్తు
కవిభావుక భావ్యమానం
తన్నాస్తి యన్న
రసభావముపైతి లోకే"

ఆలంకారికు లించుమించుగా రెండు వేలేళ్ళనించీ సాగించిన కావ్యచర్చలో కేవలం రసం (*Aesthetic joy*) ఒక్కటే కావ్యలక్ష్యమని సిద్ధాంతీకరించారు. ఆ కాలంలో ఆయా తాత్త్విక సిద్ధాంతాల విషయంలో తీవ్రమైన వాదోపవాదాలు గాని, అభినివేశాలు గాని చెలరేగలేదని చెప్పలేము. నిరీశ్వరవాదము, అనాత్మవాదము, భౌతికవాదము మొదలైన వాదా లారోజుల్లో కూడా ఉన్నాయి. కాని ఆరోజుల్లో కావ్యతత్త్వజ్ఞు లీవాదాల అభినివేశాల్లో పడి సాహిత్యలక్ష్యం విస్మరించలేదు. వారందరు లౌకిక ప్రయోజనాలకంటె అలౌకికమైన కావ్యరసాస్వాదమే కావ్యలక్ష్యమని ముక్తకంఠంతో ఉద్ఘోషించారు.

పైగా ధార్మికప్రచారాదులే కావ్యలక్ష్య మన్నవారిని తీవ్రంగా నిరసించారు. ఈ క్రింది శ్లోకంలో ఈ నిరసన స్పష్టంగా వినిపిస్తున్నది.

"ఆనంద నిష్యందిషు రూపకేషు
వ్యుత్పత్తి మాత్రం ఫలమల్పబుద్ధిః
యోఽపీతిహాసాది వదాహ సాధుః
తస్మై నమః స్వాదు పరాఙ్ముఖాయ"

—దశరూపకము.

ఇది రూపక లక్ష్య వివరణంలో రచించిన శ్లోకము. రూపకాదులవల్ల ఆనందనిష్యందము కలుగుతున్నదనీ, ఇతిహాసాదులలో లాగ వీటిల్లో వ్యుత్పత్తి మాత్రమే (ధర్మాది జ్ఞానమే) ఫలితమని నిర్వచించేవారు మందబుద్ధులనీ, వీరందరు రసాస్వాద పరాఙ్ముఖులనీ ఇటువంటి వారికొక నమస్కారమనీ దీని తాత్పర్యము. దశరూపకంలో రూపక నిర్వచన సందర్భంలో రచించిన ఈ శ్లోకం మొత్తం కావ్యాలన్నింటికీ సమన్వయించేదే. ఇలాంటి శ్లోకా లలంకార గ్రంథాలలో చాలాచోట్ల కనిపిస్తున్నాయి.

ఆలంకారికు లీ కావ్యానందం ఆధ్యాత్మికమైన బ్రహ్మానందంతో సదృశమైనదనీ ఇతరములైన లౌకికానందా లన్నింటికన్నా ఇది ఉత్కృష్టమైనదనీ ప్రతిపాదించారు. దీనివల్లనే మన సంప్రదాయంలో రసాస్వాదనకు కావ్యరచనకు అనితర సాధారణమైన అర్హగౌరవం లభించింది. "నానృషిః కురుతే కావ్యం" అన్న ప్రాచీన సూక్తిలోకూడా ఈ అర్థమే స్ఫురిస్తున్నది.

రసానందం ఆధ్యాత్మికపరిణతికొక సాధనమనీ మానవపరిణతికి ఇది ఒక మహోత్తమసాధనమనీ అరవిందుని సాహిత్యవిమర్శన ప్రతిపాదిస్తున్నది. ఆలంకారికు లింత స్పష్టంగా ఈ విషయం నిర్వచించి ఉండకపోవచ్చును. కాని వస్తుతః అరవిందుని నిర్వచనానికీ ఆలంకారికులనిర్వచనానికీ అంతగా భేదమేమీ లేదు.

ఐ. ఎ. రిచర్డ్స్ (*I A. Rechards*) మొదలైన నేటికాలపు పాశ్చాత్యవిమర్శకులు కొందరు కావ్యానుభూతివల్ల మానవుని దైనందినజీవితంలో ప్రతిహతములైన మానసికప్రవృత్తులకన్నింటికీ సమన్వయపూర్వకమైనసమ్మేళనం ఏర్పడుతున్నదనీ ఈవిధమైన మానసికవృత్తులసమ్మేళనం మానవవికాసానికి దోహదం కల్పిస్తున్నదనీ కళలకిదే పరమప్రయోజనమనీ ప్రతిపాదిస్తున్నారు. వీరందరు సాహిత్యంలో లౌకికమైన ఉపయోగితావాదాలకు కేవలం వ్యతిరిక్తులు. చిన్నచిన్న విషయాలలో భేదాలున్నా వీరివాదం అలంకారికుల రససిద్ధాంతానికి చాలా సన్నిహితంగా ఉన్నది. సంగ్రహంగా భారతీయసాహిత్యదృక్పథం ఇది. ఇంచుమించుగా ఇరవయ్యోశతాబ్ది ప్రారంభంవరకు భారతీయవాఙ్మయంలోను ఆంధ్రవాఙ్మయంలోను ఈ దృక్పథమే ప్రాధాన్యం వహించింది. సాంప్రదాయికమైన సాహిత్యవిమర్శకూడా ఈ మార్గంలోనే నడిచింది.

నేటివరకు గడిచిన భారతీయసాహిత్యంలోను ఆంధ్రసాహిత్యంలోను ఎంతో సిద్ధాంత వైవిధ్యం కనిపిస్తున్నది.

మన ప్రాచీనసాహిత్యంలో ఈ వైవిధ్యంతోపాటు సర్వాంగసుందరమైన జీవితసమన్వయంకూడా కనిపిస్తున్నది. ఈ సమన్వయం ఇంతవరకు అవిచ్ఛిన్నంగా ప్రవహించిన మన సంస్కృతిప్రవంతి కొక ప్రత్యేకలక్షణం. దీని కనేక కారణాలు పేర్కొనవచ్చును.

## అద్వైత వేదాంత దృక్పథము

అన్నింటికన్నా ముఖ్యమైనది అద్వైత వేదాంత దృక్పథము ఇంతటి సహనశీలమైన తాత్త్విక దృక్పథం ప్రపంచంలో మరి ఏ తాత్త్వికదృక్పథంలోను కనిపించడంలేదు సర్వతాత్త్విక సిద్ధాంత సమన్వయమే దీనిలక్ష్యం. ఇందువల్లనే మన దేశంలోని నిరీశ్వరవాదము, అనాత్మవాదము మొదలైన అసాంప్రదాయిక వాదాలెన్నెన్నో సాంప్రదాయిక వాదాలతోపాటు సమాన గౌరవప్రపత్తులతో వర్ధిల్లాయి. అద్వైత వేదాంతం పునాదులమీద అవిర్భవించిన మన మతవిశ్వాసాలలో ఉన్న సహనశీలత ఇతర మత విశ్వాసాలలో కనిపించడంలేదని తత్త్వజ్ఞు లనేకులు ప్రత్యేకంగా ప్రశంసించారు. నిజంగా నేటికాలపు ప్రజాస్వామ్య సిద్ధాంతాలుకూడా అందుకోలేని ఉదాత్తప్రజాస్వామ్యలక్ష్య మీ అద్వైతవేదాంతంలో కనిపిస్తున్నాయి.

కాని, ఇటీవల సాహిత్యవేదికలో విమర్శకులు కొందరు అద్వైతసిద్ధాంతాలు నియంతృత్వానికి దారితీస్తాయని వ్రాశారు. ఇది కేవలం నిరాధారమైన నిందారోపణ! ఈ వేదాంతాన్ని గురించి సమగ్రపరిశీలన లేకపోవడంవల్లనే ఇటువంటి అపోహలు బయలేరుతున్నాయి. అయినా ఈ వ్యాసానికిది అప్రస్తుతం. కనక ఇది ఇంతటితో విడిచివేస్తున్నాము

విశ్వజనీనమైన అద్వైత వేదాంత దృక్పథం అంతర్లీనమై ప్రవహించడంవల్లనే భిన్నభిన్న దృక్పథాలున్నా మన సాహిత్య ప్రవంతి నేటివరకు అపూర్వమైన సమన్వయ సౌందర్యంతో ప్రవహించింది.

## నేటికాలపు వాఙ్మయ పరిస్థితి

అయితే 20 వ శతాబ్ది ప్రవేశించినకొద్దీ రచయితలలోను, రచనలలోను సాంప్రదాయికంగా వస్తున్న ఈదృక్పథం బాగా సన్నగిల్లిపోయింది. రచయితల ప్రాథమిక విశ్వాసాలలో పరస్పర విభేదాలు పెచ్చు పెరిగిపోయాయి. దీనికి విదేశ తాత్త్విక సిద్ధాంతాలు, సాహిత్యధోరణులు చాలావరకు కారణమని చెప్పవచ్చును. చాలామంది రచయితలలో లుప్తప్రాయమైపోతున్న సంస్కృతాంధ్ర సాహిత్య విజ్ఞానంకూడా దీనికొక ముఖ్యకారణంగా పేర్కొనవచ్చును.

ఇదిగాక నానాటికీ పెరిగిపోతున్న సాంఘిక ఆర్థికసమస్యలు, వీటివల్ల బయలుదేరుతున్న విప్లవధోరణులు, కొంతవరకీభిన్న భిన్న విశ్వాసా లేర్పడానికి ప్రధాన కారణాలని చెప్పవచ్చును

ఆ యీ కారణాలవల్లనే నేటి రచయితలలో కేవలం పరస్పర విరుద్ధమైన విశ్వా లావిర్భవిస్తున్నాయి ఏ యిద్దరు రచయితలను తీసుకున్నా ప్రధాన సిద్ధాంతాలలో ఐకమత్యమున్నవారు చాలా అరుదుగా కనిపిస్తున్నారు

ఈ పరిస్థితిలో రచయితల గురుతర బాధ్యతనుగురించి తీవ్రమైన వాదోపవాదాలు చెలరేగడంలో ఆశ్చర్యమేమీ లేదు. విజానికీవాదం కేవలం సాహిత్యదృక్పథంతో జరగవలసిన అవసరమేమీ కనిపించదు వస్తుతః ఈ వాదంలో కమ్యూనిజమే ప్రధానసమస్య ఈ సమస్య సాహిత్యంతో సమన్వయించడంవల్ల వాకోప వాదాలలో కొంత సందిగ్ధస్థితి కూడా ఏర్పడింది నేటి మన సమాజానికి కమ్యూనిజం ఆవశ్యకతను గురించి, కమ్యూనిజం స్వభావ దృక్పథాలనుగురించి ఈ వాదోపవాదాలు జరిగితుం డవలసింది. ఏది ఏమైనా ఈ వాదోపవాదాలవల్ల పాఠకులలో ఒక అపూర్వ చైతన్యం బయలుదేరిన మాట వాస్తవం

## సాహిత్యము - సాంఘిక సమస్యలు

ఒకసంఘంలో ఉద్భవించిన సారస్వతమేది ఆ సంఘ సమస్యలాలోచించుకోకుండా అభివృద్ధి పొందలేదని అందరు అంగీకరిస్తారు. అయితే సాహిత్యం ఈ సమస్య లాలోచించునే ధోరణి వేరు. సాహిత్యంచూపించే సమస్యాపరిష్కారాలు, సమన్వయాలు ప్రత్యేకమైనవి. కేవల రాజకీయదృష్టితో చేసే సమస్యా పరిష్కారాలకు వీటికి చాలా భేదాలున్నాయి. సాహిత్యంలో ఈసమస్యల సమన్వయంలో ఒక విశిష్టమైన నిర్లిప్తత ఏర్పడుతుంది. ఈ నిర్లిప్తత లేని రచనలన్నీ మనం కేవలప్రచారప్రవాహంలో జమకడుతున్నాము. వీటి కేమాత్రము సాహిత్యగౌరవం ఇచ్చి ఆదరించడం లేదు. ఇది సర్వత్ర అనుభవంలో ఉన్న విషయమే. కేవలం సాంఘిక సమస్యలే సాహిత్యానికి పట్టుగొమ్మలు కావలసిన ఆవశ్యకత కూడా ఏమీ లేదు. ఉదాహరణకు ప్రకృతి సౌందర్యవర్ణన పరమైన రచనలలో ఈ సాంఘికసమస్యల ప్రసక్తి లవమైనా కనపడం లేదు. నృత్యసంగీత చిత్రలేఖనాల్లో ఇది ఇంకా స్పష్టంగా కనిపిస్తున్నది.

## ప్రజాస్వామ్య దృక్పథం

సానుభూతి, ఆర్ద్రత, కరుణ మొదలయిన ఉదాత్తదృక్పథాలవల్లనే ఉదాత్త సాహిత్యం ఆవిర్భవిస్తున్నది. ఆదికావ్యావిర్భావానికి క్రౌంచమిథున వియోగంవల్ల పెల్లుబికిన కారుణ్యమే కారణమని మన సంప్రదాయం తెలుపుతున్నది. ఇందువల్ల సహజంగానే సాహిత్యంలో ప్రజాస్వామ్యం దృక్పథం అంతర్లీనంగా ఉన్నదని చెప్పవచ్చును. కనక రచయితలందరు సహజంగా ప్రజాస్వామ్యవాదులే.

ప్రజాస్వామ్యంలోని వ్యక్తిస్వాతంత్ర్యం కళావిర్భావానికి తగినదోహదం కలిగిస్తున్నది. సిద్ధాంతదృష్ట్యా పరిశీలిస్తే ఈవిధమైన వ్యక్తిస్వాతంత్ర్యం కమ్యూనిజంవల్ల లభించడం లేదు. నియంతృత్వంలో సమష్టికున్నంతప్రాధాన్యం వ్యష్టికి లేదు. సమష్టికోసం వ్యష్టిని బలివెయ్యడంగాని, వ్యష్టి స్వార్థంకోసం సమష్టి శ్రేయానాశనంగాని మానవాభ్యున్నతికి దోహదాలు కాజాలవు. వ్యష్టి సమష్టి శ్రేయోలక్ష్యాలకు సరియైనసమ్మేళనంఉన్న సమాజాలలోనే కళలకు సహజమైనస్వాతంత్ర్యం వాతావరణం ఏర్పడగలదు. వ్యక్తి స్వాతంత్ర్యంద్వారానే ఇటువంటి సమాజస్థాపన సుకరం కాగలదని గత చరిత్ర ఋజువుపరుస్తున్నది నియంతృత్వము, ప్రజాస్వామికము పరస్పరవిరుద్ధమైనసిద్ధాంతాలు. నియంతృత్వంవల్ల ప్రజాస్వామ్యం వర్ధిల్లగలదని ప్రతిపాదించే సిద్ధాంతంలో సాధ్యసాధనవైరుధ్యం స్పష్టమే

ప్రపంచంలో క్రమక్రమంగా వ్యక్తిస్వాతంత్ర్యాలకు అవధులెక్కువైపోతున్నాయి సంఘశ్రేయోదృష్ట్యా ఈ పరిమితినిర్ణయం కొంతవరకు సహజమే. కాని సంఘక్షేమవ్యాజంతో వ్యక్తివికాసానికి అవరోధంకలిగించేధోరణు లెన్నో నేటిసమాజంలో కనిపిస్తున్నాయి. ఈ ధోరణి మనదేశంలోకూడా వృద్ధి పొందుతున్నది.

ఈవిధంగా క్రమక్రమంగా యాంత్రికమైపోతున్న నేటి సమాజంలో ప్రజాస్వామ్యానికే గొడ్డలిపెట్టుగా పరిణమించే శక్తులు వృద్ధిపొందడం సహజం. ఈ పరిస్థితిలో కళలకేగాక ప్రజాస్వామ్యానికికూడా వ్యక్తి స్వాతంత్ర్యం సంరక్షణం అత్యవసరం.

సహజంగా మన సంప్రదాయంలోనే ప్రజాస్వామ్య దృక్పథం అంతర్లీనమై ఉన్నదనీ, సాహిత్యదృష్టిలో కూడా ఈ దృక్పథం అంతర్వాహినిగా ప్రవహిస్తున్నదనీ అనుకున్నాము. ఆంధ్రదేశంలో ఇటీవల జరిగిన వాదోపవాదాలవల్లకూడా ఈ విషయమే స్పష్టపడింది. ఎవరో పది పన్నెండుగురు రచయితలు తప్ప మిగిలిన ప్రఖ్యాత రచయితలందరు ప్రజాస్వామ్యాదర్శాలవైపే నిలబడ్డారు. ఆంధ్రదేశంలో ప్రజాసామాన్యంలో కూడా ఈ విధమైన అభిప్రాయమే కనిపించింది. దీనివల్ల ప్రజాస్వామ్య శక్తులకీనా డాంధ్రదేశంలో అఖండ విజయం లభించింది. ఈ విజ

యాని కనేకమైన మహత్తర కారణాలుండవచ్చును. రచయితల ప్రజాస్వామ్యాభిమానము, చర్చలు కొంతవర కీ విషయంలో నిశితమైన జిజ్ఞాసాభిమానాలు రేకెత్తించాయి. ప్రజాస్వామ్య విజయాని కివికూడా కొంతవరకు హేతువులే అని విజ్ఞులెవరైనా అంగీకరిస్తారు.

అయితే ప్రజాస్వామ్య లక్ష్యాలకు తమ అంగీకారం తెలియజేసి నంతమాత్రాన రచయితల బాధ్యత తీరిపోలేదు. ప్రజాస్వామ్య విజయం దైనందినాచరణంలో ప్రతిబింబించేటట్లు చూడవలసిన బాధ్యతకూడా రచయితలమీద ఉన్నది. నేటి మన ప్రజాస్వామ్యం చాలావర కాదర్శరూపంలోనే నిలబడిఉన్నది. రచయితలతో బాటు రాజకీయ నాయకులుకూడా నిజాయితీతో ప్రవర్తిస్తే తప్ప దేశంలో ప్రజాస్వామ్య శక్తులు కాలూనుకుని నిలబడడం కష్టం.

ప్రజాస్వామ్య విజయానికి విద్యావ్యాప్తి, తద్వారా సజీవమైన సారస్వతాభివృద్ధి అత్యంత ముఖ్యమైనవి.

అయితే నేటి మన సారస్వతపరిస్థితి అంతగా ప్రోత్సాహకరంగా కనిపించడం లేదు. ఒక అర్ధశతాబ్ది పూర్వందాకా ఆంధ్ర దేశంలో సంపన్నులే సారస్వతాభివృద్ధికి చేయూత ఇచ్చి ప్రోత్సహించేవారు. క్రమక్రమంగా నేటి సంపన్నులలో సారస్వతాభిమానం సన్నగిల్లి, కేవలం అధికారాభినివేశము, ధనకాంక్ష ప్రబలిపోతున్నాయి. ఈపరిస్థితుల్లో సారస్వతానికిక ప్రభుత్వము, ప్రజ మాత్రమే పట్టుగొమ్మలుగా మిగిలారు. ప్రజలలో గ్రంథాల కొనుగోలు శక్తి ఇంకా బాగా వృద్ధిపొందడం లేదు.

ఇక ప్రభుత్వవర్గాల మాట. ఇంతకు పూర్వం ప్రభుత్వాధికారంలో ఉన్న నాయకు లీ విషయా లంతగా పట్టించుకోలేదు. నిజానికి వీరిలో చాలామంది కేవలం ఉపన్యాసాలలో మాత్రమే తమ సారస్వతాభిమానం ప్రకటిస్తుంటారు. వీరిలో సరియైన సాంప్రదాయిక విజ్ఞానము, సంస్కృతి తగినంతగా లేకపోవడమే దీనికి కారణం కావచ్చును.

నేటి పరిస్థితిలో ఆంధ్రదేశంలో సుస్థిరమైన ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడే అవకాశం కనిపిస్తున్నది. ఇకముందునించైనా ఆంధ్రప్రభుత్వం ఈ విషయంలో తగినంత శ్రద్ధ వహించగలదని ఆశిద్దాము.

ఇటీవల జరిగిన సాహిత్యవేదిక చర్చలలో కొందరు మన సారస్వతాభివృద్ధికి కొన్ని ముఖ్యమైన సూచనలు చేశారు. మన ప్రాచీన సారస్వతం ప్రభుత్వమే ప్రచురించి ప్రజల కందుబాటు తీసుకురావాలని ఒక రచయిత సూచించారు. ఇది ప్రభుత్వానికి సులభంగా ఆచరణసాధ్యమైన సూచన. సహకార గ్రంథ ప్రచురణ సంస్థ ఏర్పాటు చెయ్యాలనికూడా ఇంకొక సూచన వచ్చింది. ఇదికూడా బాగా సులభసాధ్యమైనదే.

గడచిన పది ఏళ్ళలోను ఆంధ్రదేశంలో ప్రముఖమైన సాహిత్య సంఘాలన్నీ నేటికి నామమాత్రంగా మిగిలి ఉన్నాయి. ఈ పరిస్థితిలో రాష్ట్రానికంతటికీ ప్రాతినిధ్యం వహించగల సాహిత్య సంస్థ ఏర్పాటుచేసి అది సక్రమమైన పద్ధతుల్లో నడిపించవలసిన అవశ్యకత ఎంతైనా ఉన్నది. రచయితలతో బాటు ప్రభుత్వము, ప్రజలుకూడా సహకరిస్తేతప్ప పై సూచన లేవీ ఆచరణలోకి వచ్చే అవకాశం కనిపించడం లేదు.

ఇటీవల కాలంలో ప్రభుత్వము, ప్రజలు అంతగా సహకరించినా సహకరించకపోయినా రచయితలే కొంతవరకు తమ రచనలకు దోహదాలు కల్పించుకున్నారు. మన పత్రికలు చాలావరకు వీరి కృషికి సహాయంచేశాయి.

కాని ఇంతమాత్రం చాలదు. సంపన్నులలో తిరిగి సాంప్రదాయికమైన సాహిత్యాభిమానము, భాషాభిమానము రేకెత్తాలి. ప్రజలలో రాజకీయాభినివేశాలతో బాటు స్వరాష్ట్రాభిమానము, భాషాసారస్వతాభిమానాలు అభివృద్ధిపొందాలి. ముఖ్యంగా ప్రజాస్వామ్యపరిరక్షణభారంవహించనున్న మన ప్రజాప్రభుత్వంమీద నిలిచిన బాధ్యత వీటి అన్నింటికన్నా గురుతరమైనది.

పై వారందరు విజయగర్వంతో విర్రవీగకుండా తమ బాధ్యతలు నిర్వర్తించగలరనీ, తద్వారా మనసారస్వతం దినదినాభివృద్ధి పొందగలదనీ రచయితల రచనాలక్ష్యం క్రమక్రమంగా ఆచరణరూపం ధరించగలదనీ ఆశిస్తున్నాను.



# శుక్రనీతి

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

౧

* ఇతఁడొక భూసురుండనుచు నెంతువొ యేమొ! ప్రమాదముండు; శ్రీ
హితమును గోరి పల్కెద మహీశ్వర! విష్ణువె వీఁడు దేవతా
తతికిఁ మేలుసేయుటె విధాయక కృత్యమటంచు నెంచు ని
ష్కృత మదిఁ జక్కఁగా నెఱుఁగఁగావలె దానముసేయ మావలన్.

౨

సురవిహితంబు పొందె దితి సూనులఁ జంపనగోరు—దేవతా
వరుని యవస్థఁ జూచి వినిపాతితులైన సురాళిఁ గాంచి యి
ద్ధర నతఁడే జనించెను ముదంబునఁ గశ్యపనందనుండుగా;
వరయుదు తెన్నగా మఱియు నాతని కిచ్చుట సర్వనాశమే.

౩

ఎఱుఁగక యిత్తునంటివి మహీశ్వర! వాఁడొక బ్రాహ్మణుండుగాఁ
జెఱచెరవచ్చి కృత్రిమపుఁ జేష్టలచే భవదీయ రాజ్య సుం
దరిఁ జెఱఁబట్టఁగాఁ దొడఁగె దానవనాథ! త్వదీయ జాతి కా
దరమును బాపుదేని నిఁక దానము గీనము మానుటొప్పగున్.

౪

మాటకు మూఁడు పాదములు మాత్రము చాలునటంచుఁ గోరె; నీ
యాటలు సాగనేరవు—దయానిధి వంచును నిన్నె తింగి పో
రాటము మాటలేకయె పరాక్రమవంతుని నిన్నుఁ బట్టి యి
ప్పాట జయింపవచ్చి; రశుభంబని దీని గణింపవో ప్రభూ!

౫

తొలుత భవద్ధితంబు గనుధోరణి నల్పముకోరె నాతఁ డా
పల జగమెల్ల నిండి యొక పాదము పెట్టెడివాఁడె సర్వ భూ
వలయమునందు లేదనఁడె త్రైఖరి తెచ్చి పరాభవింపఁగాఁ
దలఁచియు వచ్చె నింతకు వృథా శ్రమమందెదవయ్య పిమ్మటన్.

---

* [వామనుఁడు బలీంద్రునితో శుక్రుఁడన్న మాటలు]

౬

అలఁతి యలంతి కోర్కి యని యట్టె యుపేక్షవహించి దాని దు
ష్ఫలితము పొందఁబోకుము - శుభంబని దానము సేయఁబూని తూ
వల మొదలంట రూపఱుట భావ్యమె? తన్నుఁ దిరస్కరించువాఁ
డిలఁ గలఁడే మహాత్మ! యిది యిట్లని నేను వచింప న్యాయమా?

౭

గావలెఁ గాని యిత్తునంచనియుఁ గోరిక తీర్పనినాఁడు నా రకం
బైనను దానిఁ ద్రోవఁ దరమే భువి నీకును? గాన మానుమో
యనఘ! ప్రయత్నమిట్టి—దనయంబును జూపిన వ్యక్తి మానసం
బును దనియింపఁ జేయఁగల బుద్ధియు నీ కది యేల? చెప్పుమా!

౮

దానము యోగముం దపము ధర్మము కర్మము విత్తవంతుఁడై
మానవుఁ డాచరించును జుమా! యది మాని నిరర్థకంబుగాఁ
బ్రాణము సైత మీయఁగఁ బ్రయత్నము సేయుట నీకు చెల్లె; నే
డేనియు వీనికిచ్చి యిపు డెట్టులొ మోదను సాగనెట్టుమా!

౯

తనకు సమూల నాశనము తప్పని దుర్దశ పట్టునేని సె
వ్యానికిగాని మాట యొకపాటున నుండనురాదు—వాఁడు చె
ప్పిన దొకమాట చేసినది వేఱొక వంకలు పెట్టరాదు శా
సనముగఁ జెప్పి చూపినవి శాస్త్రములే యిటువంటి ధర్మముల్.

౧౦

మఱియొకమాట—దానము సుమా! యనృతంబును బల్కరాదటం
దురు గద! యందువేమొ—యిట దోసము కల్గదు నీదు ప్రాణమున్
దఱిగెడి ఘట్టమియ్యది వృథా శ్రమమేలొకొ! దానమీయఁ ద
త్తఱ పడ దేల? నామనవి దానవనాథ! వినంగ వేఁడెదన్.

౧౧

కులమును రాజ్యమున్ నిలిపి కూళలు వన్నిన వ్యూహమెల్ల ని
ష్ఫలమతి భంగపుచ్చి నిజశౌర్యము ధైర్యము దానధర్మముల్
వలసినచోటఁ జూపి బలవంతులలోఁ బ్రథితుండవై ధరా
తలమునఁ బేరుమోయుము ముదంబును బొందెదరయ్య యిందఱున్.

౧౨

అని హిత మొగ్గడించు సచివాగ్రణి శుక్రునిఁ జూచి దానవుం
డనియెను లెస్స పల్కెదు మహాత్మ! భవద్ధితమైన ధర్మమున్
గొనుటయె నాకు సంతసముఁ గూర్చునుగాని పరీక్ష సేయఁగా
మనసున కిందు మాత్ర మనుమానములోఁచె క్షమింపుమా సఖా!

---

రూపాయికి కొంటి కాని చెప్పిన వడ్డీ నిర్ణయించుకోని, రెండు తులాల రాగిడీ రెండు నెలలకి లోపాయికారీగా తాకట్టుపెట్టి 15 రూపాయలు పట్టుకెళ్లింది చంద్రంగారిదగ్గరనించి. వ్రాత కోతలు లేవు. పత్రం వ్రాయాలనంటే రెండు తులాల తాకట్టు చాల వస్తారు చంద్రంగారు. వాయిదా నాటికి సొమ్ము చెల్లించకపోతే మునుకు తాకట్టు తాకట్టని వరకు. ఇంగ్లీషు లెఖ్ఖప్రకారం రెండు నెలలూ చూచి సూరమ్మ ఎంతకూ రాకపోతే రాగిడీ అమ్మేస్తానంటాడు చంద్రంగారు. అమావాస్య వెళ్లిన దగ్గరనించీ తెలుగులెఖ్ఖ ప్రకారం రెండు నెలలూ అంచనా వేసుకుని రాగిడీ అమ్మక మున్నాదే వచ్చింది సూరమ్మ, అప్పతీర్చి వస్తువు తీసి కెడదామని. అది ఘర్షణ.

"సూరమ్మా నిన్ను నేనేమీ అన్యాయం చేయలేదు. నీకు తెలియకపోతే ఎవర్నైనా పెద్దమనుషుల్ని అడుగు వడ్డీ లెఖ్ఖ లకి ఇంగ్లీషు మాసాలు చూస్తారుగాని తెలుగు నెలలు బద్దంపు చేస్తారా ఎక్కడయినాకి అందరికీ ఒక లెఖ్ఖ నీకొక లెఖ్ఖ కడతానా! నాకయినా నిజంగా ఫాయిదాతో కలిపి అంచనా వేసు కుంటే వకటి రెండు రూపాయలు తక్కువే కిట్టాయి. నమ్మ నమ్మకపో. అవాడు గంగిగోవులా తిలపూసిన కంసాలి వీరభద్రయ్య ఇవాళ బంగారం జబ్బుదనీ మూచ్చిబంగారంకన్న నాసిగా వున్న దనీ దప్పరించాడు" అని ప్రశాంతంగా జవాబిస్తున్నాడు చంద్ర శేఖరం గారు. సూరమ్మ బుసిబుసి గుసఖాలు సాగించింది. వస్తువు ఇంట్లోనే వున్నదని ఆమెకు గట్టి నమ్మకం. కొంచెంసేపటికి పాళం ముదిరింది ఎవరి కమ్మావో ఆ అసామీనే వెళ్లి ప్రాధేయ పడతాను. ఎవరో చెప్పమని నిగ్గదీసింది. దానికి చంద్రంగారు అసలు అందకుండా పోనీ పొంచకుండా సమాధానాలు చెప్త కుంటూ పోతున్నాడు. తాకట్టు వాయిదాయింతరవాత ఎవరి కమ్మింది ఎంత కమ్మింది చెప్పాలిసిన అగత్యం తనకి లేదనీ, తన యిష్ట మెచ్చినవాళ్లికి, ఇష్ట మెచ్చినంత కమ్ముకునే హక్కు తనకి వున్న దనీ కచ్చితంగా మాట్లాడుతూ చేతిలోవున్న దస్త్రం నేలకేసి కొట్టాడు చంద్రంగారు. దానితో సూరమ్మ రెచ్చిపోయింది. ఆమైన నిప్పులు గక్కుతూ కొప్పముడి విడిపోతుంటే కారులు చారుకుంటూ శోకాలు పెడుతూ వాళ్లెరగని కోపంతో నిర్ధారణ చెయ్యడానికి వీలులేని కంఠస్వరంలో "తినవయ్యా తిను—నా సొమ్ము తినవయ్యా నువ్వు—పదిరూపాయలు చేతిలోపెట్టి రెండు తులాల బంగారం మింగస్తావటయ్యా నువ్వూ—నా వుసురు నీకు తగలకుండా పోతుందాంటే? కొంపలో మళ్లీ పెళ్లి పెటాకులూ చేసుకోబోతున్నావాయెను—పైనించీ లక్షలు కొంపమీదికి వేసు కుంటున్నా ఎంగిలిమాటికి ఎగబడతావెందుకయ్యా నువ్వు? నీ యిదావిన్ని నేనెన్నిసార్లు ఎంతవడ్డీ పొయ్యలేదు?-వక్కే ఏడిపించా లటయ్యా? నా పొట్టమీదనే కొట్టాలటయ్యా" అని రాళికకేకేస్తూ వీధినపడింది. ఇవారాలో ఇందాకా నిశ్శబ్దంగా కూర్చున్న భాస్కరం చట్రువ లేచి అటకాయించి "అట భవనా—నీకు అన్యాయం జరిగితే కోర్టులో దావా వేసుకో. అంతేగాని మాటలు మీలాతంటే లాకప్‌లో పెట్టిస్తాను జాగర్త" అని హెచ్చరిక చేశాడు.

కలిగినవాళ్లకి అన్యాయం జరిగితే ఏ కచేరీలోనో ఏ వ్యవహా రంలోనో ఎక్కడో వాళ్లకోట తొక్కి ప్రతీకారం చేస్తారు. అన్యాయంగాని దానికి ప్రతీకారంగాని జరిగినట్టు రెండో కంటి వాడికైనా తెలియదు. కాని అలగా జనానికి కించిత్తు అక్రమం జరిగిందంటే వాళ్లు ఎల్లాగూ ప్రతీకారం చెయ్యలేరు. కాని వాళ్ళకు చాతనయిందల్లా యాగీ. అది ఎంతమంది నోళ్లల్లో పడితే అంత తృప్తి వాళ్ళకి. అంచాత పనిమనిషికిగాని, పాకీదానికిగాని, బిచ్చగాడికిగాని కష్టం కలిగిందంటే వాడవాడంతా మోగిపోతుం దంతే! కాని మోగటం మటుకే!!

రాత్రి భోజనాలప్పుడు మళ్లీ ఆ ప్రస్తావన రాలేదు. భోంచేసి తీరికగా దొడ్లో చామంతి మడిదగ్గర పైరగాలికి మడతమంచాలేసు కుని ఇష్టాగోష్టిలో పడ్డారు తండ్రీ కొడుకు లిద్దరూ—భాస్కర రావు అంటున్నాడు.

"అయితే నాన్నా కొత్తక్రితం బహదూర్ మామయ్య గారింట్లో వంటపని చేశాడా నారాయణబాబు?" జమిందారు పాలంగారికి రావుబహదూరు బిరుదున్నది. ఆయన్ని బహదూర్ మామయ్య అంటాడు భాస్కరం.

"అక్కడ చేశాడో లేదో నాకు జ్ఞాపకంలేదుగాని, ఇతరత్రా వంటపనులు చేసినవాడే నారాయణబాబు—నీకూ తెలుసుగా—"

"మరి ఈ అయిశ్వర్య మెట్లా పట్టం దతనికి?"

"నారాణబాబు పాపం చిన్నతనంలో చాలా పేదరికం అనుభవించాడు. ఇప్పటి ఆ స్తిఅంతా అతని స్వహస్తాలమీద ఆర్జిం చిందే. వంటపని చేసి చేసి విసిగి అమ్మయ్య మద్రాసులోనూ, బెంగుళూరులోనూ తనకింద మనుషుల్ని పెట్టుకుని పెద్ద హోటలు హోపెన్ చేసి పికిల్ పాకింగు సేర్పాగా సాగించీ చాలా ఆర్జించా డని వినికిడి"

"పికిల్ పాపంటే?"

"అప్పట్లో అక్కడవున్న మన ఆంధ్రాస్టూడెంట్సుగట్టా పూరగాయలకి మొహంవాచిపొయ్యేవాళ్లట వాళ్లకని గోంగూర పచ్చడీ, చింతకాయపచ్చడీ, పూరగాయలూ గట్రా అన్నీ బాటిల్స్‌లో ప్యాక్ చేసి పెద్దవ్యాపారం సాగించాడీయన, ఇక్కడ కొచ్చిన పదిహేనేళ్లనించీ హోటలూ, బోర్డింగూ, లాడ్జింగూ తెరిచి పుట్ట చేరలకొద్దీ సంపాయించాడు. షుమారు పదిలక్షలదాకా వుంటుంది. చాలా మంచివాడు పాపం. అతని సత్ప్రవర్తనా, అతింహోదా, అతని దర్జా ఇవన్నీ చూస్తే ఒకప్పుడితనేనా గరిట పట్టుకుని హీనంగా బ్రతికినవాడనిపిస్తుంది."

"అయితే ఇట్లాంటి నీచమైన సమంధం చూస్తావా నాకు"

"నేనా ఈ సమంధం చూస్తా నీకు?"

భాస్కరానికి వాళ్లు తెలియటం లేదు. అసలీమధ్యలోకి మొట్ట మొదట అడుగుపెడతా తనే అన్న సంగతి మరిచిపోయాడు.

"నేను తెలిసుండే దిగా వసుకుంటున్నారా?"

"తెలియదని ఎట్లా అనుకోను—శుభ్రాల్లో పుట్టి, శుభ్రాల్లో పెరిగి మన పాటుమరిచినట్టున్న అసామీ [illegible]

సర్వే జనాః సుఖినో భవంతు.

## పండుగలు - సాంప్రదాయము

# ఎల్. జీ ఇంగువ

**ఉగాది** పండుగ దినమున తెలుగువారందరు నూతనోత్తేజముతో, నూతనోత్సాహలతో కల కల లాడుతుంటారు. ఇతరపండుగ దినములలాగే మంగళస్నానము చేయుట, క్రొత్త వస్త్రాభరణములను ధరించుట, మృష్టాన్నమును భుజించుట మొదలగు సాధారణ ఆచారములు కలిగియుండుటయేగాక, గృహములో ప్రతిఒక్కరు ప్రొద్దున వేపపువ్వు పచ్చడి తప్పనిసరిగా రుచిచూచుట, మధ్యాహ్నం పంచాంగం శ్రవణం చేయుట— ఈ రెండు ప్రత్యేక అంశములతో కూడిన సాంప్రదాయము **ఉగాది** పండుగకు సంవత్సరాల తరుబడి యున్నది.

గ్యారంటీగల న్యాణత, చక్కని సువాసన గల **ఎల్. జీ ఇంగువ** నిత్య వంటకాలలోనే గాక, పండుగ, పర్వాలకు చేయు పిండి వంటలలో వాడబడుటచే, వాటికి రుచి, వాసనలు పెంపొందించుటయేగాక, గృహములందు సంతృప్తి, ఆరోగ్యభాగ్యమును కలుగ చేయు సాంప్రదాయమును **ఎల్. జీ ఇంగువ** **60** సంవత్సరాల పైగా కలిగియున్నది.




మీరు ఎల్. జీ ఇంగువనే అడిగి మార్కుపేరు సరిచూచి పుచ్చుకొనండి

## లాల్ జీ గోదుమ్ & కో.,

**సాహుకారు పేట, మద్రాసు - 1.**

హెడ్డాఫీసు : బొంబాయి.

## ఒరిజినల్ వెజిటబుల్ హెరాయిల్

ఈ ఒరిజినల్ వెజిటబుల్ హెర్ ఆయిల్, శుద్ధిచేయబడిన నువ్వుల నూనె, శుద్ధి చేయబడిన కొబ్బరి నూనె, శ్రేష్ఠ సంబంధమైన ఆముదము వగైరాలున్నూ, అపూర్వమైన వనమూలికలతోను కలిసి తయారైనందున మీకు శాస్త్రీయమైన హెర్ టానిక్ నిజంగా




లభించినది. ఇందులో సుమనోహరమైన పరిమళము కూడా కలదు నాణ్యములో 100% గ్యారంటీ.

## దయా కాస్మెటిక్స్ (ఇండియా) లిమిటెడ్

**94, పూనమల్లి హైరోడ్డు, మద్రాసు-29.**

సువాసన ద్రవ్యములు, అలంకరణ ద్రవ్యములు, సోపులు వగైరాలు తయారుచేయువారు:-

T'grams "PUSHKALA"

## నేషనల్ ఇండియన్ లైఫ్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,

హెడ్డాఫీసు: కలకత్తా.

(స్థాపితము : 1906)

31-12-1954 వరకు వాల్యుయేషన్ ఫలితము త్వరలో రానున్నది.

భీమాచేయుటకు గాని, ప్రాతినిధ్యము వహించుటకు గాని విశ్వసనీయమైన కంపెనీ.

★

షరతులకు, వివరములకు వ్రాయండి:

**టి. నరసింహమూర్తి.**
బి. ఎ., బి. యల్.
సెక్రటరీ, మద్రాసు బ్రాంచి,
884, తంబుచెట్టివీధి,
మద్రాసు - 1.

**టి. డి. నాగేశ్వరరావు**
సెక్రటరీ, ఆంధ్రబ్రాంచి,
కెనెంట్ రోడ్డు,
బకింగ్‌హాం పేట పోస్టు,
విజయవాడ - 2.



అన్ని రకముల భీమాకు
మమ్ము సంప్రదించండి



# వాన్‌గార్డు

★ సరసమైన ప్రీమియం రేట్లు
★ పాలసీదారులకు ఆలస్యం లేని సమర్థమైన సర్వీసు
★ సరళమైన పట్టా షరతులు

**ఇవి మా సాంకేతికములు**

## వాన్‌గార్డు ఇన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్
## వాన్‌గార్డు ఫైర్ & జనరల్ ఇన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

హెడ్డాఫీసు: "వాన్‌గార్డు హౌస్"
11 & 12, సెకండ్ లైన్ బీచి, మద్రాసు-1.
ఆంధ్ర బ్రాంచి: విజయవాడ.

---

★ మీ ముద్రణాయంత్రము కొనవలసిన సమస్య ఉన్నదా?
★ మీ ముద్రణాయంత్రమునకు ఎట్టి యంత్రములుగాని చిల్లర ఉపకరణములుగాని కావలసియున్నవా?

లేక

★ ముద్రణా విషయము గురించిగాని, తత్సంబంధమైన వ్యాపారములను గురించిగాని మీరు ఏమైనా సలహా పొందగోరుచున్నారా?

**అయితే ఈ వ్యాపారమున ప్రథములమైన మమ్ము సంప్రదించండి.**

# ది స్టాండర్డు ప్రింటింగ్ మెషినరీ కంపెనీ,

12/81, శంభుదాస్‌వీధి, : : జి. టి. మద్రాసు 1.

తంతి: *PRINTMACHO*" ఫోన్: 55096.

**దిగువవాటికి మేము స్టాకిస్టులము:**

ముద్రాపకులు ఏరికోరి కొనదగినట్లు వివిధసైజులలో సుప్రసిద్ధమైన కంపెనీలచే తయారుచేయబడిన వివిధరకముల ముద్రణాయంత్రములు, ముద్రణా సంబంధమైన యంత్రపరికరములు, చిల్లర సామగ్రి, జి. పి. సిరాలు, కోలర్ కాంపోజిషన్, గాంజెస్ సిరాలు, ప్రాసెస్ ఫొటోలిథో కెమరాలు, ఎక్విప్‌మెంట్లు, రసాయనములు, వగైరా వగైరా.

**దిగువవాటిని మేము తయారుచేయుచున్నాము:**

శ్రేష్ఠమైన ప్రింటింగ్ సైజులు, గ్రాఫిక్ మెషినరీ, మా స్వంత వర్కుషాపులలో బహు తక్కువ ఖరీదుకు మా యంత్రముల రీబిల్డింగు పనులనుకూడ మేము చేయగలము.

**మీ అవసరములను తెల్పుచు ఉచితమైన మా ధరల పట్టీకొరకు వ్రాయండి.**

తెలియకుండా కూడవస్తుందనుకుంటున్నావని కలగన్నావా! పోయి అడుగు పెదకాపులనివాడ అలవాటయిన్నవాడికల్లా తెలుసు"

"ఏమిటేమిటి! పోని తెలిసే నే నంగీకరించాననుకో. నువ్వు చెప్పక్కర్లే నాకు! సమంధ పెట్టావున్నా సంప్రదాయం కావాలి కావాలని పొంగులు కొడుతూ చెప్పేనువ్వు—మంచిసంప్రదాయం గలకుటుంబమైతే చాలు పిల్లని సయితం చూడనక్కర్లేదు—కట్నం చిల్లిగవ్వయినా కాంక్షించను అని కొట్టుమిట్టాడుతూ ప్రగల్భాలు పలికే నువ్వు—అబ్బాయీ ఇది ఇట్లాంటిసమంధం అని నాతో చెప్పనక్కర్లే?"

"చెప్పలేదు. నా కత్యంతరం లేదు కాబట్టి"

"నీ కత్యంతరం లేదూ!" నువ్వు నియ్యమందుపోయేవాళ్లు కంటమనుషులయినా అడుక్కుతినేవాళ్లయినా నీకు నిమిత్తం లేదన్నమాట."

"ఆ పని ఇప్పుడు చెయ్యకుండావుంటే చాలు."

భాస్కరానికి రగులుకుంటోంది లోపల. కాని అతనికి తెలుసు చంద్రంగారు హెచ్చితే తగ్గరాడు—తగ్గితే హెచ్చుతాడు.

"అయితే మొన్న నామన్య లక్కవరంనించి ఓ సమంధం వస్తే వాడి పింతల్లి మేనల్లుడు కాలంవాడు నిడదవోలు పడవల రేవులో జంతికలమ్మాడనీ, వాడి పినతండ్రి కొడుకు చెందులూరు సంతలో కొలగారం చేసేవాడనీ, తెలుసుకొని ఆ సమంధం తిరగ్గొట్టావెందుకని?"

"వాళ్లకు డబ్బు లేదు కాబట్టి"

"అయితే డబ్బు చూచుకునే నారాయణబాబుగారి సమంధం రైటుచేశావన్నమాట!"

"ఇందులో నేను చూచుకొన్నదేమీ లేదురా అబ్బాయీ—కట్నంకూడా అంతనీ యింతనీ నేను మొరాయించలేదు"

"మాటలు కేమిలే—నారాయణబాబుకి కమల ఒక్కర్తే కూతురని తెలియదాయేం నీకు?"

"అది నాకంటే నీకే ఎక్కువ తెలిసివుండాలి మరి."

భాస్కరరావుకి కొరడాతో కొట్టినట్టయింది.

"అయితే అబ్బాయీ—ఈ ప్రశ్నలన్నీ నీకు ఎవరు నూరి పోశారురా?"—అన్నాడు చంద్రంగారు, ఇక సంభాషణ తను నడపాలన్న సంకల్పంతో.

"నువ్వనుకోవడం, మనం నారాయణబాబు డబ్బుకోసం ఎర వేసుకుని కూచున్నామనీ జరిగిన తతంగమంతా దానికోసం పన్నిన పన్నాగమేగా!"

"అందుకు సందేహమా!"

"ఇందులో నారాయణబాబు స్వార్థం ఏకోశానా లేదనే నీ ఉద్దేశం—అవునా!"

"ఆయన తప్పేముంది. కమల నిన్నంటే ఇష్టపడింది అంచేత నిన్ను కదిపాడు—నువ్వు వళె గంగిగోవులా తలూపేశావు."

"తప్పుకాదురా నాయనా—ఈమాత్రం చదువుకున్న చదువూ ఈమాత్రం ఆస్తిపాస్తులున్న సమంధమూ నారాయణబాబుగారికి రాకపోలేదు తెలుసునా! అతనూ సంప్రదాయమైన కుటుంబంలో పిల్లని పడెయ్యాలని ఎంత తాపత్రయపడ్డాడో సులభంగా అర్థమవుతుందా! నీ బుర్ర కందలేదింకా! జమీందారు బాలంగారి మేనల్లుడుగాని అతనికి నచ్చలేదు తెలుసా!"

"అందులో అతని తప్పేముంది! కంటకూట బ్రతుకు బ్రతికినా అతనికి సంప్రదాయంగల కుటుంబంలో, పిల్లని పడెయ్యాలన్న జ్ఞానం వుంది—మనమంటే గడ్డి కరవడానికి సిద్ధమయ్యాం కాని..."

"అక్కడే పొరపడుతున్నావు నాయనా—సాంప్రదాయమైన సమంధాలకోసం పాకులాడవలసిన ప్రారబ్ధం మన కేమిట్రా! ఆ సంప్రదాయం మనకుందిగా!"

"అయితే ఆ ప్రారబ్ధం నారాయణబాబుకి పట్టిందంటావు! మనకేమో డబ్బున్న...."

"మనం వెతుక్కోలేదు. కావాలని డబ్బున్న సమంధాల కోసం వెతుక్కోవడం నీచం. వెతుక్కోకుండా వాళ్ళే వచ్చినప్పుడు పెడమొహం పెట్టుకోవడం తెలివితక్కువ. పైగా ఇందులో తప్పేమిటో నాకు గోచరించడంలేదు. అతనికి కావలసిన సంప్రదాయం మన దగ్గరుంది. మనకి కావలసిన డబ్బూ దస్కం అతని దగ్గరుంది. ఈ సమంధంతో అది మనకీ, ఇది అతనికీ సంక్రమిస్తుంది. అతని డబ్బుకోసరం మనం పాకులాడుతున్నామనుకునే బదులు మన సంప్రదాయంకోసం అతను పాకులాడుతున్నాడనుకోరాదూ!"

భాస్కరరావు బి. ఏ. లో 'లాజిక్కు' తీసుకున్నాడు, కాని తర్కంలో ఈ వింతపోకడ లింకా అతని బుర్రదాకా రాలేదు. అతనికి విసుగ్గావుంది.

"ఏది ఎట్లావుండనీ—సంప్రదాయంలేని కుటుంబమని తెలిసీ కూడా డబ్బుంది కదా అని కోరటం నీచం" అన్నాడు భాస్కరం.

"అట్లాగే డబ్బు అంత లేదుగదా తొంగిరాకపోతారా అని సంప్రదాయమైన కుటుంబాలలోకి కోరబడాలని చూట్టం ఎవరికీ నీచమే. నువ్వనే నీచం ఉభయత్రావుంది. ఒరే అబ్బాయీ నీ కింకా ఈ ప్రపంచంలో విలువలు తెలియవు. డబ్బున్నవాడికి ఇవాళ కాకపోతే రేపొస్తుంది సంప్రదాయం. అయితే ఎవడో కొందరు ఆ ముద్ర వేయడానికి పూనుకోవాలి. ఆ ముద్రాధికారం ప్రథమంలో ఎవడు తీసుకుంటాడో ఎవడు తీసుకుందుకు సాహసిస్తాడో వాడికి ఐశ్వర్యం అబ్బుతుంది. అంతే. సంప్రదాయమైన కుటుంబీకుడికి సులువుగా ఆస్తులు సంక్రమించాలంటే మనం తొక్కే మార్గం—లేకపోతే దేనికి సంప్రదాయం పుట్టుకొస్తుందా!"

"అయితే సత్సంప్రదాయ మల్లా డబ్బుని ఆర్జించటానికే అంటావు!"

“డబ్బున్న వాడు సంప్రదాయం కొనుక్కుంటాడని అనుకుంటావేమో! అట్లాగే సత్సంప్రదాయమున్న సమంధం దొరకడం సామాన్యంకూడా అని నేను అందరిచెవుల్లోనూ ఇల్లుగట్టుకుని పోరడం వింటున్నావు!—”

“నీకు సాంప్రదాయ ముఖ్యంలేదన్నావుగా!”

“నా కక్కర్లేకపోవచ్చు—కాని నలుగుర్లోనూ సాంప్రదాయమంటే వుండాల్సిన విలువ పోషించుకుంటూ రావద్దూ? మన కంటూ సంప్రదాయమే ఆయెను.”

“కావుంది—సంప్రదాయానికి వుండాల్సిన విలువ వుండనే వుంది. నువ్వు పనిగట్టుకుని పోషించేదేమిటి? డబ్బులేని వాడెందుకూ కొరగాడని, డబ్బున్నవాడే గొప్పని డబ్బు విలువని శ్లాఘిస్తూ మెడలో డప్పువేసుకుని తిరిగాడా నారాయణబాబు?”

“డబ్బు విలువ బ్రతుకున్న వాడికెల్లా తెలుసు. చెప్పనక్కర్లేదు. తెలిసిందా? కాని సత్సంప్రదాయమంటే, వుండాల్సిన మోజూ, ఇయ్యాల్సిన విలువా ఎప్పటికప్పుడు నలుగురి చెవుల లోనూ గింగురుమని మోగిస్తుంటే తప్ప నిలబడి చావదు.”

“ఛ—నా కీ సమంధం అక్కర్లేదు”

అని చివ్వున లేచాడు భాస్కరరావు.

“అక్కర్లేకపోతే మానవోయి నాయినా—అక్కర్లేదనగానే నా నాయనగా అని బ్రతిమాలాడతానని గాని అనుకుంటున్నావేమో—నా కవసరం లేదు తెలిసిందా? పిల్ల రత్నంలా వుంటుంది. చదువుకున్నది — నిన్ను ప్రేమించినకన్య — నువ్వు కోరుకున్న అప్సరస. కాళ్లదగ్గరకొచ్చినసమంధం—కనకవర్షం కురుస్తుంటే గొడుగేసుకుపోతావా? ఛా—ఇందులో కలిసొచ్చేదమైనా వుంటే అది నాకుమాత్రం కాదన్న సంగతి మరోకసారి జ్ఞాపకం చేస్తున్నా. నాకు తెలుసులే—ఈ చదువుకున్న వాళ్లకి ఆశయాలనీ, ఆదర్శాలనీ మారని సరుకేంతో బుర్రలో ముసుర్తోవుంటుంది. చూపులు ఆకాశంమీదపెట్టుకున్నా నడవాలిసింది నేలమీదరా నాయనా! నేలమీద! ఇప్పుడు నిన్ను ఎలాగయినా బలవంతపెట్టి ఈ వివాహానికి దింపుతానేమోనన్న అపాయానికి ఉపాయమేమిటా అనే ఆలోచనలో పడనక్కర్లేదు. నువ్వు ఎదుర్కోవాలిసినప్రమాదమేమిటంటే—నాకక్కర్లేదనిగాని నువ్వు అనాలోచితంగా నోరు జారితివా నిన్ను కారణాలైనా అడక్కుండా వొదిలేసుకుని కూతోదానికి సర్వసిద్ధంగా ఉన్నాను. తెలిసిందా?” అని ఉపదేశపూర్వకంగా హెచ్చరించి పక్క సర్దుకున్నాడు చంద్రంగారు.

నారాయణబాబు నాలుగైదురోజులనించీ చంద్రంగారింటికి ఎడతెరిపిలేకుండా వెళ్లివస్తూవుండడం గమనించింది కమల. ఆ వేళ ఆ చెంగాదుపు ఈ చెంపకి కొడుతోవుంది. తిరిగితిరిగి యింటికొచ్చాడు నారాయణబాబు. రాగానే హాల్లో ముడతకుర్చీలో కూలబడి వుత్తరీయంతో విసురుకుంటున్నాడు. ఏదో అయోమయంగా కూచున్నట్టనిపించింది కమలకి. అతని మనస్సులోపడ్డ అగాధమేదో మొహంమీద కనిపిస్తోంది. గబగబ నాలుగు పిసుబాదంపలుకులు మిఠాయి ఉంచి గ్లాసుడు నిమ్మకాయసరబత్తుచేసి అందించింది. వట్టివేళ్ల విసనకర్రమీద కూజాలోని చల్లనినీళ్లు కసింత చిలికి పక్కన నిలబడింది. “పంకా వేయి అమ్మా” అన్నాడు నారాయణబాబు. “పంకాగాలి వేడిగా వొస్తోంది నాన్నగారూ” అని వారించింది కమల. కొంచంసేపు బడలికతీరింతరవాత “ముహూర్తం మింకా కుదరలేదా నాన్నా” అని అడిగింది కమల. తన వివాహవిషయంలో తనే కలిపించుకుని అడగట మదే మొదటిసా రామెకు.

“దానికే తడిమున్న పొడిమున్న అయోలా తిరుగుతున్నానమ్మా—చంద్రంగారు భాస్కర్రావుని అడగమంటూ లేమిటి?”

“ఆయనకా? ముహూర్త విషయంలోనా?”

“కాదు—అసలు పెళ్లివిషయమేట.”

“అదేమిటి?” ఆమె కర్థంకాలేదు.

భాస్కరరావు కింకా అభ్యంతరా లున్నయ్యా?

వెండిప్లేటులో పూరీలూ బజ్జీలూ పట్టుకొచ్చి దగ్గర పెట్టింది నాయనమ్మ. పూరి బాగా వేగినపైపు ఒక్క పిసరుతుంచి మని పంటకొరికి “సయించడం లేదమ్మా—తీసెయ్యి—” అన్నాడు నారాయణబాబు. “అదేమిటి నాయనా—పెదపాడు నుంచీ కర్పూరంలాంటి నెయ్యివచ్చింది—కన్నతల్లి కావాలని సొంతంగా చేసింది. ఇవాళ పోరాటాలు—ఒక్కటి నోట్లో వేసుకో నాయన గాదూ” అని నాన్మ సరసనే వున్న ముక్కాలిపీటమీద కూచుని లాలనచేస్తోంది. ఎంత వయస్సొచ్చినా నారాయణబాబు పసిపాపలే ఆమెకు. “మందంగా వున్నదమ్మా” అని మొహం చిట్లించాడు నారాయణబాబు.

కమల మంచినీళ్ళకని మరచెం పుచ్చుకుని

రీసింగు రూమునుని, పడకగదిలోకి పరధ్యానంగావెళ్ళి, టేబిలుమీద వున్న రంగూను పాలరాతి బుద్ధవిగ్రహం చేతికి తగిలి, ఇక్కడ కెందుకొచ్చానా అని నిలబడిపోయింది—ఆమెకు మనస్సు మనస్సులో లేదు.

అనుకున్నట్టే నారాయణబాబు భాస్కర్రావుతో మాట్లాడడానికని వొచ్చాడు. తండ్రి యింతా తనమీద రుద్దియ్యాలని చూస్తున్నట్టు గ్రహించాడతను. భాస్కరం వొకయెత్తు వెయ్యాలని చూశాడు తను ఏదో కొంత మొరటుతనంగా మాట్లాడేస్తే అతనికి మండి ఎర్రుమంటాడు దానితో తనూ తారస్థాయిలో అందుకునేడి. ఒక పెద్ద గలాటాకింద దింపేశేది. అంతేగాని అతనితో శాంతంగా వాదానికి దిగితే తనకి వొక్కపాయింటూ మిగిలిచావదు. అదీ అతని భయం.

“అయితే భాస్కర్రావూ—మీ నాన్నగారు నీ కింకా ఏదో అభ్యంతరాలూ గట్రా..”

“క్షమించండి. నాకు వుండుకున్న అభ్యంతరాలన్నీ మీ తోటి చర్చించదలచుకోలేదు నేను. సమంధం నా కక్కర్లేదని మాత్రమే మీతోటి చెప్పుతున్నాను.”

“అది సబబైనమాటే—కాదనను—ఎందుకంటే నా కక్కర్లేదని నువ్వంత నిష్కర్షగా చెబుతోన్నప్పుడు నీ కారణాలేంటని ఎదురుచూడాల్సిన అవసరం, నాకూ లేనేలేదు. అది మొదట్లో

వాళ్ళకి ఖరీదా వుండేదికాదు. అందాకా ఎందుకూ, మీ నాన్న గుమాస్తా అన్నమాటేగాని రోజూ కొట్టు తెరిచేముందు కూరా నారా కొని ఇంటో వదిలి వెళ్ళడం పిల్లలకమ్మా కొంచం నలతగా వుంటే ఆసుపత్రికి వెళ్ళి అరఖులాగటా పట్టుకురావటం వగయిరా డ్యూటీలు వుండేవి. తెచ్చిన కూరలో మురుగు వంకాయనీ, పండు కొకరనీ, చెడు దోసకాయనీ, ముళ్ళ బీరకాయనీ తీసిపారేస్తుంటే ఇంటావిడ మీ నాన్న మీద కుర్రగా వుండేది. నేను ఏరి పారేస్తున్నానని గాదు. మీ నాన్న చేసిన నిర్వాహకానికి. ఆ విలువకి కారణం లేకపోలేదు—గుమాస్తాని తొలిగిస్తే ఆ స్థానే బజారులో తొక్కితే లేస్తారు పదిమంది. వంటమనిషిని తొలిగిస్తే ఇల్లాలికి తక్షణం గరిటె చేతికొస్తుంది. మళ్ళీ వొక మనిషికోసం గాలించి పట్టుకు వేసరికి ఏడాది గిర్రున తిరిగి వస్తుంది."

వారి నీఇల్లు మాసిపోను!—పూటకి నలపనిచ్చేటట్టు లేడీయన!—మొత్తానికి రణరంగంలోకి ఈడ్చుకొచ్చాడు తనని—తను మొదట్లో అనుకున్న దేమిటి? ఇంతదూర మెట్లా వచ్చాడూ తను? లావుక్కేరు. చూడగా చూడగా ఈయనా తన తండ్రీ ఒక స్కూల్లో చదువుకున్నారేమిటే అనిపిస్తుందే! స్లేటు మార్చాడు.

"కేవలం మీరు వంటపని చేశారని కాదనుకోండి—ఆ తరవాత మీ రవలంబించిన వృత్తి అదీ......"

"అంటే హోటలు పెట్టాననా?"

"అదేలెండి అన్నం అమ్ముకునే వృత్తి."

"అన్నీ అమ్ముకోవచ్చు గాని అన్న మమ్ముకోగూడదా?"

"అన్నం పరబ్రహ్మస్వరూపం..."

"అన్నం పరబ్రహ్మమంటే ఛక్కున నవ్వే నువ్వు అన్నం పరబ్రహ్మమంటే నమ్మతావా? విద్య అమ్ముకోవచ్చా?"

"అదీ అమ్ముకోగూడదు నిజానికి—మన ప్రాచీన మహర్షుల గురుకులాల్లో......"

"అయితే స్కూలు మేష్టర్లంతా సంప్రదాయం చెడ్డవాళ్లేనా?"

"ఆ—చెడినవాళ్ళనే నా వూహ."

అయితే కాలేజిలో చేరిం తరువాత కూడా హైస్కూలు మేష్టర్లెవరయినా అవుపిస్తుంటే అతివినయంగా ఇంకా దణ్ణాలు పెడతావు దేనికని?—ఆ విద్యావిక్రేతలకి—అంతటి గౌరవానికి అర్హతలేని వాళ్లకి — ఇంతయిందుకూ? మన ప్రాణాలలో ఏది వున్నతం?

"మానం"

"ప్రాణం నిలుపుకునేందుకు తినేది అన్నం — మానం కాపాడుకునేందుకు కట్టేది బట్ట—అవునా?

"అవును"

"అయితే మరి నీ లెక్కప్రకారం అన్నమమ్ముకోవడం నీచమయితే గుడ్డ అమ్ముకోవడం నీచాతినీచమవుతుందా కాదా? మీ బజారోల్ [illegible] ఎట్లాటామువిరాదనని తెలుసునా నీకు? తెలిస్తే ఎవరివల్ల నీకేదో సాంప్రదాయం సంక్రమించిందని అనుకుంటున్నావో ఆ అసామీ కొడుకూ సాంప్రదాయం నాలుగింట మూడుపాళ్లు చెడినట్టే ఎందుకుంటావా?"

"మీవాదన విపరీతంగా వుంది. గుడ్డ అమ్ముకోవడానికీ పచ్చళ్లు అమ్ముకోవడానికీ సాపత్య మేమిటండీ?"

"నేను పచ్చళ్లని పేరుపెట్టి అమ్మకం పెట్టలేదే? ఆవకాయకి కొన్ని కొన్ని మార్పులతో "అరుణోదయ లేహ్యమని" పేరుపెట్టాను. గోంగూరపచ్చడికి పదేళాగట్టా తగిలించి రుచిలో ఒక విలక్షణత కలిపించి "బ్రెడ్ స్ప్రెడర్" అని పేరుపెట్టి బాటిల్సులో..."

"'బ్రెడ్ స్ప్రెడర్' ఏమిటి?"

దొరలు రొట్టెలమీద "ఛీజ్"లాగ, "జామ్" వాడినట్టు వుపయోగించేవాళ్లు దీన్ని—అదట్నే అంటే దొరలంతా వుటటూరుతో తినేవాళ్లు తెలుసునా? మూంబకొంవించీ, 'యూరపియనక్లొలనించీ', నాక్తేరు 'అక్‌లాండ్సునించీ', 'వెంకటూరు కన్‌టోన్‌మెంటు'నించీ, కుప్పతిప్పలుగా వొచ్చిపడే ఆర్డర్లకి తట్టుకోలేక పోయ్యేవాళ్లం."

"ఎన్ని పేర్లుపెట్టినా ఆవకాయ ఆవకాయేకదండీ? మా పెత్తండ్రిగా రచేవారులెండి."

"మీ పెత్తండ్రిగా రెక్కడున్నారిప్పుడు?"

అమ్మయ్య సంభాషణ మార్చినట్టున్నాడు. — —

"బెజవాడలో మెడికల్ స్టోర్సు పెట్టాడులెండి"

"మెడికల్ స్టోర్సా" అయితే ఆ స్టోర్సులో టానిక్కులూ ఇంజక్షన్లూ గట్రా అమ్మతారా?"

"అట్లా అడుగుతారేమిటి? పల్లెటూరి కేవయ్యలా!...మళ్ళీ ఏ చెంపనింతో దెబ్బ తీస్తున్నాడా?

"ఎందు కమ్మరూ?"

"ఓవల్టిన్ దేనితో చేస్తారో?"

"కోడిగుడ్ల సొనతోటి."

"కాడ్ లివరాయిలూ!"

"చేపనూనెతో—అది పేరులోనే వుంది."

రక్తహీనంగా వున్నవ్యక్తికి, కొన్ని ఇంజక్షన్లిస్తారు దూరాభ్యా నియూ హెపటెక్సనీ, హెపటెక్సనీ...అవి దేనితో తయారి అంటావు?"

"ఏమో నాకు తెలియదు."

లేకపోతే ఏమిటి క్రాసింగ్!

"తెలియకపోతే చెప్తా విను—అవ లేకుంటే మేకల కాలేయంతోనీ, దాని 'ఎసన్సు' 'యాంపూల్సు'గా నింపిచేసి అమ్ముతారు."

"అయితే కావచ్చును."

## కూడు గుడ్డ దొరికినంత మాత్రాన తృప్తిపడుదుమా?

## కూడు గుడ్డ సంపాదించుట కొఱకు పాపముచేస్తే ఎట్లా?

పాపము చేయకుండ కూడు గుడ్డ సంపాదించుకొను మనసు ఎట్లా కలుగును:

సిలువ మ్రాను మీద వ్రేలాడుచున్న యేసు క్రీస్తు వైపు చూచుటద్వారానే కదా?

## ఆయన సిలువతో మనమేమి చూచెదము?

1. మన దోషములనుబట్టి ఆయన నలగగొట్టబడెను.
2. మన సమాధానార్థమైన శిక్ష అనుభవించెను.
3. అతని రక్తము ప్రతిపాపము నుండి మనలను పవిత్రులనుగా చేయును.
4. తొట్రిల్లకుండ మనలను కాపాడుటకును, నిర్దోషులుగా నిలువబెట్టుటకును, శక్తిగల రక్షకుడాయెను.
5. పాపముల నిమిత్తమై సదాకాలము నిలుచు ఒక బలిని అర్పించి పరిశుద్ధపరచబడు వారిని సదాకాలమునకు సంపూర్ణులనుగా చేసియున్నాడు.



**యేసుక్రీస్తు జీవిత చరిత్ర ఉత్తర ప్రత్యుత్తరరీతి చదువుకొనుటకు నీ కిప్పుడు గొప్పతరుణము దొరికి ఉన్నది. చదువుకొన గోరుచున్నావా?**

అలాగైన రెండు అణాలు పంపుచు ఈ క్రింది అడ్రసుకు వ్రాయుము:

**[illegible] రామాయపట్టణము, నెల్లూరు జిల్లా.**

అప్పుతీసుకుని మరో పెద్దవస్తు వేదైనా తాకట్టుంచి చిన్నవస్తువు పట్టుకుపోయేవాడు..."

"అవును—ఆ బాకీ మళ్లీ వాయిదా దాటితే ఇవ్వలేకపోతే అంతకంటే పెద్దవస్తువు తాకట్టుంచేదీ—ఆఖరి పెద్దవస్తు వేదో అది మనకి దఖలు పడుతుంది. అంతే కదూ?"

వస్తువు పెద్దదిగానీ చిన్నదిగానీ వాయిదాలోపు అయితే వాళ్లదీ—వాయిదా దాటితే మనదీ చెప్పేదేముంది? డబ్బు పుష్కలంగా వున్న వాళ్లు పెద్దపెద్ద మొత్తాలు మోతుబరుల కిచ్చుకుని వాళ్ల అవసరాలు గడుపుకుంటున్నారు. నేనేమో చిన్నచిన్న మొత్తాలు సామాన్యులకిచ్చి వాళ్ల అవసరాలు గడుపుతున్నాను. ఇందులో నేను ప్రత్యేకంగా చేస్తున్న అన్యాయమేమిటని అని, అదీ నాకు పట్టుకుంట. ఇకా వంతో పెద్దపెద్ద మొత్తాలు మోతుబరులకిచ్చే షరాబా వ్యాపారస్థులే అయితే డబ్బులేని పాటకజనం ఏమై పోవాలి?"

"మనకెందుకూ? ఆ వ్యాపారం మరెవళ్లైనా చూసుకుంటారు లెమ్మా."

"ఎవరో ఏమిటి? ఇవ్వాళ ఈ వ్యాపారం మానుకున్నట్టయినా రేపు మీ బహదూర్ మామయ్య తన చేతుల్లోకి తీసుకుంటాడు దంతా. అదిగో ఆ రాజన్న ఆయనచుట్టూ తిరుగుతున్నాడు. ఆయన్ని ఏ వ్యాపారంలో దూర్చనా అని చూస్తున్నాడు, లాభ సాటి లేరయితే మా కేదివసు ఇట్లాంటి చాదస్తాలు పెట్టుకుని?"

"అసలు పెద్దపెద్ద మొత్తాలు అప్పిచ్చేవాళ్లకంటే ఎక్కువ వడ్డీలు మనమెందుకు వ్రాయించుకోవాలి?"

"వాళ్లకేమిపోయింది? ఏ తణఖాదస్తా వేసో రాయించుకుని ఇనప పెట్టెలో పారేసి కాలిమీద కాలేసుకుని, కడుపుమీద చెయ్యి వేసుకుని హాయిగా నిద్రపోతారు. మన కట్లా సాగుతుందా? తెచ్చినవస్తువు మాయబంగారమో మంచిబంగారమో చూడుకోవాలి—దానికొక నమ్మకమైన కంసాలిమీద ఆధారపడాలి. ఒక్కొక్కసారి ఆ కంసాలి అప్పుకొచ్చినవాడితో లాలోచీ అవుతాడు. ఆ తరవాత ఆ వస్తువుని ఇనప్పెట్టెలో భద్రంగావుంచి దానికి వాయిదాలోగా వరకూ బత్తెంలేని జవానులా కాపలా కాయాలి. వాళ్లకి చదువా చట్టుబండలా? అంతా అయింతరువాత 'ఒకటి చెప్పి ఒకటి రాయించావు—అప్పిచ్చిన రోజూ అది తీర్చినరోజూ రెండూ కలిపి వడ్డీ లెఖ్ఖ వేస్తావుటయ్యా?' అంటూ వ్యవహారమంతా కెలికి మొదలెడతారు. ఇందులో ఎంత బాదరబందీ వుంది? అంచాత వడ్డీ కొంచెం ఎక్కువ వేస్తాను. లక్షాధికార్లంతా లక్షలు పోగుపడకముందు ఇట్లాంటి వ్యాపారాలు చేసినవాళ్లే. లక్షలు పోగుచేసుకున్న తరువాత మాత్రం అంతా నిరసించేవాళ్లే. అయితే అబ్బాయీ—నువ్వు వెళ్లిన పని ఏమయినట్టు?"

"అయిందయింది—అన్నీ తెగతెంపులయినాయి."

"కాదు మరి? నువ్వు వెళ్లి మళ్లీ ఆయన సాంప్రదాయం పూసెత్తి వుంటావు. వాళ్లు మన సాంప్రదాయమూ, మన వ్యాపార రహస్యమూ గట్టా దుమ్మెత్తి పోసివుంటారు."

"ఇదంతా నువ్వే చేస్తా..."

"నేనా."

"అవును వాళ్ల పనిమనిషి సూరమ్మ నీదగ్గర వస్తువేదో తాకట్టుంచితే దాన్ని వాయిదా వెళ్లిన మన్నాతే తెగనమ్ముకోనా? అది వెళ్లి అక్కడ కంప్లెయింటు చెయ్యనా? కమల దానివి వినకా లేకుండా నన్ను నిగ్గదియ్యనా?"

"అమ్మ లేదులే—ఇంట్లో నేవుంది — కమలే అడిగింది? పోనీ అడిగిందేమో, అదేదో పెంకితనంగా మాట్లాడితే మా నాన్నగారికి కోపం వచ్చివుంటుంది—నేను చెప్పి దాని వస్తువు దానికిప్పించేస్తాలెమ్మని ఏదో వుదారంగా మాట్లాడి సర్దెయ్యలేకపోయినావా? నువ్వు అక్కడకూడా నన్ను సమర్థించివుంటావు అవునా? పట్టూ విడుపూ వుండవద్దూ? ఎట్లాగూ నీకు రాజసం ఎక్కువరా అబ్బాయీ—దానిమీద వ్యవహారం తెడిసికొట్టివుంటుంది."

భాస్కరానికి వుక్రోషంగా వుంది. ఎవరిని ఎందుకు ఏమనాలో అతనికి బోధపడటం లేదు. తల గిర్రున తిరుగుతుంటే కుర్చీమీద అలాగే కూచుని దీర్ఘాలోచనలో మునిగిపోయాడు.

ఎదుట దక్షిణపు గాలికి టపటప కొట్టుకుంటున్న క్యాలెండర్లో లక్స్ టాయిలెట్ సోప్ మీద రతన్ బాయి పకపకా నవ్వుతోంది!



# మాధవహేల

శ్రీ సి. నారాయణరెడ్డి

కష్టాలవలె ముసురు
కారుమబ్బుల దాటి
దుఃఖాలవలె జారు
తుహిన ధారలదాటి
పశువాంఛవలె రేగు
శిశిరానిలము దాటి
మరల నేతెంచితివ ?
మధుర మధుమాసమా!
మన్మథ ధనుర్ముక్త
మల్లికా బాణమా!

చూపుతోనే గుండె
లో పొగలు రేగించు
గ్రీష్మరాగిణి కొరకు
కేలు సాచగలేక
నవ్వుతోనే బ్రతుకు
నందు మంచులు దించు
హేమంత భామతో
జాము గడపగలేక
మోడువడిపోవు నా
లోః మోదుగుంబూల
కాగడాలెత్తిన జ
గన్మోహినివి నీవు!
రాగమాధ్వీక ధా
రా వాహినివి నీవు!

నీ పరిమళస్నిగ్ధ
నిశ్వాస లహరిలో
పొగచూరు గుండెలో
పొందామరలు పూచు.
నీ మరంద స్నాత
నీల దృక్పద్మాలతో
ఇగము పట్టిన యెడద
నిగురు మంటలు లేచు.
నీ వగ్నిశీధు పుం
జీ భూత రూపమవు!
ఈవు చల్లనిజ్వాల
తెగబోయు దీపమవు!

మావి చివురుల మేసి
మత్తిల్లు కోకిలల
చేదు గొంతుకలందు
స్వాదుగీతులు లేపి,
శిశిర విషమారుత వి
శీర్ణ వృక్షాంగనల
దిస మొలలలో హారిత
వసనాల నందించి,
వెన్నుపోటులుగాని
వినని మానవకోటి
పువుల చిరునవులతో
డ వశీకృత మొనర్చి
భువిని నందన వన
మ్ముగ మార్చు ఆమనీ!
కవి యెడద పలికించు
గంధర్వ భామిని!

---

# మన కుటీర పరిశ్రమలు

శ్రీ కామఋషి సత్యనారాయణవర్మ

## నిర్వచనము

సుమారు రెండుశతాబ్దులపూర్వమువరకూ గ్రామజీవితమునందు కుటీరపరిశ్రమలు అత్యధికప్రాముఖ్యము గలిగియుండినట్లు మనకు చరిత్రలవలన తెలియగలదు. ఒక్కొక్క తెగ ఒక్కొక్క కళ నాశ్రయించి వంశపారంపర్యముగా నా కళ నభ్యసించుటవలన వారికొక విశిష్టత యేర్పడెను. అట్టిపరిశ్రమలే వారికి జీవనోపాధులై కులవిద్యలుగా వన్నెగాంచినవి. మనుష్యునకు గల కళాకౌశలమును వ్యక్తపరచుటకు చేతిపని లోక ముఖ్యసాధనము. చేతితో రూప కల్పన గావించి ప్రదర్శించు కళాకౌశలమునే చేతిపనియని వ్యవహరింపబడుచున్నది. ప్రారంభదశలో ఒకవ్యక్తిచే నిర్వహింపబడు కృషి క్రమక్రమముగా కుటుంబముయొక్క సహకారమునుపొంది నడుపబడుటవలన నది గృహపరిశ్రమగా పరిణామము చెందినది. కుటుంబమునందలి శ్రామికులతో పాటు ఇతరులనుగూడ దిన వేతనములపై ఒకానొకపరిశ్రమలో నియోగించుటవలన ఈ గృహపరిశ్రమకే కుటీరపరిశ్రమయను పేరు సార్థకమైనది. కాలక్రమమున యంత్రముల యుత్పత్తితో పెద్దపెద్ద కర్మాగారములు స్థిరపడినవి. వాటితో పోల్చినప్పుడే కుటీరపరిశ్రమలు చిన్నతరగతి పరిశ్రమలుగా పేర్కొనబడినవి. చేతిపనులయందలి పరిణామదశలను పురస్కరించుకొని ఈవిధముగా చేతిపని, గృహపరిశ్రమ, కుటీరపరిశ్రమ మొదలగు పదముల నిర్వహింపబడినట్లుగా నూహింపదగును. గృహపరిశ్రమ యనుమాట కళాకారుడు ముఖ్యముగా తన కుటుంబ సహకారముపైననే యాధారపడి, గృహమునకు పరిమితమై సమష్టిప్రతిభను వ్యక్తపరచుననిగూడ బోధ యగుచున్నది. ప్రజల నిత్యజీవితావసరముల కుపయోగపడు వస్తు సామగ్రి పూర్వము చేతితోనే తయారుకాబడుచుండెడిది. వ్యవసాయ కృషికి కావలసిన పనిముట్లు, గృహపరికరములు, కంచు, ఇత్తడి సామానులు బొమ్మలు మున్నగు నవన్నియు గృహపరిశ్రమలుగానే వర్ధిల్లినవి.

## ఆచార సంప్రదాయములు

నేటికి వేదవిజ్ఞానమును భద్రపరచిన బ్రాహ్మణుడు, ప్రజల అనుదిన జీవితమునకు అవసరమైన పరికరములను సమకూర్చిన పారిశ్రామికుడు గ్రామవ్యవస్థకు మూలకందములవంటివారు. కమ్మరి, కంసాలి, వడ్రంగి కుమ్మరి, సాలె, చిత్రకారుడు మొదలగువారందరు గ్రామముయొక్క సమష్టి జీవనమునకై పరస్పర సహకారముతో కృషిసల్పెడివారు. ఏ ఇంటనైనను శుభకార్యమునకు తొలి పెండ్లికే కుమ్మరి ఇంటినుండి సారెబడి పాత్రలు, సాలెవాని నూతన వస్త్రములను, కంసాలివద్దనుండి మంగళసూత్రములనూ, వారిని సగౌరవముగా బహూకరించి మంగళవాద్యములతో గొనితెచ్చుట ఈనాటికి మిగిలిన శిష్టాచారములలో నొకటి. సంక్రాంతికి ఏటేటా బొమ్మలకొలువు తీర్చి కళారాధనను, కళాపోషణను వారు కలిగించిరి. దేవాలయములలో అపురూప శిల్పశోభితమైన గోపురములు, అందమైన రథములు నిర్మించుటద్వారా తరతరముల శిల్ప పారిశ్రామికుల పోషణ వ్యవస్థ ఏర్పరుపబడినది. దేవాలయము లందలి ఉత్సవమూర్తులనే గాక ఆరాధన కుపకరించు దీపస్తంభములు, జేగంటలు, నివాళిపళ్లెములు మొదలగు పూజాపరికరములలో గూడ తన కళాకౌశలమును వ్యక్తపరచి పారిశ్రామికుడు తన భక్తి, ముక్తికూడ సాధనమును కరతలామలక మొనరించుకొనెను. అందువలననే ఆనాటి పారిశ్రామికుని చేతిపని కేవలము వ్యాపారసరళిలో నుపకరించు వస్తువుగా గాక భగవత్సేవ కుపయోగపడుటకై మానవుడు తన హస్తకౌశలమున సాధింపగల ఉత్తమము, సుందరము నగు ఉపాయనముగా రూపొందినదని చెప్పిన ఓ. సి. గంగూలీగారి అభిప్రాయములో ఎంతేని సత్యము గలదు. పాశ్చాత్య కళావేత్తలలో సుప్రసిద్ధుడైన 'హావెల్' ప్రాచీన పారిశ్రామికునిగూర్చి చెప్పిన మాటలు గమనార్హమైనవి. ఆధ్యాత్మిక ధర్మప్రచారము గావించు మతబోధకుని దీక్షతో, ప్రాచీన కళాకారుడు నాగరికతను సంస్కృతిని సదిజ్ఞైననియు, వారి కళలు కేవలము ఆస్వాదయోగ్యమైనవే గాక, సాత్త్వికమైనవగుటవలన వారి మేధస్సు, పండితులయొక్క, తత్వవేత్తయొక్క స్థాయిలో నడచెననియు, అతడు పేర్కొనెను.

## చారిత్రిక విఖ్యాతి

వారసత్వ సంపదలుగా నేటికి నిలచియున్న మనదేశీయ పరిశ్రమలకు ప్రపంచ విఖ్యాతి గలదు. శాతవాహనరాజుల కాలము నాటినుండి మన ఆంధ్రదేశము ఇతర దేశములతో సాగించిన ప్రధాన వ్యాపారము నూలుబట్టలు, అద్దకపు బట్టలు, అందమైన రంగులుచల్లిన సెల్లాలును. ఇవి యూరపు ఖండమునందలి రోమదేశమువరకూ పోవుచుండెడివి. 1280 ప్రాంతమున యాత్రికుడుగా వచ్చిన వెనీసు వర్తకుడు 'మార్కోపోలో' మోటుపల్లి రేవునందలి మల్లు సెల్లాలను చూచి ఆశ్చర్యపోయెను. కాలక్రమమున దేశము పరాధీనమగుట, పాశ్చాత్యదేశములలో వచ్చిన పారిశ్రామిక విప్లవ ఫలితముగా యంత్రయుగము ప్రబలుట తటస్థించినవి. ఆంగ్లేయులు ఇంగ్లాండులో యంత్రములపై గావింపబడు అధికోత్పత్తుల వినియోగమునకై భారతదేశమున పరిశ్రమలు రూపుమాపుట, సాలీని దారముకంటె సన్నని నూలు తీయగల కళాకౌశలమును నాశనము గావించుటకై పారిశ్రామి

ములవేళ్ల తెగగొట్టుట మొదలగు గాథలు చరిత్రలో చేరిపోయె గదా! ఈ విధముగా క్షీణించిపోయిన కుటీర కళలకు తిరిగి స్వరాజ్యోద్యమముతో కొంత చైతన్యము కలిగినది. మహాత్ముడు సంకల్పించిన గ్రామపునరుద్ధరణ కార్యక్రమముతో పారిశ్రామికులకు కొంత చైతన్యము గలిగి తమ కళాకౌశలము చూపి కాపాడు కొనుచు వచ్చిరి. నేటికి మన ప్రాంతములలో మిగిలియున్న పరిశ్రమలగూర్చి కొంత తెలిసికొనవలసి యున్నది.

## వివిధ పరిశ్రమలు

ఈనాటికి మనదేశమున చేనేత ప్రధాన జాతీయ పరిశ్రమగను, నూలువడుకుట లక్షలాది స్త్రీల ఉపాధిగను వర్ధిల్లినవి. ఆంధ్ర చేనేత పారిశ్రామికులకు గల హస్తకౌశలము యావద్భారతఖ్యాతి నొందినది. వీరు భారతదేశమున పలుప్రాంతములలో వలసపోయి స్థిరపడి ఆయాప్రాంతీయ కళాకారుల పరిశ్రమలకు దోహదముచేసినట్లుగా చరిత్రలు తెలియజెప్పుచున్నవి. ప్రేళ్లు తెగగొట్టబడిన ఢక్కా చేనేతపారిశ్రామికులలో ఆంధ్రదేశీయులైన దేవాంగులున్నట్లుగా వారిపేర్లనుబట్టి తెలియుచున్నది. ఈ చేనేతకు ఉపవృత్తులుగా అనేక ఇతరపరిశ్రమలుగూడ వర్ధిల్లినవి. ఈపనికి ముఖ్యసాధనమగు మగ్గమును అందిగా వడ్రంగులు తయారుచేయవలెను. ఇదొక ప్రత్యేకకళ. దానికి సంబంధించిన కొలతలు—కొలమానము మొదలగు వివరములననుసరించి తయారుగావించినగాని ఆ సాధనము దాని కుపయోగపడదు. ఇదిగాక రాట్నములు, కదుర్లు, పన్నెలు, అచ్చులు, కండెలు మొదలగునవి కళాసామగ్రులైనప్పటికిని ఆయా పరికరములచేతను ప్రత్యేకప్రావీణ్యము గావలసి యున్నది. ఆంధ్రదేశమున అద్దక మొక ప్రత్యేకకళగా అభివృద్ధిగాంచినది. ప్రాచీన కవులనేకులు తమతమప్రబంధనాయికలను అలంకరింపజేసిన వస్త్రములరంగులు అందచందములు విన్నా తెలియంగనిదిగావు. 12వ శతాబ్దివాడైన పాల్కురికి సోమన అనేకరకముల నూలుబట్టలనుగురించి వర్ణించియుండెను. శ్రీనాథుని క్రీడాభిరామమునందు "గన్నెరుపూచాయ కరమొప్పునీర్కావి మడుగు ధోవతిపింజె విడిచికట్టి" అని వర్ణించి ఆనాటి వస్త్రాలంకరణ విధానమును వివరించెను. ఈ అద్దకమునందు చలువచేయుట, రకరకముల అద్దకముల వద్దుటలో ఆంధ్రదేశీయ పారిశ్రామికులకు ప్రత్యేకతగలదు. బందరు కలంకారీ అద్దకములకు ప్రపంచ విఖ్యాతిగలదు. గొల్లపాలెము, కంచుకూరు, పాలకొల్లు మొదలగు చోట్లగూడ నేటికి విఖ్యాతిపొందిన కళాకారులు గలరు. కోటీశ్వరుని మొదలు కాటిపేదవరకు బొమ్మలతో సావందించని వారుండరు. అట్టి బొమ్మలు తయారుచేయుటలో కృష్ణాజిల్లాలోని కొండపల్లి, తిరుపతి, నక్కపల్లి, శృంగవరపు కోట ప్రాంతములోని పారిశ్రామికులు పేర్వడయులు. కొండపల్లి కళా సంప్రదాయములలో నానాటి కళాకౌశల మొక పరాకాష్ఠ నందినదనిన నతిశయోక్తిగాదు. పొలికి కఱ్ఱతోను తయారుచేసిన చిన్న చిన్న బొమ్మలలో సామాజిక దృశ్యములు, గ్రామీణ వృత్తుల నమూనాలు, గోపురములు, దశావతారములు మొదలగు పౌరాణిక విగ్రహములుగూడ వాటి సహజ కళ ఉట్టిపడ రంగులువేసి తయారుచేయుదురు. తిరుపతి, శ్రీకాళహస్తి ప్రాంతములందు వెంకటేశ్వరుడు, పద్మావతి మొదలగు దేవతా ప్రతిమలను ఆ ప్రాంతమున దొరకు ఎఱ్ఱని, తెల్లని కఱ్ఱతో తయారుచేయుదురు. అవయవములను ప్రత్యేకముగా నతుకక ఏక దారు ఖండమునందె చెక్కుట ఈ కళలోని ప్రత్యేకత! విశాఖ మండలమునందలి నక్కపల్లి, శృంగవరపుకోట మున్నగుచోట్ల లక్క సామానులలో చదురంగబలములు, లక్కపిడతలు, పన్నీరు బుడ్లు, భరిణెలు తయారుచేయుచున్నారు. దీనికి తెల్లని కఱ్ఱనే తెచ్చి మణిబట్టి తయారుచేయుదురు. ప్రశంసాపాత్రమైన దంతపుపనులు విశాఖపట్నమున తయారగుచున్నవి. కంచుచెంబుల కొరకు ప్రఖ్యాతిపొందిన తావులు ఆంధ్రదేశమున పలుప్రాంతములందు గలవు

ఏలూరునందు నేయబడు తివాచీలు రత్నకంబళములు అమెరికాకు ఎగుమతి చేయబడుచున్నవి. నెల్లూరిప్రాంతమున కంబళ్లు నేయుచున్నారు. గుంటూరు జిల్లా నరసరావుపేటలో [illegible] తయారుచేయుచున్నారు. చెక్కరేవు, యానాం, కోటిపల్లి ప్రాంతములలో పడవలు తయారుచేయుదురు. నెల్లూరుప్రాంతమున పేము అల్లికల విస్తారముగా చేయుదురు. చిత్తూరు జిల్లా [illegible] పేటలో సన్నని గాజుపూసలు, నల్లపూసలు తయారుచేయుచున్నారు. కొబ్బరినారతో తయారగు చాపలు, త్రాళ్ళు, పడవ పగ్గములు విరివిగా తయారుచేయబడుచున్నవి. మృణ్మయపాత్రలలో కూజాలు మొదలగునవి హస్తకౌశల ముట్టిపడునటుల తయారుచేయుచున్నారు. వెదురు, తాటాకులతో తయారగు బుట్టలు, తడికెలు, చాపలు మొదలగు పరిశ్రమలవలన అనేకులు జీవనోపాధులు గడుపుకొనుచున్నారు. పాలకొల్లు నరసాపుర ప్రాంతములలో మిషనరీలచే ప్రోత్సహింపబడిన లేసు అల్లికలు విదేశములకుగూడ ఎగుమతి యగుచున్నవి. అల్యూమినియము పరిశ్రమకు రాజమండ్రి, ఏలూరు ప్రాంతము ముఖ్యకేంద్రములుగా నున్నవి. చక్కని వ్యాపారము సాగుచున్నది. ఏలూరు, బెజవాడ, నెల్లూరి ప్రాంతములలో తోలు శుద్ధి చేయుచు, రకరకముల చర్మములతో జోళ్లు, సంచులు, మనిపర్సులు తయారుచేయుచున్నారు. కడపజిల్లాలో పలకలు చేయుచున్నారు. ఇట్లు అనేక పరిశ్రమలు వివిధ ప్రాంతములలో కుటీర పరిశ్రమలుగానే వృద్ధిపొంది అనేకులకు జీవనోపాధి కలిగించుచున్నవి. కాని తగిన పెట్టుబడులు, ప్రోత్సాహము లేక ఈ కళలన్నియు నామమాత్రావశిష్టమై తగిన విక్రయ సౌకర్యములు లేక పారిశ్రామికులు అనేక ఇబ్బందులు పడుచున్నారు.

## వర్తమానము - కర్తవ్యము

సర్వసాధారణముగా ఈ పరిశ్రమలకు నాలుగు ముఖ్యాంగములు గలవు. అందు 1 ముడిపదార్థములు లభ్యమగుట 2 పరిశ్రమ కనుకూలించు వాతావరణము 3 పరిశ్రమ పోషణ కవసరమగు పెట్టుబడి 4 పారిశ్రామికుడు—ఈనాటి వాతావరణము ననుసరించి పారిశ్రామికుడు పేదవాడగుటవలన తన పరిశ్రమకు తగిన పెట్టుబడులు లేక ముఖ్యమైన శక్తి బాధాకరమగునట్టి పరిస్థితి ఏర్పడినది. పెట్టుబడిదారుడైన మధ్య వ్యాపారియొక్క అగ్రహస్తములకు పాత్రుడై తన పరిశ్రమను నడుపుకొనలేకపోవుటచే వానికి తగిన ఫలితము గూడ గిట్టుట లేదు—పారిశ్రామికుని [illegible] కళకు ఫలా, శ్రమకు

ము పోషించవలెయున్న తలంపు వ్యాపారలాభములకై ఎదురు చూచు మధ్యవర్తి అవసరము లేదు కదా. ఇటీవల భారతదేశము నందు అనేక పరిశ్రమల పరిశీలించిన బోర్డు ధార్మికసంస్థవారు గూడ ప్రైవేటు పారిశ్రామికులలో తగిన శ్రద్ధ ఉత్సాహము లేకపోవుటయే పరిశ్రమాభివృద్ధికి నిరోధకముగా నున్నదని చెప్పిరి.

రెండవది పారిశ్రామికునిలో గల అలసత్వము. అనగా పూర్వ కాలపు పనిముట్లతో, దేశమందలి నూతనాభిరుచులకు సరిపడని సరకులను తయారుచేయుచు పాతకాలపు విధానముల ననుసరించుచు నూత్న వాతావరణమునకు ఇముడని స్వభావము, పరిశ్రమల కవసరమగు ముడిపదార్థములు లభ్యము గాక మరియొక చిక్కు ఏర్పడినది—వీటన్నింటికితోడు విక్రయ సౌకర్యముల లేమి. ఈ కారణముల ననుసరించి పరిశ్రమకు తగిన ప్రోత్సాహము లేకున్నది. పారిశ్రామికునికి గల కళాకౌశలమును దేశావసరములకు—ప్రజాభిరుచులకు తగినట్లుగా మలచుకొనకపోయినచో ఈ పరిశ్రమల భవిష్యత్తు ఆశాజనకముగా నుండదు. ఒకప్పుడు రాజులపైనుండిన కళా, పారిశ్రామిక పోషణము ప్రభుత్వముపై బడినది. అందుల కనుగుణ్యముగా కేంద్రప్రభుత్వమువారు కళాపరిషత్తులను, సాహిత్యపరిషత్తులను స్థాపించి కళాసాహిత్యపోషణకు పూనుకొనుట ఎంతయు సంతోషింపదగినవిషయము. అట్లే కుటీరకళల చిన్నపరిశ్రమల పోషణకై ఖాదీ, గ్రామపరిశ్రమలబోర్డు, అఖిలభారత చేనేత పరిశ్రమలబోర్డు, చిన్నరకము పరిశ్రమలబోర్డు మొదలగుసంస్థలను నెలకొల్పి పరిశ్రమలపోషణకు పూనుకొనుచున్నారు. ఇదిగాక నిరుద్యోగనివారణపథకములలో రెండవ పంచవర్షప్రణాళికలో కుటీరపరిశ్రమల పునరుద్ధరణకు మంచి అవకాశముల కలుగజేయుచున్నారు. గనుక పారిశ్రామికులు ముందుకువచ్చి రానున్న నూత్న పరిణామములకు తగినట్లుగా సంసిద్ధపడవలసిన అవసరము గలదు. పైగా జపాను మున్నగు దేశములలో ఏకకాలమున నవలంబింపబడిన పారిశ్రామికవిధానముల ననుసరించి భారీపరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు వైరుధ్యము లేకపోవుటయేగాక రెండును సమరసభావముతో వర్ధిల్లగలవనియూడ రుజువుచేసియున్నారు. ఇట్టి పరిశ్రమ లధునికరణకు, క్రమబద్ధమొనరించుటకు అవసరమైన సాంకేతికసహాయము మనముగూడ పొందినచో నట్టి ఫలప్రదములు కాగలవు. నేటికి జపానులో గల పరిశ్రమలలో నూటికి 63 పరిశ్రమాగారములు 10 మందికి మించని వ్యక్తులలో నిర్వహింపబడుచున్నవి. అమెరికా యూరోపుదేశములలోవలె మానవుని కళాకౌశలమును, శ్రమను యంత్రములకు బలిపెట్టక, జపానులో ఎలక్ట్రిసిటీ సహాయమును మనుష్యనిశ్రమను తగ్గించుటకుమాత్రమే వినియోగించుకొని క్రియాసౌలభ్యము నందగలుగుచున్నారు. యంత్రమునకు మానవుడు బానిసగాక దానికి యజమానివలె దానిశక్తిని వినియోగించుకొనుచున్నారు.

ప్రపంచమునందు పలువిధముల అనుసరింపబడుచున్న నూత్న విధానములను సమన్వయపరచుకొని ప్రభుత్వము, పారిశ్రామికులు మనదేశవారసత్వసంపదలుగా నేటికి మిగిలియున్న కుటీరపరిశ్రమలను పునరుద్ధరించుకొనవలసి యున్నది. పారిశ్రామికులలో తగిన విద్యాజ్ఞానములేని కారణమున, ప్రభుత్వసహాయమును పొంది సహకార సంఘములుగా నేర్పడుటకు తగిన పరిజ్ఞానము వారిలో కలుగుటలేదు. గనుక దాని కనువుగా ప్రభుత్వమువారే వారభ్యసించిన కళల కనుకూలమైన సహకార సంఘముల నేర్పరచి చేయూత నొసంగి ఆదరించుట వారి విధి. ప్రతిజిల్లాకు స్థానిక పరిశ్రమలకు సంబంధించిన జ్ఞానము వృద్ధిగావించుటకు, పారిశ్రామికులలో ప్రోత్సాహము కలుగజేయుటకు వస్తుప్రదర్శనశాలలు స్థాపించవలసిన అవశ్యకత ఎంతేనిగలదు—అవలంబన లేక, నామమాత్రావశిష్టమైపోయిన పరిశ్రమలనుగురించి మిగిలియున్న కళాకారులవలన గ్రహించి అందలి ప్రక్రియావివరములను గ్రంథస్థము గావింపవలసియున్నది. అద్యతనభావిలో ప్రభుత్వసహకారముతో ఆంధ్ర పారిశ్రామికలోకమున నొక నూత్నశకోదయమై ప్రాచీన కళాకౌశలము మరల నున్నతి పొంది దేశభాగ్యమును కన్నులార గాంచు తరుణమును అఖిలలోక కర్తయగు భగవాను డనుగ్రహించుగాక! లోకా స్సమస్తా స్సుఖినోభవంతు.



# గోలకొండ కోట

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

కంచెల నుక్కు కంబములు గట్టిన యీ చెఱసాలలోన గ
న్పించెద వృద్ధతా! తమన కేతికిఁ గన్నుల నీరు నించి గా
మంచుమనో—యాంధ్రజాతి హృదయంబున శ్రీ రఘురాముని బ్రతి
ష్ఠించిన నీ కటా కఠినశిక్ష మహాకవి! సైచినాఁడవే.

ఇంతకుముందుఁ జూచినది యిప్పు డిదేమి! కళావిహీనమై
కాంతి దొలంగియున్నది యొకానొక భక్తుని దుఃఖతాత్మ! యీ
ప్రాంతములందు నీ బురుజులన్ జెఱసాలల నిల్చి నాటి వృ
త్తాంతముఁ గోటి కంఠములఁ దాలిచి చాటుచు నుండెనా యిటన్.

ఓండొకరుండు బంధముల నూడ్చుట కా మహాశయుఁ డిచ్చగిం
పం డనుకొందు నట్లతని వద్దకు రావలె రామమూర్తి—గో
ల్కొండ యశమ్ము నందవలె—గోప కవీంద్రుని భక్తికిన్ ఫలం
బుండవలెన్—నవాబుల కహో! ధన దాహము దీఱగా వలెన్.

అమ్మనుజేశ్వరాధముల యాజ్ఞకు లోఁబడనట్టివారలాం
ధ్రమ్మున నస్వతంత్ర కవిరాజులు మువ్వురె మువ్వురే!—ప్రశ
స్తమ్మగు రామభక్తిఁ దమ జాతి కొసంగిరి పోతరా జొకం
డిమ్మగ త్యాగరా జొకఁడు నీ మహితాత్ముఁడు గోపరాజునున్!

రామదాసుని ఋణము దీర్పంగ నపుడు
స్వయముగా వచ్చె శ్రీరామచంద్రుఁ డిటకు
గోపన తపాననో—నవాబు క్రోధముననో—
అయ్యె నియ్యది మాకు దివ్య స్థలంబు!

—



బలిమూర్తి

శ్రీ కె. పి. యస్. పణికర్.

# పరిశిష్టం

### శ్రీ ఘట్టి కృష్ణమూర్తి

## I

"ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదు, తలుపు తియ్యడానికి గంట సేపు పట్టాలనిపించిందేం? గుమ్మందగ్గర ఇంతసేపు నుంచోవాలని నీ ఉద్దేశ్యం?!" గడియ సడలింపగానే గుమ్మానికి తోసుకు వచ్చి తీవ్రమైన ఆవేశంలో అన్నాడు పతి. ఆమె కదల్లేదు; నిర్లక్ష్యంతో నిలబడి "ఎవరో తెల్సుకోకుండా తలుపు తీసే బుద్ధి నాకు లేదు" అంటూ పదునైన చూపుల్తో అతని కళ్ళల్లోకి తీక్ష్ణంగా చూసింది. అతని మనసు చివుక్కుమన్నది. అంతకు ముందున్న కోపము, విసుగు మర్చిపోయి మామూలు స్థితి కొచ్చాక

అతని మనస్తత్వంలోగల వైచిత్ర్యం అదే. ఎంతటి కోపము, మరెంతటి బాధా కలిగినా మరుక్షణంలోనే మర్చిపోయి మామూలు మనిషిగా ముఖకవళికల్లో, కళ్ళల్లో, సంభాషణల్లో గాంభీర్యం తెచ్చుకుంటాడు. అయినా మాటకుమాట అప్పగించే ధోరణిలో ఇలా అన్నాడు—అవును, ఎవరో తెలీకుండా తలుపెల్లా తీస్తావు! కాని, అంత దూరంగా తలుపు తట్టగలవాడు ఇంకెవడైనా కావచ్చుననే ఆలోచన కలదా, అని

అతను మంచి మాటకారి. విశేషించి కొన్ని ముక్కలు తిన్నవాడు కావడంవల్ల ఇతరుల మనఃప్రవృత్తుల్ని తేలిగ్గా గ్రహించగలడు; తదనుగుణంగా నడుచుకోగలడు కూడాను—ఆమె దెబ్బ తిన్న దానిలా క్షణం గజిబిజి అయి ధైర్యం కూడగట్టుకుని బింకంగా యిలా అన్నది. 'అయితే అది నీ పొరపాటు. అదృష్టవశాత్తు నా యిష్టం నా చేతుల్లో వుంది,' అంటూ అటు ప్రక్కకు తిరిగి పోతూ వున్నది. అతను జాలిగా నవ్వుకున్నాడు. అతడామెను లోతుగా అర్థం చేసుకున్నవాడు. పైగా తనకి వైరాగ్యం అనిపించుకోనా అనుకుంటున్నవాడు. అనునయం, ఆగ్రహం తన ఆధీనంలో అట్టే పెట్టుకుని యెదుట వ్యక్తిపై పారవశ్యతా సంభ్రమాలు ఒలికించి ఫలితం పరీక్షించుకోగల నిబ్బరం కలవాడు—ఒక్క అదలింపుతో ఆమెను అభిముఖంగా తిప్పుకుని, కొంటెచూపుల కలకలతో "నువ్వన్నమాట నిజమే, కాని నువ్వు నీది అనుకుంటున్న అదృష్టం, నీ యిష్టానిష్టాలు మరొకరు నిర్ణయించిన దారినే పోతూ వుంటయ్యని తెలియదూ!" అని సమాధానం అందకుండానే తీయబడిగా మంచంపై కూర్చోబెట్టి అప్పుడే తెచ్చిన పత్రిక విప్పాడు. మళ్ళీ ఆమె కేసైనా చూడలా. ఆమెకు చాలా బాధ కలిగించింది. ఎదుట కూర్చుని అతడంత ముభావంగా చూడడం సహించలేకపోయింది. గోడనున్న నిలువుటద్దంలో నిటారుగా కనిపించే తన ప్రతిబింబాన్ని పర్యవేక్షించుకున్నది. ఏదో తెలియని నిరుత్సాహం అర్థంకాని ఆవేదనగా మారి నున్నని ఆమె బుగ్గలపై పులకించి, నుదుట పైకి ప్రాకి, యెదుట ప్రతిబింబం తనదేనా, అన్నంత అనుమానం కలిగిస్తోంది

అతని కంటికి నచ్చేటట్లుగా వుండాలని ప్రత్యేకంగా అలంకరించుకుంది. అతనికి అలవాటని కమ్మని కాఫీ కలిపి ఫ్లాస్కులో పోసివుంచింది. ఇంత చేసినా అతడు తనను అర్థంచేసుకోక తూష్ణీంభావం వహించి, పై పెచ్చుమాటలతో వేధించడం మొదలు పెట్టాడు. దీనికి తను చేజేతులా చేసుకొన్నదేమిటి? అతడు అడుగు పెట్టే సమయానికి ఔదాసీన్యంతో ఉండిపోవడమే కారణమా? రోజూ లేనిది ఇవ్వాళ తలుపు బిడాయించుకు కూర్చోవడం గనుక?—అవును, అతను రాగానే యెందుకిలా వున్నావని అనునయంగా, లాలనగా, అడుగుతాడని, ఆ తరువాత తను అంతకంటే దీనంగా అతని గుండెల్లో తల ఆన్చి కంఠానికి చేతులు పెనవేసి కళ్ళల్లోకి చూస్తూ పూసగుచ్చినట్టు అంతా వివరించి చెప్పాలనుకుంది. కాని, ఇంత విసుగుగా వస్తాడని కల్లోనైనా అనుకుని వుంటే తలుపు ఓరవాకిలిగానే అట్టే పెట్టేది—

కొన్ని తావులలో ఆందోళనకూడా ఆవేశంగా మారగల ప్రమాదం వుంటుంది కాబోలు! అందుకనే తను అతనితో మాటకు మాట బుకాయించింది.

అయినా అతనికి తనపై యీ అధికారం యెవరిచ్చారు? అతడికి తను ఏమిటి? ఏమీ కాకపోతేనే తనపై యింతటి అధికారం చెలాయిస్తున్నాడా? ఏమైనా అతను పురుషుడు, తను స్త్రీ - వీరి యిద్దరిని సన్నిహితుల్ని చేయగలపాటి శాస్త్రీయమైన బంధం తమ యిద్దరిమధ్యా లేకపోవడం వల్లనే అతడిలా బాధ్యతా రహితంగా రెచ్చిపోతున్నాడా? తన జీవితంలో భాగం పంచుకొన్న మరో వ్యక్తియెదుట యెవ్వడిలా గదమాయించగలడు? ఇంత ధీమాగా తలుపు తట్టి ఆ పని తనమాత్రమే చేయగలనని తనపై నేరంమోపి అధికార కంఠంతో గర్జించగలడు? తన జీవితంపై, స్వేచ్ఛపైన, తన సర్వస్వంపైన—అతనికింత అధికారం యిచ్చింది తనేనా? అయితే యిప్పుడీ పశ్చాత్తాపం ప్రకటించుకుని లాభం?

ఇలా గతాన్ని గూర్చి పరాకుగా పరామర్శించుకుంటున్న ఆమె 'ఆ కాఫీ ఇలా అందుకో' అన్న అతడి అదలింపుకు ఉలిక్కిపడి ఇటు తిరిగి చూసింది. అతడు పత్రికలోంచి దృష్టి మరల్చకుండానే

ఒక్క క్షణం అలా కదిలాక అత డామెనువదలి సరాసరి ఫ్లాస్కు తీసి కాఫీ కప్పునిండా పోసుకుని చప్పరించుతూ ఇటుకేసి దీక్షగా చూశాడు. ఆమె అక్కణ్ణించి కదిలి అతడిమొహంలోకి చూడడానికి సిగ్గయి అటు పెడగా తిరిగి నిల్చున్నది "మరోగ్లాసు నింపి ఆమెనోటి కందిస్తూ," అనిశ్చితత్వం ఆట్టేసేపు భరించలేనని తెలుసుగా! వేడివేడికాఫీ చప్పరించి, మనసు చల్లబర్చుకుని, మామూలులోకంలోకిదిగి, మనసంగతి ఆలోచిద్దూ!" అన్నాడు. ఆమె సిగ్గుతోనూ, పశ్చాత్తాపంతోనూ క్రుంగిపోయి నోట మాట పెగిలిరాక ఊరుకుంది; అప్యాయంగా నోటి కందించిన కాఫీ కాదనలేకపోయింది. - ఖాళీ గ్లాసు బల్లమీదపెడుతూ 'ఏం కోపం వచ్చిందా?' అని సాగదీస్తూ అడిగింది. అది 'తెలివితక్కువ ప్రశ్న' అని ఆమెకు తెలుసు అతనికి నిజంగా కోపంవస్తే యింతదాకా రానివ్వడనే సంగతీ తెలుసు. కాని, హృదయావేగం కొంత చల్లారి నందువల్ల, ఆక్షణంలో అతణ్ణి ఆప్రశ్న అడిగి సమాధానం రాబట్టడం, అతనియెడల తన హృదయాంతరాళంలోవున్న మక్కువకు తార్కాణంగా భావించవచ్చు ననుకుంది - అతడు ఏమీ చెప్పక మాటిగా మంచంమీదకువెళ్ళి పత్రిక చదవడంలో నిమగ్నుడయాడు.

తిరిగి రూపంపైన అతణ్ణి పలకరించి సన్నిహితుణ్ణిచేసుకో వాలో ఆమెకు తోచలేదు. అత డెంతసేపైనా అలాగే కూర్చోగల డనుకుంది పంతం నెగ్గించుకోవాలనే పట్టుదల సడలాక అతనికి దూరంగావుండి పలకరించడం, ఉత్తుత్తిసమాధానాలతో కాలం వెళ్ళబుచ్చడం, మరింత దుర్భరంగాతోచింది. రెండడుగులు ముందుకు నడిచి, కొంచెంత అనుమానంతోనూ, భయంతోనూ వెనక్కుతగ్గి ఒకచేత్తో బల్లపైబడివున్న వస్తువులు సర్దుతూ అలాగే నిలబడిపోయింది

అతడంటే తన కీక్షణంలో అంత జంకు యెందుకు కలగాలి? రోజూకంటే అతడిలో యీనాడు కనిపించేవైలక్షణ్యం యేమిటి? అతడిమొహం రోజూలా చిరునవ్వు చిందించుతూ తనను అటుకేసి ఆకర్షించుకోవడంలేదా? ఎందుకనో మరింత గంభీరమై కొట్టొచ్చి నట్టు కానవస్తోంది ఇదంతా అతడిస్వార్థమేనా? అని మరో సారి ప్రశ్నించుకుని కాదు, అన్నట్టు తలూగించుకున్నది 'ఇలా రా!' అని అతను పిలుస్తాడేమో అని ఇవ్వాళ ఇలా యెందుకు ఉన్నావని అడుగుతాడని, తనమాటలు విని ఓదార్పుగా తల నిమురుతూ యింతమాత్రానికే బేలవైపోవాలా? అని బుజ్జగించి బుగ్గలు నిమురుతూ కళ్ళల్లోకి లోతుగాచూసి డగ్గుత్తికతో దైన్యం ఒలకబోస్తూ మాట్లాడగలడని, ఇంకా యేమో ఆశించింది, కాని, ఇందాకటి మాటలకంటే యీ మౌనం మరింత భయానకంగా తోచింది.

వణికే చేతులతో ప్రక్కనున్న కాలుకుర్చీ లాక్కుని భారంగా కూలబడింది. ఎంతోసేపు అతని మొహంలోకి చూస్తూ అంతులేని ఆందోళనతోనూ ఉక్కిరిబిక్కిరిచేస్తున్న ఆవేశాలతోనూ అల్లాగే వుండిపోయి తమ పరిచయం ఆదిగాగల విషయాన్నిగూర్చి సింహావలోకనం చేసుకుంటున్నది—

—అతని మంచితనం, మాటనేర్పు, కళ్ళల్లో లోతైన భావాలతో కూడిన ఒక ప్రత్యేకాకర్షణగల అతని మొహం బలిష్ఠమై పొంకంగావున్న శరీరం, అతనికున్న విజ్ఞానం, ఇతరులపట్ల అతని కున్న సానుభూతి, ఒక నియతమైన మార్గము ఆదర్శము లేకుండా అతను గడుపుతున్న జీవితం ఎప్పుడూ వ్యక్తపరచే అతడి సంతృప్తి తనంటే అతనికున్న అభిమానం, తనపై మొదటగా అతని ఆకర్షణ, దాపరికాలు లేకుండా తననిగూర్చి అతను చెప్పుకొనే నిజాలు— వీట్లలో తన కేది ఆకర్షించింది? ఏ వొక్కటీకాదు; అన్నీ ఆకర్షించి వుంటాయి. వీట్లను ఆధారంగా గొని అతడికి మరింత సన్నిహితురాలుగా వుండాలనే క్షణం క్షణం అనుకుంటూవచ్చింది.

హఠాత్తుగా తనను ఇక్కణ్ణించి బదిలీచేయ బోతున్నారని మధ్యాహ్నం తన స్నేహితురాలు వసుంధరవచ్చి చెప్పివెళ్ళడం జ్ఞాపకమొచ్చి ఉలిక్కిపడింది. అమ్మయ్యో, నా కిక్కణ్ణించి ట్రాన్స్ఫరే! అన్నంత భయమైన ఆవేశంతో గుబగుబలాడింది. వెన్నున ఝల్లుమని చరచినట్లయింది. రెండుకాళ్ళూ పైకి ముడిచి చేతులతో బంధించి పెనుగాలికి అల్లల్లాడే గువ్వలా వణికిపోతూంది. పెదవులు నల్లబడి, వెచ్చదనంకోసం వెంపర్లాడే పసిపాపలాగ గజ గజ లాడిపోతోంది.

మరోక్షణంలో పట్టుతప్పి పక్కకు వొరిగిపోయేదే, కాని అతప్పుడే తలెత్తిచూడడం, ఆమె దైన్యావస్థను గ్రహించి 'సుందరీ!' అనే పిలుపుతోపాటు చివాల్న ముందుకువాలి రెండుచేతులా ఆమెను కమ్ముకోవడం జరిగింది—

"రాధా నన్ను క్షమించవూ!" అంటూ తన రెండుచేతులా అతని వెచ్చటి నుదుటిని తన నుదుటిపై నొక్కుకుంటూ కరుణా విలంగా కళ్ళల్లోకి చూస్తూ అడిగింది సుందరి

"ఎందుకని? నువుచేసిన పొరపాటు నాకు చెప్పడానికి భయ మెందుకు? "అని గంభీరంగా వోదార్చుతూ వెన్నున చేత్తో రాస్తు న్నాడు రాధ; అతడి పూర్తిపేరు రాధాకృష్ణమూర్తి.

తన చెంపను అతడిచేతి కందిస్తూ చెయి గట్టిగా పట్టుకుని, 'నన్ను మద్రాసుకు బదిలీచేస్తారని ఆఫీసులో అనుకుంటున్నారట' అన్నది సుందరి అతను కళ్ళువిప్పి ఆమె మొహంలోకి పరకా యించి చూసి "అందుకనా యిందాకట్నించీ అంత దిగులుగా కూర్చు న్నావు! ఏం ఎవరన్నారామాట? మద్రాసు వెళ్ళడం నీకు ఇష్టం లేదా?" అంటూ ఆమెను మరింత దగ్గరకు గదుముకున్నాడు. 'నా కింకా రూఢిగా తెలియలేదు, కానీ, ఇక్కణ్ణించి ట్రాన్స్ఫర్ చెయ్యబడేవార్ల జాబితాలో నేనూ వున్నానని మాత్రం తెలుసు. అందుకనే భయంగావుంది. నిజంగా..' అని వాక్యం పూర్తి చేయడం అమంగళంగా తోచి అంతటితో వూరుకున్నది సుందరి.

'సరే కానీ, ఎంత ప్రాప్తమో అంతే' అని పొడిగా బదులు చెప్పి వూరుకున్నాడు రాధ. సుందరికి పట్టలేనంత దుఃఖం పొర్లు కొచ్చింది తను బదిలీగురించి యింత ఆందోళనపడుతుంటే ఒక్క వేదాంతం ముక్క అని వూరుకున్నాడని.—అవును అతని కెందు కుంటుంది ఆదుర్దా! తను లేకపోతేమాత్రం అతనికేం కొదవ! తనలాటివాళ్లు అతనికి అరుదు కాదు. అతని తత్వం యెప్పుడూ యింతే. దేనిని లోతుగా ఆలోచించడు—

అసలతని జీవిత విధానమే అంత. తనలాగే యితర్లని తేలికగా గాలి వడగల క్రింద కట్టవాలుకి వదలాలని చూస్తూవుంటాడు. అయినా తన లాగే యితరులూ బాధపడాలనుకోవడం తెలివితక్కువ కాదూ? తనకు ట్రాన్స్‌ఫర్ చేసింది యెవరు? చేయించింది యెవరు? ఆ విషయం వసుంధర తనకు పనిగట్టుకు చెప్పివెళ్ళట మెందుకు? దాని మొగుణ్ణి మద్రాసునించి యిక్కడకు వేయించడానికి వాళ్ళ నాన్న పలుకుబడి అంతా వుపయోగించి నందిని పందిని చెయ్య లేదూ? అతగాడు ఇక్కడకు దిగితే యిద్దరూ కులుకుతూ అన్నగారి మేడపైన కాపరం వెలిగించాలని కాదూ దాని దుర్బుద్ధి?—

వసుంధరనుగురించి తను పొరపాటు ఊహించుకున్నదేమో. విశ్వేశ్వరంలో(?) దానికి మొగుడూ తనూ అటనికి చేరువలో వుండాలనుకోవడం దాని తప్పా? ఏభార్య భర్తతోపాటు సుఖంగా ఉండాలని వాంఛించదు? తను ఇక్కడే శాశ్వతంగా వుండాలని యెందుకనుకుంటున్నది? తనకు రాధ యెవరు? ఈ ప్రశ్న పాటము(?) రించడంతో గజిబిజిఅయి అతణ్ణి మరింత గాఢంగా హత్తుకుని తన ఆత్మీయతను నిరూపించుకోవాలని చూసింది. కాని అతని నోటి వెంట సాంత్వనంగా మరోమాట వెలువడలేదు—

ప్రతిప్రాణికీ అప్పుడప్పుడూ యితరుల సానుభూతి అవసరమౌతూవుంటుందికాబోలు. తను ఈ స్థితిలో అతని సానుభూతిని ఆశించింది కాచా(?) అది పొందకపోవడంతో మనసు మరింత ఉద్విగ్నమైంది. ఆమె కన్నీళ్లు అతనిగుండెలకు వెచ్చగా తగిలినట్టే, జాలిగా నవ్వుతూ ఆమెవంక ప్రశ్నార్థకంగా చూశాడు

'నేనింతగా కుమిలిపోతూవుంటే నీకు చీమకుట్టినట్లయినా లేదు, అంటూ అమాయికంగా అతనికేసి చూసింది. ఇంకా యేదో చెప్పబోవాలనుకొంటున్నట్టు పెదవుల కదలికవల్ల గ్రహించాడు రాధ. వెంటనే ఆమెను అటు ఒత్తిగిలించి, "ఇందులో బాధ పడవలసింది నాకేమీ కనుపించలా. మద్రాసు ఈవూరికంటే బాగుంటుంది. అక్కడవుంటే పత్నాలక్షేపానికి(?), విజ్ఞానోపార్జనకు, మంచి అవకాశం. ఇంక ప్రశాంతత అంటావా?, అది కొనితెచ్చుకొనేదికాదు. పోతే నాసంగతంటావా.., కొత్త అగాడు(?) ఆమె ఆతురతతో అతనివంక జూసింది, తనసంగతి యేమిచెప్తాడో అని. రాధ ఒక్కక్షణం దీర్ఘాలోచనలోపడ్డాడు. ఏమి చెప్పాలా అనికాదు; ఎలా చెప్పాలా అని. మళ్ళీ తలెత్తి చూశాడు. అను నయంగా చెప్పవలసిన అవసరం గ్రహించినట్లున్నాడు. ఇలా ఉపక్రమించాడు,

'ఇంకా కొంతకాలంవరకూ మనం విడిపోయేటప్పటి యీబాధ తాత్కాలికమైనదే అవుతుందని నా నమ్మకం. నా అనుభవాన్ని బట్టి చెబుతున్నాననుకో! నాకంటే నువు యెక్కువ బాధ పడుతున్నావు. కానీ, క్రమంగా కొత్తవాతావరణానికి అలవాటు పడిపోతావు ఇంక యీరాత్రికి జాగారం చాలుగానీ, యిక్కడవుంటే నాలుగురోజులూ వృథాచేయవద్దు, నీ బదిలీసంగతి నాకూ మధ్యాహ్నమే తెలిసింది " అని వూరుకున్నాడు రాధ

"అయితే నువ్వెప్పుడూ నాకు మల్లేబాధపడలేదా యిలాంటి అశాంతరాత్రుల్లో?" పసిపాపలా అడిగింది సుందరి—"పిచ్చిదానా, నేనూ మనిషినే అందరికీవుండేభావావేశాలే నాకూ వున్నయ్. ఎన్నింటికని ఏడవనూ? బాధపడే తీరుబాటుకూడా లేకుండా కొత్త బాధలు వచ్చిపడుతున్నయ్. వాటిని తట్టుకోవడానికి కావలసిన గుండె నిబ్బరం పరిస్థితులే చేకూరుస్తున్నయ్ ఇంతవరకూ. కాని, భవిష్యత్తులో యెప్పుడో యిలాంటి అలవాట్లకు శాశ్వతంగా పరిష్కారం చూసుకుంటాను. నిజంగా నేనుపడ్డ పడుతూన్న మానసికబాధలు నీకేంతెలుసు? ఏదో చెయ్యాలనుకుంటాం మరేదో చేస్తాం, కాలప్రవాహంలో కొట్టుకుపోతూవుంటాం: అందుకనే దక్కినంతే చాలునవే తృప్తి యెప్పుడూ వుంటుంది నాకు నువ్వూ దానికి అలవాటుపడితే మనస్సు కొంత కుదుటపడుతుంది"—

అతను మాగన్నుగా ఆటు పొరుగుతున్నాడు(?). అతను తననించి దూరమైపోతాడన్న భయం అంకురించగానే ఆమె మరింతదగ్గరగా జరిగి అతనిమీద చెయివేసింది, జంకుగా. కాని ఇవాళ అత నెందుకనో చిరాకుపడినట్టులేదు. కొంతసేపటివరకూ తన భవిష్యత్తును గూర్చిన ఊహాగానాల్తో కాలం గడిపింది. బల్లమీద గడియారంలో ఒంటిగంట అయింది. సుందరి మెల్లిగా లేచికూర్చుంది. అతను గాఢనిద్రలో వున్నాడనుకొందిలావుంది, మితిమీరిన ఆవేశంతో ఆప్యాయంతో అతనిగుండెల్లో చెయివేసి నిమురుతూ మొహం దగ్గిరగాచేర్చి అతనిమొహంలోకి చూసింది. ఆలోపలలో తన పెదవులు అతని బుగ్గలకు తాకడంకూడా గమనించలేకపోయింది. మూసినరెప్పల్లో కనుపాపలు కదులుతున్నట్లయి కొంచెం సిగ్గుపడింది. తను ఇంతగా యెన్నడూ చొరవతీసుకొని యెరుగదు. 'మేలుకొనే వున్నావా?' అని గాభరాగా అడిగింది సుందరి. 'ఆఁ ఏదో కలొచ్చింది, ఆలోచించుకుంటూ యీ లోకంలోకి వస్తున్నాను', అన్నాడు రాధ కన్నులు తెరవకుండానే. 'నన్నుగూర్చేనా?' అడిగింది సుందరి, తన ఆదుర్దానుగురించి అతను నవ్వుకుంటాడేమో అని అనుమానిస్తూనే. 'ఊఁ ' అని పెదవులు కదల్చకుండానే చిరునవ్వు నవ్వాడు రాధ

'ఏమిటి?' అన్నది సుందరి — 'పడుకుందూ, ఇంకా యెంతసేపు మేల్కొంటావ్? నిన్నుగురించే కలొచ్చింది. దానినిగురించే ఆలోచించుకున్నాను మెలకువగా, అన్నాడతను. అమాయకంగా ఆనంది నిజంగానేఉందా? మ ఈరోజు నేను మర్చిపోలేను యెప్పటికీకూడా, అన్నది. 'బాగా ఆలోచించుకుంటే జీవితమూ ప్రతిరోజూ అంతే' అన్నాడతను. నిజమే ననుకున్నది సుందరి, గుండెల్లో బరువు సగం తగ్గినట్లయింది.

## 2

ఉదయం నిద్రలేచే సరికి మంచంమీద కూర్చుని అతనేదో పుస్తకం చదువుకుంటున్నాడు. 'అప్పుడే లేచావా", అన్నది సుందరి, కుప్పిల్లి(?) బిగించి, నడుము సాగటట్టుగా వొళ్లు విరుచుకుంటూ - "బాగుంది నీకు మల్లే నాకూ కాలం విలువ తెలియక పోలా, అవసరాలు తీర్చుకురా, టిఫెను కాఫీలు తెచ్చాను, అన్నాడు రాధ, ఆమెవంక అదోలా విలక్షణమైన భంగిమలో చూస్తూ "ఎందుకు కాఫీ. నేను కాచియిచ్చేదాన్నిగా" అన్నది సుందరి అతనివంక తృప్తిగా చూస్తూ.

"నేను నిజమే చెప్పాను, అన్నా తడవు, సుందరంమింంచి లేస్తూ—ఆఫీసుకు పోతున్నాను విలుంటే సాయంత్రం వస్తా, లేక పోతే రేపు కనిపిస్తా" అంటూ చెప్పులకు బెల్టు పెట్టుకుంటున్నా డతను.

"ఏం వాలుకుర్రోజులా నీ బస యిక్కడే అన్నావుగా మరి, రాత్రి భోజనం. ." మాట సగంలోనే అందుకుని, "అవును అన్నాను, ఇప్పుడు జ్ఞాపకానికి వొచ్చింది, మా మేనేజరుగారు ఇవ్వాళ సినిమాకు రమ్మన్నాడు. బహుశా భోజనం యేర్పాటు కూడా అక్కడే జరుగుతుంది." అన్నాడు రాధ—అడుగు ముందుకు వేయబోతూ.

"మర్నైతే .."

"రేపు ఉదయాన వస్తాను ఏం? ..అన్న అతని ప్రశ్న సుందరి చెవులకు కొంచెం కటువుగానే తోచింది. అతడు గడపలు దిగాడు. ఎంత సన్నిహితంగా వుండాలని ప్రయత్నించుదున్నా యేదో వొక మాటలో తనను దూరానికి నెట్టివేస్తూనే వున్నాడు. అతడు చెప్పింది నిజమేనా? నిజానికి తనపై అంత మమకారమేవుంటే సినిమాకు వెళ్లడం మానేసి యిక్కడికి రారాదూ? ఆమాట మొహంయెదటనే అడిగితే యెలాగుంటేదో.. కానీ, అతను రోడ్డుమలుపు తిరిగి పోయాడు—

తలుపుకి తాళంవేసి ఆఫీసుకు వెళ్లుతూ తీరుబడిగా ఆలోచించుకున్నది సుందరి. 'అతడు చెప్పింది నిజమే నేమో సాధారణంగా అబద్ధం ఆడడు. కాకపోతేమాత్రం తనేం చెయ్యగలదు? అతడే చెప్పినట్టు ఎంగిడక్కతే అంతే ప్రాప్తమనే నిబ్బరంతో కాలక్షేపం చెయ్యాలేమో. .

—ఆరోజు నిజంగానే సుందరి ఆఫీసులో కాలుపెట్టేసరికి నమ్మలేనంత యింద్రజాలం ప్రత్యక్షమయ్యింది. తను రోజూ కూర్చుండేకుర్చీదగ్గిర వసుంధరమొగుడు విశ్వేశ్వరరావు కూర్చుని బల్లపైవున్న ఫైళ్లు తిరగవేస్తున్నాడు, అతనికి అధికారం యెవ్వరిచ్చారు? నిర్ఘాంతపోయి గుమ్మంలో చేరబడినిల్చుంటే అయ్యగారు పిలుస్తున్నారని జవాను వార్త అందించాడు. ఆఫీసరువద్దకు నేరుగావెళ్లి, అతడికి ఛార్జీ వప్పగించి, బదిలీ కాయితం చేతబట్టుకుని ఒక్కదణ్ణంపెట్టి తిరిగి వస్తూవుంటే టపార్టీ, అన్నాడెవడో...

విశ్వేశ్వరరావు ఇన్నాళ్లీకు ఇక్కడకు రాగల్గినందుకు ఆఫీసు స్టాఫుకంతకూ యీనాటి అపరాహ్ణంలోనే తేనీరు ఇప్పించబోతున్నాడట! ఇంకానయం! తను వెళ్లిపోతున్నందుకు కాదుగదా!! పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటమూను—

—కాళ్లీడ్చుకుంటూ యింటికివచ్చి మంచంపై వదుంవాల్చింది సుందరి. వచ్చేదాకా రావాలన్న తహతహేగాని, వచ్చి యేంచెయ్యాలో తోచడంలేదు. ఈ యేకాంతం మరింత ఖంగారుగాను, భయావహంగాను ఉంది. అయిదుపాళ్లు గడియారంవంక చూసినా రెంటికి పదినిమిషాలుంది. అతడెప్పుడువస్తాడో. తనూ అతడి ఆఫీసుకి వెళ్లివుంటే...ఇంకమైనా వుండా? తన తొందరపాటుజాలి అతడు కంటగించుకుంటే...అసలే తెలివితక్కువ జరిగిపోయింది. తన ఆఫీసునుంచే నేరుగా అక్కడికి వెళ్లివుంటే. . ఎందుకీ ఆత్రత?—తనకు బదిలీఅయిందికదా అని అతడికి పెందరాళ్లే యింటికివెళ్లే 'పర్మిషన్' వస్తుందా? అక్కడవుంటే మరి పిచ్చి ఎక్కేటట్టుంది. ఎక్కడో ఏదో ఎడారిలో ఒక్కర్తే వుండిపోయినట్లనిపించింది. ఇంక అతణ్ని గురించి ఆలోచించడం మానుకుని తన ముందు కార్యక్రమం నిర్ణయించుకుంటే ..—మనసు మెదడుపైన టప్పున రెబ్బకొట్టినట్లయింది. అతనితో తనకు గల అనుబంధం అంత క్షణాలమీద మర్చిపోదగినంతటిదా? తనపైజం అందుకు వప్పుకుంటుందా? లేక అతడు తనకు వొరగబెట్టేదేమిటి? ఏమైనా అయివుండొచ్చు, అతడు అబద్ధం ఆడనని కాదూ తన విశ్వాసం? కావచ్చు, తన భవిష్యత్తునుగూర్చి యేమైనా వాగ్దానం చెయ్యగలిగాడా? లేకపోతే యింతటితో మనసు రాయి చేసుకోవలసిందేనా?— తను అలా యెన్నటికీ చెయలేదు. ఈ అల్లకల్లోలంలో అయోమయమైపోకుండా చేయగల్గింది అతణ్ని గురించిన తలంపు ఒక్కటే. అందులో పాల్గొన్నప్పుడే యిక్కడ వుండే రెన్నాళ్ళయినా ఒక మనిషిగా మెసులుకోగలదు—

—గబగబా తలుపువేసి బజారుకి బయల్దేరింది; అతడికేం కావాలా అని ఆలోచించుకుంటూ—ఆ పాత షాపులోకి వెళ్లకూడదు. వాళ్ళేదో తనవంక విచిత్రంగా వింతగాచూస్తారు. కొత్తపోయి నా లాగులకు చొక్కాలకు గడ్డలు కావాలని కోరితే యెవరలా చూడరు? ఈ నాగప్రపంచం తీరే అంత తమకునచ్చిన చీరలుకొనే స్వాతంత్ర్యం వారికి వున్నప్పుడు, తనుమాత్రం నచ్చిన లాగుగుడ్డ కొనుక్కో రాకూడదూ?—అయినా వారి సంకుచితాభిప్రాయాలతో తనకేమిటి లెక్క? అతడికి తెలుపు ఇష్టమని తెలుసు, అతడి స్వభావం ప్రతిబింబించేదికూడా అదేనని తన విశ్వాసం. ఇరవైయేడు రూపాయిలు ఓల్లు చెల్లించి, బైలుపడి గబగబా నడిచి యింటికొచ్చింది—

—ఇవాళ యెందుకో అతన్ని విడిచివున్న ప్రతిక్షణమూ తనలో వొకవిధమైన వేదన కలిగించుతోంది అతడు క్షణాలమీద యిక్కడకువచ్చి వాలితే బాగుండుననిపించుతుంది అయినా తనకున్న ఆదుర్దా అతని కెందుకుంటుంది? సాధ్యమైనంతవరకూ అతడు తననించి దూరమై పోవడానికే ప్రయత్నించుతున్నాడు. లేనిపోని మమకారం బయటపెట్టి తనను మధ్యపెట్టి మరిపించాలని చూస్తున్నాడా? రాత్రినించీ అతడి ప్రవర్తన అలాగే వున్నట్టు పసికట్టగల్గినా మొహం యెదట ఏమీ అనలేక, అనే ధైర్యంకూడా చాలక, పెదవులపైకి వచ్చినమాటనే దిగమింగుకుని లోలోపల యేదో సమాధానం పలుక్కుని వూరుకున్నది. కాని అతడలా చేయగలడా? ఏమో . ఎవరికి యెరుక? తను స్త్రీ, అతను పురుషుడు.

ఇంతలో హఠాత్తుగా జ్ఞాపకం వచ్చిందామెకు అతడు పొద్దున్న చెప్పినసంగతి - ఏడుపొచ్చినంత పనైంది. గుండె దడదడా కొట్టుకుంది. మంచంపైన చాపచుట్టలా పడింది. తనకు ఆశ దన పెచ్చినకొలదీ క్షణాలు దల్లగా దొర్లుతున్నయ్, గడియారం అటుకేసి తిప్పి గుండె దిగులుతో కుర్చీలో కూలపడి వదుంవాల్చింది.

ఎంతో సేపు మైమరచి నిద్రపోదామని చేసిన ప్రయత్నం విఫలమయ్యింది. అయినా కళ్లుమూసుకునే పడుకున్నది. ఆత్రం ఆగక గడియారం ఇటుతిప్పి చూసుకున్నది తొమ్మిదన్నర కూడా అయిదు నిమిషాలు తక్కువ - వీధిసద్దుమణిగింది. అయినా అతను వచ్చేజాడ తెలియడంలేదు కాలం కదలించడాని వూహించుకునే సరికి ఆకలి పేగులు గుర్రు మన్నయ్ ఇప్పుడు ఏదేనా చేసుకు తినగల స్థితిలో లేదు కాఫీ అయినా పెట్టుకుంటే బాగుంటును, అనుకున్నది, వెంటనే తోచింది మరొకగంట వేచిచూస్తే బాగుంటుందేమో అని. బట్టలు మార్చుకుని అద్దంలో మొహం చూసుకుంటే కళే లేదు; డొక్కపోయినట్టుంది బుగ్గమీద చేత్తో రాచుకుంటూ 'తను అందవికారి నా' అనుకుంది. కొద్ది హృదయం వి త్తాసు పలికింది. తన కెప్పుడూ అందాన్ని గురించిన ఆలోచనే రాలేదు ఒకరికి అందమైనదిగా కనబడాలని ప్రయత్నించలేదు కూడా. రాధ అన్నాడు, నీలాంటి వెలువంకల పొలిక తో ప్రక్కన వుంటే తలెత్తుకు తిరగగల'నని అది అతని హృదయాంతరాళంనుండి వచ్చిన మాటేనా? తనను సన్నిహితురాల్ని చేసుకోవడానికి చేసిన యత్నా? అతనిమెచ్చికోలు తనని ఉన్నతిస్థాయికి తీసుకుపోయిందా మానసికంగా? అదే తన జీవిత చరమ లక్ష్యమా?—అతని దంతి హృదయం లేకుండా అనివుంటాడా? అయినా అతను తన కేమిటి? ఈ ప్రశ్న తిరిగి రావడంతో గిజాటుగా కణతలు వేగ్రతో నొక్కుకుంటూ వాలిపోయింది.—

ఏ క్రమాలకి తలుపుతడుతున్న చప్పుడయింది మారు పలకక పలికే వోపిక లేక కొన్ని క్షణాలపాటు కళ్లప్పగించి చూస్తూ వుండి పోయింది. అతను తన పరిస్థితి ఊహించిన వాడిలా తలుపు తట్టడం మాని పేరు పెట్టి గంభీరంగా పిలుస్తున్నాడు ఆ స్వరం చెవుల బడడంతో అంతకుముందటి ఆలోచనలు వెనకబడి ఒక నూతనోత్సాహం పొంగివచ్చినట్లయింది—అది ఆమెలోని మానసిక బలహీనతా, అమాయికత్వమా! నిర్ణయించుకోలేక చివాల్న లేచివచ్చి గడియ సడలించింది. అతను నేరుగా వచ్చి చేతులోవున్న పొట్లాలు బల్లపై పెట్టి కుర్చీలో కూర్చుంటూ "భోంచేశావా?" అని అడిగాడు 'చేశానని చెబితే!'—అతనియెదుట తను అబద్ధమాడలేదు ఒకవేళ అలాంటి పొరపాటు జరిగినా మొహంమీదంచి కళ్లల్లోకి చూసి అంతర్యాలు చదువుకునేపాటి తీక్షదృష్టి అతనిది 'లేదు' అని చెప్పేసింది సుందరి

'ఆ పొట్లాలిలా యిచ్చి స్టూలు దగ్గిరకు లాక్కో' అని చేయి చాచాడు రాధ.

'నాకు 'ట్రాన్స్ఫర్ మెమో' ఇచ్చారు, ఇవ్వాళనించే ట్రాన్సిట్' ఈ అశుభాన్ని తన నోటితో ఉచ్చరించే శక్తి లేదన్నట్టు వణుకుతున్న కంఠంతో అన్నది సుందరి అతడి చేతికి పొట్లాలు అందిస్తూ.

"తెలిసే ఇప్పుడు వచ్చాను, ఇక్కడి దేం గొడవ పడుతున్నావో అని. ఆవేశం జాస్తి నీకు, కాకపోయినా, మళ్ళీ వంటి పాపవి కాదు." రాధ పొట్లాలు విప్పి పదార్థాలు సగం పంచి పెట్టాడు. తిరిగీ యిలా అందుకున్నాడు.—

"కాని, ఎప్పుడూ—పెళ్ళైనాసరే—లంఘనం చెడుకోవడ నేర్చుకోకు కడుపు కాల్చుకుని సాధించగలిగింది చాలా తక్కువ" అంటూ వొక్క పెద్దా లడ్డూ పొడుపుగా నోటి కందించాడు.—

అతడన్న ఆ మాటతో తిరిగి పాతపుండు రేగినట్లయిందామెకు అతను యాధోరణిలో యిలా యెందుకు మొదలెట్టినట్లు! ఇక కడసారి వప్పగింతా? ఈ వొక్క మాట అని తనను వేధించడానికే యిప్పుడు ఆదరాబదరా పరుగెత్తుకు వచ్చాడా! ఈ అవస్థలూ అతడనే ఆమాట తనపై యెంతటి నిప్పుల గాడ్పులు విసురుతుందో వూహించుకోలేకనే అన్నాడా? తెలిసి తెలిసి యెందుకింత దారుణం తలపెట్టినట్టు! ఈ మాటతో తనయెడల అతని కర్తవ్యం, బాధ్యత ముగిసిపోయినట్టే భావించి అంటున్నాడా?—ఆకలి సెగలకు తోడీ ఆలోచనల పొగలు మరింత కమ్ముకుని గజిబిజి చేస్తుంటె ఆమె యేటూ తోచక ఏమీ అనలేక అతని వంక తదేకంగా చూస్తూ వుండిపోయింది "మంచినీళ్లు" అన్న అతని పిలుపుతో ఉలిక్కిపడి అక్కణ్ణించి లేచి నడిచింది

"పోనీ అతడే తనని పెళ్లి చేసుకోకూడదూ? అందుకు తను సిద్ధమేనా? అతని అంతస్తుకు తను తగదా? అంతస్తు ఎవరి తాహతును ఎవరు నిర్ణయించగలరు? హృదయంలేని స్వార్థపరత్వాన్నే అతనూ నెత్తుకు పాకులాడుతున్నాడా యిన్నాళ్లూ? తన యెడల ఆత్మీయతను ప్రకటించి యెన్నిసార్లు కొండెక్కించలేదు!—మంచినీళ్ల గ్లాసు బల్లపై పెడుతూవుండగా అనిశ్చితత్వం ఆట్టేసేపు భరించలేనన్న, అతడి మాటలు స్ఫురణకువచ్చి, కళవళంగా వొణికి పోవడంతో వేళ్లు పట్టుతప్పి గ్లాసు చెయిజారి కిందపడిపోయింది. అతను తలెత్తి సూటిగా ఆమె మొహంలోకి చూశాడు; అన్నాడు.

"అనుకుంటూనే వున్నా" అంత పనిచేస్తావని, ఏదో అనుకుని మరేదో చెయ్యబోవడం తెలివితక్కువ తాత్కాలిక ఉద్రేకాలకు లొంగిపోతే ఆశించిన ఫలితం అందక పోగా పర్యవసానం భయానకంగా వుంటుందని తెలియదూ? అది గ్రహించలేక దానికే యిన్నాళ్లూ పాటుపడ్డాను కొత్త బాధలు వచ్చిపడుతున్నప్పుడు వాటిని తట్టుకోవడానికి కావలసిన గుండె నిబ్బరం పరిస్థితులే చేకూరుస్తూ వుంటయ్ ఆ ధైర్యంతోనే, నేనూ లాక్కొస్తున్నాను అపాటి గుండె దిటవులేనివాళ్లకి, భవిష్యత్తు అయోమయంగా వుంటుంది ఎంతవరకూ దక్కినదే చాలుననే తృప్తిలో వున్నవాళ్లకు ఏ బాధా వుండదు నాలుగు లడ్డూలు తిని నీళ్లుతాగి ఆకలి చల్లార్చుకో! అన్నీ తీరుబడిగా ఆలోచించుకోవచ్చు, అర్థంలేని ఆరాటాలకు పోయి మనసు పాడుచేసుకోవడం మంచిది కాదు." అంటూ అక్కణ్ణించి లేచివెళ్లి గడియారం బల్లమీద పెట్టి వున్న పొట్లాం యేమిటో అని విప్పి చూడబోతున్నాడు.—
"ఏ వేదాంతాలు నాకేం అక్కర్లేదు" అన్నది సుందరి; నిరుత్సాహం వెలిబుచ్చిన ఆవేశం గుండెల్లో గుబులుగా రగిలిస్తూ వుంటే—

అతడన్ని విషయాలలాగే ఆ మాటలనూ గాఢంగా తీసుకోకుండా చులాగ్గా సమాధానం చెప్పాడు. "అర్థం కాని మాటలన్నీ వేదాంతాలే అనుకుంటారు చాలామంది. నిజానికి వేదాంతం చెప్పే

